# మాలపల్లి



యూనివరల్సు పబ్లిషర్సు (రిజిష్టర్డు)
గవర్నరుపేట :: బెజవాడ

ఓం

శ్రీ బ్రహ్మకృపాహి కేవలం!

# మాలపల్లి

ఒకటవ అధ్యాయం

## చేను

ఆ సంవత్సరం శ్రావణ భాద్రపదమాసములలో వర్షము లమితంగా గురిసినా శరదృతువు ప్రవేశించఁగనే కొంచెం వెనుకాడి మబ్బు నిర్మలంగా వున్నది. మిట్ట మధ్యాహ్నం సూర్యబింబానికి అప్పుడప్పుడు చిరుమబ్బు లడ్డంవస్తున్నా మొయిలు విడిచినతోడనే కిరణాలు తీక్ష్ణములై పొలాలలో పనిచేసే శ్రామికులకు చిఱుచమటలు కమ్ముచున్నవి. ఊరిపడమటి రేగటిచేలో దుక్కిదున్నుతున్న రామదాసు ఆకసంవంక జూచి, వేళమిగిలిందని, చాలు జొన్నచేనుగట్టువరకూ దున్ని అరకవిడిచి యెద్దులను చేలోవున్న కుంటలోనీళ్లుపెట్టి గట్టునవున్న తుమ్మపీకెకు కట్టివేశాడు, అంతట జొన్న చేలో వేసినమంచదగ్గరకుపోయి అచ్చటవున్న కొడవలి తీసుకొని నిలువున కంకులు గిల్లిన యెఱ్ఱజొన్న పట్టెలో సందెడు పచ్చిచొప్పకోసి యెద్దులకు మేత వేశాడు. ఒక క్షణం అటూయిటూ చూచి యింకా రాలేదేమబ్బా అని కుంటగట్టెక్కి వూరివైపు చూచాడు. ఎవ్వరూ వచ్చేజాడ కనబడలేదు. కొంతసేపు పరకాయించి చూచాడు. ఎవరో కొండలపందునుంచి దుత్త నెత్తినబెట్టుకొని వస్తున్నట్లు కనపడ్డని „మనవాండ్లే కావచ్చును. సరే, యెందుకూ — పిల్ల పరుగుపరుగున రయిలుకట్టదగ్గరకువస్తూవున్నది. తల్లిరాక, పిల్లను పంపింది యెందుకో. ఆవిడ పరగటిచేనికి పిల్లవాండ్లకు అన్నంతీసుకొనిపోయిందిగాఁవలె. రయిలుకట్టదాటి రావలెగా." ఈమాట లనుకొంటుండగా పడమటనుంచి రయిలువచ్చేవేళయిందని రామదాసుకు, తటాలున జ్ఞాపకం వచ్చింది. తన చత్వారపుకండ్లను పెగిల్చిచూచి „అదిగో రస్తామీదుగా పరుగిడుతున్నది. రయిలు రానేవచ్చిం"దని గుండెలు తటతటమని కొట్టుకొనగా తన కొమార్తెవచ్చేదారి వంకజూచి పిల్ల రయిలుకట్టదిగి పదిమూళ్లురావడం కనిపెట్టి దిగులుదీరి కొంతదూరం వచ్చేవరకూ నిదానించిచూచి స్థిమితపడి నిలుచున్నాడు. ఎద్దులు అరమోడ్పు కన్నులతో ఆప్యాయనంగా పచ్చి [illegible]లు నములుతున్నవి. రామదాసు యెద్దులవంక చూచి వీపునా వెనుకావున్న దద్దుర్లనూ ముల్లుపోట్లనూ నిమిరి అర్తికి కొంచెం పేడరాచి పుచ్చులు సవరించి „ఎద్దుల కెండతగులుతున్నది. ఇంకా ఒకటిరెండేండ్లనుగాని తుమ్మపీకె యెక్కరా"దని అనుకొంటూ జొన్న చేనుగట్టువైపుకు పోయి నిలువబడ్డాడు. రైఁయ్యని పడమటిగాలి తోలుతున్నది. జొన్నపైరు గాలికి కెరటాలుగట్టి వుయ్యాల

ఊగుతున్నది. బంగారపు రాగిరేకల గుత్తులవలె సొంపుగులుకుతూ కంకులు వచ్చని నుంకుపోసుకుంటున్నవి. పురుషసృష్టియొక్క ఆవశ్యకలవికాని సంభ్రమమును దెలుపుతూ పుప్పొడి విచ్చలవిడిగా వాయుపథమున విహరిస్తున్నది. రామదాసు పశువాని కాసన్నమై వున్న పైరును చూచుకొని తనకు కలిగిన హృదయానందమును వికసించి వున్న తన తెలిగన్నుల వెలిబుచ్చుతున్నాడు. రామదాసు కొంచెం పొడగరి కలగల పులుగ నెరసినమీసములు పెదవులపై గుబురుకొని వున్నవి. స్వచ్ఛమైన గాలీ, తగినంత దేహపరిశ్రమా, పండనైయున్న పైరూ, ముప్పిరిగొని రామదాసున కొకింత వుల్లాసం గల్పించినవి. తక్కిన తలంపులన్నీ మరచి యేకరీతిగా పైరువంక చూస్తూ ,,పిల్లల అదృష్టంవల్ల ఒక్క వారంరోజులపాటు యెండా గాలీ కొట్టి తూర్పుసాగకుండా వుంటే యెంత లేదన్నా రెండుపుట్లగింజలు రాలకమానవు. దంటు బాగా గంటగట్టి లేట బుట్టి జములుకంకులు పయితంయానింది. కొంతజల్లివిత్తనం పడ్డదిగాని అంతా ముద్దవిత్తనమయినట్లయితే యింకొక్క యేనుముపైన అనేదే. కాని మనకు ప్రాప్తం యెంతో అంత. ఇంతకూ తూర్పుగాలి సాగకుండా వుండాలె. ఇవ్వేళ యెండ చిటచిట లాడుతున్నది. ఈ వుబ్బకు సగం కంకి గింజపోసుకుంటుంది. వెనుక జిక్కిన జాడూ బోడూ గూడా పండితేనే గాని పాలివుండదు. ముందు యెక్కవచ్చిన యే పదిశేరలో పండితే యేమి ప్రయోజనం? అందరూ బాగుంటేనే బాగు. ఇదిగో? ఈ కంకి చూడు ఎట్లా గింజపట్టిందో. గెలేపండిన'' దని కంకించి చూస్తుండగా జోతియొక్క కాళ్లచప్పుడు వినపడ్డది. రామదాసు కంకి విడవంగనే అది పురవడిగాపోయి ప్రక్కకర్రకు తగిలేవరకు రెండవకర్ర యింకా ముదరక పాలవుబ్బగా వుండంచేత తాకుడుకు నుంకురాలిందేమోనని పరీక్షించి చిరునవ్వుతో బిడ్డవంక చూచి దానితలపైనవున్న దుత్తదించుకొని యెండలో రావడంచేత మొగాన జారుతున్న చెమటబొట్లు తుడిచి చెదిరిన ముంగురులు సవరించి ప్రేమ దళుకొత్తు ముఖవైఖరితో, ,,అమ్మా! యివ్వాళ నీవు వచ్చావేమి? మీ అమ్మ యెక్కడికిపోయిం''దని అడిగాడు. జోతి గోముగా పెరిగినపిల్ల. యిద్దరు మొగపిల్లలతర్వాత కలగడంచేత యింట్లోవాండ్లందరూ గారాబంతో చూస్తున్నారు. మాలకులమైనా, జోతి తండ్రివలె నల్లటిదిగాదు. తల్లినిబోలి కొంచెం చామనచాయగలది; సన్నకమ్మి వేసి నేయించిన ముతకచీరగట్టుకొని మేనత్తపట్టించిన అద్దాలరవిక తొడుక్కున్నది. ఎండలో తళతళ మెరసే అద్దపుబిళ్ళల తెలికాంతులు మెడలో కొండిబెట్టి గుచ్చికట్టిన బేడకాసుల యొక్కయూ వెండికంటె యొక్కయూ తెలుపు సమ్మిళితమై వొప్పుతున్నది, ముడిముక్కునవున్న యెర్రరాళ్ళ దోసకాడతీరైన కనిముక్కులతో పొందిక గలిగివున్నది, మెడలోవున్న వెండినక్కుల నీలిబొందును పమిటమీదికి తీసుకొని ముంజేతులు కొంచెంపైకెత్తి ఎడమకాలు ఎత్తివైచి, ముద్దుమాటలతో, "అయ్యోయి! అమ్మ అన్నకు బువ్వపట్టుకపోయింది. ఆడనే - తనకు పనివున్నదంట. నన్నే మా నీకు బువ్వయిచ్చి నాకు కావలసినన్ని తిమ్మ్యదోసకాయలు కోసి తెచ్చుకొమ్మన్నది. నే కోసుకుండేదా?"

---

రా__పొయ్యేటప్పుడు కోనుకుందువుగానిలే. చూడు, రైలువచ్చేవేళ అయింది గదా. యింత ఆలస్యంగా వచ్చావేమి? నీవు పట్టాలమీద వుండగనే రైలుపొగ కనబడ్డదే. నీకు రైలుబండి కనబడలేదా?

జో__నేనే, యెటూ చూడకుండా తొందరగావచ్చి రైలుకట్టెక్కేవరకు__ పో - దూరాన్నుంచి రైలు వస్తూవున్నది. అది చూచి భయపడి ఒక్కవురుకురికా.

రా__అమ్మో! బిడ్డకు ఎంతగండం తప్పింది యివ్వాళ (అని చేతితో తలపై నిమిరి) యిక మీదెప్పుడు వచ్చినా రైలుకట్టెక్కకముందు అటూయిటూ చూచి రైలు రానిసమయంలో పట్టాలుదాటు సరేనా?

జో__అట్లాగేకాని__అయ్యా, నాకు వూచబియ్యమే.

రా__నేను అన్నందిని కొట్టిపెడతా గాని నీ విట్లాకూర్చో, అన్నం తింటావా?

జో__వద్దు.

రా__అయితే ఈ తియ్యదోసకాయ తింటూకూర్చో - అని చెప్పి దుత్తపైన వున్న చిన్నమూటవిప్పి జొన్నన్నంలో చింతచిగురు పప్పు కలుపుకొనితింటుండగా,

జో__అయ్యా! పప్పులో వేసిన ఉల్లిపాయముక్క నాకు ఏరియ్యవే?

రా__ఇదిగో, రా-అని, రెండుమూడు ముక్కలేరి చేతికిచ్చి తాను కూరాన్నం దిని దుత్తలో కలిపిపోసిన మజ్జిగన్నందాగి చేతులూ దుత్తాకడిగి, గుడ్డవుసిమి దుత్తలో వేసి వొక లేతకంకిగోసి వూచబియ్యముగొట్టి వూది బొంతులేరి కాసిని జోతి చేతిలో పోసి తక్కినవి పమిటకొంగున కట్టాడు.

జో__చేతిలోవి తిని మూటగట్టినవి యింటికి తీసుకొనిపోయి పిసికిళ్ళు చేసుకుంటా, దోసకాయలేవి?

రా__కోసుకొనివస్తా; కూర్చో.

జో__నాకు రెండు, అమ్మకొకటి, అన్నలకుచెరొకటి, బుల్లివాడికొకటి కోసకరా.

రా__బుల్లివాడు దోసకాయలు తింటాడా?

జో__పోనీ. అదికూడా అమ్మేతింటుంది. వాడికి పాలిచ్చేది అమ్మేగా.

రా__వాళొక్క కాయైనలేదుగదా? నీకు రెండెందుకమ్మా?

జో__నీ విక్కడ తినకుండావస్తే నీకుగూడ వొకటి కోసకరా. నా రెండో కాయ బావకిస్తా.

రా__సరే. యివిగో కాయలు. దుత్తలో వేశా. ఇదెత్తుకొని సరిగా యింటికి పో. మీ అమ్మను దోసకాయపచ్చడి చేయమను.

జో__ఆఁ, అబ్బా, యేమయ్యా! నీ ఆశా! నేను కాయలు తినవద్దూ!

అని జోతి దుత్త ఎడమభుజముమీద పెట్టుకొని చిన్నపమిట వీపున వ్రేలాడుతుండగా, చేయ్యి రొండిన బెట్టి, చిటుకుచిటుకున అడుగులు పెడుతూ దుక్కికడ్డంగా డొంకకు పోతున్నది. రామదాసు వోరగంటితో జోతినిచూచి "లేతకాళ్లు, దుంపలు గుచ్చుకుంటవేమో. చిన్న చెప్పులైనా చేయిస్తే బాగుండును," అనుకొంటూ దుక్కిదాటి

డొంకలోకిపోయి పక్కనున్న జొన్నచేనుచాటుకు పొయ్యేవరకూ చూచి యెద్దుల దగ్గిరకు పోయినాడు. పొద్దు వాటవాలింది. యెద్దులు కడుపునిండా మేసి ఆకుపు తీర్చుకొన్నవి. యెల్లెద్దు పడుకొని నెమరువేస్తున్నది. పుల్లది బడిదంట్లు వదలివేసి వొగుడాకు లేరుకొని తింటూ యెండుకో చిరచిరలాడుతున్నది: యెల్లది స్వాభావికంగా శాంతం కలది. పుల్లది కొంచెం కసురుబోతు. రామదాసు ఏదో ఆలోచనగా ఎద్దులను విప్పి తీసికొనిపోయి పుల్లదానిని వలపలనూ, యెల్లదానిని దాపలనూ గట్టి పగ్గాలు మేడికిచుట్టి, ఎడమచేతితో మేడిని పట్టుకొని కుడిచేతితో 'అర్' అని పుల్లెద్దును అదలించాడు. యెద్దులు లాగడానికి ప్రయత్నించినవిగాని, పట్టుపట్టక తిరుగుడుబడి నిలబడ్డవి. రామదాసు కొంచెంపరికించి తాను చేసిన తప్పును గ్రహించి 'యెన్నడులేని పొరబాటు వచ్చినదేమిరా, ఇది వ్యవసాయానికి ఏవండ సూచించునో' అని సందేహించుతూ, యెద్దులను మార్చికట్టి అరక సాగించాడు. పడమర నాలుగు గడియలకల్లా దుక్కి పూర్తిచేసి "యిప్పటికి దుక్కి నాలుగుసాళ్లు పూర్తిఅయినది. ఒక్కసారి గుంటకయీడ్చి చాళ్లుదోలి అచ్చుపెడితే పదునుగానంగనే మిరపమొక్కలు నాటవచ్చు" నని అనుకొంటూ అరకను తోలుకొనివచ్చి కుంటదగ్గిర నిలిపి కుంటలో దాచివుంచిన దంటితో మిరపమళ్లకు నీళ్లుజల్లి కొంచెం ఆయాసపడి "ప్రొద్దుగూకులూ అరకదున్ని మళ్ళకు నీళ్ళుకూడ నేనే చల్లబోతే శానాకష్టంగా వున్నది. పెద్దపిల్లవాడు ఎన్నిటికని తంటాలు పడతాడు. సంగణ్ణి జీతానికి మాన్పించి యింట్లోనే వుండమంటేబాగుండు" నని, అనుకొంటూ మోపెడు పచ్చిదంటుకోసి మోపుగట్టి తలమీద పెట్టుకొని అరక దోలుకొని యింటికి వచ్చాడు,

---

## రెండవ అధ్యాయం

# దొడ్డి

రామదాసు అరకదోలుకొని పల్లెకు వచ్చేటప్పటికి సాయంకాలమయింది. ఇంటికి దక్షిణంగావున్న పశువులదొడ్డిదగ్గర అరకనిలిపి తలుపుతెట్టుకొని లోపలికి బోయి చొప్పమోపు లోపల పడవేసి మరలవచ్చి యెద్దులనువిప్పి లోపలికి తోలుకొని వచ్చేటప్పటికి వులవలు రుబ్బుతున్న పనులకాపరి అప్పాదాసు సగం వులవలపిండి తెచ్చి రాతిగాబులో కలుపుతున్నాడు. యెద్దులు వులవకుడితితాగి తృప్తిపడి నీరుడు జేసినతోడనే వాటిని గాటిదగ్గర కట్టివేసిజీతగాడు చొప్పదొడ్డినుంచికట్టుకొనివచ్చిన వరిగెచెత్త గాటిలోవేసి అరకసామాను తెచ్చి కొట్టంలో పెట్టాడు.

రా—అప్పుడూ! రుబ్బడంకాగానే చొప్ప నరుకుతావా?

అ—అట్లాగె నరుకుతా.

రా—బావ యింకా పొలమునుంచి రాలేదా?

అ—వచ్చి నీళ్లుతెస్తున్నాడు:

రా__నీళ్లు తేవడం యింకా కాలా ?

అ__అప్పుడేనా? ఊరచెరువుమాలరేవు దగ్గరనుంచి యిక్కడికి మన పడమటి చేనంత దూరముంది. రెండుగావళ్లు తెచ్చి రాతిగాబులో పోశాడు. ఇంకా మట్టిగాబూ మూడుబానలూ పట్టివేవున్నవి.

రా__పొద్దు గూకుతున్నదే? యెన్నడు నీళ్లయ్యేది. రుబ్బటం యింకా యెంతసేపుపట్టేను ?

అ__కావచ్చింది. పత్తిగింజలు రెండువాయిలురుబ్బా. కానిని పత్తిగింజలు మిగిలితే మళ్లీరోటవేశా. లిద్ది కదులుతూవుంది. గానిగె తిప్పుతుంటే గతుక్కుమంటున్నది, అయింది. ఇగతీస్తున్నా...నని గబగబ గానిగె నాలుగుచుట్లుతిప్పి పైకిదీసి పిండి కుండలోకితోడి రోలు కడుగుతున్నాడు.

రా__నీవు పయటన్నంతిన్నావా ?

అ__ఆ. అత్త తెచ్చెగా ?

రా__చొప్ప నేనైనా నరుకుతాను. చిన్నబుంగలు కావళ్లో వేసుకొని బావతోపాటునీవూ రెండు కావిళ్లందుకో.

అప్పాదాసు పదునాలుగు సంవత్సరముల ప్రాయపువాడు. ఇంకా పోకలు తెలియవు. శరీరం అడుగుభాగమునకంటె పైభాగం కురచగా వున్నది. గడ్డిలేకపోయినా నడుము కొంచెం వెనుకకువంగి శరీరమునకు పటుత్వమిచ్చింది. ప్రతిపనీ వొకరిచేత చెప్పించుకొనకనే తానే యోచించుకొని వొళ్లువంచి పనిచేయగలవాడు. బాగాచదువుకొన్నాడు. రామదాసింట్లో జీతానికి కుదిరినతరువాతనే చదువు మొదలుబెట్టి రామదాసుయొక్క శ్రద్ధవల్ల కొంత సాహిత్యంకూడా కుదుర్చుకొన్నాడు. తోటజీతగాండ్లకంటే రెండువరహాల యెక్కువజీతం యేర్పాటుచేసి అన్నవస్త్రాలు రామదాసే జరుపుతున్నాడు. రోటిదగ్గర మదురుగోడవంకకు తగిలించియున్న పైబట్ట తీసి తలకుచుట్టుకొని చిన్నబుంగలు కావట్లోవేసి కావడిచేర్లు బద్దకు వొకచుట్టుచుట్టి తనకు మోయినుగా కురచ చేసుకొంటున్నాడు. రామదాసు చిన్నగొడ్డలితెచ్చి చొప్ప నరుకుతున్నాడు. ఇంతలో వెంకటదాసు తలుపుకొట్టుకొని బారుటంగలువేస్తూ కావటి వూపుకు జతగా వుబ్బూతలూగుతూ కావడిదింపి రెండుబుంగలూ రెండు చేతులాపట్టుకొని యినుపకాడలవంటి చేనరములు కండలుగట్టిన దండలు పైకుబకఅలకనగా యెత్తి గాబులో కుమ్మరించి ఖాళీబుంగలు మట్లలో వేశాడు. చొప్పనరకడం నిలిపి తనవైపు తిరిగిన తండ్రితో ,,చొప్పకూడా నీవు నరక్కపోతే మేము నరకలేకపోయినా ముశే''అని కొంచెం పెద్దగా అడిగాడు.

రా__చొప్పనరకడ మెంతపని గాని - యింకా యెన్నికావిళ్లు పడతవి ?

వెం__ఎన్నిపట్ట కేమి ? రెండుకావిళ్లు ఇప్పుడు ఆడపశువులు తాగటానికి కావలెనా? అయిదుకావిళ్లు రెండుగాబుల్లోనూ, మూడుకావిళ్లు బానలోనూ పడతవి.

రా__సరేకాని; అప్పుడూ నీవూ కావిళ్లు వేసుకొని వొకజత తెచ్చి యీపూట గడిపి రెండోజత యింటిదగ్గర దింపండి. వులవపిండీ పత్తివిత్తులతోక్కూ సగం

యీ పూటవేసి పొద్దుటికి తక్కినసగం వుంచండి. తెల్లవారుజామున మనమిద్దరమూ కావిళ్లు తీసుకొన్నామంటే తెల్లవారేవరకు అన్నీ బర్తీచేయవచ్చు

వెం.__ఇం. మోకాళ్ల కలకలతో తెల్లవారుజామున పూరచెరువునించి కావిళ్లు మోస్తావు. అప్పుడిని నీళ్లకు అలవాట్పవలసిందే. మధ్యాహ్నం మన ఆవుపెయ్యకట్టింది.

రా.__అట్లాగా. గేడిపెయ్యేనా ?

వెం.__కాదు. బట్టది. ఆ గేడిది నక్కోరుబోయినట్టు అట్లావున్నదేమి?

రా.__నక్కోరుబోవడంగాదు. దానిచారే అంత. వొక్క నెలపాటు తియ్యకుండా ఆంటిపట్టి రోజుకు చారెడువుప్పు నీళ్లల్లో కలిపి తాగించు. యెట్లా కట్టదో చూస్తాను.

ఇంతలో అప్పాదాసు కావట్లో చిన్న బుంగలు వేసుకొని చేర్లు కురచగ జేను కున్నాడు. వొంకెన తగిలించివున్న వుత్తరీయమంచుంగు విడిచి తలకు చుట్టుకొని కావిడి బుజంమీద పెట్టుకొనబోయేవరకు కొత్తచేత నవ్వువచ్చింది. ఆవరణమంతా తనను చూచి నవ్వుతున్నట్టే ఆతనికి కనపడ్డది. కుచ్చిళ్లు పక్కకులాగి యెడమకాలి మీది చెంగుదోపుకొని బావ యెట్లానడుస్తున్నాడో చూస్తూ వెనకడితే పోతున్నాడు.

రా.__ఆవుదూడలను రేంటిని పాలకు విడుస్తా? మీరు వచ్చేటపుడు కట్టివేసి రాండి. లేకపోతే పీధిన బడతవి

వెం.__అన్నీ చేస్తాం పోవే. నీ వింటికి.

కప్పుర చీకటి ప్రారంభించింది. దూడల అంభారవములు విని ఆవులు మిఱ్ఱి చూపులు చూస్తూ కట్టుమట్టున గిరగిర తిరుగుతున్నవి. 'దూడలను విడిచే వేళయింది. ఆవులకింకా నీళ్లు అందకపోయెనని'' అనుకొంటూ రామదాసు చొప్ప నరుకు తున్నాడు. నరకడమైన తిరువాత ఆడపశువులకు కొద్దిగా మేతవేసి మిగిలినది కొట్టంలో అటుగుమీద యెండుమేత పక్కన బొత్తిబెట్టుతుండగా వాకిట దగ్గిర చప్పుడయినది.

రా.__ఎవరది?

కొత్తమనిషి.__(తలుపు నెట్టుకొని కొంచంతలవంచి గడపదాటి లోపలికి వచ్చి)__ యేమన్నా నేను సుబ్బలక్ష్మిని.

రా.__ఏమమ్మా! ఇటు వచ్చావు ?

సు.__లోపలికి తిరిగినమడిమెలతో చాచికొంచెం అడ్డడుగులువేస్తూ బిగుతయిన పూర్ణిలపట్టెడను యెడమచేతివేలితో సవరించుకొంటూ__మాదన్నా! వాడిచెయి బడ. మునసబుగారి బసివిరెడ్డి కఱ్ఱతీసుకొని యెట్లాకొట్టాడో. అని యెడమచేతిమీదికి జారివున్న పమిటెకొంగును పైకిలాగి తుష్కించి తోళ్ళువేలాడే రవికలేని దండచేతి మీదగట్టిన కదుమును చూపించినది.

రా.__ఎందుకట్లా కొట్టాడు ?

సు.__వట్టి అభాండంవేశాడు. నేను గరువులకుపోయి గడ్డికోసుకొని మూటెత్తు కొని సావరాలమీదిగా వస్తూవుంటే తానెక్కడినుంచో బూతులు తిట్టుకుంటూ మా చేలన్నీ నీకు మాన్యాలయిపోయినవా, అని కర్రతో మూట కిందబడనెట్టి యీ దెబ్బ

కొట్టాడు. చేయి యెత్తనీయడంలేదు. అదికాదయ్యా. నేను గరువులకుపోయి గడ్డి దెచ్చుకొంటున్నాను. కావలిస్తే మూటవిప్పి చూడండి. వట్టిగురుగాకూ, మదనాకూ తప్ప మరేమైనా వుందేమో. ఇట్లాంటిగడ్డి మీచేలో వొకపోచ చూపించండి. పయటి వేళ బోయి వొక్కొక్క పోచచొప్పున దుక్కులలో పీక్కొని తెస్తున్నాను, అసే వరకు "దుక్కుల్లో పీకావో దిక్కు లేనివాండ్లచేలల్లో దొంగిలావో యెవరు చెప్పగలరు? పొద్దు కూకంగానే మా చేలగట్లు మీకు రహదారులయినవి. మనిషంటే గట్టునపోయేదీలేకపోతే కంకి కాయా తెంచేది, యింకొకతడవ మా చేనుగట్టునపోయి నావా అంటే నీ గేడికాళ్ళు విరగ్గొడతాను. యెత్తుకో! మూటెత్తుకో. మాకొట్టంలో వేసిపొమ్మని రెండోసారి కఱ్ఱతో యీడ్చి కొట్టేవరకు వెండిగాజులు రెండూ యెట్లా మెలిదిరిగిపోయినవో చూడు.

రా—మాలమాదిగలంటే అంత చౌక?

ను—మొన్న మట్టసానికి సామినేడివారిచేనికాడ నడిదొంకలో చిప్పెర వట్టుంటే దొక్కొంటున్నా; వాండ్లకోడలు నానామాటలని అట్లా పారపెట్టనీయక పోయింది. పొద్దు కూకిందాక తిరిగి వంచెడుగడ్డితో వచ్చా. ఆసాములు యింతకట్టైనా కంచనా కాలకపోతే యెట్లాగబ్బా! యీ అలగాజనం బతికేది. యేగాడికో పొకడ పెట్టవలసిందే తప్ప యీబన్నెను యికభరించలేను.

రా—దాన్నవిట్టి యెట్లాబతుకుతావు అట్లాగె తంటాలుపడుతుంటాడు. కాక పోతేపట్టుకు యెండిపోవచ్చిన గొడ్డును యిప్పుడు యెవరుకొంటారు.

ను—ఏమితంటాలు పడతానో అబ్బా. గడ్డిగుడ్డా లిక్క ఆ బసవయ్యే వూడ బెరుకున్నాడు, అవయినాయియ్యమను,

రా—పొద్దున్న చూతాం పద,

ను—గేదె పొలంబోయివచ్చినప్పటినుంచి నిలువున కట్టివేసియున్నది, అందులో ఆది మలపగొడ్డు, కాస్తమలుసుకైనా వేయకపోతే అగుక్కేడూ రాల్పదు, అందు కోసమని యిట్లావచ్చా.

రా—రెండు యేడుకట్టలూ కాస్తవచ్చిదంటూ తీసుకో. ఇదుగో మాట, నీవు మళ్లీ పొగాకువేసుకొంటూవున్నావు. సంగడుచూస్తే చీనాట్లు పెడతాడు.

ను—నీయింటికి రాకదానికి నాకదేభయమయ్యా, మొన్న అట్లాగే నలు సంతనోట్లో అనుకున్నా, వాడెట్లాగో కనిపెట్టి నన్ను ఆటలు బట్టించాడు. నేను యికయెప్పుడూ వేసుకోనని చెప్పా. ఇప్పుడొక కాడతుంపి నోట్లో వేసుకొన్నా. నోటి తుత్తరమీద సంగతే మరచిపోయినా, ఇక వేసుకోనంటే చెడ్డవొట్టని నోటిలో పొగాకువుమ్మి చొప్పకుడిసదిట పట్టుకొని చింపిరికలను యెడమచేతితో గోకు కొంటూ వాకిటిదగ్గర కొంచెం వంగి వెళ్లి పోయింది

రామదాసు అవరణం పారజూచి చొప్పదొడ్డివాకిటికి అడ్డంగా పెండెం కదిలాలాగి బిసికొయ్య తగిలించి వుత్తరీయం దులుపుకుంటూ వీధితలుపు గొళ్లెంవేసి యింటికి వెళ్లిపోయినాడు.

---

## మూడవ అధ్యాయం

# ఇల్లు

రామదాసు మాలదాసరికులస్థుడు. పూర్వం శ్రీ మద్రామానుజులు మహాకృపాళుడై పండితపామరులగు మహాజనులందరికీ తరణోపాయంగా భక్తిప్రధానమయిన వైష్ణవమతం స్థాపించి మతవ్యాప్తికై డెబ్భయిరెండుపీఠం లేర్పరచి పరమపదించారు. ఆంధ్రదేశంలో అద్దంకిపీఠం మిక్కిలి ప్రసిద్ధిపడసి తెంగలశాఖకు చెందివున్నది. తెలుగుదేశమున వైష్ణవమతప్రచారం విశేషంగా సాగుతున్న రోజులలో తన్నిమిత్తమై దేశమంతటా ప్రచారసంఘం లేర్పరచబడ్డవి. త్రైవర్ణికులకు ఆంధ్రద్రవిడశాఖలకు చెందిన బ్రాహ్మణులే గురువులుగా నుండిరి. శూద్రులకు బ్రాహ్మణవైష్ణవులే బోధించుచుండేవారు. యీ జనాధికారం అన్నివర్ణములకూ యివ్వవలెననే సమబుద్ధిచేతనో ప్రచారకులసంఖ్య చాలకనో హీనజాతులయొక్క సంస్పర్శను నిచ్చగింపకనో లేక నాలుగైదు వర్ణములవారు బ్రాహ్మణాధికారమును తిరస్కరించి తమ కేల యీజనాధికారముండకూడదను స్వతంత్రభావమును వ్యక్తీకరించటంవల్లనో శూద్రులలో చాత్తాదులనూ (సాతానులు) పంచములలో దాసరులనూ మతబోధకులుగ యేర్పాటుచేశారు. ఈప్రచారకసంఘములన్నీ కలిసి దేహమనోరోగముల రెంటికీ చికిత్సచేస్తూ మతబోధకులు లౌకికవిద్యనూ వైద్యమునూ సమ్మిళితంచేసి చెంచులూ యేనాదులూ పంచములూ మొదలయిన సమస్త జాతులనూ వైష్ణవమతంవంక దిప్పగలిగినవి. ఇందుచేత నా కాలమున సంఘనిర్మాణమునకై అనేకులు మహాప్రయత్నం చేసినట్లు స్పష్టమాతున్నది. ఇట్టి ప్రయత్నములనే శైవమతప్రచారకులూ చేసినట్లు కనబడుతున్నది. ఇటీవల రాజసన్మానం లేకపోవడంచేత మతప్రచారక ప్రయత్నములే ఆగిపోయి పూర్వపుకట్టుబడులన్నీ శిధిలమై యేదియెందుకేర్పడ్డదో గుర్తించడానికిసైతమూ వీలులేకుండా జాడలు మరుగైపోయినవి. చాత్తాదులలోనూ మాలదాసర్లలోనూ వైద్యమూ, కొంచెం అక్షరజ్ఞానమూ, జ్యోతిషమూ, అపరకర్మలలో యాజకత్వమూ యిప్పటికి నిలిచివుండి పూర్వపద్ధతులు యిట్టివై వుండవచ్చునని సూచిస్తున్నవి. చాత్తాదులలోనూ, జంగములలోనూ యిప్పటికీ గొప్పపండితులున్నారు. కొన్నిప్రదేశములలో జంగములు బ్రాహ్మణులను గురుపీఠమునుండి చాలవరకు తొలగించి వారిస్థానమాక్రమించారు. ఈ మహాప్రయత్నములు పూర్ణంగా కొనసాగే వున్నట్లయితే మన సంఘములోని వర్ణభేదములు చాలవరకు అంతరించి యిప్పటి దౌర్భల్యస్థితి రాకపోయేదే.

రామదాసుయొక్క పూర్వీకులు వైష్ణవమతబోధకులై వారి వంశంవారు యిప్పటికి నిలువుబొట్లు పెట్టుకొంటున్నారు. మూడు తరములనుండీ వీరు జ్ఞానమార్గంలో ప్రవేశించి అచలబోధను స్వీకరించారు. అప్పటినుండీ సర్వసమత్వాభిప్రాయములూ, స్వతంత్రబుద్ధీ, సంఘసేవాపేక్షా, శౌచమూ, పారమార్థిక చింతా వారి కుటుంబంలో తిరిగి తలయెత్తినవి. రామదాసు గురువువల్ల కారణం పొందినప్పటినుంచీ ఐహిక విషయములయెడల కొంత విముఖత యేర్పడ్డప్పటికి సంసారం దిద్దుకొనే దక్షత గలిగి చేతి

కక్కురతు వచ్చిన పిల్లవాండ్లు లేకపోవడంచేత సంసారమంతా యీదడం యాతనగా వుండేదిగాని నాలుగుసంవత్సరములనుంచీ పెద్దకొడుకు వెంకటదాసు వ్యవసాయపు పనులలో అరితేరి ప్రతిపనీ తండ్రికడ్డంవచ్చి చేసుకొని పోతూవున్న తరువాత రామదాసుకు చాలా విశ్రాంతి కలిగింది. వెనుకటి అలవాటుచేత చేసేచేయి వూరుకోక ఏదో వొక పని అతుకుతున్నా అతడు విశేషకాలం మతవిషయంలోనే యిప్పుడు గడుపుతూ వున్నాడు. రెండవ పిల్లవాడు యింటిపనులలో దిగకపోవడంచేత పెద్దపిల్లవాడికి వీలు కానప్పుడు యెప్పుడైనా అరకకు పోతూవున్నా సాధారణంగా వెంకటదాసు తండ్రిని పొలంపని చేయనిచ్చేవాడు కాడు. రామదాసు పూర్వీకులు భాగ్యవంతులనడానికి వీలు లేకపోయినా పదిడబ్బులు యిచ్చి పుచ్చుకొంటూ వొక అరక వ్యవసాయమూ, నాలుగైదు ఆవపశువులూ పెట్టుకొని యీవేళ పాయిమీదికిలేదూ అని అనుకోకుండా కాలం వెళ్లబుచ్చుకుంటూ వచ్చారు. పూర్వార్జితపు ఆస్థిలో తూర్పుపొలమున అయిదెకరముల మాగాణీ దక్షిణ పొలిమేర దగ్గర ఆరుయెకరముల సావరమూ, మిద్దెయిండ్లూ మాత్రం నిలిచివున్నవి. రాముదాసు తండ్రి వుత్తరంగా వూరినానుకొనివున్న నాలుగెకరముల పాటిచేను పశువులపోడుకు ఆగలేక పదిహేను సంవత్సరముల క్రిందట మంచిధర వచ్చినప్పుడు ఆవూరి షావుకారు నల్లమోతు చౌదరమ్మకు విక్రయించి పడమటి పొలమున పదియెకరములు సుక్షేత్రంవంటి రేగటిచేను సంపాదించాడు. అప్పటినుంచీ అరకకు వోపినంత పొలమేర్పడ్డది. రాముదాసు హయాంలో సావరంలో వాగు పారుతూండే రెండెకరముల పడమటి పంపును బీడుకిందవదలి కాడిగట్టువున్న కర్ణంగారి రెండెకరముల బీటిని వేలంలోకొని తనబీటిలో కలుపుకొన్నాడు. ఇప్పటి పశులదొడ్డికూడా రామదాసే సంపాదించాడు. పశువులకొట్టం యింట్లోవుంటే అనారోగ్యమని రామదాసు రెండవ కుఱ్ఱవాడు పట్టుపట్టి గడచిన యెండాకాలములో కొత్తదొడ్లో రెండవకొట్టం వేయించాడు. ఇంటిముందర మొరాబాలో వొకటి, రెండు పాడిగొడ్లు తప్ప తక్కిన వాటిని కొత్తదొడ్లోనే కట్టివేస్తున్నారు.

రామదాసు యింటెది తూర్పువాకిలి. అతడు వీధితలుపు నెట్టుకొని లోపలికి బోయి గొళ్లెంవేసి అవరణములో నాలుగడుగులు వేసేటప్పటికి జ్యోతి, అమ్మా! అయ్య వచ్చాడని చెప్పుతూ యెదురుగా పరువెత్తివచ్చి చేయిపట్టుకొని లాగి అమ్మకు సగం దోసకాయలు పచ్చడినూరేటందు కిచ్చానని చెప్పగా నీవు మంచి అమ్మవమ్మా అని తండ్రి లాలించేవరకు కొండెక్కినంత సంతోషపడ్డది. ఆవరణంలో వాల్చి వున్న మంచముమీద తండ్రి కూర్చోంగనే అతని నలుముకొని వొడిలో కూర్చొని నేను పూచబియ్యం పిసికిళ్లుచేసుకొని తిన్నానూ, ఎవండ్లనూ యిన్నయినా పెట్టలేదూ అని దీర్ఘాలుతీస్తూ చెప్పింది.

రా—ఎవ్వరికి పెట్టకుండా అట్లా తినవచ్చా?

జో—తినగూడదూ—ఈ తడవ తెచ్చుకొంటే పెడతాలే!

ఇంతలో మాలక్ష్మి నడికట్టువేసుకొని కుడిచేతితో తోడుబాలూ ఎడమచేతితో యెత్తుపీటాతీసుకొని మందగమనంతో షోడపగొండపై వుదయించే పూర్ణచంద్రుని కిరణజాలము నెదుర్కొని తనచిరునవ్వుచే యెగతాళిచేస్తూ మందంపనిపాపించి తనభర్త మిక్కిలి డస్సివుండడంచూచి “అమ్మాయీ! మీ అయ్యమీదపడబోకు. అబ్బాయి

ముసుగువేసుకుంటాడేమో మంచముమీదకూర్చుని చూస్తావుండు. లే, మాటవినీ" అని అన్నది.

జ్యోతిలేచి పరుగెత్తుకొంటూబోయి పంచాదిలో దక్షిణపు ప్రక్కన వేసివున్న పిల్లవాడిమంచంమీద కూర్చుండి వాడితో ఊంకొడుతున్నది. మాలక్ష్మి దూడను విడిచి పాలుచేపగానే కట్టివేసి గేదెను వెన్నుచరిచి యెత్తుపీటమీద కూర్చొనిరెండుచేతులతో పాలుపిండ నారంభించింది.

రాకాచంద్రుడు మాలక్ష్మిమోము చంద్రుడు అపహసించడంచేత చిన్నబోయి మిన్న కగ్రాగుతున్నాడు. రాముదాసు వుత్తరీయమును జుట్టి తలక్రింద బెట్టుకొని చేతులు పట్టెలపైవెచి కాళ్లుజాచి అరమోడ్పుగన్నులతో చంద్రబింబము నాస్వాదించుతూ క్షణంలో అంతర్ముఖుడుకాగా పాత్రిళ్లలో బాలుని ఊంకారములూ పాలధారల ఝంఝంరవములూ దహరాకాశమునన్నూ మహదాకాశమునన్నూ విలీనమైవున్న నాదబ్రహ్మముతో ననుసంధించి అన్నీ ఓంకారమున నేకీభవించినవి. నాదు పేరయ్యయోగి వరేంద్రుని కరుణచే త్రివేణీసంగమమున కమల సహస్రార కమలమున బట్టబయలై వున్న పండువెన్నెట లభించిన ముక్తికాంతా సంపర్కన సంజాత నిర్మలానంద ఝురి నిమగ్నుడై వొడలెరుంగక యోగనిద్రం జెందె, సప్తద్వీపాంతర వర్తులై నవరత్న ఖచిత సింహాసనారూఢులై, మణిప్రగిత ధర్మకిరీటధారులైన చక్రవర్తులకు అనుభవింపరాని మహదానందమును దేహం వొరుసుకొనిపోవు నులకమంచమున నుయ్యాలలూగే మాలదాసరి చూరగొంటున్నాడు. ఆకసాము నిర్మలంగా వున్నది. మలయసమీరములు మాంద్యమును పొందినవి. గగనలక్ష్మి వేయికనురిక్కలతో తనివోవక పరిశీలిస్తున్నది. మిద్దెపంచలోని దీపకళిక నిశ్చంచలమై వున్నది. చంద్రుడు పరుగిడనొల్లక తిరిగి తిరిగి సంచరిస్తున్నాడు. విరాట్పురుషుడు తన వేడికంటిని మరుగుపరచి కలువకంటిని విపులీకరించి కడగంటికిరణములతో చుంబిస్తున్నాడు. మాలక్ష్మి దూడను పాలకువిడిచి దుత్తను అరచేత బెట్టుకొని యెత్తుపీట రెండవచేత బెట్టుకొని లోపలికరిగి పాలు దాలిమీద పెట్టి పొంతకుండలోని నీళ్లుపట్టిచూచి స్నానంచేస్తే బడలిక తీరుతుందని భర్తదగ్గరకు వచ్చి లేపబోయి అప్పటి యాతని మహదావస్థను గ్రహించి కన్నుల బాష్పములురాల తన పూర్వపుణ్యవశమున యీ పుణ్యపురుషుని చేపట్టుటచేగదా తనకిట్టి యద్భుత దృశ్యములు అప్పుడప్పుడు లభించుచున్నవని ఆనందించి మెల్లగా కాళ్లవైపుకుబోయి ప్రేమాతిరేకమున తన పమిటకొంగుచే నాతని పాదములు విసిరి వాటికి తగలకుండ ముమ్మారు నమస్కరించి బాలునికడకుబోయి "అమ్మాయీ మీఅయ్యకు కూరుకుపట్టింది. ఇక్కడ అరవద్దు. పద" మని పాత్రిలిగుడ్డతో బాలుని చేతులలో బెట్టుకొని తూర్పింటిలో మంచముకడ నున్న యెత్తుపీటపై దీపమునకు సమీపమున గూర్చుండి బాలుని వొంటికి మూడుకూ ఆకుదనురాచి పాలుగుడుపుతూ తానిప్పుడే చూచివచ్చిన అద్భుతదృశ్యం మరల మనస్సునకురాగా ఆ దృశ్యంయొక్క సూక్ష్మరూపమే తన యెదుట పాలుగుడుస్తున్నదని గోచరింప అదివరకు తన మనస్సు నావరించివున్న ప్రేమ, భక్తి వాత్సల్యంగా పరిణమింపగా ఆనందంగ తియ్యని పాలుతాగుతూ సౌలభ్యవశమున బాలుడై తల్లివంక జూచు విశ్వస్వరూపమును కదలక వీక్షించి మైమరచి వున్నది.

జ్యోతి పచ్చడికీయుగా మిగిలిన దోసకాయలను ముక్కలుగోసి అందరూ వచ్చిన

తరువాత పంచుకొని తింటామని దాచిపుంచి అన్నలు వచ్చే వేళయిందని ముక్కలు తెచ్చి చేటలోపోసి దీపముయెదుట పెట్టుకొని కుప్పలుపెట్టుతూ మొదటికుప్ప నాదీ రెండవది బావదీ మూడవది అమ్మదీ అని వరుసగా అందరికుప్పలూ పెడుతూ కూర్చున్నది.

---

## నాల్గవ అధ్యాయము

# కుటుంబము

మాలక్ష్మి పిల్లవాడిని నిద్రబుచ్చి వసారాలోకి వచ్చేటప్పటికి రామదాసు లేచి మంచంమీద కూర్చున్నాడు. తాయ తిరిగి అతని వావరించింది.

మా—నీవులేచి స్నానంజేస్తే యింకలోకి పిల్లవాండ్లు వస్తారుగా. మళ్లీ పొద్దు పోతుంది.

రా—అట్లాగే. నీళ్ళుతోడు.

మా—సందున చేస్తావా యిక్కడికి తోడక వచ్చేదా ?

రా—తోడకరా. చెంబుతో కాపిని నీళ్ళిట్టియ్యి.

రామదాసు తలుపుతీసుకొని వీధిలోకి వచ్చాడు. నెల రెండుబార లెక్కింది. ఎదురుగా తూర్పుకనుమలవరుస వెన్నెట్లో నల్లగా నిగనిగలాడుతున్నది. ఈ వరుసలో నూదిబోడు బొల్లుమోర రాయుడికొండ ఖిల్లాకొండ అనే మూడుశిఖరములు ఆకాశమును నిక్కి చూస్తున్నవి. దక్షిణాన కోసెడు దూరంలో యింకొక తిప్ప వున్నది. మాలపల్లెకు వాయువ్యాన మాదిగపల్లె, దానికి వుత్తరాన ఫర్లాంగు దూరములో మాలకొండా కమ్ముకొని వున్నవి. రామదాసింటికి పడమర యిరవై గజములలో పూరగొండా, యీరెండింటికి మధ్య సంగళాపురమునుండి పడమటి పొలమునకు పోయే డొంకా వున్నవి. వూరికి తూర్పు దక్షిణాల రాస్తా, దానికానుకొని వూరా చెరువూ, వాటి నడుమ శివాలయమూ, దానికి తూర్పున పంటకాలువా, దానిగట్టున అమ్మవారి కొండా వున్నవి. పెద్దకాలువ కనుమలకు తూర్పుగా పోతుంది. గ్రామానికి యీశాన్యమునా నైరుతిమూలా రెండు రైలుస్టేషన్లున్నవి.

రామదాసు యిల్లు యెదురుబడి రెండేసిదూలముల మిద్దె. యింటికి తూర్పునా, దక్షిణానా పెంకటి వసారాలు, యింటిముందు ఖాళీస్థలమూ, వీధికానుకొని దక్షిణపు గోడమీద రెండుదూలముల పూరికొట్టమూ వున్నవి. ఇంటికి పడమర విశాలమయిన దొడ్డీ, దక్షిణమున పశువులదొడ్డీ వీటిచుట్టూ కంకుటిముదురు పోసిన ప్రహరీగోడా, కలవు. పడమటపోయే డొంకలోకి యింటిదొడ్డికి పశువులదొడ్డికి దిడ్డివాకిళ్ళున్నవి. తూర్పున సింహద్వారములూ వాటి కెదురుగా ఖాళీ పోరంబోకలూ వున్నవి. డొంకలోనుంచి యింటికి వుత్తరంగా వొకవీధి వచ్చి పోరంబోకులో కలుస్తుంది. రామదాసు తండ్రి నలభైసంవత్సరములకింద యీ పోరంబోకులో నాటిన వేపచెట్టు పెద్ద మానైంది. దాని మొదట అరుగువేసి పైన వీరబ్రహ్మంగారి కావిజండా యెత్తారు. యీ చెట్టుక్రింద శ్రీరామ మందిరమూ, గ్రంథాలయమూ కట్టించడానికి స్థలం నిమిత్తం రామదాసు రెండోకుమారుడు దరఖాస్తు పెట్టాడు. యింకా మంజూరు కాలేదు. పడమటిల్లు రెండుగదులుగా అరగోడ బెట్టి విభజించారు. తూర్పింటిలో గదులులేవు. కాని ఆగ్నేయ

మున గడిపారున పెద్దఅరుగువేసి వాకిటి రెండుపక్కలా తూర్పువసారాలోకి కొత్తగా రెండు కిటికీలు పెట్టించారు. తూర్పింటిలోనుంచి దక్షిణపు వసారాలోకి దానిలోనుంచి పడమటి దొడ్లోకి వాకిళ్లున్నవి. దక్షిణవసారాలో వంటచేసుకొంటారు. తూర్పింటిలో వుత్తరపుదరిన గడవంచీ వొట్టాకు వుండే, కిట్టి కొట్టంలో మిరపకాయల బోరెంలూ, గింజలగాదే పెట్టారు. వుత్తరపు గోడజెంబడివున్న మూడుపాళ్లకుగాను వొకదాంట్లో వడ్లు నిలవవున్నవి.

రామదాసు బయటికని దీర్చుకొని వాకిటదగ్గరకు వచ్చేవరకు వెంకటదాసూ, అప్పాదాసూ కావిళ్లువేసుకొని పేరెములుతీస్తూ, కేకిసలు కొడుతూ వస్తున్నారు.

రా—అం, మెల్లగారాండి. బుంగలుపోగొట్టేరు.

అప్పాదాసు కావిటిరొయొక్క వెనుకమట్టు మండిగానికి తగిలిందిగాని బుంగ పోలేదు.

రా—అడుగులో హంసపాదు పెట్టేవురా.

అ—ఇంతమాత్రానికేనా.

రా—అప్పుడూ! నీ కావిడిక్కడ దింపు. చన్నీళ్లకుంటవి. యింత ఆలస్యము జేశారేమి?

అ—బానలూ తొట్లూ అన్నీ నింపివేశాం.

రా—అం, అట్లా రొప్పుతున్నావేమి?

అ—బావ నన్ను బహుతిప్పలు పెట్టాడు. ఆయన యెన్ని కావిళ్లు తెచ్చాడో నేనూ అన్ని తెచ్చా. వచ్చేటప్పుడూ పోయేటప్పుడూకూడా ఒకటే వురకడం.

రా—పెద్దబ్బాయ్ యెందుకురా పాపం చిన్నవాణ్ణి తిప్పలు పెట్టడం?

వెం—(అప్పుడివంక చూచి) - చిన్నవాడివా? గాడిదగుడ్డుకాలె వున్నావు.

మా—మీ రిద్దరూ యిట్లారండి. పొంతకుండలు వాకిట్లోకి పట్టుకవస్తురుగాని

వెం—ఇద్దరేసి పట్టాలనా. రారా చెరివొకటి పట్టుకవస్తాం.

మా—అయ్యో వాడొక్కడా! నడుమునొప్పిపట్టేను. మీ పంతాలు సరే కాని నా పొంతకుండలు భద్రం.

జోతి రెండుచెంబులు పట్టుకొనివచ్చింది. ముగ్గురూ నీళ్ళుపోసుకొంటున్నారు. మాలక్ష్మి భర్తకూ కొడుకుక్కూ వీపు తోముతుంటే జోతి నేను బావకు వీపుతోముతానని నడుముదగ్గర సన్నసై బుజములదగ్గర దిశాలమైన వీపు తోమింది.

స్నానమైనతరువాత వుతికినపంచలు కట్టుకొని అందరూ ఇంట్లోకిపోయినారు.

వంటవసారాలో ఆగ్నేయాన పొయిలు పెట్టారు. పడమటిభాగంలో రామదాసుకు పళ్ళెమూ తక్కినవాండ్లకు కంచాలూ పెట్టి అన్నంవడ్డించి దానిమీద గోంగూరవేసి యిదిగో మీ అమ్మాయి తెచ్చిన దోసకాయల పచ్చడని తలాకాసిని పచ్చడి బద్దలు వేసి సాయంత్రం వేసే మమూలు ప్రకారం అందరికీ నెయ్యి వేసింది.

జోతి—అమ్మా యిటురా మాట (చెవిలో) అందరికీ నా దోసకాయముక్కలు పెట్టవూ?

మా—ఇప్పుడు కాదు. అన్నం తిన్నతరువాత,

జో—అందాకా చెప్పవద్దు.

రా__ఏమిటో రహస్యం.

జో__వొట్టు. చెప్పేవు!

మా__చెప్పనులే; మీకెందుకూ మా సంగతి.

రా__చెప్పకపోతే మానెలే.

జోతి__చూడమ్మా యీ మొద్దుకంచం నాకు కదలదు. బుల్లికంచం కొని పెట్ట మంటేనూ.

మా__ఈతడవ కంచరవాండ్లు వస్తే కొందాంలే.

జోతి__అయ్యోయ్. అమ్మే - నాకే - పయిటాల - రోజూ - ఆ బియ్యపు అన్నమే - పెట్టమంటే - పెట్టదు.

మా__నీమే అమ్మా, సుకరాలు పోతావు, ఈ పూటవండింది నీకు చద్దెన్నానికి మిగిల్చి పెడుతూ నేవుంటిని. ఎటుతెచ్చి నీవు మధ్యాహ్నమేగా జొన్నన్నంతినేది కాకపోతేవట్టుకు పండిగ్గింజలు పారబోసుకుంటారూ?

వెం__మూడుపూటలా వరెన్నంతింటే వ్యవసాయం చేసినట్టే, తూర్పున అసలు మెట్టేలేదు. వాండ్లకేమి వ్యవసాయ ముంది? నాట్లువేయడమూ నూర్చుకోవడమూ; మనుష్యులు పూదపొట్టలూ వాండ్లూ వుంటారు.

మా__మధ్యాహ్నం మీకు అన్నం దీసుకొని రావడానికి నానా యిబ్బందీ అయింది. మీ ఇద్దరూ చెరోకకోసకూ పోతిరి. నేను యింట్లో వుంటే బయటికీ బయటికిపోతే యింట్లోకీ లేదాయె. ఆఖరుకు వెట్టిపున్నన్న మేనత్తను బతిమలాడి పిల్లవాడి దగ్గర కూర్చోబెట్టి ఆదరాబాదరా లగువులుతీసి వచ్చేవరకు పిలవాడు చేతుల్లోనిలవ కుండా యేడుస్తున్నాడు. అసలాబిడకు పిల్లవాణ్ణి పట్టుకోనే చేతకాదు!

వెం__అసలు పుట్టుపుంకాయె.

మా__నిరుడు యీ రోజుల్లో మా సబమ్మ బాగావోపిగ్గానే తిరుగుచున్నది. ఏటీ ఆమె మంచానబడి వడసారం ఆరునెలలుకూడా కాలేదు. ఆమెరోజులు వెళ్ల బుచ్చుకొని పోయింది మహారాజు. ఎప్పుడూ గడిచినరోజులే మంచివి.

రా__కాలం వచ్చినప్పుడు పోక మన కిబ్బందని మానుకొంటుందా? రేపు మనకాలమువస్తే మనమూమాత్రం బోమా. పిల్లలు నాదార్లం లేవదిలి పెట్టిపూరుకుంటాడా.

జోతి__అమ్మా! రేపెక్కడకే అయ్యా, నీవు పోవడం.

అ__(పగలబడి నవ్వుతున్నాడు)

వెం__ఎక్కడకా? దేవుడిదగ్గరకు.

జోతి__దేవుడు తన దగ్గరకు మిమ్ములను రానిస్తాడా?

మా__ఆ; ఆ దేవుడు రానిస్తాడు.

జోతి__ఇక్కడి దేవుడిగుడిలోకి మనలను రానీయరేమి?

మా__రానీయకపోతే వాండ్లే చెడ్డారుతే! మీ అన్న మనకు దేవుడిగుడి కట్టిస్తున్నాడుగా.

జోతి__మన గుడిలోకి వస్తాడా దేవుడు?

మా__ఆహా యెవరు కట్టించుకొన్నా వస్తాడు. ఆయన కంటులేదు.

రా—పెద్దదేవుడు మనలోనే వుంటే యీ రాతిదేవుళ్ళెందుకు? రాళ్లు దేవుళ్లయితే రాములు మింగవా అన్నాడు.

వెం—నీదంతా అద్వైతం, అంతా నీఅంతవాండ్లయితే దేవుడిగుళ్లక్కరలేదు. మేమంతా ముక్కులు పట్టుకొని కూర్చుంటామా యేమి?

రా—ఎందుకు కూర్చోగూడదు?

వెం—బువ్వెక్కడలా యిగను.

రా—పెట్టివుంటే అదే వస్తుంది.

వెం—చాకిరి చేసుకుంటే వస్తుంది.

రా—చాకిరిచేసుకొన్నా రానిరోజులు వస్తవోయ్; అప్పుడు మన తెలువులేమీ అక్కరకురావు. లక్ష్మి యెటువంటిదంటే తాటికాయల్లో నీళ్లు చూడరాదూ. అవ్వే వస్తవి, అవ్వే యెండిపోతవి.

క: "సిరి దా వచ్చిన వచ్చును, సలలితముగ నారికేళ సలిలము భంగిన్
సిరి దాఁ బోయిన బోవును, కరిమ్రింగిన వెలగపండు క్రమమున సుమతీ"

జోతి—అమ్మా మొద్దుకంచాన గుజ్జుతీసుకుంటే రానేరాదు.

మా—అమ్మాయీ! నీకు పొద్దుగూకులూ గునుపే నేమే!

జోతి—చూడమ్మా నా చేతిన యెంత గుజ్జతుక్కొనున్నదో, గిన్నే అట్లాగే వుంది. ఎప్పుడమ్మా చిన్నకంచం కొనిపెట్టడం?

మా—నీవు యే పట్టుపడితే అదేపట్టు. కొనిపెడతా నంటిగా.

మాలక్ష్మి చల్లబోస్తూ వుప్పువడ్డిస్తున్నది.

వెం—అయ్యకు కాస్త పెరుగు వేయరాదూ?

మా—అందరికి వేస్తేనేగాని ఆయన వేయించుకోడట.

వెం—అందరూ పెరుగుతాగవలెనంటే నాలుగుబర్లపాడి కావాలె.

మా—సరే నాయనా యీ వొక్క బర్రెతోనే తెములడంలేదు. రెండో బర్రె కూడా యీనితే యెట్లాగా అని చూస్తున్నా. మీ చెల్లెలు రోజూ మూటెడు గడ్డి తెస్తుందేమో యేదో వొకమాట చెపితే

రా—ఆమె వున్న బర్రెనే అమ్మతానంటున్నది. గడ్డెక్కడా దొరక్క.

మా—మన చేలల్లోనే తెమ్మనేది. ఆసాములు పుట్టనిస్తారూ! గడ్డి యెండిపోయినా మాబాగేకాని మాలవాండ్లు కాలుపెట్టకూడదు.

రా—కనుక్కో యేమంటుందో.

మా—ఇప్పటికి వున్నగొడ్లను సగరొవ్వకుంటే చాల్లే. ఈయేడు మాపెద్దబ్బాయి పెండ్లయి కోడలువస్తే అప్పటికి చూచుకొందాం.

వెంకటదాసు తలవంచి ముసిముసి నవ్వులు నవ్వుతూ వూకుకున్నాడు. అందరూ భోజనంచేసి దొడ్లో చేతులు కడుక్కొని తూర్పింటిలోకి పోతున్నారు. మాలక్ష్మి భోజనానికి కూర్చున్నది.

జోతి—(రహస్యంగా) ముక్కలు పెట్టవద్దు.

మా—అమ్మాయి తియ్యదోసకాయముక్కలు పెట్టుతుందట. తీసుకోండి. పెట్టేదాకా నిలవడంలేదు.

రా___ఇందాకటి రహస్యమదేనా?

అ___ఇటహే యిటదే అని ఒక కుప్ప తీసుకున్నాడు.

జోతి అందరికీ తక్కినవి పంచిపెట్టింది. రామదాసు ముక్కలు తింటూ దస్తరం తీసుకొని వసారాలో దీపం దగ్గరకు పోతూవుండగా___

వెం___ఈయేడు పొగతోట మానుకుండేటట్లేనా?

రా___సంగడు అందరిచేత పొగాకు మాన్పిస్తుంటే మనము పొగాకు పండించడమూ. సావరాల్లో తాటిచెట్లు గీత కియ్యనన్నాడట.

వెం___ఈవున్న తోట్టాకయినా యేనాడికో పొకడ పెట్టుకుంటే మంచిది. వాడు యిదంతా తగలపెడతానంటాడేమో. ఎంతహీనమైనా వందరూపాయలసొమ్ము.

రా___అంతమాత్రపువాడు కూడాను.

వెం___రేపొద్దున బేరమిచ్చి తోలిపెడతా.

రా___నీ యిష్టం యిందుట్లో వొక బొక్కు లేదేమిరా?

వెం___లేకేమవుతుంది? బాగా చూడు.

రా___చూశా. 'వెంగమ్మగారి రాజయోగసారమూ, శేషాచలనాయుడుగారి వరమునసమార్గమూ, సిద్ధప్పగారి తత్వాలూ, కోటయ్యగారి గురుకీర్తనలూ, శివరామ భాగవతులవారి తత్వకండార్థాలూ, పీరయ్యగారి యేలాలూ, సీతారామాంజనేయమూ. బుచ్చయ్యగారి సాధనచతుష్టయమూ - అంతే శ్రీరామశాస్త్రులవారి భక్తియోగం లేదు అది నా పారాయణ గ్రంథం.

మా___లోపలనుంచి - పొద్దున సంగడూ మరోకాయనా వచ్చి వొకపుస్తకం తీసుకొనిపోయినారు. రెండోఆయన యెవరో తుంగదుర్తి బుచ్చయ్యగారట. మన అయ్యగారూ వారూ గురుపుత్రులు లే?

రా___బుచ్చయ్యగారా! మనయింట్లో అడుగుపెట్టారా? యెంత సుదినం. అయ్యో నేనింట్లో లేకపోతినే అప్పుడు. ఆయన మహాతపశ్శాలి. యెన్నాళ్లనుంచో దర్శనం చేయవలెననుకొంటున్నా. వారు యెక్కడ దిగారో?

మా___ఎక్కడ దిగిందీ నాకు తెలియదు. రేపల్లా వుంటారట.

రా___అంతే సరే. పొద్దున దర్శనం చేయవచ్చు.

వెంకటదాసూ అప్పాదాసూ దుప్పట్లు తీసుకొని కొత్తదొడ్లో పడుకొనేటందుకు వసారాలోకి వచ్చారు. వెంకటదాసు మనస్సు ముందే వేసిన తోట్టాకుమీదికి పోయింది మళ్లీ మలుపుకొన్నాడు. అన్ని పనులకంటే ముందు పొద్దున పొగాకు అమ్మవేయవలె నని అనుకొంటూ యిద్దరూ బయలుదేరారు.

అ___బావా! అదిగో బర్రె యీనుతూవున్నది.

వెం___నిజమే. బర్రె యీనబడ్డది.

జోతి___ఆమాటలు విని పరుగెత్తివచ్చి చూచి-అమ్మా, మనబర్రెయీనుతున్నదే మాలక్ష్మి త్వరగా చెయికడుక్కొని వాకిట్లోకి వచ్చింది.

జోతి___అమ్మా, మనకు చిన్న బుజ్జాయి పుడుతుంది. గాఁవాలె.

మా___పుడుతున్నది.

వెం___మనం పోదాం రారా.

అ—ఇవ్వేళ యిక్కడే పడుకొంటా. తెల్లవారుజామున లేచి పనికోసం వస్తాలే

వెం—ఇక్కడేమి చేస్తావు? బర్రెకు నడుములు పడతావా?

అ—నీవు పట్టు.

రా—పెద్దవాండ్లను మళ్లీ అంటార్రా?

వెం—సరే, నే బోయి హాయిగా పడుకొంటా.

---

## ఐదవ అధ్యాయం

## బఱ్ఱె

రా—బర్రె లేవలేనంటూ వున్నది. కొంచెం లుగ చెడట్లు కనబడుతున్నది.

మా—లుగ చెడడమంటే వొంటి గొడ్డుకున్న పోషణ నాలుగుగొడ్లల్లో అమరుతుందా. అందులో యీతలు ముదిరిన గొడ్డు.

రా—కాస్త పచ్చిమేత వేస్తే యిప్పుడు?

మా—ఇప్పుడు మేత తింటుందా? నారాయణమూర్తి బెట్టిన ఆ నాలుగు ఘడియలూ గడవాలె. పాపం దానికి కష్టసమయుంగదా!

జోతి—అమ్మోయి బర్రె నాలుక వెళ్లబెట్టుతున్నదే.

అ—అదిగో! వుచ్చబుడ్డ పడిపోయింది.

మా—ఇక ఆట్టేసేపు పట్టదు.

జోతి—రెండుకాళ్లతో దణ్ణం పెడుతున్నట్టుగా వున్నదేమే.

మా—నారాయణమూర్తీ! ఈమాయప్రపంచంలో యెందుకు పుట్టిస్తున్నావురా అని దణ్ణం పెడుతుందట.

రా—భూమిమీద పడేవరకూ జంతువుకు పూర్వజ్ఞాన ముంటుందని రాజయోగ సారంలో చెప్పారు. అది కలిలో ప్రవేశించింది.

జోతి—అదిగో దూడవచ్చింది.

బఱ్ఱె చటుక్కున లేచి గిఱ్ఱున తిరిగి తనజన్మ సార్థకమైనట్లు కండ్లనానందం వెలిబుచ్చుతూ బిడ్డనుచూచి వాయికేలు కొడుతూ వొంటినున్న మురికంతా నాకడం ఆరంభించింది.

మా—దాని ముక్కులా కండ్లా మష్టుతుడవండి.

రా—ఎవ్వరూ తుడవనక్కరలేదు. తల్లే తుడుస్తున్నది.

మా—ముక్కులు వూపిరాడవు. తుడిచి గట్టెలు గిల్లండి. తెంగదూడే; మా మాగాని దున్నుతుంది.

రా—ముక్కులుపిండి గట్టెలు గిల్లబోగా బర్రె బుస్సుమన్నది. దానిని గదిమి గట్టెలుగిల్లి పొట్టమీద పెడితే తల్లి తినివేసింది. దూడ వొక్కమాటు చిన్నగా అరిచి కాళ్లు ముడుచుకొని మెల్లగాలేచి తొట్రుపాటుతో తప్పటడుగులు వేసి పొదుగుకంకకు పోయింది.

మా—ఓసి నీకడుపుడక, అప్పుడే నీకడుపులో యెలుకలు తోడుతున్నవటే! వోటి కండించండి.

రా__దానిని పొదుగుదగ్గిరకు యెవరు పంపించారో వారే కుడుపుతారు. మీరు తొందరపడడ మెందుకు? చూస్తూ వుండండి.

దూడ మెల్లగా పొదుగులో మూతిబెట్టి అటూయిటూ నెట్టి నోటిలో చన్ను యిరికించుకొని చప్పరించడ మారంభించింది.

రా__సరేనా.

మా__సరిగాకేవుంది. జంతువు పుట్టిందే అందుకారు.

రా__అన్నమయకోశాన్ని పోషిస్తేగా ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ కోశాలు అందులో నిలువబడేది?

జోతి__అమ్మా, మనము జున్నుబాలు తాగే దెప్పుడే?

మా__ఈపూటవి ముర్రుబాలు పిండి కుడితిలోబోసి పొద్దుటవి జున్ను చేసుకో వచ్చు.

రా__మాయపడేసరికు యెల్లైనా వొక గంటసేపు పడుతుంది. దానికి మా నెడు గింజలు పెట్టి కాస్త వరిగడ్డి నెయ్యి. పుంజుకొని మాయవేస్తుంది.

మా__అప్పుడూ! గడసంచి మీదతట్టలోవి మూనెడు సజ్జలు చేటలోపోసుకరా.

అప్పుడు సజ్జలుచేట ముందర పెట్టంగనే బర్రె దాణాతిని వొళ్లు విదిలించి వరిగడ్డి మేస్తూవున్నది. దూడ కాసినిపాలు తాగి అటూయిటూ రెండడుగులు వేయబోగా తల్లి దూరంగా పోనీయలేదు. నాలుగు నిమిషములలో దూడ కిందబడుకొని కనుమూయ నారంభించింది. బర్రె దూడను మూచూచి సమీపాన పడుకొన్నది.

అ__మామా, రేపు వూళ్ళో గొడ్లను చెరువులో నడిగడ్డకు తోలుతారట. నీరు దీసింది.

రా__ఈయేడు గడ్డి బాగా బలిసిందా.

అ__మోకాలెత్తు పెరిగింది. పెద నడిగడ్డన అంతా తుంగబట్టింది. కాని చిన నడిగడ్డన దోమకాలూ చెంగలీ కలగలుపులుగా పెరిగింది.

రా__అయితే బాగా పదిహేనురోజులు మేయవచ్చు. తుమ్మకాయ యెద్దులకు పదిరోజులు సరిపోతుంది, పుల్లరెంత?

అ__యెంత; మునుపటిది. బర్రెకు అర్ధా, ఆవుకు పావలా. పుల్లరిఖరీదు వొక్కరోజు మేతకే యీయవచ్చు.

రా__రేపు ఆడగొడ్లన్నింటిని తోలకపో. పుల్లరి రేపే యియ్యవలెనా?

అ__మన గొడ్లను తరువాతయిస్తామంటే వూరుకొంటారు. రేపు వూరికె లెక్క వ్రాసుకొంటారు.

మా__అదుగో పిల్లవాడు లేచినట్లున్నాడు. మామా అల్లుడూ మంత్రసానిపని చేయండి. నే బోయి పడుకొంటా. చద పిల్లా పడుకుందువుగాని బుజ్జాయి పుట్టిందిగా.

జోతికి కూరికెపాట్లు వస్తున్నవి. లేచి వొళ్లువిరచి బుజ్జాయిను వొక్కమాటు ముద్దుపెట్టుకున్నది.

జోతి__అమ్మా, దీన్ని లోపల కట్టివేయువద్దటే.

మా__నిన్ను మీ అమ్మదగ్గర లేకుండా బయట కట్టివేయుమంటావా?

జోతి__ఊం పోమ్మా.

మా—రాత్రి చినుకులేమి రావులే. కాస్త మద్దు అణిగినదాక దానెమ్మదగ్గర పడుకోనియ్యి. ఇప్పుడే తీసుకపోతే తల్లి అరుస్తుంది.

ఆ—అత్తా, రేపు నాకు పెరుగన్నం గట్టాలె.

మా—అట్లాగేలే. యేమికథ?

ఆ—రేపు వూళ్ళో గొడ్లవాళ్లంతా కుషామత్తుగా అనుకుంటారు.

రామదాసుకూ అప్పాదాసుకూ పక్కలువేసి మాలక్ష్మి, జోతి లోపలకిపోయి పడుకొన్నారు.

అప్పుడు తన మంచమున కానుకొని గొంతుగూర్చొని కొంచంసేపు బర్రెవంక చూచి మోకాళ్లమీద ముంజేతులు అడ్డంగా బెట్టుకొని వాటిమీద తన మొగమానించి తాను పొద్దున పెరుగన్నం కట్టుకొని పడిగడ్డకుపోవడమూ అక్కడ పిల్లలతో ఆడుకోవడమూ చేర్లో యీతకొట్టడమూ తలపోసుకొంటున్నాడు.

రామదాసుకు బుచ్చయ్యగారు తలంపుకు వచ్చారు. కొంచెము దీపం దగ్గరకు జరిగి దప్తరంలోవున్న గురుకీర్తనలు తీసుకొని నాలుగు కీర్తనలు కూనరాగములు తీస్తూ చదువుకొన్నాడు. ఇంతలో బర్రె లేచిన చప్పుడయింది. రామదాసు బర్రెవంక చూచి పుస్తకం మూసి, "అరే అప్పుడూ మాయవేస్తున్నది. తింటుందేమో మూతిమీదకొట్టు" అని చేతులోవున్న కఱ్ఱతో పేడపల్లికెలోకి నూవిపెట్టుకొని దూరంగా బోర్లించి చేతులు కడుక్కొని వీధితలుపు గొళ్లెంవేసి యిక పడుకోరా పొద్దుపోయిందని అప్పడితో చెప్పి తన మంచముమీద పడుకొన్నాడు.

అప్పుడికి వెంటనేనిద్రపట్టింది. రామదాసుకు యేదో ఆలాపనగా వుండి కానేపు లేచి కూర్చున్నాడు. మనస్సు ఆలోచన సముద్రంలో సుడిగుండమువలె గిరగిర తిరుగుతున్నది. తలంపులు వొకదానివెంబడి వొకటి తరంగములవలె వస్తున్నవి. అరే దానికేమి తెలుసు, పశువని అనుకొంటాము. దానికి హృదయంలో తన బిడ్డమీద యెంత ప్రేమ వున్నది. "మద్దులుకాస్త అణిగినదాకా" అని అడిగన్నది. అబ్బా యేమి మద్దు! అయితే అవికూడా అణిగిపోతవిగాంబాలె. మొదటవున్న మద్దు యెందుకు తరువాత వుండవు? దూడ పెద్దదైతే తల్లీ పిల్ల సంబంధం అని అసలే మరచిపోతవి. ఈ సంబంధమునే పుత్రేషణ మంటారు. దారేషణం పశువులలో తక్కువగా వున్నదనుకొంటాను. నిజంగా పశువులలో స్త్రీ పురుష సంబంధమును వ్యసనమే అనడానికి వీలులేదు. ఋతుకాలంలో తప్ప ఒకదాని మొఖ మొకటి చూడవు. తల్లి పెండ్లిమాట యెత్తంగనే వెంకటదాను యెంత ఆనందపడ్డాడు! ముఖం కళకళలాడింది. మొన్నటిదాక యేమి యెరగనట్లు వుండేవాడు, ఋతువు వచ్చేవరకు ప్రతిదీ అట్లామారిపోతుందిగాంబాలె. ఏదో వొక అద్భుతమైన రసప్రవాహం పొంగివచ్చినట్లు కనబడ్డది. ఇవి వ్యసనాలనీ తుచ్ఛసుఖాలనీ కొందరంటారు నాకు కనబడ్డ యీ రెండు దృశ్యములూ వట్టి యీషణములేనా, మాయాకల్పితములా. మాయంటే అనేక అర్థములు కావచ్చు. దానికేమి. ప్రేమాస్వరూపుడయిన భగవంతునియొక్క ప్రేమే అనేక రూపములుగా పరిణమిస్తుందని సంగడంటాడు. అయితే యివికూడా భగవంతునివలె శాశ్వతములు కావాలె మాయమట్టుకు శాశ్వతమయింది కాదా. ఇవి దుష్టములనీ త్యాజ్యములనీ బోధిస్తారే. ఈ బోధల ప్రకారం యశోదా గోపికలయొక్క ప్రేమను కూడా యీషణములనవలసి

వస్తుంది: అవి యీషణములయితే వారికి మోక్షసాధనము లెట్లయినవి? పైగా క్రోధం గూడా మోక్షసాధన మన్నారు. మొత్తంమీదచూస్తే ఐహికం ఆముష్మికానికి మెట్లులాగ కనబడుతుంది. ఈ మెట్లును వుపయోగించుకోవడంలోవుంది. నిచ్చెన స్వర్గానికీ వేయవచ్చు, నరకానికీ వేయవచ్చు. పైకిపోయే మెట్లు స్వర్గానికీ దిగువకు పోయే మెట్లు నరకానికీ దారితీస్తవి. సృష్టిలోవుండే అంతస్థులనుబట్టి చూస్తే మనుష్యులను చాలా యెక్కవచ్చాము. వీటిని పూర్తిగా యీషణము లనటంకంటె మోక్షసాధనములనడమే బాగుంది. ఈ పశు వీ యీతకు వొక మెట్టు పైకెక్కించదనుకొంటాను. వెంకటదాసూ తాను పొందిన ఆనందంవల్ల వొక మెట్టు యెక్కినట్టే భావిస్తాను. అందుకనే రాజయోగం సర్వోత్కృష్టమన్నారు. రాజయోగమంటే నిచ్చెనవేసుకొని మేడెక్కినట్టు. మనుష్యులకు యెగిరి మేడెక్కడం దుస్సాధ్యం.

పూర్వసంస్కారంవల్ల సంగడికి అన్నీ మంచిదారులున్నవి. వాడికింకా పటుకు చిక్కినట్లు లేదు. కాస్త చేయందించేవాడు లేకపోతే దార్లు తొలుగుతవి. బుచ్చయ్య గారనుగ్రహిస్తే బాగుండు. సంగడు హెచ్చరించేవుంటాడు. పొద్దున ఆ జాడతో అని చూతాం. యేమంటారో.

రామదాసు కీ తలంపులన్నీ అప్రయత్నంగా వచ్చినవి. ప్రారంభంలో వీనిని తొలగింపవలె నని ప్రయత్నం జేశాడు. చేతకాలేదు. తరువాత ఆ ప్రయత్నమే మరచిపోయి ఆలోచనా ప్రవాహంలో పడ్డాడు. పైఁకొలది కొట్టుకొని పోయినాడు. ఇప్పుడు తిరిగీ స్ఫురణకు వచ్చింది. బలవంతంగా నిలువదొక్కుకొన్నాడు ప్రవాహంలో నిలువరించలేకపోయినాడు. కట్టతెంచుకొన్న ప్రవాహంవలె మనస్సు పరుగెత్తుతున్నది. చిత్తమును నిరోధింపవలె నని పునఃప్రయత్నం జరిగినా సాధ్యంగాలేదు. ఆలానము విరుచుకొని పరువెత్తు మదపుటేనుగు వలె విహరిస్తున్నది. గురువాక్యంతలంచుకొన్నాడు, స్మరించాడు. సాయంతన మంత సులువుగా నలవడిన యేకాగ్రత మరల కుదురలేదు. నీటి సొనలవలె పుట్టి మానసక్షేత్రము నార్ద్రముగ చేసే చింతనామృత మటికి రాలేదు. జలలు తిరిగి పోయిన బావివలె మానసం శూన్యమైంది. మరచిన వేణుగాన సరళిని మనస్సునకు దెచ్చుకొన ప్రయత్నించి విఫలమనోరథయయిన గోపిక చందమున నిగమ మహాటవిలో సంచరించి పరబ్రహ్మముగానని ఛాందసుఁడిమాడ్కి ఖేదమనస్కుడై నిట్టూర్పుల నిగుడ్చుతూ కనుల నశ్రుకణము లుబ్బలనిలిచి వొక్కక్షణమూరకున్నాడు. మనస్సునకేదో హఠాత్తుగా స్ఫురించింది. చూడ్కులు గొడుగుబల్లపై ప్రసరించినవి. తలపై నెమిలిపురిం జెవురుకొని కెందామరలు అరమోడ్పుజెంద వెడదలై కడుంగడు నిడుదలై లావణ్య ముఖసరోవరమున తేలియాడ నెన్నుదుటిపై కస్తూరి తిలకమును దులకించే ముంగురులు చెర్లాటమాడ సొబగు దళుకొత్తే చిరునవ్వు తెలికాంతులను లలితకపోలములపై ప్రసరింప మొగము నోరగా నుంచి పగడంపుజిగి నిగజిమ్మ బింబాధరముపై కడాని వంశలతం జొనిపి నెత్తావి వెదజల్లు ముఖకమల సమీరంబులచే పిల్లనగ్రోవి నూదుతూ చిగురుటాకుల రవళి నుప్పొత్తుగొనని వేలుగొనలు వేణురంధ్రముల పై బరువుతూ వైజయంతీ లతాశోభితమై బంగారు చిరుగజ్జియలు కిణికిణిరవంబులతో హేమపీతాంబరాలంకృతమైన జఘనంబుననూ ముల్లోకపావనము లయిన వ్యత్యస్తాంఘ్రికమలములనూ తాండవమాడ త్రిభంగి లలితంబై నీలమేఘశ్యామంబై భువనమోహనం

మైన శ్రీకృష్ణాఖ్యపరబ్రహ్మము నడుమనిలువ ఆ జవ్వనంపు సొంపకబొచ్చెము లేక అచ్చుబడి అచ్చెరువుగ అందరి కన్నిరూపులై కాలిమువ్వలపై హత్తుకొను క్రొక్కారు మెరుంగులంబోలు గోపకన్యాసహస్రముతో కేళిం గేలుగీలించి అంగనపాంత మాధవుడూ అతనిచెంత నంగనగా నల్లకలువలూ హేమ కమలములూ కలిపిగుచ్చిన దండ యొక్క రవళి యనఘళింప శృంగారభావభరితంబై నవరస పోషితంబై ఘుమ్మకంకణా కలితంబై మండలభ్రమణము గావించు రసమండలము మనోనయనామృతంగా చిత్రింపబడిన యొక్క చిత్రపటముం గని నిశ్చేష్టుడై చిత్తవృత్తులు నశింప సంకల్పరహితమైన మనస్సుతో పూరకున్నాడు. పటమును కొంతవడి చూచి తలవూచి "అవునవును ఈ దృశ్యమూ భగవంతుని ప్రేమయొక్క విలాసమే. ఇక్కడ యీ విధముగా వ్యక్తమైనది. ఆ స్తగిరిగహ్వరవినిర్గతమై కృష్ణాలహరి యొకచోట రాళ్లపైనెక్కు దుముకుతుంది ఒక స్థలమున కారడవిలో విటపివారిముచే నాచ్ఛాదితమై దాగుడుమూత లాడుతుంది. యొక కెలంకున సన్నగిలి చిన్న బాలికవలె చెర్లాడుతుంది. యొకతావున పడుగుగట్టి నిర్వేగమై నిలిచిపోతుంది. యొకచోట రౌద్రరూపిణియైపొంగి పొరలి వెల్లువలై సృష్టి సంహారం గావిస్తుంది. యొకచోట బంధింపబడి మందగామినియై ఆంధ్రమాతృస్వరూపిణి దాల్చి ఆంధ్రలోకమునకు జీవనములు వర్షించి సర్వకళాప్రదాయినియై అంతర్ధానము నొందింది. యివియన్నీ కృష్ణామాయియొక్క విలాసము లయినట్లు ఈ బ్రహ్మాండము లన్నీ ఆ ప్రేమాసముద్రుని యొక్క లీలలే. కృష్ణుని బాలలీలలచే యశోదముఖమున తాండవమాడిన ఆనందమే మహిమముఖమున అవతరించింది. ఈ పటమునందలి కృష్ణుని ముఖస్మేరలేశమే వెంకటదాసుయొక్క చిరునవ్వు ఇవి రెండూ దాసుకూ గోదెకూ తరణోపాయము లనడానికి సందేహంలేదు" అని నిశ్చయించుకొని నయనగోచర మవుతున్న మోహనరూపము తన హృదయవేదనను శమింపజేయగా దానికి మరిమరి నమస్కరించి తన మంచంపై పరుండి నిద్రబోయినాడు.

---

ఆరవ అధ్యాయం

# గొడ్లకాపరులు

మాలక్ష్మి చీకటితో లేచి అవసరాలు తీర్చుకొని మొగం కడుక్కొని అప్పడిని లేపి కొట్టందగ్గరకు బంపి దక్షిణవసారాలో చల్లచేయడానికి ప్రయత్నం చేస్తున్నది. జోతి ఆ చప్పుడు విని లేచి తన కళాయిగిన్నె తీసుకొని చద్దన్నంలోకి గటిపెరుగు దాంట్లో వేయించుకొని నంచుకోడానికి మాగడ పెట్టించుకొని తల్లి చల్లచేస్తుంటే చూస్తూ కూర్చున్నది. రామదాసు కవ్వపు చప్పుడువిని లేచి పాడిగొడ్లకు మేతవేసి నీళ్లు తీసుకొని బయటకు పోయినాడు.

కవ్వపుచప్పుళ్ళు వినబడుతున్నవి. రాత్రి చేనికి కావలిపోయిన కుర్రవాడెవడో గొంతెత్తి శ్రావ్యంగా పాడుతున్నాడు కిర్రుకిర్రుమను కావిడిశబ్దముతో జనులు నీళ్లు మోస్తున్నారు. తూర్పురేఖలు తెల్లవారుతున్నవి. మాలమాదిగపల్లెలచుట్టూ పారవేయబడ్డ యెముకలనుండి, పశుకళేబరాలను కోసినస్థలములో విడువబడ్డ మురికినుండీ, తోళ్లూనడానికి జానవేసే గాబులనుండీ, దండెములమీద ఆరవేసిన కుళ్లు మాంసపు

వరుసనుండీ గాలిబయలుదేరి నలుదిక్కులా వ్యాపిస్తున్నది. ఈ గబ్బుకు చిన్నప్పటినుండీ అలవాటుపడ్డ రామదాసుకు కూడా కష్టంగా వున్నది. "ఇందుకోసమే కాఁబోలె మాలవాండ్లను వూళ్లో ఉండవద్దన్నారు. ఈ చండాలపు వల్లనే వీండ్లకు చండాలులని పేరు వచ్చివుంటుంది. వీండ్లు చాలామంది. నీళ్లే పోసుకోరు. శౌచపద్ధతే యెరుగరు. ఇంతకూ దరిద్రమే మొదటికారణం, అజ్ఞానం రెండవది. సంగడు వీళ్లందరికీ బళ్ళు పెట్టించి చదువూ వృత్తులూ నేర్పించాలంటాడు. దీనికి డబ్బూ; మనిషిచట్టమూ రెండూ కావలె. ఇది క్రమంగా జరుగవలసినపని. మాకవంటే అయ్యేపని కాదు. అన్నిటికి శ్రీకృష్ణుడే వున్నాడు" అని అనుకొంటూ యింటికి వచ్చాడు.

మాలక్ష్మి పిల్లవాడికి వుగ్గుపోసి వొంటికి చమురురాచి పాలిచ్చింది. వేన్నీళ్లలో బర్రెను కడిగి వెల్లిపాయులువేసి కాచిన ఆముదము రాచింది. పొద్దుటిఅన్నానికి వేసరు పొయ్యిమీద పెట్టి బర్రెకు కుడితిపోసి పాలుతీస్తున్నది.

రా—పండ్లుతోముకుంటూ — జున్నుబాలన్నీ మనకేనా? యెవరికైనా పోస్తావా?

మా—ఈ పూట యెవరికీ పోయదలచుకోలేదు. యియ్యవలసినవాండ్లకు తలా కాసిని సాయంత్రం యిత్తామనుకొన్నా. మీచెల్లెలికి యీపూట బంపుదామనుకొన్నా. గాని యేమైనా యింటికైన పెద్దాడపడుచని యీపూట అన్నానికి యిక్కడికే రమ్మన్నా.

రా—నీవు వొకరిచేత చెప్పించుకుండేదానివా? కానావు.

మా—మనుష్యులు యెటువాలుబడితే అటు మాట్లాడుతుంటారు.

రా—నీవు చాలా మంచిదానివిలే. యెప్పుడూ వొక్కమాటలునే మాట్లాడుతుంటావు. సరేకాని నేను స్నానంజేసి బుచ్చయ్యగారిని చూడబోవలె.

మా—చెయ్యి. నీళ్లు కాగేవున్నవి.

వెంకటదాసూ, అప్పడూ కొట్టములో పని పూర్తిచేసుకొని నీళ్లకావిళ్లు తెచ్చి యింట్లో దింపారు.

రా—నాకు యివ్వేళ సెలవు. అయ్యవారిని చూడబోతా. నీకిగోజు పనెక్కడ?

వెం—ఈవేళ పనే తక్కువలే! సావరాలకు అరక వేసుకొని పోతా.

రా—పత్తి బాగా కమ్ముకొన్నదా?

వెం—పలచనే అంటున్నారు. పంటమోయిను పైరున్నది. అదివండితే చాలులే.

మా—అత్తను పిలిచిరావే. జున్నుబాలు తాగుదాం. అదిగో! నూరేండ్లు నీ కాయువు. అనుకొంటుండగనే వచ్చావు.

సుబ్బలక్ష్మి—ఎందుకమ్మా నాకు నూరేండ్లు! మా అప్పడు వొకయింటివాండ్లైతే చూసిపోదామని వుంది—

అప్పడు చిరునవ్వు నవ్వాడు. రామదాసదిచూచి తెల్లబోయినాడు. ఈ రెండు సంగతులు యితరులెవ్వరూ గమనించలేదు.

మా—వూరిలో అంతా మేనకోడలే వుందికదా అంటున్నారు.

జోతి—పో, ఏమిటమ్మా నీ వెప్పుడూనూ.

మా—ఈ పిల్ల పెళ్లిచేసుకోకుండా వూరుకుంటుంది గావాలె.

జోతి—పో! అని తల్లిని కొట్టబోయింది.

రామదాసు కీ దృశ్యం అర్థంకాలేదు.

అందరూ జొన్నబాలు తాగారు. మాలక్ష్మి పచ్చివోళ్లని రుచిచూచివూరుకున్నది

సు—ఏమిటదినా! నీవు తాగలేదు. మేము వెళ్లిపోయినతరువాత తాగుతావా?

మా—ఆఁ. దాచుకొన్నా. ఆడబిడ్డవు యిక్కడవుంటే కోడలు దాన్ని తాగ నిస్తావమ్మా?

సు—అప్పను ఆడబిడ్డ అర్థముగ డన్నారు.

మా—అక్షేమి కర్మం. పూర్తిగానే అయెను.

వెంకటదాసు అన్నంతిని కోసేరు వేసుకొని పొలం బోయినాడు. రామదాసు పులికాపు చేసుకొని సంగణ్ణిచూచి వారంరోజు లయిందంటూ వూళ్లోకి పోయినాడు.

అయిదారుగడియలు పొద్దెక్కింది. అప్పుడు అన్నం దిన్నాడు. తల్లి తల దువ్వుతున్నది.

సు—మా అప్పుడు ఏమీ సాగను తెరుగడమ్మా. యీ కాలపు పిల్లలు గిరజాలనీ పోయిలనీ, పంచాదులనీ వుంచుకుంటారు. మావాడు చిన్నప్పుడు పెట్టించిన జుట్టూ, జులపాలూ తప్పా యేమీ యెరుగడు. పట్టి పిచ్చినాయన. యిటువంటి పోకిళ్లకల్లా వెంకటదాసున్నాడు.

మా—అయినాడు వచ్చేప్పటికి నీ కొడు కెటువంటి వాడవుతాడోలే. నిజానికి యెవరైనా మా సంగడి తరువాతవాండ్లే. చూచుకుంటె వ్యవసాయపు పని చూసు కొంటాడు. అది తప్పితే వాడి పుస్తకాలేమో చదువులేమో మీటింగులేమో తప్ప రెండో గొడవ యెరుగడు. మేము చెప్పించిన చదువుకూడా విశేషంలేదు. తనంతతానే ప్రభన్నుడయినాడు.

సు—సంగడు దేవుడివంటివాడు. బంగారానికి పరిగారం తోడయినట్టు చౌదరయ్యగారి కొడుకు జతయినాడు. పొరుగూళ్లుపోతే యిద్దరూ కలిసే తింటారు. చౌదరయ్యకు ఇదంతా యిష్టంలేదుటగాని వీడు చాలించుకుంటే వ్యవసాయం సాగదని భయపడి వూరుకుంటాడుట.

మా—చూడని సంగతులు మన కెందుకు? వాండ్లతో దిండే మన కేమయిన వొరుగుతుందా? అందాకా యెందుకు? మనలో మనకు కుదిరిందీ? మనము దాసర్లం గదా. తక్కిన మాలయిండ్ల పిల్లను నీ కొడుక్కు చేసుకో.

సు—చేసుకుంటే తప్పేమీ లేదు గాని మనము మాలల్లో బ్రాహ్మలంట.

మా—కానీ అనే సందేహపుమాట వొకటి అన్నావుగదా! అందరూ అట్లాను అనుకోరాదా. తప్పు వొక్క కులపు వాళ్లదగ్గర వున్నదన డానికి వీలులేదు. తీగలాగితే అంతా కదులుతుంది. యేమోయ్! నీకు గొడ్లకు వేళయింది. కబుర్లు కొంటూ మీ అమ్మ వొళ్లో గూర్చున్నావు.

అప్పుడు లేచి పెరుగన్నం మూట తీసికొని గోచిగుడ్డ నడుముకు చుట్టు కొంటున్నాడు.

మా—ఏమబ్బాయ్! గోచిగుడ్డ తీసుకుపోతున్నావు, చెరువులో యీదడానికా నాకు తెలియదు. మీ అమ్మ యిష్టం, నీ యిష్టం.

సు—హాయనా యీదేవమ్మ? వుప్పెనో. వూదరో ఆది వొక సలుసును పెట్టుకొని తంటాలు బడుతున్నా.

అ—ఈదటానికిగాదే. గొడ్లు నీళ్లల్లో దిగితే తోలక రావటానికి.

మా—నీసన్నీ మయిదులు. మధ్యాహ్నము మీఅమ్మ అటువచ్చి చూస్తుంది.

అ—చూడమను.

అప్పుడు అన్నపుమాట కర్రకు తగిలించుకొని యింట్లో కట్టివేసిన రెండు గేదెలను తోలుకొని పశువులదొడ్డికి వెళ్లాడు. గొడ్లను విడిచేవేళ మిగిలింది. అప్పుడిని చూడంగనే పశువులు కూనశబ్దంతో అరచినవి. ఆవులు తలుగు విప్పే అవకాశం లేకుండా ఆత్రపడ్డవి. ఊళ్లో పశువులు కొన్ని అప్పటికే నడిగడ్డ చేరినవి. మరికొందరు తోలుకొని పోతున్నారు. కొన్ని పశువులు పోడుచుకొంటున్నవి. అప్పుడు తన గొడ్లను తరిమాడు. కొందరు కోమటిస్త్రీలు తట్టబుట్టుకొని ఆదిగో కడి. యిదుగో చిదప, అని గొడ్లు తొక్కేదికూడా కానకుండా పరుగెత్తుతున్నారు. వొకతె తానుముందు చూశాననీ, మరియొకతె తాను కాలుతో దోశాననీ పోట్లాడుతున్నారు. నడిగడ్డ గుత్తకు తీసికొన్న సుబ్బారాయుడు కట్టమీద వీరల విగ్రహాలను ఆనుకొని కూర్చుని పశువుల లెక్క వ్రాసుకుంటున్నాడు.

సు—అప్పా! మీగొడ్లెన్నిరా?

ఆ—మావి వొక ఆవూ, మూడు పెయ్యలూ, మూడు బర్లూ. దూడలను చెప్పవలసిందేనా?

సు—అవిమట్టుకు మెయ్యవా?

అ—అయితే యెడపడ్డలు మూడు.

ఆవులు కట్టమీదగా పోయి వరవకాలవదాటి పెద్దనడిగడ్డ పోయినవి. గేదెలు నీళ్లు చూడంగనే ఆహ్లాదపడి చెంగనాలు తీస్తూ నీళ్లలో దిగి యీదుకొని చిన్ననడిగడ్డ చేరినవి. అన్నిటికంటే ఆఖరున జంగిలిగుంపువచ్చింది. కాపరులందరూ వొకవంద మంది పోగయినారు. అన్నపుమాటలన్నీ గిజిగాళ్లగూళ్లవలె తుమ్మచెట్లకు వేలాడగట్టి కొందరు బిళ్లంగోడు ఆడుకొనడానికి తుమ్మమండలు విరిచి ముండ్లుసెలిగి బిళ్లలూ కఱ్ఱలూ చేసుకొంటున్నారు. కొందరు పిల్లనగ్రోవి వూదుతున్నారు. కొందరు బెత్తులు తెచ్చి చిఱ్ఱెంకి ప్రారంభించారు. కొందరు చెడుగుడు ఆడుతున్నారు. దెబ్బలు తగులుతవని ఆలంకాట వద్దన్నారు. ఆడపిల్లలాడే నాలుగుస్తంభాలాట పనికిరాదన్నారు. దాగుడుమూతలంటే నవ్వారు. దానికంటే గింతాట మగసిరెయింది అన్నారు. గోలిగుండ్లు గడ్డిలో కనబడవన్నారు. కోతికొమ్మంచాట పేరు చెప్పంగనే గుంపెడుమంది పంగల చింతదగ్గరకు పరుగుత్తారు. అప్పుడు యెనిమిదిమంది జట్టుకు కుదుర్చుకొని ఆడితే ఆలంకే ఆడవలెనని ప్రారంభించాడు. ఒక్కమాటు లాగేసరికి యిద్దరికి మోకాళ్లు చెక్కలు పోయినవి. అంకటితో అది చాలించి జిల్లాకోడి మొదలుపెట్టారు. ప్రతివాడూ వంతులుప్రకారం టాంగ్, బిరాంగ్, ముష్టీ, గోడా, కోనా, హంక్టీ, జిక్కులూ, ఆడి జిక్కులు పూర్తికాంగనే అందరూ చెంగినతరువాత గెలిచినజట్టు చేవులూ యొక్కలూ శిక్షలు వోడినవాండ్లకు అప్పాగొట్టి యిచ్చారు. తరువాత మనలో కొందరం కూతపట్టే వాండ్లమున్నాం. గిరి ప్రారంభింతామని మధ్య గుండ్రంగా గిరిగీసి రెండువైపులా యాభైగజాలు రొంటుబెట్టారు. అప్పుడూ, వెంకమ్మా పెద్దజీతగా వుండడానికి అం

కరూ వొప్పుకున్నారు. ఉభయులూ జట్లను ఏర్పరుచుకొని వెంకడిజట్టులో సన్నకారు పడ్డారని వాడికి జీరకాయ యిచ్చారు. అప్పుడిజట్టు గిరిలోవుండి వెంకడిజట్టు రెండు రొలులూ కాస్తున్నది.

అప్పుడు "తాతముక్కులో తంగేడుపుల్లా, దసినీయవ్వ కుందేలుపిల్లా, పిల్లా, పిల్లా, పిల్లా" అని కూతబట్టి వెంకడి రొలను దొక్కి కూత విడువకుండా వెంకడిజట్టును విడిపించుకొని గిరిలోకి వచ్చాడు.

అప్పుడిజట్టు గెలిచిందని రొలను మార్చుకొని రెండవ ఆట ప్రారంభించారు. వెంకడు "చిప్ప దెమ్మకో చిక్కులు బెడతా - నీయబ్బ తినిపోయె నన్నేమంటవు, నన్నేమంటవు. నన్నేమంటవు" అని కూస్తూ రొలదగ్గరకు వచ్చేవరకు అప్పుడిజట్టు వెంకడిని పట్టుకొని కూత ఆపివేశారు. వెంకడు తనకు జీరకాయవున్నది, తాను చెల్ల లేదని మళ్లీ గిరిలోనుంచి అప్పుడు లేని రొలవైపుకు బయలుదేరి "పొగాకుమట్టా ఆరగ వేసికొట్టా, కొట్టా" అని అలుపువచ్చి గుక్కబట్టలేక ఎలదాకాపోకుండానే మధ్య నుంచి వెనుకకు దిరిగి వచ్చాడు.

ఈ ప్రకారం ఆటలు నడిచేప్పటికి వరకూ జరిగినవి. పిల్లలందరూ అలిసిపోయినారు పశువులన్నీ కాలుకదలకుండా మేస్తున్నవి, యిక ఆట చాలించి అందరమూ యీత కొడదామన్నారు. తంతులు వేసుకొని మునిగి దాక్కున్నారు. కొందరు వెనక్కితా కొందరు ముందరితా యీది తమరు నేర్చుకొన్న మెళుకువలు చూపించారు. వొళ్లు జల్లు మనేవరకూ యీది నీళ్లబయటికి వచ్చి ఆరబెట్టుకున్నారు, అందరూ తమ గుడ్డలు కట్టుకొని "యిక అన్నాలకు పోదామా" అన్నారు. అనడమేతరువాయిగా చెల్లెక్కి మూటలు దెమ్మకొని గుంపులుబడి కూర్చొని తినడం ప్రారంభించారు.

వెం___సాయిబు రొట్టె తెమ్ముకున్నాడే! నాకు కొంచెం పెడతావోయ్?

సా___నీకిపెట్టి నేనేమితినాల?

వెం___నా అన్నం పెడతాలే.

సా___మాలవాండ్ల అన్నంకి తినమంటావూ?

అ___అందరికీ పెడతానంటున్నావు, నీవేమి తెమ్ముకున్నావు?

వెం___సజ్జసంకటీ, కారమూ.

అ___అంతుకేనా! నాకు కొంచెము పెట్టు. నీకు పెరుగన్నము పెడతా.

సు___యెవరికయినా వూరుమిరపకాయ కావలెనంటె యిస్తా.

వెం___అప్పుడు పెరుగుముద్ద పెట్టాడు. దాంట్లో కొరుక్కుంటాతే.

నరిసిగాడు___పెరుగన్నంలోకి నంజుకోవడానికి కూడా కావలసివచ్చిందీ? వాడి వట్టి చప్పిడన్నమని మిరపకాయ లాక్కున్నాడు.

అ___వాడికి ప్రాప్తమయింది పోనియ్యి.

పిల్లలన్నం తినడం అయింది. పశువులు పూర్తిగా మేసి చెరువులో నీళ్లుతాగి చెట్లకింద పడుకొని నెమరువేస్తున్నవి. కొన్ని తిరుగుబోతులు వరవదారినిబడి వెళ్లి పోతున్నవి.

అ___వొరేసాయిబు! నీ బర్రె అంగుబండమీదుగా పోతున్నది.

వెం___వాడిది దొంగమేతలు మరిగినగొడ్డు.

సాయిబు__"యహోవ్ యహోవ్ తిరుగిటూ" అని కేకలువేస్తూ బూతులు తిట్టేవరకు గిజ్జిన మళ్లింది.

వెం__మనకు పోగాకు యెవ్వడు పెడతాడు? దుండిగపాకుచుట్టలు తగల వెయ్యండోయ్. అరె నిక్వా లేదు గాంవాంలె. అయితే యీపూట వస్తుకిందలెక్క.

అ__ఇప్పుడు చుట్టలెందుకు పెడతారుగాని యెవడన్నా కాసేపు పదాలు పాడండిరా.

వెం__పదాలనరిసిగాడే దానికి మొనగాడు.

(నలుగురు నరిసిగాడిని లాక్కొనివచ్చి మధ్య గూర్చోబెట్టారు)

న__నేను పాటలు మరచిపోయినారా. చిన్నప్పుడు బాగా వచ్చేవి. మీరెవరైనా యెగతాళిచేస్తే నే పాడను.

అ__ఇప్పుడు మహాపెద్దవాడివి అయినావు గాంవాంలె. వచ్చినంతవరకు కానియ్యి.

న__నాకు బూతుపాటలు వచ్చు.

వెం__బూతులేనిది రుచిలేదు. మొదలుబెట్టరా.

న__ముందొకపద్యం జదువుతా.

జొన్నచేనికాడ సొగసుకత్తెను చూచి
నిన్నటేలనుంచి నిదుర లేదు.
దాని నన్నుగూర్చి దయసేయుము మాధవా
పొన్నపూలతోటి పూజజేతూ.

వెం__ఒరే! వీడికి నిద్దురపట్టడంలేదుట యెందుకో.

అ__నీ చమత్కారాలు చాలించి వాడిని పాడనియ్యి.

ను__పదం పాడరా. పద్దేల కేమి. నే దరువేస్తాలే.

సా__గుండేలుగాడి పదమంత మంచి దింకొకటిలేదు.

న__గుండేలుగాడి పదం పాడతాగాని, మాదిగముత్తా! నీవు చిందెయ్యరా.

ముత్తడు అందుకు నే సిద్ధమని పైగుడ్డ నడుముకుగట్టుకొని బారలుచాచి నిలువబడ్డాడు.

న__

గుండేలుగాడి తమ్ముడంట - మందపాటి కోటడంట -
మారెళ్ల సుబ్బడంట - మంచుబెట్టి చంపెరో రబ్బో గుండేలుగా!
అబ్బో గుండేలుగా - ఓ రబ్బో గుండేలుగా -
అబ్బో గుండేలుగో - రబ్బో గుండేలుగో.

ము__

(దేహమంతా లయస్వరూపమయి చిందుతొక్కుతున్నాడు)

తక్కిస్కా-తక్కిస్కా-తక్కిస్కా-తక్కిస్కా.........

ను__ఇంకొకటను. పొద్దుహూసులూ వొకటే అయితే బాగుండదు.

న__మొదలు జ్ఞాపకంలేదు యిది బలేపాట - వినండి.

(౧) నీకూ నీ-వారు లేరు నాకూ నా - వారులేరు
యేటివొడ్డునా - యిల్లుగడదంపదరా.

చల్ మోహనరంగా.

రేయివస్తే యీదిపోదం పదరా.

(పిల్లలంతా విగ్రహాలులవలె నిశ్చేష్టులై వింటూ కూర్చున్నారు)

(౨) మునిద్దరీ మున - సొక్కపైతే, మల్లెపూలా తెప్పగట్టి
తెప్పమీదనే - తేలిపోదంపదరా.

చల్ మోహనరంగా.

తెప్పమీదనే - తేలిపోదం పదరా.

సు—(మనసులో) యింత పెద్దది పాడుతాడేమి?

(3) కంటా కాటిక బెట్టి కడవా చంకానా బెట్టి
కన్నీటా - కడవ నింపేతిగదరా,

యీ పదం యెందుకో అప్పణ్ణి యెక్కువగా ఆకర్షించింది. దీని భావం తనకు ముందు అనుభవంలోకి వస్తుందనిమాత్రం తెలియదు.

వెం—ఒరే నరిసిగా! యీ మేడుపుపద్యాలు చాలించి రుచిగా వుండేవీ కరకరలాడేవీ కానియ్యరా.

న—

ఓరోరి బండోడ - వొయ్యారిబండోడ
నీమీద నా మోజా నిలుపూబండీ నీమీద నామోజా

వెం—నీమీద నామోజా - అంతమాత్రం తగలవద్దూ

సు—యల్లాముపదం నీకు వచ్చుటరా?

న—అన్నీ వచ్చు.

సు—బలే అది అన్నిటికీ కిరీటం.

"మతీయుల్లామే—హుజీయుల్లామే" అని పయిగుడ్డ ఎగురవేస్తూ అన్నాడు

అ—యల్లాముపదమూ వద్దు, వాగులాముపదమూవద్దు. పట్టి బూతు.

న—అవి వద్దుట పోనియ్యండి.

వెం—మాకు అవే కావాలె. అప్పాయు వద్దంటే నే గావాలెనన్నా. బూతేమిటి? ప్రపంచంలో బూతే లేదు.

అ—ఎవరడిగిందీ వద్దుగాని. నీయిష్టం వచ్చింది యేదో వొకటి ఆఖరుపదం పాడు

నరిసిగాడు—(లేచి పయిగుడ్డ పమిటవేసుకొని) ఇదే ఆఖరుది. వినండి! యిక వన్నడగవద్దు.

తాన, తంథాన, తాన తంథానానా
ఆయీ, కావేటీ వేంకటరాయీ
పెట్టెలోని చేయివేయీ, కాలువదీసి నాకీయీ
మసిబూసుకొని నీవుబోయీ.
తనా, తంథాన, తాన, తంథానానా
అమ్మ: నీదొడ్డిలోది తులిసెమ్మ
నీ చెవుది చారెడుకమ్మ, కమ్మదీసి నా కిమ్మ
బూడిదె బూసుక పోమ్మ.

—

ఇప్పటికింతే యింకా జాం పొద్దున్నది. దున్నపోతు సవార్లు తీసేయండి. గొడ్లు యిగ నిలవవు. వాటిని మళ్లవేసినట్టుగా గూడా వుంచండి.

అందరూ గొడ్లదగ్గరకు పోతున్నారు.

ఆ—ఇందులో యమధర్మరాజు నెవరిని చేస్తారు?

వెం—చిందులు దొక్కాడు. ముత్తడే యమధర్మరాజు.

న—ఓ దున్నపోతు మహారాజు గారూ! వో ముత్తయ్య చక్రవర్తీ! దయ చేయండి.

అంతా ముత్తడిని పెద్దదున్నపోతు నెక్కించారు. వో ఆజట్టు తక్కినవాటి నెక్కి పూరేగారు. నబ్బ డెక్కిన పలగున్న కేకలకు బెదిరి నాలుగుకాళ్లసవారి దీనే వరకు వాడు కిందికి డొల్లాడు. కొందరు దిగి తుతికొంద రెక్కారు. ముత్తడుమాత్రం దిగలేదు. పొద్దుగూకవచ్చింది. పాడిపశువులకు దూడలమీద మర్లుబుట్టినవి. యేను తల్లి కడుపులోకి జారుతున్నది. పశువులు నెమర్లు వేస్తూ యిండ్లదోవ బట్టినవి. పడమటిగాలి పొడుపుగొండలకు దాకి గిఱ్ఱునదిరిగి జోరున మంగళాపురముమీద వీస్తున్నది. నడిగడ్డ నిశ్శబ్దమయినది. తుమ్మలు చీకటికమ్మి బావురు మంటున్నవి.

---

## ఏడవ అధ్యాయము

# సద్గురువు

రామదాసు మాలపల్లెనుండి బయలుదేరి కొండవెంబడిగా డొంకను కొంతదూరం వచ్చి వూరికి, మాలపల్లికీ మధ్య వొంకాటంగావున్న పాటిదిబ్బ దాటి తూర్పువీధికి మళ్లి కమ్మబజారున వస్తున్నాడు. రాత్రి పటంలో జూచిన శ్రీకృష్ణుని మోహనాకారము మనస్సును విడువలేదు. అచ్చొత్తినట్టు మనస్సుకు అతికిపోయింది. పరధ్యానంగా వున్నప్పటికీ రాసమండలం కండ్లలో మెదులుతున్నది "రాళ్లు దేవుళ్లయితే రాసులు మింగవా అని అన్నాడుగాని సగుణోపాసనవల్ల చాలా ప్రయోజనమున్నట్లే కనబడుతుంది. బుచ్చయ్యగా రేమంటారో అడుగుదాం" అని అనుకొంటూ రచ్చబండదగ్గరకు వచ్చేసరికి యిరవై సంవత్సరములు వయస్సుగల వొక యౌవనుడు యెదురుపడ్డాడు. కొంచెం నలనివాడు. జుట్టు కత్తిరించుకొని టోపీ పెట్టుకున్నాడు. కళ్లికోటు చెక్కుకోటు తొడుక్కొని గోచీ కుచ్చెళ్లుజార్చి తెల్లధోవతి కట్టుకొన్నాడు. మొగానవున్న సన్నని అమ్మవారి మచ్చలు దూరానికి కనబడవు. పైన ఉత్తరీయం లేదు. శరీరం బద్దవలె కొంచెం వంగివుంటుంది. అంత పొడగరి కాడు. నడిచేటప్పుడు పక్కకు వూగుతుంటాడు. ముఖం గడ్డందగ్గర వాచి కణతల వైపున విశాలమవుతుంది. కనుబొమలు ముందుకు పొడుచుకొనివచ్చి అతడు మేధావంతుడని సూచిస్తున్నవి. కండ్లు తేటగలిగి విశేషంగా చలింపక దీర్ఘాలోచనమునూ, విషాదమునూ వెల్లడిస్తున్నవి. ముఖవైఖరినిబట్టి మనిషి దుర్బలుడని తెలుసుకోవచ్చును. చేతిలో పింగాణిలోటా బట్టుకొని రామదాసును సమీపించాడు.

రా—ఎక్కడికి? బుచ్చయ్యగా రూళ్లోవున్నారా?

యామునుడు—నిన్న నీకోసం వచ్చారు. నీ వింట్లోలేవు. ఈవేళ మళ్లీ పోదామంటే నీవింట్లో వున్నావేమో చూతామని వస్తున్నా.

రా—నేనూ వారి దర్శనంకోసమే వస్తున్నా. వారు గొప్పవేత్తలు. యెరుగుదువా ? యిదివరకు వారిసంగతి.

యా—ఇదివరకు వారిపేరు విన్నా. మహాజ్ఞానే అనుకొంటూను. భక్తివిషయములలో వారికి ప్రవేశం తక్కువ. నిన్న భక్తియోగం వారికి చదవమని యిచ్చాను. అభిప్రాయమింకా చెప్పలేదు.

రా—అంటే జ్ఞాపకం వచ్చింది. రాసమండలమనే పటం అద్భుతంగావున్నది.

యా—నాదగ్గర యింకొకపటంకూడ వున్నది. దానిని మననంచేస్తే ప్రేమభక్తి కుదురుతుంది. దానివంక చూస్తే పరుగెత్తే మనసుకూడా కట్టుపడుతుంది.

రా—నాకు అనుభవంలోకి వచ్చింది నీవు కృష్ణభక్తుడివిగాఁబోలె.

యా—నేనా - నేను - గోపికను.

రా—గోపికవా ? సంగదాసూ, గోపిక వేమిటిరా ?

సం—నేనుకానేమో అని పిలుస్తున్నావా? సంగదాసునే. గోపికనుగూడానూ

రా—(యోచించి) గోపికలది ప్రేమభక్తికదా !

సం—అవును నాదీ అదే.

రా—వాండ్లది స్త్రీలప్రేమ.

సం—ప్రేమకు, ఆడప్రేమా మగప్రేమా అని లింగవిభాగమున్నదా ?

రా—వాండ్లు శ్రీకృష్ణుని నాయకునిగా కామించారు.

సం—నేనూ అట్లాగే ప్రేమిస్తాను. అయ్యగారున్న యిల్లిదే.

రా—ఊఁ. నాకు విషయం పూర్తిగా అవగాహనకాలేదు, మననం చేస్తేనే గాని మనస్సు కెక్కదు. విషయంమట్టుకు దొడ్డది. నీవు యింటికి చదుకోడానికి రావడమే మానివేశావేమి ?

సం—మనయింట్లో తెగ యెలుకలు. అవి కరుస్తవని నాకు భయం.

రా—యెలుకలు కరుస్తవీ ? మమ్ములనందరినీ కరుస్తున్నవీ ?

సం—మిమ్ములను కరవఁపోతే నన్ను కరవకూడదా ? అందరినీ వొకనాడే కరుస్తవా ?

రా—గోపికనంటావు, కృష్ణభక్తి అంటావు, మళ్లీయిదేమిటి ?

సం—యెలుకలు గోపికలను కరవకూడదా ? కావలిస్తే కృష్ణునికూడాకరుస్తవి

ఉభయులూ సంభాషణ చాలించి లోపలికి పోయినారు.

రా—(ఉత్తరీయం నడుముకు చుట్టుకొని) అయ్యా దాసుడిని (అని సాష్టాంగ నమస్కారం చేసి నిలువబడి) ఇది శుభసుదినం. తమదర్శనం చేయవలెనని యెంత కాలమునుంచో అనుకొంటున్నాను. మా అయ్యగారు తమరినిగురించి అనేకమాట్లు ప్రస్తాపించారు. తమమాట బహుచెప్పారు

బుచ్చయ్యగారు—పీరయ్యగారు నాకు జ్యేష్ఠసోదరులు. వారి గురువుగారిదగ్గర నేనూ కొన్ని విశేషాలు గ్రహించా.

రా—తమరు అన్నీ గ్రహించారు.

బు—దూరంగా నిలుచున్నారేమి? యిట్లావచ్చి వసారాలో కూర్చోండి.

రా—తమరు అచలపరిపూర్ణులు తమకు యేభేదమూ లేదు. మాబోటి అజ్ఞానులను లోకవ్యవహార మొకటి బాధిస్తున్నదిగా! దానిని అనుసరించి పోకపోతే వీలులేదు.

బు—నీవన్నీ తెలిసినవాడవు. నేచెప్పవలసినది యేమీలేదు. నీఅభిప్రాయంతో నీ కొడుకు యేకీభవిస్తాడా? నీజ్ఞానసంగతి దేవుడెరుగు; యీ బేధాలు ముందు కొట్టివేయమంటాడు.

రా—ఇంతకూ నే నొక్క సంగతి మనవిచేస్తా. కట్టెంకలు పోయితీరుతుంది. మా అయ్యగారింట్లో ఆరాధనకు గుంటూరునుంచి సాతాని కృష్ణయ్యగారు దయచేశారు అయ్యగారు ప్రసంగం చేస్తుంటే క్రిష్టయ్యగారు లేచి సద్గురువును సంపాదించుకోవడం యెట్లాగని పృచ్ఛచేశారు. దానికి అయ్యగారు గురువుకోసం శిష్యులెవరూ వెదకనే అవసరంలేదు. శిష్యుడికి యోగ్యతవచ్చేవరకు గురువే వెతుక్కుంటూ వస్తారని శలవిచ్చారు. వాడిలో ఎన్ని లోపాలుంటే నేమిగనుక? తమరు అనుగ్రహిస్తే అన్నీ చక్కబడుతవి.

సంగదా నేమీమాట్లాడలేదు. తండ్రీ కొడుకూ దూరముగా గోడకానుకొని కూర్చున్నారు.

బు—రామానాయుడుగారు యిప్పుడు వస్తున్నారని కబురు వచ్చింది. వారు చాలా యోగ్యులని వింటాను.

రా—వారు నిసితయోగ్యులు. మా వూరి దుర్మార్గానికి వారు యీవూళ్లో వుండబట్టే వర్షాలుకురుస్తున్నవి. మా పిల్లవాడు వారిదగ్గర నేవుంటున్నాడు. బుద్ధిగరిపిందీవారే.

బు—అందరూ మీ పిల్లవాడే రామానాయుడుగారిని చెడగొట్టుతున్నాడంటుంటే. నీవు వారు నేర్పారంటున్నావా?

రా—యెవరు యెవరికి నేర్పినా నడవడిలో తప్పులేదు. ఒకరికి అపకారంచేసి యెరుగరు.

బు—ఆమాట అందరూ వొప్పుకుంటారు గాని కొన్ని చర్యలు లోకానికి విరుద్ధముంటారు.

రా—ఆసంగతి నేను చెప్పేమాత్రపువాడిని కాను. తమరు దయచేశారు. తమరు అనుగ్రహిస్తే అన్నివంకలూ తీరుతవి.

బు—యథార్థం చెప్పుతాను. మీ పిల్లవాడు గొప్ప మేధావి. వారి వుభయులతో కలిసి మాట్లాడుదామని నాకోరిక, అంతా వొకమాటే తటస్థించారు.

రా—మాపిల్లవాడి విషయంలో తమరు గొప్పగా మాట్లాడడం వాడికి క్షేమం కాదు. అవన్నీ తమ ఆశీర్వచనాలుగా భావిస్తాను.

బు—నే చెప్పినదాంట్లో అతిశయోక్తి యేమీలేదు. నాయుడుగారినికూడా చూడవలెనని కుతూహలంగా వున్నది. వారు వచ్చేలోగా చప్పున స్నానంచేసివస్తాను. వారు దయచేస్తే యీ అరుగుమీద కూర్చోమని చెప్పండి.

రా—చిత్తం, తమరు దయచేయండి.

రామదాసూ. సంగదాసూ గోడనీడను వొరసిలగా కూర్చున్నారు.

## ఎనిమిదవ అధ్యాయం

## కర్మయోగము

రామానాయుడు నిదానంగా వీధిగడప మెట్లెక్కి మండిగం వెలుపల నిలువబడి యింటి యజమాని వెంకటసుబ్బయ్యను 'అయ్యగారేమి చేస్తున్నా'రని అడిగారు.

వెం—అయ్యా! యిటు లోపలికి దయచేసి అరుగుమీద కూర్చోండి. అయ్యగారు స్నానం చేస్తున్నారు. అయింది ఇప్పుడే వస్తారు. చాపమీద కూర్చోండి. బాబూ! తమబోటివారు మాయిండ్లకు యెందుకు దయచేస్తారు? అయ్యగారిమూలంగా వచ్చారుగాని.

నాయుడు:—దాని కేమిలెండి.

రామదాసూ, అతనితోపాటు సంగాదాసూ లేచి నిలబడ్డారు.

నాయుడు:—రామదాసు వచ్చాడే!

రా—అయ్యగారి దర్శనంకోసమే. యెన్నాళ్లనుంచో వున్నకోరిక యిప్పటికి ఫలించింది.

రామానాయుడు రెండువైపులా కట్టలో యిమిడేటట్లు బిగించబడిన పచ్చని వెండికట్లు గల జానబెత్తమును చేతపట్టుకొని, తగరంవేసి కిర్రులేని ఆకుచెప్పులు దొడిగి అరుగుమీద కూర్చున్నాడు. సన్నని పేటేరు ధోవతీ, యెర్రగీరల కుడితినీ, జరీ కోలుకులు వేసిన పుల్లిపారవంటి వుత్తరీయమూ, ఆయన ముఖమార్దవాన్ని అతిశయింప చేస్తున్నవి.

బుచ్చయ్యగారు స్నానం చేసి వుతికిన పంచలు వేసుకొని రాగానే రామానాయుడు నిలిచి నమస్కరించాడు. బుచ్చయ్యగారు తమరు లేవడ మెందుకని కూర్చుండచేసి తానూ కూర్చున్నాడు.

నాయుడుగారి సన్నగా దిద్దిన నామములూ, పచ్చనితిరుచూర్ణమూ, యెర్రరాళ్ల కమలాలూ చామనిచాయగల మేనికాంతికి వింతశోభనొసంగుతూ ప్రేక్షకుల నాకర్షిస్తున్నవి. బుచ్చయ్యగారు కొంతవడి ముఖవికాసం చూస్తూ కూర్చుండి పలకరించదలంచుకొని యేమియనుమున. గుటింబిమాట్లాడడానికితోచక "నలబోతువారి కుటుంబమంటే మనజిల్లాలోకల్లా ఘరానా పొందింది. పాలసముద్రంలో అమృతం పుట్టినట్లు నాయుడుగారు జన్మించినారు." అని యింకా చెప్పబోతుంటే రామానాయుడు కాస వెనుకకు జరిగి తన కయిష్టములయిన స్తుతిపాఠములచే కొంచం తెల్లబోయి తన సోగమొగమునకూ, కోనుదురునకూ జవాబుగా పైకెగట్టబడిన నల్లని కొంతసిగ వెనుకవున్న స్తంభానికి తగిలేటట్లు మొగ మొకింతపైకెత్తి చేతిలోని బెత్తమును కదలించుతూ "మాకుటుంబానికి కొంత గౌరవ మున్నదేమోగాని, నేను అమృతమువంటివాడిని కాను" అని ప్రత్యుత్తర మిచ్చాడు.

రా—అయ్యగారికి నాయుడుగారు కొత్త. తమరు చెప్పిన సంగతులన్నీ నిజమే అయినా అవి వినడానికి నాయుడుగారి కిష్టంగా వుండదు.

బుచ్చయ్యగారు కొన్ని మతవిషయములు నాయుడుగారితోనూ, సంగదాసుతోనూ చర్చించాలెనని అనుకొన్నారు. సంగదాసు నాయుడుగారిదగ్గర చేరి దుర్చొ

ధలు చేసి చెడగొట్టుచున్నాడని బుచ్చయ్యగారితో కొంసరస్నారు. యిదివరకు సంగదాసుతో మాట్లాడినప్పుడు అతనిబుద్ధి చాకచక్యంచూచి ప్రవాదములు కొంతవరకు నిజమై వుండవచ్చునని అనుకొన్నాడుగాని నాయుడుగారి మూర్తిని చూడంగానే అభిప్రాయం మారింది. రెండూ స్వప్రకాశంగల స్వతంత్రవ్యక్తులుగా కనబడ్డవి. నాయుడుగారితో సంభాషింతామంటే గుచ్చుకుబడలేదు. మొదటి ప్రయత్నానికే మొన విరిగిపోయింది. మొదట రామదాసుతో సభాషించినప్పుడు సంగదాసు చర్చను దిక్కుపోయినా తన అనుభవాన్నిబట్టి సంగదాసు సంభాషణాప్రియుడుగా కనబడ్డాడు. విషయం తానుపక్రమించడంకంటే సంగదాసు ప్రారంభిస్తే బాగుంటుందని “సంగదాసు! యేమైనా సంగతులు చెప్పవోయ్” అని అడిగాడు.

సం—పెద్దలు, తమరు సెలవీయండి.

కథ ముగిసింది. రామదాసీ విషయస్థితిని కనిపెట్టి తన కదివరకు మొన తేలివున్న సందేహాలనుగురించి సంభాషణ ప్రారంభించాడు.

రా—అయ్యా! ప్రపంచంలో మానవుడు సత్కర్మ చేస్తూ వుండవలసిందేనా?

బు—వ్యావహారికంగా విచారిస్తే దుష్కర్మచేయడంకంటే సత్కర్మచేయడం మెరుగు. పరమార్థికంగా విచారిస్తే రెండూ బంధహేతువులే.

నాయుడు—నిష్కామకర్మ అయితేనో?

బు—నిష్కామకర్మ బంధహేతువు కానిమాటే! అది చేస్తూ వుండవచ్చు.

సం—పారమార్థికంగా విచారిస్తే సత్రయాగాలుచేసిన ఋషులూ, రాళ్లు గొట్టిన రాక్షసులూ వొక అంతస్తువారేనా? ఋషులు ఫలాపేక్షతో సత్రములు పెట్టరు. రాళ్లుగొట్టే రాక్షసులూ పొందగోరుతున్న ఫలమూలేదు. వుభయులకూ ఆ చేష్టలు స్వాభావికమే.

బు—నీవు చెప్పినప్రకారం వుభయులవీ నిష్కామకర్మలయితే ఆయా కార్యములవల్ల పారమార్థిక విషయమున కలుగగల ప్రతిబంధకములు వారికి లేవనే చెపుతాను

సం—మంచీ, చెడూ కార్యములవల్ల లోకమునకు కలిగే సాధక బాధకములటుండనిచ్చి కర్మఫలములు నిష్కాములను బాధించవా?

బు—ప్రారబ్ధం భోగంవల్ల నశిస్తుంది. సంచితము ముక్తివచ్చినప్పుడు విడిపోతుంది. నిష్కామ కవచంవల్ల యిప్పుడు చేసేకార్యముల ఫలం అంటదు.

సం—పారమార్థికమునకూ మంచీ చెడూ పనులకూ సంబంధం లేదా?

బు—యింతవరకుంటుంది. ఫలాపేక్షతో గూడినదైతే రెండూ సంచితమును వృద్ధిజేసి ఆసంచితము నశించకపోతే ప్రారబ్ధంగా మారుతూ జననమరణములకు హేతువవుతుంది. పరమార్థమెంచు యివి రెండూ చాలావరకు సమానాంతరములనే చెప్పవచ్చు.

సం—పరమార్థమునకు పాపపుణ్యములు చాలావరకు సమానాంతరము లని శలవిచ్చారు. నాయందనుగ్రహముంచి రెంటికీగల తారతమ్యమును తెలుపవేడుతున్నాను.

బు—పుణ్యకర్మలు పరలోకములో సౌఖ్యములను బొంది భుక్తశేషమును మర్త్యలోకములో అనుభవిస్తారు. సత్యలోకమును పొందినవారికి సద్యోముక్తి లేకున్నా బ్రహ్మకల్పములోపుగా పునరావృత్తి కలుగదు. ఇంద్రత్వ బ్రహ్మత్వముల సహితమూ పుణ్యవిశేషంచేత పొందవచ్చును. పాపకర్మలు నరకములో పాపఫలమూ

లనుభవించి శేషమును మర్త్యలోకంలో ననుభవిస్తారు. పుణ్యకర్ములు భోగములను కామించి అనుభవించి, రోసి, వాటిని నశ్వరములనీ తుచ్ఛములనీ తెలుసుకొని, వాటిని గోరక నిష్కామకర్ములై అనుభవంచేతనో, తపోమహిమనో సంచితమును నశింపజేసి బొగిలిపట్టినగాని లేక వేగిపట్టిగాని గింజలు మొలవనట్లు పునరావృత్తిరహితమైన పరమపదమును పొందుతారు. పాపకర్ములు వాల్మీకాదులవలె మహాపురుష ప్రసాదముచే అరుదుగా సన్మార్గమును బొందినా సాధారణంగా పాపులు నిష్కాములు కాజాలరు. ధ్రువుడు భగవత్సాక్షాత్కారంచేత వైరాగ్యమును పొందగలిగాడు గాని రాక్షసులు తపోమహిమచేత బ్రహ్మసాక్షాత్కారంబొందీ మోక్షమును కోరలేదు.

రా—కంసాదులకు మోక్షమెట్లా వచ్చింది ?

బు—విరోధకభక్తిచేత వచ్చింది. పాపకర్మములు జేసి బలవన్మరణం బొందినా నిరంతర విష్ణుధ్యానంచేత ఉత్తమలోకమును పొందగలిగారు.

సం—ఫలాపేక్షతో చేయబడిన సుకృతం స్వర్గాదిభోగముల నిచ్చుననీ, ఫలాపేక్ష లేనియెడల నిష్ఫలమగు ననీ తేలుతున్నది.

నా—ఫలాపేక్ష లేనియెడల బంధహేతువు కాదనీ తేలుతున్నదనీ దిద్దుకుంటావా ?

సం—దుష్కృతమునుకూడా ఫలాపేక్ష లేకుండా చేస్తే ఫలము మన కంటదు గనుక నరకమూ రాదు, బంధహేతువూ కాదు.

బు—బాగు. బాగు. అప్పటికి సుకృతమే పయిచెయ్యి అవుతుంది. నీవు చెప్పినట్లు దుష్కృతమునకు ఫలాపేక్ష లేకపోవడంవల్ల కర్తకు నష్టమేమీ లేకుండాపోయింది. సత్కార్యములు యెప్పుడూ లోకోపకారకములుగా వుంటవి. కర్త ఫలమపేక్షించినా లేకపోయినా దుష్కార్యములు లోకకంటకములు.

సం—ఏమి తేలిందంటే దుష్కార్యములు సాపేక్షకములయినా నిరపేక్షకములయినా కర్తకో, లోకమునకో బాధకములే. సుకృతములు సాపేక్షకములయితే లోకమునకు శ్రేయమూ, కర్తకు స్వర్గాదిభోగములూ యిస్తూ బంధహేతువు లౌతవి. ఫలాపేక్ష లేనియెడల లోకోపకారములు మాత్రమవుతవి.

బు—దాని కిది చేరిస్తే సరిపోతుంది. ఫలాపేక్ష లేకపోతే పాపకర్మములు చేయడానికి ప్రోత్సాహమే లేదు. అప్పుడు రాక్షసులూ సత్రములలో రాళ్లుగొట్టరు. ఫలాపేక్ష లేకుండా సత్కార్యములు చేయుడమున కలవాటుపడ్డవాడు ధ్రువుడివలె సిద్ధములయిన సంపదలనే త్యజించి పరమపదమునుమాత్రమే ఆశించుతాడు. స్వర్గాది భోగములు లేకపోయిన వని చింతించడు. ఇంతేకాకుండా ఫలాపేక్షలేని సత్కార్యములయందు అపరము హెచ్చు. ఫలాపేక్షవద్దు కర్తృత్వము భగవంతుడిదే అవుతుంది. చేసేవాడూ చేయించేవాడూ అతడే. కార్యస్వామ్యం ప్రత్యేకవ్యక్తినుండిమారి ప్రభువు దవుతుంది. నౌకరు తన స్వంతకార్యమును నెరవేర్చుకొనేటప్పటికంటె ప్రభుకార్యమును నెరవేర్చేటప్పుడు యెక్కువఅధికారం చలాయించగలడు. ఫలాపేక్ష లేక అధికారవశమున చేసినపనులకు నౌకరుకు జవాబుదారీ లేదు. యితరులకు వర్తించే ధర్మములు అతనికి వర్తించవు.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ.

అని శ్రీకృష్ణభగవాను డన్నాడు. అదుగో, గుర్తు. అక్కడ నిలవండి.

సం. నా. చిత్తం! గోచరమయింది.

బు—ఇప్పటికే కాలాతీతమయింది. "శరీరమాద్యం ఖలుధర్మసాధన"మన్నారు. భోజనాత్పరం మీ కందరికీ సావకాశంగా వుంటే దయచేయండి. నా కింకా తనివితీర లేదు. మీతో యింకా సంభాషించవలెనని కోరికగా వుంది.

నా—మా పుణ్యంపల్ల తమరు దయచేశారు. మే మనవలసినమాట తమరే అంటున్నారు. ఝాము ప్రొద్దువుండగా మేము రావచ్చునా?

బు—సరే.

ముగ్గురూ నమస్కరించి వెళ్ళుతున్నారు.

బు—(నాయుడుగారిని గమనించిచూచి) మనిషికి ఆట్టే వయస్సులేదు. ౨౫కి లోపు. గోగుకొమ్మలె నేవళంగా పెరిగాడు. పొడుక్కు తగిన లావుంటే యెక్కువ బాగుండేది. అయితే బలహీనుడు మాత్రం గాడు. సాత్వికస్వభావం ముఖాన వుట్టిపడుతున్నది. ఈశిష్యులు దొరకడము నాదీ అదృష్టమే.

---

## తొమ్మిదవ అధ్యాయం

## ఉపాసన

మూడుజాము లయింది. ప్రభాకరుడు కాలగతిచే తన ప్రచండ దీధితులు గోల్పోయి వుచ్చస్థితినుండి జారిపోయినాడు. గ్రామకాంతలు సాయంతన భోజనమునకై ధాన్యములు సిద్ధంచేస్తున్నారు. నిర్వ్యాసంగులు శయ్యలపై బరుండి విసిగి, లేచి, ఫలహారములుచేసి చీట్లాట ప్రారంభించారు. నూత్నదంపతు లింకా మేల్కాంచ లేదు. మనముగ్గురు జిజ్ఞాసువులు కలిసి బయలుదేరి వెంకటసుబ్బయ్య యింటివద్దకు వచ్చారు.

నా—సంగదాసూ! ప్రశ్నలడిగేపని నీదబ్బాయి.

సం—ప్రారంభించే పని మా అయ్యది.

నా—వింటూ కూర్చుండేపని నాది.

రా—ప్రారంభించడమేగదా నాపని. యేదో నాకు తోచిన పాయింటు యెత్తుగడచేసి వూరకుంటాను.

నాయుడు మెల్లగా తలుపునెట్టి లోపల ప్రవేశించి అరుగుమీద కూర్చున్నాడు తండ్రీ, కొడుకూ కొంచెం వెనుకగాపోయి దాసులమని నమస్కరించి తమ మామూలు చోట కూర్చున్నారు.

బు—సరిగ్గా వేళకు వచ్చారే.

రా—తమ దర్శనానికి అనేకమంది వస్తూవుంటారు. మరి చల్లబడితే అవకాశం

చిక్కదేమోనని కాస్త పొద్దుకలగంగనే వచ్చాం. ఏవో నాలుగు మంచిమాటలు చెపితే వింటాం.

బు—శుభమా అని పొద్దునా నీవే ప్రారంభించావు. యేదో వొక సంగతి యెత్తుగడచేయి.

రా—చిత్తం. అచలపరిపూర్ణాన్ని సాకారంగా వుపాసించాలెనా, లేక నిరాకారంగా వుపాసించాలెనా?

బు—పరబ్రహ్మం సాకారమంటావా, నిరాకారమంటావా?

నా—ఆకారమంతా నిరాకారానిదే కాకపోతే ఈ ఆకారము మరొకరి దని తెలిసి వస్తుంది. అప్పుడు విశ్వరూపు డింకొక డవుతాడు. పురుషుడూ, ప్రకృతీ పరబ్రహ్మయొక్క విభూతే.

బు—సరేనా.

సం—ఇంకొక డున్నా డనుకొన్నా విశ్వమయుడు కానివాడితో ప్రయోజనమేమి?

నా—వాడు విశ్వమయుడు కాకపోతే విశ్వమే వుండదు. అప్పుడు యే వుపాసనా లేదు.

రా—మానసికోపాస నంటారు. అదేమిటి?

బు—ఉపాసనంతా మానసికమే. సాకారాన్ని వుపాసించినా నిరాకారాన్ని వుపాసించినా మనస్సుతో చేయవలసిందే. మనస్సు నుపయోగించక వుపాసనే చేయలేరు.

రా—ఆత్మీయోపాసనంటే?

బు—ఆత్మసంబంధమైన వుపాసన అని అర్థం చేసుకోవచ్చునా? సాకారానికి చేసినా, నిరాకారానికి చేసినా వుపాసనంతా ఆత్మసంబంధమైనదే. జీవాత్మ పరమాత్మకు అర్పించే పూజంతా ఆత్మసంబంధమైనదే.

రా—ఆకారం నిరాకారానిది కనుక.

బు—"సర్వం ఖల్విదం బ్రహ్మ" అనే శ్రుతి దీని కాధారం.

సం—నిరాకారం సాకారం యెందు కయింది?

బు—యెట్లా అయిందనే విషయం ఋషులు మహావిపులంగా చర్చించారు గాని యెందుకయిందనే విషయం మనుష్యబుద్ధికి విపులంగా గోచరం కాలేదు. భగవల్లీల అని మాత్రం చెప్పారు. నా చిత్తం అన్నదానికి పైప్రశ్న లేదు. తరువాతి ప్రశ్నలకు అనవస్థాదోషం తగులుతుంది.

సం—ఈలీల యెప్పుడు ప్రారంభమయింది?

బు—అనాదిగా వున్నది. అనంతంగా వుంటుంది. నిత్యలీల యని దీనిపేరు. ఇదియే జగన్మాత, విశ్వరూపిణి, ప్రకృతి అనికూడా పిలుస్తారు. దీనికి జగద్ధాత్రి, రాధ మొదలయినవి సంప్రదాయానుసారము లయిన నామములు.

రా—'రాళ్లు దేవుళ్లయితే రాసులుమింగవా' అని వేమన్నగారు ఆక్షేపించారే దాని కేమి శెలవు?

బు—మింగుతవని భయపడేవారి అభిప్రాయంలా గ్గనపడుతున్నది. అయితే రాళ్లు దేవుళ్లనుట్టుకు కావలె కాకపోతే మింగలేవు. రాళ్లకూ దేవుళ్లకూ భేదం చెప్ప

తూ వాళ్లు దేవుళ్లనేవాండ్లకు ఆ జవాబు చెప్పారేమో.

రా—ఏవిధమైన ఉపాసనయితే శ్రేష్ఠం?

బు—మానింది మందు. తత్వాన్నిబట్టి వుంటుంది. కొందరు పరత్వంచేత విశ్వవ్యాపకుడై యుండగా ఆయనను జూచారు. పౌరాణికులయిన కొంద రాత్మవిదులు దహరాకాశంలో తేజస్వరూపుడై ప్రకాశిస్తుండగా కనుగొన్నారు. కొందరతడు సాంధ్యారాగంలో తొంగిచూస్తుంటె గుర్తించారు. సౌలభ్యవశంచేత అతడు గొల్లపల్లెలో పేడ దీస్తుంటే కొందరు పట్టుకున్నారు. కొందరికోసం వుక్కు స్తంభం పెకలించుకొని వచ్చాడు. నాకు శబరిగుడిసెలో దొరికాడు. నిగమమహాటవిలో సంచరించి విసిగి యెక్కడా కనుపడలేదని వచ్చినవాండ్లను కూడా నే నెరుగుదును.

సం—అంతటా వుండేవాడుగనుకనా?

నా—అంతటా వున్నాడు. అంతా అతనిలో వున్నది.

బు—అంశాభేదములతో రాయీ, చెట్టూ, పుట్టా, నీవూ, రాముడూ, కృష్ణుడూ, బ్రహ్మాండమూ మొదలయిన అన్నిటియందు ప్రకాశిస్తున్నాడు. కండ్లున్నవాండ్లకు యెక్కడయినా కనబడుతాడు. ఎవరిదృష్టి దేనిమీద పారుతుందో మనం చెప్పలేం.

రా—యోగులకు సాకారోపాసనతో అవసరమా?

బు—యెవరు యోగులంటే? అంతా యోగులే. జీవాత్మకు పరమాత్మతో స్పర్శకలిగినపు డెల్ల యోగమనే చెప్పవచ్చును. అట్టిస్పర్శం కలుగనిది మానవుడు ధ్యానోన్ముఖుడు కానేకాడు.. భగవత్కృపారసం చేత అట్టి అవకాశములు కలిగినప్పుడెల్లా ధ్యానము నలవరచుకొని క్రమక్రమంగా నిరంతర ధ్యానమూ నభ్యసించవలయును. గాఢ యోగాభ్యాసులకు సయితం చాలా కాలంవఱకు నిరంతర సమాధినిష్ఠ సాధ్యం కాదు. వారు సమాధిని విరమించి నప్పుడూ లేక ధ్యానవర్జితులై నప్పుడూ మానసమును దుర్విషయములనుండి మరల్చి ధ్యానోన్ముఖులుగ చేయునిమిత్తం విజ్ఞానులైన కవుల చేతనూ, శిల్పులచేతనూ చిత్రకారులచేతనూ చిత్రితములై, రసభూయిష్ఠములై, భక్తి ప్రేరితములై భగవల్లీలా బోధకములైన గ్రంథములు పఠించడమూ దృశ్యముల నవలోకించడమూ అవసరం. సమాధిని విడిచిన వెంటనే మనస్సును స్వేచ్ఛగా విషయములపై పారదోలడంకంటె భువనమోహనమైన యే రాసమండల రంగమునందో విడుచుట మేలుకదా.

సం—సాయంకాలమున సురద్రుమ వనములో వాయుకిశోరములు కుసుమ రజమును వెదజల్లుచుండగా యమునా సైకతములపై పండువెన్నెలలో వేణుగోపాలునితో వొక గోపిక విధముగా ఆడుకోవచ్చును.

నా—గోపిక విధముగా అనుటకంటె గోపికవై అని దిద్దుకొందునా?

సం—మనఃపూర్వకంగా దిద్దుకొందును.

రామదాసు నిర్ఘాంతపోయి చూస్తూన్నాడు.

బు—నేను మాత్రం దండకారణ్యంలో పర్ణకుటీరమున విద్యుల్లతలవలె వెలుగొందుతూ మకరతోరణాలై సీతాలక్ష్మణులు వుభయ పార్శ్వములా అలంకరించగా శబరికి సత్కారోత్తనై నీలమేఘమువలె మౌనిజన మయూర మానసహరుడై ప్రకాశించే రామచంద్ర భగవానుని పదసాన్నిధ్యమున రామకథా సుధారసము కర్ణపేయముగ నాస్వాదించుతుంటాను.

రా—అయ్యా! తమబోటి యోగిపుంగవులను సయితం ఆకర్షించిన దృశ్యం యొక్క ప్రాశస్త్యమును దెలుప ప్రార్థిస్తాను.

బు—ఈ దృశ్యము నాకు తలంపుకు వచ్చినప్పుడెల్లా నేను పరవశమును పొందుతాను. ఆయవస్థ యోగసమాధికంటే నాకెక్కువ తోడ్పడుతున్నది. శబరి వొక రామభక్తురాలైన యెరుకల మనిషి.

రా—కులమున కేమి? గుణం ప్రధానంగదా.

బు—నిశ్చయం. శబరీమోక్షణ ఘట్టం రామాయణంలోనిది. శబరి రామచంద్ర భగవానుడు అయోధ్యనువిడిచి, కిష్కింధను దాటి దక్షిణమునకు వస్తున్నాడని విన్నది. విన్నప్పటినుంచీ ఆమెకు సరిగానిద్రపట్టడంలేదు. ప్రతిరాత్రి భగవానునిసందర్శించినట్లు కలగంటున్నది. ఆయనమూర్తి యెట్లా వుంటుందో అదివరకామె చూడలేదు. తన భావనాశక్తి కల్పించగల అందమంతా ఆయనకు సమకూర్చింది. నీలిమబ్బులూ, నల్లగలువలూ, ఇంద్రనీలములూ, ఆ మహాత్ముని మేనికాంతికి దులకింపనోపవని తోసివేసింది. తాను విన్న కమలలోచనములూ, కంబుకంఠమూ, దీర్ఘములైన బాహువులూ, వెడద యురమూ, కస్తూరితిలకమూ మున్నగు సౌందర్య చిహ్నాలన్నీ నీలదేహానికి సమకూర్చి, కౌస్తుభమణిచే కంఠము నలంకరించి, చేతిలో కోదండంపెట్టి, తన కల్పనాశక్తికందిన నయనాభిరామమైన వొక స్ఫురద్రూపాన్ని మనసులో కల్పించి ఆ దేవుని పదకమలములను తన నయనపద్మములతో నొత్తుతూ ఆనందపడుతున్నది. తన కుటీరమునకు అరటి కంబములూ ఆకుజొంపములూ పూగుత్తులూ మొంగలిపొత్తులూ లేతకొమ్మలూ మృదువైన రెమ్మలూ తెచ్చి అలంకరించింది. ఆవరణమంతా కసవూడ్చి. నీళ్లుజల్లి, యిల్లలికి, ముగ్గులు దీర్చి, తోరణాలు కట్టింది. అతనికి నైవేద్యం పచరించుటకై వనములోవున్న స్వాదుఫలాలన్నీ చేర్చి, వాటిలో మంచివాటి నేర్చి, కొరికి రుచిచూచి మిక్కిలి తియ్యని వాటిని వుంచి తక్కినవి పారవేసింది. సెలయేళ్లనుంచి తియ్యని నీటిం దెచ్చి కుండల నింపింది పాప మా శబరికి వెర్రెత్తింది. తన పనులు మరచిపోయింది. దేహ సౌఖ్యాలు విడిచి తన చిత్తవృత్తులన్నీ శ్రీమన్నారాయణుని పాదములకడ బెట్టింది. పూజాద్రవ్య సంపాదనలు దప్ప యితర సంపాదనలు మానింది. రాముడు మా యింటికి వస్తాడని చెలికత్తెలకు చెప్పింది. వారిని దోడ్కొనివచ్చి ఆహ్వాన పరికరములన్నీ చూపించింది. రాముడు తన ఆతిథ్యము స్వీకరించడానికి వస్తున్నాడని విన్నది. పాపము ఆయనను యెవరు పిలిచారో తెలియదు. విప్రుల యజ్ఞశాలలకు బోవ లజ్జించునది, సామగానమునకు మానము వహించునది, మానుల హృదయ మందిరములం జొరనిది, శాస్త్రంబులకందనిది సింగిగుడిసెలో ప్రత్యక్షమైంది. అయ్యో పాపము! వెర్రి శబరి వుబ్బి తబ్బిబ్బులయింది. వొళ్లు చెమటలు గమ్ముతున్నవి. కాళ్లు తడబడుతున్నవి. చేతులు వణకుతున్నవి. నాలుక పిడచగట్టింది. నోట మాటరాదు ఆహ్వాన వాక్యాలు చెప్పలేదు. పూజా ద్రవ్యాలు సమర్పించలేదు. ఆహారము లొసంగలేదు. పిలవకుండా వచ్చి నాయనకు మర్యాద లేమవసరం? కాని అన్నీ చేసినట్లే అయింది. చేసినవి పుచ్చుకొనుటకైనా అతిథికి శక్తిలేదు శబరి పడుతున్న అవస్థలన్నీ ఆయన పడుతున్నాడు. పిలవందే యెందుకని పరుగెత్తుకొని వచ్చాడు? యేమీ చెప్పడేమి? కుశల ప్రశ్నలడగడేమి? ఆయన యేదో చెప్పవచ్చాడు మాట తడబడ్డది. బిడ్డపడుతున్న అవస్థే తండ్రీ

పడుతున్నాడు. తాదాత్మ్యావస్థ అన్యోన్యంగా వుండక తప్పదు. ఆయన చెప్పినమాటలు కొన్ని వినబడనేలేదు. "శబరీ! శబరీ! శబరీ!" అని ముమ్మాటన్నాడు. శబరినోటి వెంట జవాబులేదు. ఉత్తరప్రత్యుత్తరములు భావములే గ్రహించినవి. శ్రీరాముడు శబరి శిరస్సుమీద చేయుంచాడు. అదికూడా పూరక భావములో మాత్రమే వుంచాడేమో. శబరి ధన్యురాలైంది.

వాయుసంచలన మాగిపోయింది. ఆకులు మ్రాన్పడ్డవి. వృక్షకోటరములనుండి "శబరీ! అయ్యో! నీవు పిచ్చిదానివని మేమనుకొన్నామే" అని శబ్దము వచ్చింది. అది వాయుతరంగములమీద కొట్టుకొనిపోయింది. లోకమెప్పుడూ సత్పురుషులను గూర్చి అట్లాగే అనుకుంటుందని చెట్లతో ఋషినుండే జవాబు వచ్చింది. అవీ గాలికెరటములలోనే తేలిపోయింది.

రామదాసూ, యీ దృశ్యం భావించుకొన్నప్పుడెల్లా నాకు వీరిద్దరి అవస్థేపడుతుంది.

రా—అయ్యా! యిప్పుడు వింటున్న మేమూ ఆ అవస్థలోనే వున్నాం.

బు—యోగులకు యిట్టిదృశ్యములు మిక్కిలి సహాయకారులు.

రా—తమ సాక్ష్యంకంటే మాకు రుజువెందుకు?

నా—యోగులకుకాని మాబోటివారికి మిక్కిలి అవసరమని మేమే సాక్షులం.

సంగదాసు నిశ్చేష్టుడై వున్నాడు.

రా—అయ్యా! ఈ శిష్యులవలన తమరుకోరు గురుదక్షిణ యేమి?

బు—సంచితము నాకిచ్చివేయండి.

నా—ఈ జీవితముకూడ మీకే అర్పిస్తున్నానని యెర్రని చిగుళ్లలో తాపిన తెల్లని పలువరసచే హృదయనైర్మల్యమును ప్రకటిస్తూ, ప్రత్యుత్తర మిచ్చాడు.

సం—నా ప్రాణాన్ని సహా యిస్తున్నాను.

బు—చిరకాలజీవులు కండి.

రా—రేపిక్కడ తమరు దయచేసి వుంటారుకదా?

బు—లేదు. వెంటనే బయలుదేరుతాను. కాలం సమీపించింది. తొందరపడి వచ్చాను. జీవసమాధి చేయబోతున్నాను.

రా—మా అమ్మగారివాక్యం నిజమైంది.

నా—పొద్దున తమదర్శనం చేస్తాం.

బు—అవసరం లేదు. నేను మీకిక అందను.

రా—అయ్యా! వొక్కమనవి. యేమో యిట్టి వెర్రిప్రశ్న లడిగినందులకు క్షమించండి.

బు—తప్పులేదు. అడక్కపోతే అమ్మయినా పెట్టదు. పొదుగున పాలున్నప్పటికీ దూడ కుమ్మందే తల్లిచేపదు.

రా—తమకు సాటువల కేమి కొదువ? మాకిక అనుజ్ఞయివ్వండి.

బు—మంచిది.

ముగ్గురూ వెళ్లిపోయినారు.

---

## పదియవ అధ్యాయం

# పెత్తనం

ముగ్గురూ కలిసి బయలుదేరారు. తీరు సంతర్పించిన కరుణారసపూరిత హైమరంగం మనస్సుల సమ్మోహింపజేసింది. కొంతసేపటికి తేరుకొని వొకరివంక వొకరు చూచుకుంటూ నిలువబడ్డారు.

రా—మౌనముద్రను భేదించి—మనిషి గొప్పవేత్త.

సం—గొప్ప భక్తుడు.

నా—గొప్ప యోగి. కమలాలవంటి కండ్లల్లోనుంచి బ్రహ్మతేజం గురుస్తున్నది.

రా—యోగాభ్యాసంచేతనే కావాలె. మనిషి బొత్తిగా కృశించాడు.

నా—శరీరం కృశించినకొద్దీ బుద్ధి వికసిస్తున్నది.

రా—జీవసమాధి యెప్పుడో మనం పోయి చూస్తే బాగుండు.

నా—మన కందదని చెప్పెనే.

రా—ఆ మాటలో అంత అర్థముందా? అయితే నేను వారితోనే వెళ్లుతాను.

నా—వారు చెప్పినమాటలో ఆ అర్థముంటే నీవు యిప్పుడు వెళ్లినా ప్రయోజనముండదు.

సం—అయినా నేబోయి కనుక్కొని వస్తాను.

సంగదాసు వెంటనే వెంకటసుబ్బయ్యగారి యింటికి వచ్చి అరుగుమీద లేక పోవడం చూసి అయ్యగారు ఏమి చేస్తున్నారని అడిగాడు.

వెం—మీవెంటనే ప్రయాణమై బయలుదేరారు. మధ్యాహ్నం చెప్పడంలో సాయంత్రమే వెళ్లుతా నన్నారు తీరా ప్రయాణమయ్యేటప్పటికి జడుస్తూనే పొద్దుతేదే అయ్యా, అన్నాను, ఎంతదూరం? యిప్పుడు పోతేనా అన్నారు.

సం—యేవూరు పోతామన్నారు ?

వెం—ఆసంగతి నేనడగలేదు. యెంతదూరముంటే పొరుగూళ్లో పనివున్నదేమో అనుకున్నాను. యెందుకూ ? దూరంబోయి వుండరు. వీధి మొత్తతిరిగివుంటారు.

ఇద్దరూ కలిసి మొత్తతిరిగిచూస్తే యెవరూ కనిపించలేదు యేవైపు చూచినా యెవరూలేరు. అంతట సంగదాసువచ్చి "నాయుడుగారు చెప్పిందే నిజం. నేను అపచారం చేశాను" అని అన్నాడు.

రా—వెళ్లారా యేమి ?

సం—యేమైనారో యెవరికీ తెలియదు.

రా—ఆశ్చర్యం,

నా—చెప్పనేచెప్పారు. ఆశ్చర్యమేముంది ?

రా—మీరు అదృష్టవంతులు. యిటువంటివారివల్ల కారణం సాధారణంగా దొరకదు.

సం—ఆయన వుపదేశఫలం మనకందరికీ లభించింది.

రా—పితృరుణం తీర్చుకున్నావు. నీవల్లనే నాకు లభించింది. యింటికి పదు

కోవడానికి వస్తావా?

సా—యీ రాత్రి మాయింట్లోనే పడుకుంటాడు. మానాయనగారూ పిల్లలూ గూడా యింట్లో లేరు

రా—యెక్కడికి పోయినారు?

సా—తిమ్మాపురం పెండ్లికి వెళ్లారు. నాయనగారు రేపుతప్పకుండా రావలె,

రా—కమలమ్మగారుమటుకు రారా?

నా—ఊహూఁ. అక్కడనుంచి నాదెండ్ల పుట్టింటికి వెళ్ళుతుంది.

రా—రేపైనా రా. పేనిగ యింటికి వెళ్ళుతాను.

సంగదాసూ, రామానాయుడూ యింటికివచ్చారు. రామానాయుడు మేడ మీదికి పోయినాడు. సంగదాసు కొట్టంలోకి పోయి యెద్దుల చావిడిదగ్గర నిలువబడ్డాడు.

సం—ఆసంసాహేబూ! యింకా దాణా పెట్టలే యెద్దులకు? లాక్కుంటున్నవే.

ఆ—బుట్టలకు పోసి తెస్తున్నానండీ. వులవలు వుడకడం ఆలస్యమైంది. పత్తిగింజలు బుట్టల్లోపోసి వుంచాం.

సం—పత్తివిత్తులు యింకా యెన్నాళ్ళుపోతవి?

ఆ—అయిపోవచ్చినవి. రెండురోజులకు మిగలవు.

సం—యెట్లాగబ్బా యిగను? పత్తిఅడిగేవాండ్లు లేరు. పత్తిగింజలకు యెక్కడలేని ధరానూ. పత్తిపట్టిస్తే బాగుండు. ఆసంసాహేబూ! నీవు ఆనికె తోగటవీధి పోయి పత్తిరాటాలవాండ్లను పట్టుకురా. పదిపుట్లు పట్టిస్తే చాలావరకు నెట్టవచ్చు. యెదలైపోతే తరవాతమాట చెప్పబోను. పదిరాటాలువస్తే రోజూ వొకపంపుంపత్తి వలుగుతుంది.

ఆ—చౌదరయ్యగారు రేపు వస్తారుగా; గింజలు కొందామంటారేమో?

సం—మనం పత్తిపట్టిస్తే ఆయనెందుకు కొంటానంటాడు? ఒడ్డగనే కోడలంటే వద్దనేఅత్త యెక్కడావుండదు. రాటాలు యెక్కడ పెట్టిస్తాం? యింట్లో పెట్టిస్తే తెగ అరుస్తావే.

ఆ—మొన్న వేలంలో గొన్న తోగటింట్లో పెట్టించడి. బాగా విశాలంగా వుంది.

సం—కొనంగానే మనది వచ్చిందా! అమీనావచ్చి స్వాధీనం చేయవద్దూ?

ఇ—అవొక ఖర్చెందుకని పంతులుగారూ, చౌదరయ్యగారూ పోయివాళ్లను వెళ్లగొట్టి తాళంవేశారు. ఇంకా స్వాధీన మేమిటి?

సం—వాళ్ళు వూరికున్నారా?

ఆ—గంపెడుచీకటి నెత్తినవేసుకొని తూర్పు బతకపోయినారు. అక్కడనే వాలుగావుంది. పెట్టించండి.

సం—సరే కానియ్యండి. అక్కడ హమేషా వొక మనిషి వుండాలె. పద్దులు వ్రాయగలవాడవు నీవే వుండు. వొక్క విత్తు బీరుపోనియ్యవద్దు. కూలివాండ్రు యేడుస్తారు. రేపు ప్రొద్దున రాటాలు ప్రారంభించే జవాబుదారీ నీది తెలుసునా?

ఆ—సరే చెప్పారుగా! నా జీతంసంగతి సాచేతగానే పోనిస్తున్నారు.

సం—రేపు చౌదరయ్యగారు రాంగనే యెదోవొకటి ఫైసలు చేస్తాంలే. రాంగనే వొకమాటు కదిలించు.

సం—బండ్లదొడ్లోకి బోయి—వెంకయ్యా రేపు అరకలపని యెక్కడ?

వెం—వెంకటయ్యగారు పదిహేను అరకలు మిరపదుక్కిలో చాళ్లుదోలడానికి పోదామన్నారు. తక్కినవి యెక్కడకిబోవలెనే నిన్ను గనుక్కోమన్నారు.

సం—ఆయన అన్నీ గుంట్లుబెట్టి పని జేస్తావుంటారు. మళ్లీ కురదలా లెందుకు? యిరవై అరకలు చాళ్లకు బోనిచ్చి తక్కిన పదీ వరిగె దుక్కిలో గొఱ్ఱు దోలడం మొదలుపెట్టండి గొఱ్ఱులతో రామయ్యను పొమ్మను. చాళ్లకు వెంకటయ్యగారు బోతారు. జట్కాబండి మనిషిలేడూ? ఫరీదుసాహెబూ!

ఫ—క్యావుజీ మహారాజ్?

సం—యేం క్యావుజీ. మాట్లాడే స్థితిలో వున్నావా?

ఫ—లేకపోవడమేమండీ. మొన్న యెవ్వడో యేక్ దఫా—

సం—అవును వొక్కమాటే— యెప్పటి కప్పుడు. చౌదరయ్యగారు నీవు పనికిరావంటున్నారు. మీ అయ్యవొచ్చి బతిమెలాడి భద్రంచేస్తానని పోయినాడు. యేమి భద్రం జేశాడో?

ఫ—మా అయ్య ఖసం తినిపించాడుగా అండీ. మళ్లీ దుకాణంకల్లి అసల్ పోతున్నానండీ? సైజీ సబ్ కూ పూఛో.

సం—యేమిటోయి మీ నాయన కొత్తవి తినిపించాడా? ఖసం యేమిటి?

ఫ—ఒట్టు పెట్టించాడుగా అండి.

సం—అదా? సరే చూతాం. చౌదరయ్యగారు పొద్దున రైలు దిగుతారు: రైలుదగ్గరకు నీబండి పోవాలె.

ఫ—అమ్మగారు దేవుడికి మూసేకి పోతామన్నారుగా అండీ.

స—అమ్మవారిగుడికి పొద్దున్న పోతామన్నారా యేమి?

ఫ—అవునండి.

సం—జట్కా కావాలన్నారా?

ఫ—అమ్మగార్కి ఝట్కా అయితేనే ఘసంపండీ.

సం—యేమిటా ఘసంపు? అయిదారుగు రెక్కాలె. యిసుకలో నీ జట్కా పడుకుంటుంది. నే కనుక్కుంటాలే. వెంగన్న వున్నాడా? దుకాణానికి పంపించావా?

వెం—అయ్యా వీడండీ, యీసాయెబు యెప్పుడూ దుకాణానికి రమ్మంటాడండి

సం—అవును నీవు చాలా బుద్ధిమంతుడివి. మీ యిద్దరూ నడవవలసిన వాండ్లే. రత్నాలు దొరికారు. బండ్లు బోల్తా తోస్తారేమోనని అయ్యగారు భయపడుతున్నారు. అన్నట్టు మొన్న రైలుదగ్గరనుంచి వస్తూ రాతికి పట్టించి తిరగదోశావటగా?

వెం—రెద్దు అలివికప్పితే నన్నేమి చేయమంటారు?

సం—స్టేషనుదగ్గెర దుకాణంలో అదికూడా తాగిందా యేమి?

వెం—ఏమిమాటలు చెపుతారండీ. నే నిప్పుడు అంటుకోవడమే లేదుగదా.

సం—అయితే బుద్ధిమంతుడవేగాని రేపుప్రొద్దున మీ యిద్దరిలో యెవరు రైలు

దగ్గరకు పోయినా అయ్యగారితో నీలిమందుకు ధర లేచిందట. చెన్నపట్నంతో లేటంసుకు రెండువాగిన్లు కావాలట. యిదివరకు హెచ్చరిస్తే మేష్టరుగారు నచ్చుగా జవాబు చెప్పారట. మీరు వారితో మాట్లాడి తప్పక రెండువాగిన్లు సెటిల్ చేసుకొని రమ్మన్నానని కాముకా చెప్పాలె. మరిచిపోతారా ?

వెం___నే మరచిపోనండి. యీ సాయిబుకు తెలిసిందో లేదో.

ఫ___కాగితం వ్రాసియ్యండీ.

సం___ఉద్ధరించావు. అయితే నీవు అమ్మవారి పడికేపో. వెంగన్నా! నీవు స్టేషనుకుబోయి బండిలో పడుకోక గేటుదగ్గర నిలుచోని అయ్యగారు దిగంగానే పిలువు. చెరొకదారీ అయ్యేరు. ఆ దున రైలుకట్టవెంబడి వస్తారు.

వెం___అయితే నేను పాయింటు దగ్గరనే బండి దింపుకుంటా. రెండురోడ్లూ అక్కడనే కలుస్తవి.

సం___అప్పుడే మరచిపోయినావు. అయ్యగారు మేష్టరుగారితో మాట్లాడవద్దూ.

వెం___సరే గేటుదగ్గరనే వుంటా.

సం___వెంగన్నా! నీవు గొల్ల వెంకటస్వామి యింటికిబోయి నీవు పొగ తోటలో గొర్లతోలుతానంతలాయిస్తున్నాడట. కాముకావచ్చి మాట్లాడి పొమ్మన్నానని వెంటబెట్టుకొనిరా? అతడు మందదగ్గరెవుంటే పెండ్లాన్ని పిలుమకరా.

వెం___వాడు యెప్పుడూ మందదగ్గరనే పడివుంటాడు. పెండ్లాన్నిరమ్మనమంటా.

సం___చీపురు తీసుకొని కొడుతుంది.

వెం___మీపేరు చెపుతా.

సం___అంత ప్రబుద్ధుడవూనూ.

ఆనంసాహెబువచ్చి "తోగట చిన్నప్పతో మాట్లాడా, పదిరాటాలు సంతన చేసుకొని పొద్దున వస్తానన్నాడు. స్వంతరాటాలే నాలుగున్నవట. యెవరో నీలిమందు బేరగాండ్లు వచ్చారు. నాయుడుగారు మిమ్ముమ రమ్మన్నారు"

సం___వీధిలోకివచ్చి___ యేమండో. షాహుకారుగారు, పెద్దషాహుకార్లంతా దయచేశారే. కొస్తా లేచిందా ?

షా___గిరాకీలేదు. బంకలూలేదు. అడిగే దిక్కేలేదు. మీరు పండినా యెండినా వ్యవసాయం చెయ్యక తప్పదుకదా. వర్తకంలో మేమున్నందుకు దండగో పండగో కొంటూ వుంటాం

సం___లాభంలేని సెట్టి వరదబోడు. యిదివరకెట్లా దీస్తున్నారు ?

షా___శమలో___పావులూ___పోగుసుకా___ అవల్రకానికి అయిదు పెట్టాం నాసికి నూరూ తొంభై వర్ణంకొద్దీ పెటాం.

సం___యింకొక మాటనండి. మాది ప్రాస్తమైన సరుకు. నాసెన్నమాట లేదు.

షా___అక్కడికే పెట్టుధర. యేమాత్రం తేలేను.

సం___రెండువందలు దాకొంటుంది.

షా___స్వంతమేనా ?

సం___కొద్దిగా బాకీలకింద వచ్చింది. యెందుకూ___ దిష్టికి అక్కపోతే మేమే

తియ్యం. మాటదక్క వద్దూ. రెండో రకమన్న మాటలేదు.

పా—సరేమి. చెప్పూ. వేయిరూపాయలు బయానా యిచ్చిపోతాం.

సం—పొద్దున వస్తారుగా?

పా—యెప్పటికప్పుడు రహితమైతే మంచిది.

సం—మీరు బేరం యియ్యడానికి వచ్చారా, తియ్యడానికి వచ్చారా?

పా—పోనియ్యి. నీవు బేరం యియ్యకపోతే మేము వందమళ్లు యిస్తాం తీస్తారా?

సం—చౌదరయ్యగారుకూడా పొద్దున వస్తారు.

పా—ఆమాట మాకు భయంలేదే. నీవు మాట అన్నావంటే ఆయనదాకా అవసరంలేదు. అందాకా యెందుకూ. నీవు మాతరఫునపోయి బేరం యిచ్చిరా, కాదంటే అప్పుడను.

సం—వేళతోగూడిన వ్యవహారంగా.

పా—సరే యిప్పుడు కాదన్నమాటేగా?

సం—ఆఖరుమాట చెప్పలేదే.

పా—పొద్దున వూళ్లోకి తూకానికి వస్తాంగా, రకంజూచి.

సం—సరే.

సంగదాసు లోపలికిపోయి స్నానంచేసి భోజనంచేశాడు. లక్ష్మమ్మ ప్రొద్దున తనకు గుర్రపుబండి వుండవలెనని చెప్పింది. గొల్లవాడు తెల్లవారి వస్తానన్నాడని కబురు వచ్చింది. రాత్రిమళ్ళా నాయుడుగారిని చూడడానికి అవకాశం కలగలేదు. లాంతరు తీసుకొని తనగదిలోకిబోయి యెలుకలు లేకుండా వెదకిచూచి తలుపువేసి పడుకున్నాడు.

---

## పదకొండవ అధ్యాయం

# దేవాలయం

తూర్పు తెల్లవారింది. వెంకటయ్యా, సంగదాసూ లేచి కొట్టంలోకి బోయి జీతగాండ్లను పనులకు పురికొల్పుతున్నారు. వాండ్లు పశువులకు మేతవేయడమూ, నీళ్లుతేవడమూ, పుడితిబోయడమూ, పేడతీయడమూ, కసవూడ్చడమూ మొదలైన పనులు చేస్తున్నారు. ఆవయినతరువాత యిండ్లకుబోయి అన్నంతినివచ్చి కోటేర్లు వేస్తున్నారు. వెంకటయ్య భోజనంచేసి లక్ష్మమ్మతో—చిన్నమ్మా! నీవు గుళ్ళోకి పోతున్నావుట. నీతో యెవరు వస్తున్నారు?

లక్ష్మ—నీభార్యను తీసుకొనిపోతున్నాను. అబ్బాయికూడా వస్తాడట.

వెం—ఆమెట్లు నీవు యెక్కి దిగ్గలవా? లేపోయినని పెట్టుకొన్నా వెందుకు?

ల—నీభార్య కాపురానికి వచ్చిన కొత్తలో ఆస్వామికి చీర మొక్కున్నాను. ఈ ఆయిదేండ్లనుంచీ అట్లాగేపోతున్నది. గొడ్డూ, బిడ్డా గలవాండ్లం. యేదగ్గు వచ్చినా యేపడిశెంపట్టినా ఆనే నింజిలిగా వుండుంచని బయలుదేరుతున్నా.

వెం—ఎండబడ్డవా అంటే యెక్కి దిగడం నీతరంకాదు అయిన నీవు తేమాసం

మనిషిని. పని తెముల్చుకొని పోయేదెప్పుడో, వచ్చేదెప్పుడో. నేనెట్లా వున్నా సద్య నీవు జారిపడేవు. కొన్ని మెట్లు వారకటంగా వుంటవి. నిన్ను పట్టుకొని యెక్కించాలె. అరకను యెవరినైనా పంపి నీతో వచ్చేదా?

ల—నీపనికి అరక తెందుకు? పిల్ల వుంటుందికదా. అబ్బాయివస్తా నేవున్నాడు.

సం—వెంకటయ్యగారూ! అరకలు పోతున్నవి.

వెం—ఆమెను మెట్లెక్కించేటందుకు వొకమనిషిని పంపవోయ్. అబ్బాయి యెక్కిస్తాడంటుంది. ఆయన యెక్కగలిగితే చాలు. మేనా వుండేగదా, కానేవు చాకలవాండ్లను రమ్మనక పోయినావా?

సం—అదీ ఆలోచించా. వాండ్లు యేదోవూరు సవారీకి పోయినారట. సరే యేదో చూతాం. మీరుగాని జొన్న చేనేమైన చూశారా? కోతకు వచ్చిందేమో.

వెం—మందెక్కి వచ్చిన మున్నైయెకరాలు తిరగబారి పోయింది. కాకపోతే కళ్ళునేల పదెకరాలు కాస్త ఆగవలసివస్తుంది. కల్లపుగుడ్డం బాగా కాసినట్టు లేదు.

సం—యివ్వాళ మీరీచాళ్ళు తోలడంగానిచ్చి రేపు గొర్రుదోలడం పూర్తి చేయండి. రేపు వొకయాభైమంది కూలీలను తీసుకపోయి కోత మొదలుపెట్టిస్తాను. యెల్లుండి అరకలపని లేకపోతే జీతగాండ్లందరినీ కోతకు తీసుక పోవచ్చు. సొంత మనుష్యులుగూడ కొందరు పని చేస్తుంటే పని జరుపుగా సాగుతుంది.

వెం—వుండట నేను దున్నుతుంటే సాగినట్టు, లేకపోతే సాగదు.

సం—నీలిమందు బేరగాండ్లు యీపూట వస్తామన్నారు. నూటయిదింటికి పైనే పడవచ్చు. మీ చిన్నయ్యగారు యీరోజు రాకపోతే చేయవలసిందేమిటి? పెద్దమొత్తమని సందేహిస్తున్నా. పోనీ చెన్నపట్టణం యెత్తింతామంటే కానా లాయిలాసా పని ముందు అక్కడకి పోయేనాథుడు లేడు.

వెం—నీవు చెప్పినకాడికయితే పోనీయవచ్చు ఆయన వచ్చినట్టుకు వెళ్లవేసే దేమున్నది?

సం—ఆపడానికి వీలయితే ఆపుతాను. అరకలు సగంత్రానికి పోయివుంటవి. కలుసుకోండి.

చంకన ములుగర్ర పెట్టుకొని చుట్ట చుట్టుకొంటూ బారెడేసి అంగలువేస్తూ వెంకటయ్య బయలుదేరాడు.

సం—అమ్మా, లక్ష్మమ్మగారూ! ఎందుకీతాచ్చారం. బండి వాకిట్లోకివచ్చింది.

ల—మేము బయలుదేరుతున్నాం. అబ్బాయి యింకా కిందికిరాలేదు. మాకు చిల్లర కావలె.

సం—అబ్బాయిగారు మేడదిగి వస్తున్నారు. వారొక అర్థరూపాయి నేబులు తీసుకున్నారు. చాలునా?

ల—చాల కెందుకు పదండర్రా.

లక్ష్మమ్మ పాతపువొంటిమనిషి. ఆలావుమీద పొడుగనిపించదు. పండోదరి వలె యిల్లు నిండివుంటుంది. కాళ్ళు కొంచం పీలగా వుండటంవల్ల బందికాడుతూ నడుస్తుంది. పచ్చిపసుపుకొమ్మవంటి పసిమి. పూర్వకాలపుమనిషి, యీకాలపు తళుకు బెళుకు తెలుగదు. మనిషిదగ్గర కల్లాకాడూ లేదు. యెవరితోనైనా నోటూర పరసన

నిలిచి మాట్లాడుతుంది. స్వంతగా వడికి, నేయించుకొన్న పైజారుచీర గట్టుకొని గుమ్మడిపండు పెట్టి కుచ్చెళ్లు దోపుకొని గోటురవిక తొడుక్కున్నది. కాళ్లకు పసుపూ, మెడకూ చేతులకూ గంధమూ పూసుకొని, పెద్ద యెఱ్ఱకుంకుమబొట్టు పెట్టుకొన్నది. ముక్కున యెఱ్ఱరాళ్ల బిలకా, చెవులకు పండిన బొగడలూ, తిరుగుడు కమ్ములూ, మెడలో గళ్ళపట్టెడా, పమిడివల్లలూ, తాళిబొందులో రూపులూ, అద్దిగెలూ, తలను తిరుగుడుబువ్వా. సవరకుప్పె, చేతికి చక్కగా తోమిన రాగిగొట్లూ నడుమ లక్కపట్టెలూ,—యివే ఆమెకు సాధారణమైన అలంకారములు. కాళ్లకు సన్నని మెట్టెలకంటె వేరేనగలు లేవు. ఈసరకులు ఆమెకు యెప్పుడూ వొంటిమీదనే వుంటవి. దాపుడునగలు రాగిడీ, కమ్మల గొలుసులూ, ముక్కుపోగూ మాత్రం కార్యఖరమ్మతులలో పెట్టుకుంటుంది. సగం నెరసిన తలవెంట్రుకలు మిక్కిలి శోభస్కరంగా వున్నవి. చూచినవారు పెద్దముత్తయిదు నమస్కారం పెడితే పాపాలు విరిసిపోతవనుకుంటారు.

మెల్లగా వాకిట్లోకి నడిచింది. గడపదాటి బండీవంకచూచి అరుగు దగ్గరకు తిప్పితే యెక్కుతానన్నది. ఫరీదుసాహేబు బండి అరుగంట తిప్పి గుర్రాన్ని గట్టిగా పట్టుకొన్నాడు. మెల్లగా బండిలోకి సర్దుకొన్నది. కమాన్లు కిటకిటలాడినవి.

ల—వెనకబరువూ, ముందుబరువూ అంటే నే జరగలేను. వొకరు వెనుకా, వొకరు ముందూ యెక్కి మీరే సర్దుకోండి.

కోడలు వెనుక యెక్కింది. రామానాయుడు ముందెక్కి "బండి నేను మెల్లగా తోల్తాను. జట్కావాలా వెంబడే రా" అన్నాడు. పనికత్తె అక్కలక్ష్మి పసుపూ, కుంకపు పళ్లెమూ లక్ష్మమ్మ చేతి కందించింది.

ల—అక్కలక్ష్మీ! యిల్లు భద్రం. నీవు వొళ్లుబరువుమనిషివి. పొయ్యిలేక తిరవపు మజ్జిగ లేవనేవు!

అక్కలక్ష్మి చిరునవ్వు నవ్వింది.

ల—దానూ! పూజారి అప్పయ్యకు కబురంపావా?

సం—పొద్దున కొండమీదికి పోయినాడు. మీరు వచ్చేదాకా అక్కడనే వుండమన్నా.

గుర్రం సాగింది. బండి మూలతిరిగినతరువాత సంగదాసు గదిలోకి పోయినాడు. ఫరీదుసాహెబు వెంట పరుగెత్తుతున్నాడు. గుర్రం రోడ్డుమీద తరటు పోయింది. కాని డొంకలో నడక ప్రారంభించింది.

ల—రాముడూ! చూశావు వాడిజాగ్రత. కూలివాండ్లను కొట్టవద్దంటాడని మీ నాయనకు కోపంగాని వాడు లేకపోతే మనకు వొక్కరోజు సాగదు. యింటివ్యవహారం నీవేమీ అంటించుకోవుగదా?

రా—రేపటినుంచీ నే పొలంబోతా. వ్యవసాయపుపని నేర్చుకోవాలె.

ల—నేర్చుకోనేదేమున్నదీ? చూస్తుంటే అదే అవగాహన అవుతుంది.

రా—చూడడం గాదు. దున్నడం నేర్చుకోవాలె.

ల—ఇక అయినట్టే. నీవు దున్నితేనేగాని సంసారం నుంచుబడదు. మీనాయన కోప్పడతాడు. కవిలె చూచుకుంటూ వ్యవసాయం అజ కనుక్కుంటూవుంటే చాలు,

రా__వ్యవసాయం చేయండీ దాంట్లోవుండే కష్టనిష్ఠూరాలు యేమి తెలుస్తవి?

ల__మీనాయన నిన్ను ఉద్యోగంలో ప్రవేశపెడతానంటున్నాడే! అక్కవెళ్ళితే వల్లగాదట, పోతావా?

రా__నీ వేమన్నావు?

ల__అయిన నీ అభిప్రాయం చెప్పు.

రా__నేను నవుకరీ చేయను.

ల__నీకు వచ్చిన చదువుకు కొన్నాళ్ళలో తహసీల్‌దారుపని అవుతుందికే?

రా__ఏమయినా గానియ్యి. చేబోను. నీ వేమన్నావు?

ల__నేను నిన్ను విడిచిపెట్టి వుండలేనన్నా.

బండి దేవాలయానికి పోయే మెట్లదగ్గర ఆగింది. కోడలూ, రామానాయుడూ దిగారు. లక్ష్మమ్మ మీరు నోగలుకట్టుకుంటే దిగుతానని మెల్లగా జారింది. పూజారి అప్పయ్య హాజరుగా వున్నాడు. చాలా పొడుగాటివాడు. అరవయ్యోయేడిలో వుంటాడు. కొంచెం అడంగిరేకల మనిషి, సంసారంలేదు. చిన్నప్పుడే భార్య వెళ్ళిపోయింది. పొట్ట లోపలికిపోయి యెప్పుడూ అక్కళించే వుంటుంది. జామారు పింజపోసి మోకాళ్ళమీదికి దోపుకొని తడికొల్లాయిగుడ్డ కుడిబుజానవేసుకున్నాడు. సంసారంలేని వాండ్లకు సరసాలు మెండని ఆయనకు నవ్వుమాటలధికం గాలి కెగురుతున్న పిలక జుట్టు సవరించుకుంటూ లక్ష్మమ్మ కెదురుగా వచ్చాడు. యెడమచేయి తిప్పుతూ మాట మాటకూ ముక్కుగుళ్ళెగరవేస్తూ

అ__లక్ష్మమ్మా! నీవు మా వూరు కాపురానికివచ్చి ముప్పైయేండ్లు దాటింది. పారుగుగడప తొక్కియెరుగవు. ఆఖరకు అమ్మవారి దర్శనానికీకూడా రాలేదు.

ల__ప్రాప్తం వుండవద్దా__మామా__నాకు తెల్లవారి లేచినప్పటినుంచీ మాగాణాం. తెలానాంగా యీ సంసారమే సరిపోతున్నది.

కొండకిందిగుడి గ్రామదేవతది. గుడిముందు అమ్మవారి పాదాలున్నవి. ముందు ఆమెకు మొక్కులు చెల్లాలె. లక్ష్మమ్మ కనువుకుంకమచల్లి వొక రవికా, ఖర్జూరకాయ పెట్టి దణ్ణంపెట్టింది. ఆలా వొక కానీ దక్షిణవేశారు అప్పయ్య కన్నుల సంతోషం వెలిబుచ్చుతూ పసుపూ, కుంకం వదిలివేసి తక్కినవి యేరుకొన్నాడు. అందరూ మెట్లదగ్గరకు పోయినారు, చెక్కడపురాళ్ళతో మెట్లు విశాలంగా కట్టబడ్డవి. యిరుప్రక్కలా రాతిదూలములతో పిట్టగోడలు కట్టారు. గోడల ముఖస్తలమున రాతిగోడలో యేనుగ తొండములు చక్రాకారంగా చెక్కబడ్డవి. మెట్లదారి నిటాలుగానుండక మెలికలుదిరిగి మరుపుగా వుంటుంది. లక్ష్మమ్మ తిప్పుమీదవున్న దేవాలయంజూసి అందాకా యెక్కవలసిందేనా? మామా! నీవు నన్నెట్లా చేరుస్తావో అంటూ వొకచేయి కోడలిమీద వేసి రెండవచేత పిట్టగోడ ఆనుకొన్నది. యెక్కడం ప్రారంభించారు. అక్కడక్కడా కూర్చుంటూ లక్ష్మమ్మను గుంటి దగ్గరకు చేర్చారు.

అ__ఇది ధనపుకొట్టు. యెంత దిట్టంగా అమిర్చారో చూడు. అన్నీ చెక్కడపు దూలాలే! యీ గుడి యెప్పుడయినా శిథిలమయితే తిరిగి కట్టించడానికి ధనపు బిందెలు ఇందులో ఉన్నవిట.

అగ్బర్ పాదుషాకాలంలో అమీర్ మలుక అనే సేనానాయకుణ్ణి గోల్కొం

డనవాబు దండయాత్ర సంపించాడు. అతడు తన జయసూచకంగా వుత్తరంగా కనుపడేచెరువు తవ్వించి గుంటిమీద మసీదు గట్టించాడు. ఆమసీదుకట్టించేనిమిత్తం యీ దేవాలయపురాళ్లు తీసుకొని పోవలెనని ధనపుకొట్టుమీదివి కొందురాళ్లు పెకలించే వరకు అతనికళ్లు భోర్లున నెత్తురుగక్కి వచ్చింది. అంతట రాళ్లు వెళ్లగించటం సంక్షేపించి తన మసీదుకు కావలసినన్ని వేరేరాళ్లు చెక్కించుకున్నాడు. యిక్కడ నుంచీ మెట్లు వొరకాటం. యీ ధనపుకొట్టుదగ్గిర కాసేపు అందరూ కూర్చోవలెనని శాస్త్రం.

ల—శాస్త్రం లేకపోయినా కాసేపుకూర్చొంది ఆ యెత్తుమెట్లు నే నెక్కలేను

రా—శాస్త్రంకూడా అందుకే యేర్పడి వుంటుంది.

అప్పయ్య పెదవులు గిన్నెవలె బెట్టి ఉహుహూ అనినవ్వి మా కోడలు యెత్తుబడ్డది. మా కోడుకును పిలిపించమంటావా? లేవదీయడానికి.

ల—మామా నీవు యిక్కడ వుంటివిగా.

లక్ష్మమ్మలేచి యెత్తుమెట్లెక్కవలెనని ప్రయత్నంజేసింది. కాలు లేవలేదు. మరల కూర్చొని మామా! యింతదూరమూ యెక్కి అమ్మవారిని చూడడానికి ప్రాప్తం లేదుగాబోలె నని మెట్టుమీద గూర్చొని పైకి దేకడం ప్రారంభించింది.

అ—అహా—నాకోడలు యెంత వుపాయశాలి!

అందరూ నవ్వేరు.

ల—ఎవరి వుపాయం వాండ్లది. వుపాయం లేనివాండ్లను వూళ్లో వుండనీయ గూడదుట.

అందరూ గుంటమీది కెక్కారు.

ఈ శక్తిదేవాలయం మిక్కిలీ పురాతనమైనది. యే కాలమున యెవరు గట్టించిందీ తెలిపే చరిత్రాధారాలు లేవు. గుంటి వుత్తరపుప్రక్క వొక శిలాశాసనమున్నది. అది యెండతెగని గాలీవానాపెట్లకు అరిగి అక్షరాలు శిథిలమై యున్నవి. ఇది రెడ్లనాటి శాసనం. మంగళాపురం, క్రంతేరు, డోంకివఱ్ఱు గ్రామాలు అమ్మవారికి అగ్రహారమిచ్చినట్లున్నది. అమీర్ మాలిక్ ముఖమండపంలో కొంత చిత్తరువుచెక్కి పారవేయించి అచ్చట తన దండయాత్రలో గలిగిన విజయములు వర్ణించుతూ శాసనం వ్రాయించాడు. యీ దేవాలయానికి స్థలపురాణమూ లేదు. యీ కొండకు దక్షిణమున పుట్టకోటనే గ్రామప్రాంతస్థలములో పూర్వపు విదర్భాపుర మున్నదనీ తన వివాహమునకు పూర్వం రుక్మిణీ మాధవుం దనకు పెనిమిటింజేయుమని ప్రార్థించి మొక్కుబడులు చెల్లించడానికి యీదేవాలయానికి వచ్చిందనీ శ్రీకృష్ణుడామెను రథముమీద బెట్టుకొని పలానాదారిన వెళ్లిపోయినాడనీ గుంటిమీద కనుపడేనీటిచారలు రథచక్రములజాడలనీ పూజారప్పయ్య యెడమచెయ్యి తిప్పుతూ తేపతేపకూ గుక్కతిప్పుకుంటూ భక్తులకు వర్ణిస్తుంటాడుగాని యీ కథలో సత్యమెంతో చెప్పడానికి వీలులేదు. రమేశదత్తుగారు విదర్భ బీదరు ప్రాంతంలో వుంటుందని పేరుపోలికనుబట్టి వ్రాస్తాడుగాని యితరకారణము లేమీ చెప్పడు. ఆప్రాంతములో ప్రసిద్ధమయిన ఈశ్వరీదేవాలయ మున్నదేమో తెలియదు. చరిత్ర శోధనావిషయమున ఆంధ్రులు గనబరుచు అలసభావమే దీనికి అడ్డంవచ్చింది. విదర్భ ఆంధ్రదేశములోనిదా అనే ముఖ్యవిషయములో నయితేం ఆంధ్రులు పరిశీలించి

అభిప్రాయం వెల్లడించకుండడం శోచనీయమే. రుక్మిణీకల్యాణములో పోతన్నగారు కూడా స్పష్టీకరించలేదు. "నమ్మితి నా మనంబున సనాతనులైన యుమా మహేశులన్, మిమ్ముఁ బురాణదంపతుల" అని రుక్మిణి పార్వతీ పరమేశ్వరుల నిద్దరినీ ప్రార్థించి నట్లు కనబడుతున్నది. ఆ దేవాలయములో అయ్యవారు లేరు. అమ్మవారొక్కతే వున్నది. పై పద్యములో రుక్మిణి యిద్దరిని భజించినట్లు కనబడ్డా పద్యముచివరను ఈశ్వరీ అని ఒక్కరినే సంబోధించింది. ఈ పద్యానికి పూర్వపువచనంలో "ఇందుధర సుందరీ మందిరంబుచేరి" అనీ తరువాత వచనంలో "గౌరీదేవికి మ్రొక్కి" అనీ వ్రాయడం చేత కవి అలంకారంగా వొకచోట వుమకు మహేశ్వరుణ్ణి చేర్చాడుగాని రుక్మిణివెళ్ళింది శక్త్యా అయమే అయినట్లు స్పష్టపడుతున్నది. పుట్టకోట ప్రాంతంలో పడిపోయిన దేవాలయాలూ పూడిపోయిన విగ్రహాలూ, మట్టిదిబ్బలూ చాలా కనబడడంవల్ల యిది పురాతన ప్రసిద్ధస్థలమయినట్లు తోస్తుంది.

చుట్టూ ఘుమారు నూరుగజాలయెత్తునుంచి పైన వొకయెకరం విశాలస్థలమున్నది. యిట్టి రమ్యస్థలములలో పాశ్చాత్యులు విహారమందిరాలు గట్టించి పెద్ద పూటకూళ్లయిళ్లు పెట్టించేవాండ్లు. మన పూర్వులు తమ ఆదర్శాల ప్రకారం దేవాలయాలు కట్టించి పవిత్ర స్థలములు చేసారు. పైనుంచి చూస్తే రంగం మిక్కిలీ హృదయంగమంగా వుంటుంది. తూర్పున కొండలు బారుదీరినవి. తక్కినవైపుల పొక్కిటిగడ్డలవలె తిప్పలున్నవి. ఈ సమీపగ్రామాలు కొండకాటిపూళ్లని తూర్పుసోదరులు పొగుడుతారుగాని యిది పూర్వం నుంచీ ప్రసిద్ధస్థలాలే. రెండు పెద్ద తటాకాలూ, నీరూరే వాగూ, లోతులేనిబావులూ, కొండవీటిచెంతా ళ్లవసరంలేకుండా చేస్తవి. కొండనెత్తిమీద యెండాకాలం చల్లగా వుంటుందిగాని జబ్బులిప్పుడు నివాసంచేసే అలవాటు రెడ్లప్రభుత్వంతో బోయింది. ఈ గుంటికి వుత్తరమునా, తూర్పునా, వరిమళ్లు పచ్చిమగళ్లవలె వరుసలుదీరి పసరుగక్కుతూ వచ్చీపొయ్యే పిల్లగాలులకు సయితము సలాములు చేస్తున్నవి. చిత్తడిచిరుపొట్టలన్నట్లు ముదురు పళ్లన్నీ పొట్టకునచ్చి అక్కడక్కడవె[illegible]ళ్లకున్నవి.

దేవాలయం మిక్కిలి సుందరమైనది. యింతకంటె పెద్ద దేవాలయము లున్నవి కాని యింతటి పనితనం యీ జిల్లాలో మరొకచోట కనబడదు. దేవాలయ స్థాపకులు ధనమూ, కాలమూ, వ్యయమూ లుందని చూచినట్లు కనబడదు. శిల్పవిద్య అంతా ముఖమండపాన కురిపించబడ్డది. యెంతమంది శిల్పశిఖామణులు యెన్ని సంవత్సరాలు యీ మంటపం కట్టారో చెప్పడానికి వీలులేదు. పెద్ద రాతిశిలాబీలను సన్నని పడాకులతో మలిచి అతికినట్లు మోపిగట్టించి దేవాలయపు గోడలు పెట్టారు. యివి యింతవరకూ దసలలేదు. యీ గోడలమీద రాతితో జవగట్టి చూరుదింపారు. ముఖమంటపాన చెగటు పుట్టేటట్లు సూక్ష్మ్యాం గుప్పించిన శిల్పి యీ గోడలమీద నాజూకుగా అక్కడక్కడ చిన్నప్రతిమలను చిత్రించి చూపర మనస్సులకు విరామం కల్పించాడు. ఈశాన్యమున యిరవైగజాల దూరంగావున్న నేవామంటపం దాటి ధ్వజస్తంభం దిరిగి మనవాండ్లందరూ ముఖమండపంలో ప్రవేశించారు. దానికిరుప్రక్కలా వున్న నునుపుదేల్చిన నల్లరాల వరుపులపై కూర్చున్నారు. చేతుల నునుపుల పైజార్చి చూచి అధరమును పంటనొక్కుకుంటూ కన్నులను మాంద్యముగ స్తంభములవంక దిప్పారు. నల్లనికాంతి యష్టి నిద్దంపు టరుగుల నుండి విజృంభించి మేలుకట్టు నంటుకొన్నది. ఈ స్తంభాలు కొంతవరకు చచ్చౌకంగా

కలకలుదీరి యొకచోట వక్రువలై మరియొకచోట బొద్దులు తమ్మాలింగనము సేయు వేరొకచోట గాజ్లుదీరి నిలువుటద్దములవలె చూపరప్రతిమలు ప్రతిబింబిస్తూ, సోకిన చమురయ్యేటట్టు స్వచ్ఛములై యున్నవి. వాటిమీద పీటలమర్చబడి శిల్పచాతుర్యమునకు పీటలై యొప్పుచున్నవి. వితానమున రెండుగజముల నడిమికొలతగల పద్మము చెక్కబడి వున్నది. దళములు యొండొంటిని నొరుసుకొంటూ యొకదానిపై యొకటి వరుసలు దీరి కుచ్చితిప్పులై, పారువులై, మురువులై, నడుమబొడ్డుదేలి లోచనములకు విందులుచేస్తున్నవి ఈ కమలానికి చుట్టూ కణికెడు రాతిగుబ్బలు యొండొంటిం బెరసి నునుపులై, పలుదలై వక్రువలై మొనలుదేరి రసికుల భావములను ఆవహిస్తున్నవి. ద్వారబంధం శిల్ప విన్యాసమునకు పొలిమేర శిల్పి శిల్పవ్యసనియై తన శిల్పచాపల్యమును మెదిపి పాకంజేసి గొడుగుబల్లను అచ్చుబోసి వుంటాడు. నల్లని చలువరాయిని జలపతనంవలె జరున నంపు దీర్చి జార్చి ఆపి అంచు గట్టాడు, యీ అంచుపొడుగునా శిల్పలావణ్యంయొక్క జిగ్గు నిగ్గులు నయనామృతములై వప్పుతున్నవి. కమ్ములసోయగం వర్ణనాతీతం. శిల్పి తన చాతుర్యంచేత భావమున రూపకల్పన జేసుకొని భ్రమరకీటక న్యాయంగా తన పోగరు పోట్లతో యిసిరాతినుండి కమ్మలను మూర్తీభవింపజేసి వుంటాడు. తీగెల రామణీయకమూ, చిగురుటాకుల మార్దవమూ, పూవుత్తుల రవళీ, మొగ్గలసొబగూ, కాయల గరువమూ అన్నీ పావళించి అల్లుకొని జడలుగట్టినవి. మంశిగం మూడంగుత్తులుగా వున్నది. కమ్మలయొక్క సౌందర్యాటవి యిచ్చట గన్పట్టదుగాని గాంభీర్యమూ, నిదానమూ, భావనా సౌశీల్యమూ ఆతిశయించి వుంటవి. యీ శిల్పం చాలవరకు పెద్దన కవిత్వమును బోలి స్వాభావికమైన సౌందర్యమును వెల్లడిస్తున్నది, చాలాచోట్ల నాగపడిగెలుమూ, గొడుగుబల్లలు మున్నగువానికి నాడబాము ఆకారములునూ గన్పట్టుటచేత నిది నాగశిల్పములలో చేరియున్నది.

ప్రేక్షకులు చూచిచూచి శిల్పలావణ్యమునం దలిసి మన అప్పయ్యవంక జూచేటప్పటికి ఆయన మళ్లీ తన కథ ప్రారంభించాడు.

---

## పన్నెండవ అధ్యాయం

# అమ్మవారు

అ—పూర్వం వాసిరెడ్డివారి సంస్థానంలో పొత్తూరివారు దివాంజీలుగా వుండగా అమ్మవారికి చాలాభోగం జరుగుతూ వుండేది. ఇప్పటిప్పటి సత్రాలన్నీ పడిపోయినవి. గుడికి ప్రాకారం లేకుండా వుండడం బాగుండలేదు. వెనుక యేకా లక్ష్మయ్య అనే ఆయన తొంగిచూడబోయి పడి కాలంచేశాడు. పూర్వం అమ్మవారికి చాలా నగలువుండేవి. నా పెండ్లికిముందు యెవరో యెత్తుకపోతే అప్పటి కరణం లక్ష్మీనారాయణ మావల్ల దండగగొన్నాడు. యింకొకటి కథ ఆగిపోయింది. అమానుమూలుక్క యీ ప్రక్కగ్రామానికి తనపేరుబెట్టి బావి తవ్వించాడు. ఈద్వారబంధపు కమ్మలలో కలిపి మలచబడ్డ ద్వారపాలకులను బద్దలుగొట్టించి గుడిగోడలమీద చెక్కిన చక్కని బొమ్మలనన్నీ భిన్నంజేశాడు. తురకవాడు అఘాయిత్యంచేస్తాడని అమ్మవారు వెనకగోడ బద్దలు

గొట్టుకొని సత్రసాలలోవున్న బావిలో ప్రవేశించింది. వాడు పోయిన తరువాత తిరిగీ తెచ్చి ప్రతిష్టజేశారు.

రామానాయుడు కండ్ల బొటబొట నీళ్లుగార్చాడు. కుడిచేతి పిడికిలి గట్టిగా బిగిసి గజగజ వణికింది.

రా—అప్పుడు యీ వూళ్లల్లో హిందువులు లేరా?

అ—అయ్యో లేకేమి?

రా—అరమోడ్పు గన్నులతో—జీవంతో లేరు వున్నారా? రెడ్డిసంతానుల వీర రక్తం విరిగిపోయిందా? గడిసీమలు గాచిన కామానాయుడి సంతతి అంతరించిందా? రావెళ్లవారూ, పెమ్మసానివారూ, ధర్మసంరక్షణబిరుదం దగ్ధంచేసి కుక్షింభరులై కూళల వలె జీవించుతున్నారా? వీరాధివీరుడైన మేడమాత్యునియొక్కయూ, చితాపుఖానుని సైన్యముల చిందరవందరజేసి కొండవీటిస్వాతంత్ర్యము నిలిపిన నాదెండ్ల గోపయామాత్యుని యొక్కయూ సంతానం—

రామానాయుడు రక్తనాళములలో స్వచ్ఛమైన వీరరసం విజృంభించింది. దేహ మెల్లనిండి నిబిడీకృతమైంది. దిగంతములకూ వ్యాపించింది. మనసు సంకల్పరహితమై లీనమయింది. దేదీప్యమానమైన నీలకాంతులతో త్రిశూలధారిణీ వీరస్వరూపిణి దృష్టి గోచరమయింది. రెప్పలు మూతలుబడ్డవి.

హే విశ్వరూపిణి, హే జగద్ధాత్రీ, సమస్త జగంబులూ నీవే. ముమ్మూర్తులకూ మూలాంకురాంబవు. నీ వాడికోరలతో నీ పవిత్ర నఖంబులతో హిరణ్యకశిపుని జించి చెండాడి నీలో గలుపుకొంటివి. నీ కోదండం రావణుని వ్రయ్యలేసింది. నీ చక్రం శిశుపాలుని కంఠం తెంచింది. నీవే త్రిపురాసురుల గూల్చావు. ప్రళయకాలరుద్ర రూపిణివి, లోకంబుల నీలో దాచుకొంటావు. నీవే పరాపరా కృతివి. బ్రహ్మాండముల సృష్టించి బంతులాడుతున్నావు. భారతివై లోకమునకు విజ్ఞానము నుపదేశిస్తున్నావు. లక్ష్మివై సమస్తదేశములకూ జీవనము లిస్తున్నావు. దుర్గవై ఆంధ్రస్వరూపిణివై ఆంధ్రలోకము నేలుతున్నావు. గౌతమీ, కృష్ణా, పినాకినీ, తుంగభద్రా స్వరూపిణివి. శ్రీశైల ద్రాక్షారామ కాళహస్తి శ్రీకూర్మ శ్రీకాకుళ భద్రాద్రి తిరుపతుల వెలయుచున్నావు. నీవు ప్రేమస్వరూపిణివి. రాధవై బృందావనమున విహరించి భువనముల నిత్యలీలా విభూతిం దనరుచుంటావు. నీవు ఓంకార స్వరూపిణివైన మూలాంకురాంబవు. మంగళాపురములో వెలిశావు. అకార ఉకార మకారంబవై సత్వరజస్తమోరూపిణివై, శరపభూత వికారిణివై పంచతన్మాత్రారూపమును బొంది పంచేంద్రియములుగ అవతరించావు. శబ్ద స్వరూపిణివై, దేవుని పుత్రుడవైనావు. హ్రీంకార స్వరూపిణివై కడపటి పైగంబరువైనావు. విజ్ఞానస్వరూపిణివై సత్యవతీ గర్భమున బుట్టావు. అహింసా స్వరూపిణివై కపిలవస్తు నగరములో వెలిశావు. ప్రాగ్జోతిషంలో జన్మించినవైయ్యాయిక బోధిని వైనావు. నీవు నాయందనుగ్రహంచేత సౌలభ్యవశమున భీకరవేషము దాల్చి నవరస స్వరూపమును సయితమూ ప్రదర్శిస్తున్నావు. తల్లీ! నీ మహద్రూపం దర్శించి ధన్యుడనైనాను. నీ విశ్వరూపమును ఉపసంహరింపుము.

ల—యేమి మామా! నాకు భయమేస్తున్నది. పిల్లవాడికి కండ్లు మూతలు బడ్డవి. నే నింకెక్కడికి కదలను.

అ—అతడికి వచ్చిన భయంలేదు. అది అమ్మవారిచేష్ట. ఆమె సత్యం ఈరోజు వరకూ ప్రత్యక్షంగా కనబడుతున్నది. యిక్కడికి యెన్నివేల యేండ్లయిందో ఆ యంత్రంవేసి.

ల—హూట్లాడించేదీ ?

అ—యిప్పుడేమీ వద్దు. కాస్త తెప్పిరిల్లనియ్యి. నేనే అడుగుతాగా ? అడగవలసిన వేమిటో.

ల—నీ వేదో చెబుతూ వస్తున్నావా, దద్దళంలోకి అడుగుబెట్టాం. అప్పటినుంచీ వాడి ముఖాన యేదో వికారం కనబడుతూనే వున్నది. అమ్మవారి చేష్టయితే యెగుడు దిగుడు కూటం లెందుచేత ?

అ—అనేక మోస్తర్లు, అమ్మవారికి అయిదుబిందెల పానకం మొక్కుకో. ఆవేశి శమిస్తుంది.

ల—దానికేం ? వచ్చే శనివారం పదిబిందెలు చేయిస్తా, అమ్మవారి దయ చక్కగావుంటే.

రామానాయుడు కండ్లు తెరచి విభ్రాంతిగా చూచాడు.

ల—ఏమినాయనా ! యెట్లా వున్నది ? వికారంగా వున్నదా?

రా—(కండ్లు తుడుచుకొని చక్షురించి) బాగానేవుంది.

అ—బాగావుండిగదా, ఆ తల్లి చల్లంగా, నేను పదిబిందెలు పానకం మొక్కుకున్నాగాని నీవుగూడా మొక్కుకో.

రా—యిరవై బిందెలు చేయింతాం, వూళ్లో అందరికీ పోయవచ్చు.

ల—పాత మొక్కు చెల్లించిపోదాంపద.

అ—యివి అమ్మవారి పాదాలు. వాటిని పూజించండి.

పాదపూజ అయిన తరువాత అందరూ దేవాలయంలో గర్భగుడిచుట్టూ విశాలంగా వున్న చీకటిదారిగుండా ప్రదక్షిణం చేశారు.

అ—అమ్మవారు ప్రతివాండ్లకూ తన రొత్తువున్నట్లు కనబడుతుంది.

అందరికీ వొక మోస్తరుగానే కనపడ్డదిగాని అప్పటి స్థితిలో యెవరూ పరీక్షించలేదు.

అప్పయ్య అందరికీ కుంకంయిచ్చి మంత్రపుష్పంబెట్టి మొక్కుబళ్లు చెల్లిన తరువాత గారీపాడం యిచ్చాడు, అంతట అందరూ బయలుదేరి మెట్లుదిగారు. లక్ష్మమ్మ బండిలో మెల్లగా యెక్కింది. అందరూ యెక్కిన తరువాత పరీదుసాహెబునే బండి తోలమన్నది.

ల—నుల్లీ యేమీ వికారంగా లేదుగదా?

రా—లేదు.

బండి భోజనాలవేళకే యింటికి వచ్చింది.

---

పదమూడవ అధ్యాయము

# పొగరాజులు — మడత కుడుములు

సంగదాసు అన్నంతిని తన ఆఫీసుగదిలో కూర్చున్నాడు. ఆదంసాహేబువచ్చి "కమాస్తాగారు భోంచేశారా" అని యెవరినో అడుగుతున్నాడు.

సం—ఆదంసాహేబూ! యేమిసంగతులు? అక్కడ వుండకుండా వచ్చావేమి?

ఆ—పదిరాటాలు సాగుతున్నవి. వొకబోరెం యెండవేయించాను. యీమనుకులో అంతకంటే యెక్కువ నలగదు. మీరు చెప్పంగనే చీకటితోబోయి కూలిండ్లు అన్నీ గాలించా. మునసబుగారి జొన్నకోతలు రేపల్లా పడతవిట. వొక పాతికమంది కంటే మనవు యెక్కువ తేలేటట్టులేదు. యెల్లుండైతే వందమంది వస్తామన్నారు. ఈ మాట చెప్పి పోవడానికే వచ్చా.

స—వారి కోతలు అడ్డంవచ్చినవీ? సరేపో. వెంగన్న స్టేషనునుంచి వచ్చాడేమో యిటురిమ్మను. (తనలో) ఇవ్వాళగూడా రాలేదేమబ్బా. ఇల్లువిడచి వుండేవారుగారే! నీలిమందు ఆపితే మళ్లీ పందమవుతుందేమో.. యేమోయి వెంగన్నా! యెంతసేపయింది నీవువచ్చి?

వెం—యింతకుముందే కాదండీ, బండివిడిచి యిట్లా వస్తున్నా.

సం—యింతసేపు యేమిచేస్తున్నావు? తాగి పడుకున్నావా?

వెం—యిప్పుడు బొత్తిగా ఆజోలి పోవడంలేదుగదా, యేమిటండీ అట్లా అంటారు? వొకవేళ తాగితేమట్టుకు నే పడుకోవాలెటండీ?

స—మంచినీళ్లప్రాయమయింది అయ్యగారు రాలేదేమి?

వె—వచ్చారు.

స—యేరీ?

వె—పాలెపు మునసబుగారూ, వీరూ యింకా హేమాహేమీలంతా జేరి కోతకూలి గింజలిస్తామా, డబ్బులిస్తామా అని ఆలోచిస్తున్నారు.

స—మన అయ్యగారు యేమిస్తామంటున్నారు?

వె—మునసబుగారు తోకగొయ్యమంటే యీయన సున్నంగూడా పెట్టమంటున్నారు.

స—అదేమిటోయ్. కూలీలకు తోక లుంటవా?

వె—మునసబుగారు కూలికింద డబ్బులిచ్చి గడ్డి మామూలిస్తామంటుంటే వీరు గడ్డి అసలే వల్లగాదంటున్నారు.

స—యింకా యేమి మాటలు జరిగినవి?

వె—కావా మాట్లాడుతున్నారు. మీ రేమియ్యవలె నంటారు?

స—నా మాటేమైనా వచ్చిందా?

వె—సాడీలు చెప్పాపంటారు.. నా కెందుకు?

ల—పోనీ. యితర సంగతులు చెప్పు నా అభిప్రాయం నీకు తెలుసునా?

వె—మీరు కూలీలపట్టేగా.

స__నేను నీతో చెప్పానూ?

వె__మునసబుగా రన్నారు.

స__అయ్యగారు కాదనలే.

వె__వారికిమట్టుకు తెలియదూ?

స__వారికిమట్టు కేమి తెలుస్తుంది?

వె__మీరు వాదిస్తుంటారటగా.

స__యేమని?

వె__కూలీలకు డబ్బిస్తే గిట్టదని.

స__యింకా యేమి సంగతులు?

వె__మీరు పని చాలించుకుంటారా?

స__అయ్యగారంటేగా.

వె__వారు వుందనునే అంటారు. మీ కిష్టం గాకపోతే చాలించుకోరా?

స__యెందుకిష్టంగాకపోతుంది?

వె__మీరు అవునన్నది వారు కాదంటే.

స__యింకా కొత్తసంగతు లేమి?

వె__ఆఁ__యిక నేమీ లేవు.

స__(తనలో లేనట్టే) నామాట యేమివచ్చిందో చెప్పవుగదా!

వె__నా కెందుకయ్యా? వొకరి ప్రస్తావం.

స__అయ్యగా రేరీ?

వె__మునసబుగారు నిలిపారు. యేదో తేల్చుకొని మాపోరేపో వస్తారు.

స__రైలువాగిన్ల సంగతి యేమిచెప్పారు?

వె__నీలిమందు ధర పడిపోయిందట. చెన్నపట్నానికి యెత్తించవద్దన్నారు.

స__అరే! వర్తకులు మనపత్తిన చుట్టిపోవాలెనని వచ్చారన్నమాట. నిన్న బేరమే రహితంకాలేదన్నారే. ఇవ్వాళ యేమితూచుకుంటారు? అందుకనే రాలేదు. నాకు యేదో అనుమానంగానే కనబడ్డది - సరే, నీవు వెళ్లు.

(తనలో) జరుగుతున్న కథ యావత్తూ బోధపడ్డదిగదా. వస్తున్న పనిలోనేవుంచి అణిచిపెడదామని వారి వుద్దేశం. కూలివాండ్లను అన్యాయం జేయదల్చుకున్నారు. యిదివరకు వచ్చే కూలే చాలా హీనంగావుంది. దాన్ని డబ్బులోకి మార్చి యింకాతగ్గించవలెనని ప్రయత్నం. నాయుడుగారితో యీ సంగతి యావత్తూ చెప్పుదామా? ఎందుకు ఆయన మనస్సుకు వ్యసనం? కథ యెట్లానడుస్తుందో చూదాం.

సాయంకాలం చౌదరయ్య రాలేదు. రామానాయుడు చల్లబడ్డతరువాత ఫలహారంజేసి సంగదాసుగదిదగ్గరకు వచ్చి 'షికారు పోదామా' అన్నాడు.

స__పత్తిపట్టడం చూసివెళ్లుదాం.

వుభయులూ రాటాలదగ్గరకు పోయినారు. పత్తి పట్టడం ఆపి విత్తులు తూస్తున్నారు.

స__విత్తులు గదిలో బోయించి దూది బోరానికి తొక్కించు,

ఆ—కూలీలు గింజలు యెక్కువిస్తారంటున్నారు? వారానికి వొకమాటిస్తే వాండ్లకు జరగదట.

స—మూడురోజుల కొకమాటు యిప్పించు. తాళపుచెవి అమ్మగారి కియ్యి. మేము పొద్దుబోయి వస్తామేమో కొత్తకూలీలను వచ్చినంతవరకు పోగుచెయ్యి. మబ్బు కారాడుతున్నది. జొన్న తింగబారింది. నిలువునతడిస్తే గింజ మసకేస్తుంది.

రామానాయుడు, సంగదాసు రోడ్డువెంబడి మలకాచెరువుకేసి షికారు బయలుదేరారు.

రా—ప్రత్తిబట్టేవాండ్లకు రోజుకు కూలి యెంతిస్తారు?

స—పూర్వం కట్టుకు అర్వేణ్ణరసోలెడు జొన్నలిచ్చేవారు. యిప్పుడు అర్వేడు చేశారు.

రా—రోజూ యెన్నికట్లు పడతారు?

స—సాధారణంగా మూడెత్తులగింజలు పడతారు. రెక్కపుష్టి గలవాండ్లయితే యింకో సవలం పట్టవచ్చు.

రా—అరసోలెడు తగ్గిస్తే వాళ్ళు వొప్పుకున్నారా?

స—అవీ యిచ్చేవాండ్లు లేకపోతే వొప్పుకోక యేంచేస్తారు?

రా—మా నాయనగారు యిన్నాళ్ళ రానికథ తెలుసునా?

స—చూచాయగా తెలిసింది. విశేషాలు మీకేమయినా తెలుసునా?

రా—పాలెంలో యీసాయంత్రం మీటింగుట. చిన్నపరెడ్డి మన మునసబును రమ్మని కబురంపాడు కొత్తకూలి గింజలు మానివేసి డబ్బియ్యవలెనని యేర్పాటుట.

స—మీటింగుసంగతి నాకు తెలియలేదుగాని మీ నాయనగారూ, చిన్నపరెడ్డీ యీసంగతే మాట్లాడుతున్నట్లు విన్నవాండ్లు చెప్పారు.

రా—చిన్నపరెడ్డి కూలివాండ్ల కూడుదీసి యింకా మేడలు కట్టిస్తాడుగావాలె మా నాయనగారు వీండ్లలో చేరకుండావుంటే బాగుండు.

స—మీ నాయనగారిదే ఎక్కువ ప్రోత్సాహమంటారు.

రా—మునసబుకు చిన్నపరెడ్డి వుత్తరం వ్రాశాడే!

స—మీనాయనగారికీ, మునసబుకూ మనస్పర్ధ గనుక కన్నుగిలే పుల్లలన్నిటినీ కూడదీసుకుంటున్నారు.

యితరవూళ్లకు మీ నాయనగారు వ్రాసివుండవచ్చును.

రా—ఈ పెద్దవాండ్లంతా మోసాలుజేసుకోని యెందుకీ నిర్భాగ్యులమీద దండెత్తడం? పూటకూటికిలేని యీ కూలీలు యేమి ప్రతిక్రియ చేయగలరు? వీండ్ల కాధారమెవ్వరు?

స—దేవుడే ఆధారం.

రా—ఆయనగూడా న్యాయం విడిచి భాగ్యవంతుల పక్షమైతేనో?

స—మన మిద్దరం ఆయననుకూడా యెదిరింతాం.

రా—ఇదే మనయిద్దరికీ శపథం. ఇక యుద్ధం ప్రకటించు.

సం—యికమీద బహుశా నేను మీ యిల్లు విడువవలసి వస్తుంది.

రా—నేనే కదువవలసి వస్తుందేమో. యింట్లోవుండి యుద్ధం యెట్లా చేస్తాం! రేపు జొన్నకోతల కూలీ విషయం యేమాలోచించావు?

సం—యుద్ధానికి వాండ్లే ముందు ప్రయత్నాలు చేస్తున్నారుగదా! మొదటి దెబ్బ వాండ్లనే కొట్టనియ్యండి.

రా—ఆ గౌరవం వాండ్లకెందుకియ్యాలే.

స—మొదటిదెబ్బ కొట్టినవాడికంటే తిన్నవాడే ధన్యుడు.

రామానాయుడు సంతోషం పట్టజాలక సంగదాసును కౌగలించుకున్నాడు.

చండకిరణు డస్తమించాడు. ఈ యౌవనుల సంధిసమయములను సంధ్యారాగం రక్తాక్షరములతో ఆకాశఫలకమున చిత్రించింది. యీ రక్తమే ప్రతిగృహమందూ దీపమై ప్రకాశిస్తున్నది. సంభాషణ చాలించి వుభయులూ యింటికి బయలుదేరారు. యింటిదగ్గిర అదంసాహెబు యెదురుగా వచ్చి

అ—యిదిగో తాళపుచేవి. అమ్మగారు లోపల వున్నారు.

స—దిబ్బలో దంటెక్కువ పడుతున్నది. జీతగాండ్లు వాండ్ల యిష్టం వచ్చినట్లు తొక్కిస్తున్నట్లున్నారు.

అ—అన్నీ బడిదంట్లేనండి.

స—సన్నదంట్లైతే వాండ్లు తేపా వేయలేక వొక్కసారే యింతపడ వేస్తారు. తిన్నంతతిని మిగిలింది తొక్కుతవి. వొబ్బిడిగా వాడుకోకపోతే యెన్ని వాములైనా ఆగవు. వాండ్లతో చెప్పు. అయ్యవారు రానట్టేనా?

అ—రారని మనిషి వచ్చాడు.

స—పనిచెందుకు? ఆకబురు పొద్దున్నే వచ్చిందే!

అ—రెండువుత్తరాలుకూడా తెచ్చాడు. తాటి లింగయ్యకూ, బాపయ్యకూ తక్షణం పాలెపు మునసబుగారింటికి రమ్మని వ్రాశారు. యిందుకని లేదు.

రా—యెవరు వ్రాశారు?

అ—అయ్యగారే.

స—వారు వెళ్లారా?

అ—బాపయ్య లేదు. లింగయ్య వెళ్లాడు.

స—మునసబుగారు వచ్చారా?

అ—వస్తుండాలె.

రా—బాపయ్య వస్తే నే రమ్మన్నానని చెప్పు. మునసబుతో మాట్లాడడం యెట్లా?

స—నే వెళ్లి మాట్లాడతా.

రా—మిక్కిలి ఉత్సాహంతో—దానూ శత్రువులు సైన్యాలు కూర్చుకుంటున్నారు.

స—అందులో తప్పేముంది? యెవరి ప్రయత్నాలు వాళ్లు చేసుకోనరా? మనం వొకరి స్వాధీనంలోవున్న మనుష్యులమైనాం.

రా—మన అంతరాత్మలు మన స్వాధీనంలోనే వున్నవి.

స—రేపు జొన్నకోతకు మీరు వస్తామంటిరి!

# పదమూడవ అధ్యాయం



రా—అయ్యో! తప్పకుండా నేనుకూడా అన్నం మూటకట్టుకొని తెచ్చుకోనా? అంతా తెచ్చుకోవడంలా.

స—అది పనికిరాదు. మధ్యాహ్నందాకా వుండి యింటికి భోజనానికి రండి.

రా—అవన్నీ నట్టిమాటలు. భోజనం చేలో చేయవలసిందే. పోనియ్యి, యింటి నుంచి అన్నం పంపించమందాం.

స—మా అయ్య పడుకోడానికి రమ్మన్నాడు. ఈరాత్రి వెళ్లుతా.

రా—బాగా పట్టుకున్నదే మీ వాండ్లతో మాట్లాడు.

స—యేమని మాట్లాడేది? వాండ్లేదారిన వస్తారో.

రా—ఒక్కటే దారి. యెరగనిదేముంది? మాన్పుకు వొప్పుకోవద్దను.

స—బాగా పట్టారే?

రా—నీవే నన్ను పట్టావు.

స—మీరే నన్ను పట్టారు.

మనిద్దరినీ ఒకదయ్యమే పట్టింది.

స—అది వదలితే?

రా—నీ కాభయం వద్దు దేవుడి పట్టుకంటె దయ్యపుపట్టెక్కువ.

స—అట్లయితే దేవుడు అటు చేరినా మనము గెలుస్తామున్నమాటే.

రా—నాకేమీ తోచడంలేదు. అయితే కూలివాండ్లు సమ్మెకడితే ఆరోజులలో భోజనం ఎట్లా?

స—యేమి చేస్తారు? పస్తుంటారు.

రా—పస్తూ?

స—అయ్యా, మీ రేమనుకొంటున్నారు. అందరికీ పొద్దిటిపూట గుమ్మపాలూ, మధ్యాహ్నం గెడ్డపెరుగూ మూడు గంటలకు రకరకాల ఫలహారాలూ, సాయంత్రం తేలికైన భోజనం, పడుకోబోయేటప్పుడు వేడిపాలూ, అప్పుడప్పుడు చిరితిండి యీ మోస్తరుగా అమరుతున్న దనుకుంటున్నారా?

రా—నన్నెందుకు ఎగతాళి చేస్తావోయ్? నిజంగా పస్తుంటారాయేమిటి?

స—అయ్యా, చెవులున్నవాండ్లు వినండి. మా మాలమాదిగ పల్లెలలో నాలుగు నెలలు పూర్తి భోజనమంటే జొన్నన్నం, గోంగూరా, కారం, యివి కడుపునిండా తినడం. నాలుగు నెలలు అర్ధభోజనం మిగిలినరోజులు కటికి వుపవాసం.

రా—నీవు చెప్పేదంతా నిజమేనటోయ్?

స—దేవుడనేవాడొకడు యీ ప్రపంచాన్ని పాలిస్తుంటే—వున్నాడా అని నాకు సందేహం—వున్నా దయామయుడు గాడు—ఆయనమీద ప్రమాణంచేసి చెప్తాను. నే చెప్పేదియావత్తు సత్యం.

రా—యేమి ఆశ్చర్యం. భోజనంలేకుండా వూరికే ఉంటారూ?

స—దొరికితే నాగజెముడుపండ్లూ, బొడ్డాకూ, చచ్చిన గొడ్లమురికిమాంసం—

రా—మురికిమాంసం తినకూడదు. ఆసంగతి నీవు వాండ్లకు గట్టిగా చెప్పాలె.

స—అయ్యా, ఆకలిబాధ మీకు తెలియదు. మహర్షులవంటివాండ్లు ఆకలిబాధకు నిలువలేక, యే మాదిగపల్లెలోనో జొరబడి యెండవేసిన మురికిమాంసమును దొంగిలించి

తిన్నారట. అది తినవద్దని యెవరూ బోధించ నవసరం లేదు. వాండ్లకు కడుపులోకి అన్నంవుంటే తినమన్నా తినరు. అన్నం లేకపోతే మురికిమాంసం కాదుగదా యెముకలు గూడ కొరికి తింటారు.

రా__ఓయబ్బా యిక చాలించవోయ్, నే వినలేను. యిదివరకు అన్నంలేక బాధపడుతున్నారంటే యేమో అనుకున్నాగాని యీసంగతులన్నీ నాకు తెలియవు. ఇక నన్ను విడిచిపెట్టు.

స__పాపం మిమ్మలను చాలా శ్రమపెట్టినట్టున్నా

రా__శ్రమేమిటి వాళ్లుపడేశ్రమలు వినటానికె శ్రమా? యింతకు నీవు దొరికితే నాగజెముడుపండ్లు తింటారన్నావే. ఒకప్పుడవిగూడ దొరకవా?

స__యిదివరకే మీ మనసు కళవళపడ్డది. యింకొకమాటు చెపుతాలెండి

రా__ఆ ఒక్కటి చెప్పి వూరుకో.

స__మావూరి రెండుకొండలనిండా నాగజెముడు బలిసివున్నదిగదా! యెండాకాలం సగపడ్డతరువాత వచ్చిచూడండి. ఒక్కకాయయినా వుంటుందేమో.

రా__యేమీ దొరక్కపోతే యేమిచేస్తారు?

స__మిమ్మను బాధపెట్టడం బాగుండలేదు. యేమి చేస్తారా, మడతకుడుములు తింటారు.

రా__అవేమిటీ?

స__అవి మీ రెప్పుడూ తినలేదు. అవి తింటే అజీర్తి పోతుంది. యేకాదశినాడు యివే తింటారు.

రా__నీవు హాస్యం చేస్తున్నావు.

స__హాస్యంగాదు. ఇది వాలుకల్లో పరాచకం. రోజూ పీనుగలు తగలవేసే మా వాండ్లకు పీనుగలంటే భ్రాంతమైపోతుంది: యీ దినపస్తులు నేను రోజూ చూస్తున్నవే. పస్తులుంటే దేవుడు మీకు పుణ్యమిస్తాడట. ఆ దేవుడు దినసస్తులుండే మాకెందుకిచ్చాడో__మరచిపోయినాం, మడతకుడుములంటే మాకే బాగా తెలుసును. అవి మాలమాదిగల కడుపులలోనే యెక్కువ వుంటవి. అన్నం బొత్తిగా లేనప్పుడు పడుకుంటే బాధ యెక్కువని అన్నపుతిత్తి మడతలు పడేటట్టుగా ముడిచిపెట్టుకొని పడుకుంటాం. యిది మేము కనపెట్టిన పిండివంట.

రా__ఈ స్థితిని తొలగించేదోవ యేమయినా వున్నదా?

స__నాకు వొక్కటే కనబడుతున్నది. నిర్గుణుడైన యీ దేవుణ్ణి పదభ్రష్టుని జేసి ఆ సైతానునైనా దెచ్చి కూర్చోబెట్టి దానిదోవన అదిపడివుంటే మనము బ్రతకవచ్చునని నమ్మకం.

రా__మళ్లీ సైతానెందుకు?

స__ఎవరూ లేకపోతే మరీ మంచిది.

రా__నామనసును ఆందోళన పెడుతున్నావు. నీమనసులో అంతకంటే యెక్కువగావుంది. యిక పోదాం పద.

---

## పదునాల్గవ అధ్యాయం

# సమిధెలు

సంగదాసు మనసు పరిపరివిధాల ఆలోచనలతో నిండియున్నది. రామానాయుడి యొక్క వుత్సాహం ఆశ్చర్యం కలిగించింది. త్వరగా దారి నడుస్తూ యేమో ఆలోచిస్తున్నాడు.

“నాయుడు గారికి మన విషయంలో సంపూర్ణమయిన అభిమానమున్నది. నిజంగా ఆయన పూనుకుంటే యెంత సహాయమైనా చేయగలడు. కాని ఆయన చేయువలసిన త్యాగంకూడా అత్యంతం. తండ్రికి ప్రతికక్షుడు నాయకుడు. అంములో పట్టుదల మనిషి. కొడుక్కి ఆస్తిలో నాలుగోభాగం పంచిపెట్టి కవిలెంతా అయపుతుంటాడేమో. ధన నష్టమేకాకుండా తండ్రికి ప్రతికక్షులో ప్రవేశించాడని లోకాపవాదం భరించాలె. రయితులు యెవరో సహధర్ములుదప్ప తక్కినవాండ్లు ఆయనకు వ్యతిరేక మవుతారు. ఆయన యెప్పుడూ కష్టపడ్డవాడు గాడు. యీ చిక్కులచేత వుత్సాహం తగ్గిపోతుందేమోనని భయంగావుంది.”

మాలపల్లెకు సమీపంలో వున్న కోమటింటి దగ్గరకు వచ్చాడు. కొత్త సుబ్బయ్య భార్య చంద్రమ్మ దుకాణంలో కూర్చున్నది. మాలపల్లె దుస్థితి మూర్తీభవించినట్లు అక్కడ కనబడ్డది. సంగదా సదివర కెప్పుడూ యీ దృశ్యం జూడలేదు. అక్కడ జరుగుతున్న సంభాషణవింటూ దూరంగా నిలుచున్నాడు.

చం___నీ కేమి కావలెనే వెంకి?

వెం___నాకొక దమ్మిడీది చింతపండూ, వొకదమ్మిడీది వుప్పూ, మిరపకాయలూ వొక దమ్మిడీది వుల్లిగడ్డ.

చం___తే, కాని దే. అవి దీసుకో.

వెం___వెయ్యవమ్మా యింకా కాస్త వుప్పు.

చం___ఊఁ ఇకపో. నీ కేమి కావలెనే ముత్తీ?

ము___నాకు అరగిద్దెటికి ఆముదం, వొకగిద్దెటికి వుప్పూ, అరగిద్దెటికి చిన వుల్లిపాయా.

చం___ఊఁ ఇట పట్టు.

ము___కాస్త బెల్లం కొసరు బెట్టవమ్మా.

చం___ఇకబో. నీ కేమిటే సత్తీ?

సం___ఈ పత్తి తీసుకొని బియ్యం మియ్యవమ్మా. అల్లుడు వచ్చాడు.

చం___ఇటబట్టు ఆపత్తి కేమిటే?

స___దీనికి వుప్పూ, మిరపకాయా. చింతపండూ పెట్టు.

చం___ఇన్ని యెట్లా వస్తవే. ఆకాస్తను.

సం___వచ్చినంతవరకే పెట్టవమ్మా.

నాగి___చంద్రమ్మా! నే నెంతసేపయిందమ్మా వచ్చి. నన్ను పంపవమ్మా.

చం___ఏమి గావలెనే?

నాగి___యీ గిద్దెడు గింజలకూ పొగాకు పెట్టు.

చం___అవి గిద్దెడున్నవీ ?

నాగి___నే గొలిచానూ.

చం___తీసుకో. తొందరపడితే యెట్లాగే. సత్తీ నీ బిడ్డిగోనే.

స___నోట్లోకి కాస్తవెయ్యవమ్మా. నోట లేదనే బదులు చేత లేదంటావనే నీ దుకాణానికి రావడం.

చం___ఇటుబట్లు. కాస్త పొద్దుగలగా రాగూడదూ.

స___కూలిగింజలు కొలిపించుకొంటిమి. యిట్లా వస్తిమి.

ఈవిధంగా బేరం నడుస్తున్నది యిటువంటి పరిస్థితులు చూచి తాను నాస్తికుణ్ణి అయిపోతానేమో నని భయం పుట్టింది.

"వీండ్లెట్లా సమ్మెగట్టడం. పూటపూటికి లేదు" అని సందేహించాడు. తన మనసు నిరాశ చెందకుండా మళ్ళీ ఆపుకున్నాడు. నురల ప్రయాణమైనాడు. చంద్రమ్మవాకిట్లో చూచినస్థితిని తమ యింటితో బోల్చి చూస్తే ఇల్లిఒంచి డిల్లీకి బోయినట్లుంది.

జోతి___అమ్మా! చిన్నన్న వచ్చాడే (అని కేక వేసింది.)

మా___లేగెత్తివచ్చి మా అయ్యను చూచి యెన్నాళ్లయిందమ్మా కండ్లు బోయినట్లుంది.

సంగ___నారంరోజులేకా ?

రా___(దొడ్లోనుంచి వచ్చి) చాలవూ నారంరోజులూ ?

సం___నిన్ననేకా నీవు చూచింది.

రా___పనిమేళ్ళా అక్కడికి రాబట్టి.

మా___మా అయ్య జొన్నబాల కంటుకున్నావమ్మా! యీపూట ఆరబాగా యిరగవు.

జోతి___అన్నా! మనకు బుజ్జాయి బుట్టింది.

సంగ___పెయ్యమాడేనా !

మా___కాదు. మాగాని దున్నేందుకు పుట్టింది.

సంగ___ఆంజోతీ! నీవు బాగా చదువుకుంటున్నావా ?

జోతి___ఆఁ నీవిచ్చిన పుస్తకమంతా అయింది. యింకొకటి తెచ్చిపెట్టు.

రా___వాకిట్లో మంచంమీద కూర్చుందాం రా. చల్లగాలిలో.

మా___కాసేపు కూర్చోనిస్తూ యిక్కడ. నిన్న నీవు చూచివచ్చావుగా.

సం___అప్పాయి బాగా సాగుతున్నాడే.

మా___చీ అట్లా అనకూడదమ్మా, దిష్టి తగులుతుంది. వాండ్లమ్మ లేవడంలేదు. మొ చేతిమీదా, కంఠమీదా యెవరో కొట్టారట. బుజం వాచి బ్రహ్మలోద్దయింది. పూర్లో మంగలివైద్యునికి చూపిస్తే లోపల యెముక విట్టింది. తనవల్ల కాదన్నాడట. మధ్యాహ్నంనుంచీ నీకోసం వొక్కమోయిన కలవరిస్తున్నది.

సం___యెవరు గొట్టారు ?

మా___యెవరో బసివిరెడ్డట.

సం___యెందుకూ ?

రా__మనకెర్మం. మాలమాదిగలై పుట్టినందుకు. చేనిగట్టుమీదిగా నడిచిందట. ఇగెవ్వడూ యిటు రావద్దని కొట్టి గడ్డి పూడదీసుకొన్నాడు. సరేన?

స__బాగా సేవుంది. నే వెల్లి చూచివస్తా అమెను. రారా బావా.

ఉభయులూ వెళ్లేరు.

మా__నీవు కోమటింటికి పోయి జొన్నబాల్లోకి కొంత బెల్లప్పాయ కొనక్కరా. యింట్లో నిండుకొన్నది. కొద్దిగా వుంటే పొద్దున అమ్మాయి వేసుకొన్నది.

రా__ఒక సవాసేరు తేనా?

మా__తీసుకరా లేనప్పుడు మరిగెత్తేదానికంటే.

రా__నాకు పట్టివే పోశావుకదా వొకమ్మగన్న బిడ్డననే.

మా__నే నొక్కదాన్నేకా మరి యిదాన్నిక్కడ. నేను తిన్నానో లేదో మీరు విచారించారా?

రా__నీవు తినకుండా మాకు పెట్టవచ్చావా అనుకొన్నాం.

మా__తినకుమాలిన ధర్మమా. నే తినే మీకు పెడుతున్నా. అబ్బాయి వచ్చే లోగా రా. చీకటిలో యెందుకు వంపేవని నా మీద కొప్పడుతాడు. దొడ్లో చెట్లపాదు పెట్టినందుకు వొక పొట్లకాయ కాసింది. కోసిచ్చిపో, తాలింపువేస్తా.

సంగదాసు మేనత్తయింటికి పోయినాడు. సుబ్బలక్ష్మి గుడిసెలో కుక్కిమంచం వేసుకొని పడుకున్నది.

సంగ__యేమత్తా! వొంట్లో యెట్లా వున్నది?

సు__నాయనా వచ్చావా? నీకోసమని యెదురు చూస్తున్నా. మోచేతిదగ్గర నుంచి గూడదాకా పర్వతాకారంగా వాచింది. వల్లమాలినపోటు. నేను బతకననే దిగులులేదు. అప్పుడు యేణ్ణర్థంవాడివై వుండగా మీమామ చచ్చాడు. అప్పటినుంచీ అష్ట కష్టాలుపడి పెంచా. చిటుక్కున వొక దెబ్బగొట్టి యెరగను. నాకడుపు నాకట్టుకొని కరువురోజుల్లోగూడా వాడికి మూడుపూటలా అన్నంబెట్టాను. నా యోజకేమో అంత్యానికి వచ్చినది. వాడిని నీవు చేయివదిలావంటే యెందుకూ గాకుండా బోతాడు. యీ దిక్కుమాలిన పక్షిని నీవొళ్లో వేస్తున్నా, మీఅమ్మ వకరివంటిది గాదు. జీతగాడని పేరేగాని యీ రెండేళ్లనుంచీ తనబిడ్డలలో వొకణ్ణిగా చూస్తున్నది. నీ చేతిలో బెట్టి దిగులులేకుండా వెళ్లిపోదామని కనిపెట్టుకొనివున్నా అప్పుడూ! యిట్లా నా మంచం మీద కూర్చో నాయనా. వట్టి అర్భకుడు. ఇగ అత్తనే అమ్మనుకో. చెడు సావాసాలు పోబోకు. సంగబావను దేవుడినిగా యెంచుకో,

అప్పుడు యేడుస్తున్నాడు

సు__యేడవద్దు నాయనా, యేడవవద్దు.

సంగదాసుకు కండ్లన నీళ్లు గిర్రున తిరిగినవి మీద చేయివేసి__

సంగ__అత్తా! అప్పుడికి వచ్చిన భయంలేదు. వాడికి మేము యే లోపంలేకుండా చేస్తాం. నీ విక్కడవుంటే లాభంలేదు. చీకటితో అయ్యనిచ్చి బండిలో ఆసుపత్రికి పంపిస్తాను. వాండ్లు యేదయినా వెంటనే పనిచేస్తారు.

సు__సరే కానియ్యి__యీ వూళ్లో మట్టెయ్యప్రాప్తంకూడా లేదుగావాలె. కళ్లం యెక్కడవుంటే అక్కడికి గొట్టుకొని బోతుంది. అప్పణ్ణి నాతో పంపు.

సం—అట్లాగే. మామా నీవూ పొండిరా. అత్తా! అన్నం తిన్నావా?

న—వొదినె ఇప్పుడే అన్నం పెట్టిపోయింది. రాత్రి అన్న యిక్కడే పడుకున్నాడు.

సం—నే వెళ్లివస్తాను.

న—సరే. అప్పుడెన అండవడబోకు.

సంగదాసూ, అప్పుడూ యింటికివచ్చి అంతా భోజనం చేశారు. సంగదాసు తండ్రిని గుంటూరు ప్రయాణంచేసి బ్రహ్మంగారి వేపచెట్టుదగ్గరకు వచ్చాడు. రంగదాసూ పున్నన్నా అక్కడ మాట్లాడుతున్నారు.

రం—యెప్పుడో సంగన్న వచ్చాడే. నీ విక్కడికి రావడం పొరుగూరినుంచి రావడంకంటే కష్టంగా వున్నది.

సం—యీపూటకే మామా. బాగావున్నావా?

రం—యెరగవూ మా బాగూ. యిట్లాగే వున్నాం యెండుతూ, వాడుతూ. మీ అయ్యకు కాలు విరిగిందేటే?

పు—వాండ్లయ్యకు విరగడం యెందుకు కాలు? నీకు విరక్క పోయిందీ కాలిబల్లపడి.

స—యెవరికీ విరగవద్దు. అంతా బాగానే వుండాం. అంతా అన్నాలు తినివుంటారా?

పు—అన్నాలూ. సగంమంది నిద్రబోయి వుంటారు? పొద్దుగూకంగానే యింత నాలికెకు రాచుకుండేదీ, దీపం మలిపి పడుకుండేదీ. కోతలకు పోయివచ్చిన వాండ్లు అన్నాలు వండుకుంటున్నారు.

ర—పున మాటలు విని చేరబారుతున్నారు.

సం—పున్నన్న యీ యేడు పెంకుటిల్లు వేస్తాడా?

పు—వీరదాసు మొదలుపెడితే నేనూ రెండోవాణ్ణిగా వుంటా.

వీ—ఇట్టి నాకరొకటిప్పించు. వీరదానుకూడా కడతాడు!

పు—తండ్రీ, కొడుకూ రు.౧౫౦ యీయేడు దిబ్బెంలో వేశారు.

వీ—నీవు లెక్కబెట్టావు.

పు—మీరిద్దరూ యెంతలేదన్నా నెలకు చెరి ఆరురూపాయలకు తాగేవాండ్లు. కాలిపనిలో మీ యిద్దరూ సంపాదించేడబ్బుకు తాగడమే లేకపోతే యిదిరవరకు వెండి గోడలు పెట్టించేవాండ్లు సంగన్న ధర్మాన యీయేడు మానారు. రూపాయలు కూడబెడుతున్నారు.

స—వీరమామా! మొదలుపెడతావా?

వీ—పెడుదును గాని పిల్లవాడు బండీ, యెద్దులుగొని రాళ్లబాడిగ సాగిస్తా నంటున్నాడు. దాంట్లో చాలా వఖా వుంటుందిలే.

సం—మళ్లీ మొదలుపెట్టరుగదా!

వీ—మా వాడు రూపాయిలు కూడబెట్టడంమరిగాడు. నీవు తాగమన్నా తాగడు

సం—మామా! యీయేడు మనం బావి తవ్వించుకుందామా?

రం—అట్లాగే కానియ్యి. అందరికీకావలసిందేగా. ఎవరికేమి వొద్దుతావో చెప్పు.

సం—మన పల్లెలో యెన్నిండ్లున్నవి?

పు—రెండు పెంకుటిండ్లూ, పదిపూరిండ్లూ, పద్దెనిమిది చుట్టుగుడిసెలూ అందరికీ యిండ్లక్రమాన వొడ్డితే యెట్లా?

న—అదెట్లా కుదుర్తుంది? రాళ్లతోలకం బండ్లున్నవాండ్లది. కట్టుబడి రాతిపనివాండ్లది. తవ్వకం తక్కినవాండ్లది. రాతిఖరీదు నా స్వంతాన యిస్తా.

ర—మేము రాతిపనికి జామువొద్దెక్కి పోతాం. తవ్వకం కాగానే నేనూ, నా పిల్లవాడూ పొద్దుటిపూట యావత్తుకట్టుబడీ చేస్తాం.

పు—సంగదాసు బండితోపాటు నాబండీ వచ్చేదే.

ర—యిక తవ్వకం మిగిలున్నది. యేడి మేస్త్రీ? దూరంగా కూర్చుంటావేమి?

నాయుడు—వింటూనేవున్నా. కూలి దొరకక కాళీగా వుండేవాండ్లు వస్తే తవ్వకం నే చేయిస్తా.

రా—పోతుమాల మీ ఆయ్యేగా. పంచిరోజు చూసి గద్దెత్తమను.

నా—తవ్వకానికి కూలి లేకపోయినా పోతు తప్పదు.

ర—మా బావ పోతుమాలను తీసుకో.

పు—సింబోతు వాళే వీరదానున్నాడు. అతణ్ని దీసుకో.

స—పనిలోనికి రాని సోమరిపోతును నే నిస్తా.

వీ—ఏదో వొకటిస్తురుగాని. మాదిగపల్లిలో ఆగుబ్బుగా చెప్పుకుంటున్నారు. కోతకూలిసంగతి సంగదాను యేమంటాడు?

పు—కోతకూలిసంగతేమిటి?

స—మునసబు గింజలు శేవు డబ్బులు యిస్తాను తీసుకోం డన్నాడుట.

పు—యేదైతేనేమి?

స—యెంత యిస్తానన్నాడు?

వీ—ఆ తప్సీలు నాకు బాగా తెలియదు. నీవు వొచ్చావని విని వాండ్లిక్కడికే రావా లనుకుంటున్నారు. కేక వెయ్యండి.

ర—వాండ్లలో పెద్దింటివాడు. ముత్తడు; వాడిని పిలవండి.

వీ—తలమాదిగెను పిలిస్తే అంతా వస్తారు. వొరే ముత్తా! సంగన్న పిలుస్తున్నాడు. అంతా రండి.

సం—యేమోయి ముత్తన్నా! యేమికధ?

ముత్తడు—ఏమికధవున్నదీ. బతికే కథ గాదు. చచ్చేకథ. మునసబు కోతకూలికి గింజలు యియ్యడట. డబ్బిస్తాట్ట.

స—యెంత యిస్తానన్నాడు?

ము—రోజుకు పావలాట. అది మామూలుకూలట.

స—రూపాయికి పన్నెండుమానికలు జొన్నలిచ్చేటప్పుడు కూలి పావలా. ఆప్రకారం అయితే యిప్పటిధరప్రకారం కూలి రూపాయికి దాకొంటుంది.

ర—డబ్బులు కట్టు కేమి? చేదా? యిప్పటిధరకట్టి యిప్పమనండి మనమే కొనుక్కుందాం.

మ—అట్లా యియ్యడుట. అదీ వాయించాం.

స—తాను యిప్పటి ధర్మప్రకారం అన్ని రూపాయిలు తీసుకోవడంలేద ?

పు—అది వాండ్లసొమ్ము.

స—చాకిరీ కూలివాండ్లసొమ్ము. భూమి రైతుసొమ్ము. జేనిధర దానికుండాలె. తన పదార్థానికి తాను యెక్కువధర తెచ్చుకుంటున్నప్పుడు అవరవడిన కూలివాడి పదార్థానికి వెల హెచ్చవద్దా?

మ—చాకిరీ నీళ్లకూలికి పోవలిసిందే?

స—ఆసామికి పండే ధాన్యాన్ని బట్టి చూస్తే ఆడ్డెడుగింజలు చాలా తక్కువ కూలి. యిప్పుడు అదీగూడా తగ్గించవలెనని చూస్తున్నారు. వూళ్లో అంతా యిచ్చే ప్రకారం యియ్యాలని మీ రడగండి.

మ—ఆ మాటంటే అన్నివూళ్లల్లో వొకటే కట్టుబడి చేస్తారన్నాడు

సం—మరికూలి తీసుకున్నారా?

మ—ఇంకా లేదు. యిప్పటి ధరల ప్రకారం పావలాకు మానెడు జొన్నలు కూడా రావుగా.

స—ఏమి చేతామని మీ వుద్దేశం?

మ—అంతా ఆలోచించండి.

వీ—ఆలోచనేమిటి? కోతలకు పోద్దు. యెట్లా కోసుకుంటారో చూతాం.

ర—ఇదివరకే మనపని వానాకాలం పచ్చి, యెండాకాలం యెచ్చీగా వుంది. పావలామాటుకు వారికి నష్టం యెందుకూ? పని మానుకొని వాండ్లకు నష్టపెట్టనూవద్దు. వాండ్లనే బాగుపడనీయండీ. చచ్చేవాండ్లం యెట్లాగూచస్తాం. వూరికే పనిచేసిరండి.

వీ—మనం వూరికే చావం, అంతా మనవెంబడివాండ్లే. అన్నం దిక్కుండా యీరోజు కోస్తావు, రేపుకూడా కొయ్యగలవా ? మనకు సరీగా కూలిస్తే వాండ్లు చెడిపోతా మనుకొంటున్నారుగాని దాని విలువ వాండ్లకు కనపడిలేకుతుండి.

పు—యెక్కువ కూలిచ్చారని యెక్కువపని చేస్తారా ?

ర—యెక్కువ కూలిస్తే యెక్కువ తింటాం. సత్తు యెక్కువౌతుంది. యెక్కువ పనిచేస్తాం. పస్తుపడుకొని వొకమోపెత్తూ చూతాం. కడుపులో యెత్తులేకపోతే వొక మాటు మెసేది రెండుమాట్లు మోస్తాం. అందువల్ల వాండ్లకు పనిజాగు. మనకు కూలీ నష్టమే ?

మా—వీరదాసు చెప్పింది నిజమే. కూలివాడికి అర్ధన్నం పెడితే ఆసామికి శ్రేయస్సుకాదు. పనిచేసి కూలితీసుకోకుండా వస్తే ఆసామికి మనమీద జాలా? జాలే వుంటె యీ కథంతా యెందుకు? గొర్రె కొవ్వేందల్లా గొల్లవాడికే మేలంటారు,

స—యిప్పుడు రెండుమార్గాలు చెప్పారు. రంగదాసు చెప్పింది ధర్మమార్గం. ఆమార్గం మనమంతా అవలంబించగలిగితే కూలీలు ధర్మమార్గ మవలంబించినవాండ్లవు తారు. రైతులుకూడా కూలీలను చూచైనా ధర్మమార్గానికి రావచ్చు. వీరదాసుమార్గం వీరమార్గం. దాంట్లో తప్పులేదు. రైతులకు పైర్లు కోసిపెట్టవలసిన బాధ్యత మీకులేదు. మీకు గిట్టితే కోస్తారు. లేకపోతే మానుతారు. యిదికూడా ధర్మమే. వీరధర్మం.

పు—తెగచెప్పరేదే.

స—ధర్మసందేహం, సూక్ష్మభేద మున్నది.

వీ___కొంత రదీ, మరికొంద రిదీ అవలంబించడానికి వీలులేదు. వీరధర్మ మవలంబించి కొందరు సమ్మె కట్టినప్పుడు సధర్మం అవలంబించి కొందరు కోతలకుపోతే మార్గం చెడుతుంది.

స___మీ అందరిఅభిప్రాయ మేమిటి?

వీ___రంగదాసు చెప్పింది అందరూ అవలంబించడం కష్టం. దానికి క్రమంగా పోవచ్చు. వీరధర్మం త్వరగా అర్ధమవుతుంది. అందరమూ అదే ప్రారంభించి చూతాం. నీవు యెట్లయినా బుద్ధిమంతుడవు. ఆలోచించి చెప్పు.

స___ఇప్పుడు మిగిలిపోయేది ఏమీలేదు. నిదానంగా ఆలోచింతాం. యితర వూళ్లల్లో పెద్ద లేమాలోచిస్తారో కనుక్కుందాం.

వీ___ఇతర పల్లెలవాండ్లకు మనపల్లె యెట్లా పోతుందో ఆదారికే వస్తారు.

స___వూళ్లో కూలీల అభిప్రాయ మేమిటో ?

మా___బలిజ శేషయ్య సమ్మె కడదా మంటున్నాడు. ఆయన చాలినవాడు. తక్కినవాండ్లు ఆయనను కాదనరు.

స___జనులు వీరధర్మమే అవలంబించేటట్టున్నారు, యిప్పటి ఉద్రేకంజూస్తే. రేపు చౌదరయ్యగారి చేనికి కొందరుకూలీలు రండి. వారు ఏమార్గానికి వచ్చేదీ తెలుస్తుంది. మునసబుగారి చేనికి వెళ్లినవాళ్లంతా వస్తే బాగుంటుంది. వారిద్దరికీ రాజీ కుదురుతున్నట్లున్నది.

వీ___ఇది వొక మాటే. కానియ్యండీ.

అందరూ లేచి యిండ్లకు వెళ్లారు.

---

## పదునైదవ అధ్యాయము

## కోతలు

సంగదాసు ఊరమంతేచి కొల్లాయిలుతీర్చుకొని కూలివాండ్లకు కోతకు రమ్మనమని కబురంపించి తాటి పాపయ్యతో మాట్లాడి మునసబుగారింటికి వచ్చాడు.

స___మునసబుగారూ! ఏమి విశేషాలు?

ము___నీవు యెటుండేవాడవు ?

స___సంగతి చెప్పందే యెటుంటావని అడిగితే?

ము___నీవు జాడలు తీయకుండా వున్నావు? చంకబిడ్డను జారదీసేవాడివి.

ర___సంగతులు చెప్పి తరువాత పెట్టవలసినవి వుంటే పెట్టండి.

ము___చౌదరయ్యగారు వస్తారుగా ?

స___జొన్నకోతకు యివ్వాళ రమ్మని నూరుగురు కూలివాండ్లకు చెప్పా. ఇప్పుడు నన్ను ఏమిచెయ్యమంటారు?

ము___నిన్న మాకు యీరాత్రేమంచిదోరికేవరకు గగనమైందే! నూరుగురు నీకెక్కడ దొరికారు? చట్రాత నాగదీస్తావుగదా.

స___గడబిడలుగా వున్నవి. గబామనేసరకు యీవత్తూ కోయించివేయవలెనని చూస్తున్నా. ఈరోజు యెవరికి కోతలు లేవటగా?

ము__మాచేలు కోత లేకేమి. యింకా నాలుగైదు రోజులపని వుంటే.

స__కూలివాండ్లనందరినీ యింకా నాలుగురోజులు మీరు ఆకట్టుకొనికూర్చుంటే మాచేలు ఏమిగావాలె?

ము__కూలివాండ్లు దొరకని చౌదరయ్య యెత్తిన ఎత్తాయేమిటి?

స__సంగతేమిటో చెప్పకుండానన్నడిగితే ఏం చెప్పేది?

ము__ఏమిటి కష్టంవచ్చినాసరే పట్టుపట్టి కూలితగ్గించవలెనని అక్కడ ఆకోతలూను యిక్కడ పూరికూలీలందరిని బెట్టి యీకోతలూనా? నాకెందుకు యీ అసవాదంతా.

స__నాకూ ఎవరూ ఏమీ చెప్పలేదు. మామూలుగా కోయిస్తున్నా. మీతో ఏమన్నా చెప్పారేమోనని అడగడానికి వచ్చా.

ము__సాయంత్రంలోగా పూర్తిచేయిస్తావా ఏమిటి?

స__నాలుగోవంతుకూడా కాదు.

ము__ఈచౌదరయ్యతో నేను ఏది పెట్టుకోను. ఆచిన్నపరెడ్డిచేత పిలిపించి యిరికించాడు.

స__మీరు దీర్ఘకోపం లేనివారు. యితరులు చేసినతప్పులు మరిచిపోవడం సత్పురుషుల లక్షణం

ము__నీవు పూసి పెట్టి మాట్లాడుతున్నావుగాని మీచౌదరయ్య చేసినద్రోహం నేను మరచిపోను. మాయింట్లోవాండ్లంతా అతనితో స్నేహమేమిటని నన్ను దుయ్యపట్టుకున్నారు.

స__నేను సెలవుపుచ్చుకుంటా.

ము__జవాబు చెప్పవేమి? మాకూలీలను విడిచిపెట్టిపో.

స__అది వాండ్ల యిష్టం

ము__అరే బసివిరెడ్డి! నీవు పోయి మన కూలీలందరినీ కొట్టకరా. మామూలు ప్రకారం నిన్నటికూలీగూడా: లిపి వాండ్లు కావలెనంటె యింకా నాలుగురోజులు కూలిమాబాదలాగా యిచ్చి కోత సాగించు

స__మేము ఈరోజు మాట్లాడుకుంటిమిగదా, మీ కెట్లా వస్తారు?

ము__చూస్తాం మీరు మాట్లాడుకోవడం ఏమిటో?

స__మీతో నాకు వాదం ఎందుకు?

అని మునసబుగారు కూలీలు కావలెనంటే నాలుగురోజులకూలి ముందుగా తీసుకొని వెళ్లండని మాదిగపల్లెకు కబురంపి రామానాయుడిదగ్గరకు వెళ్లాడు

రా__ఏమి దాసూ! కబుర్లేమి?

స__అవసరంవస్తే కూలీలంతా సమ్మెకట్టడానికి సిద్ధంగా వున్నారు. మునసబు అక్కడ రెడ్డితో మాటయిచ్చి వచ్చాడుగాని యింట్లో వత్తిడి తగిలినట్లున్నది. ఇప్పటికి చెదిరిపోయినట్లే కనబడుతున్నాడు. పాలయ్యకు వ్రాసిన వుత్తరంలో ఏమీలేదు.

రా__మనము బయలుదేరుదామా?__పిలువు. పాలుతాగి సిద్ధంగావుంటా.

సం__పాలుతాగే నుకుమారులు జొన్నకోత కోస్తారట. మీరు నామాట విని భోజనముచేసి బయలుదేరండి. కాకపోతే పదిగంటలకే అన్నం వచ్చే ఏర్పాటుచేయండి,

రా—కాదు. అందరితో కలిసి రెండు జాములకే తినాలె, నలుగురిమోస్తరుగా నేనూ భోజనంచేసే బయలుదేరుతా, కూర్చోని మాట్లాడుదాం రా. యెప్పుడూ పొలంలోకి అడుగు పెట్టవేమి? నియమమా,

సం—కిందికిబోయి కూలివాండ్లకోసం మనుష్యులను పంపాలె, అనికె మాట్లాడుదాం,

రా—అయితే నేను అన్నం దింటా. నీవుకూడా త్వరగా తిను.

కూలీలు మూతాలుగా కొడవండ్లూ, కూటిముతలు తీసుకొని బయలుదేరుతున్నారు. రామనాయుడూ, సంగదాసూ వొక గుంపుతో వున్నారు. రామనాయుడు ముదుగు గుడ్డలు వేసుకొని చెప్పులు తొడుక్కున్నాడు. రాత్రి సంగదాసుతో మాట్లాడినతరువాత కూలీలసంగతులు పూర్తిగా విచారించవలెనని అభిలాషగలిగింది. మొదట కూలీలకంటె ముందు నడిచాడు కాని కొంతదూరం పోయినతరువాత వెనుకబడ్డాడు. ఆడ కూలీలుకూడా త్వరగానే నడుస్తున్నారే అనుకున్నాడు.

సం—శేషయ్యా! నీవు మునసబుగారి చేనికి పోలేదా?

శేషయ్య—మళ్లీ పిలవడానికి ఆయనకు సిగ్గులేకపోతే పోవడానికి నాకైనా వుండవద్దూ? మాముఠాలో వొక్కరూ పోలేదు. నిన్నటికూలి వొకమనిషిని పంపించి తెప్పించుకొన్నాం.

రా—మామూలు కూలేనా?

శే—నాలుగురోజులకూలి మొబావలాగా యిచ్చాడు ఇప్పటికైనా కూలీలు పనిమంది మాదిగలుమాత్రం పోయినారు. తక్కినవాండ్లంతా మీకే వస్తున్నారు. ఆయన యెట్టిగా వుంది.

సం—మునుములను కొత్తపద్ధతిగా యివ్వనంటావా? పాతపద్ధతిగా యివ్వమంటావా?

శే—ఇన్నిపద్ధతులు మాకు దెలియవు మేమెరిగింది వొకటేపద్ధతి.

సం—చివరకు తగాదా పెడతావా?

శే—అన్నిటికి మీరే ఉన్నారు.

సం—తగాదాకు కూడానా. చౌదరయ్యగారు యీయనంటే నా సొంతాన పెట్టుకోను.

శే—ఈయనంటే రేపటినుంచి బంద. దాని ఒకటి హేర్పడే వున్నది.

రా—ద్వంద్వయుద్ధం జరిగేటట్టుగా యున్నదే.

సం—రెండుసేనలూ తయారవుతున్నవి.

శే—జయమెటవుతుందో?

రా—న్యాయమెటుంటే అటు.

శే—అయితే మాదే.

కూలీలందరు చేనిదగ్గరకు పోయి దుత్తలు కుంటగట్టునబెట్టి మునుములుబట్టి కొయ్యడం ఆరంభించారు. రామనాయుడూ, సంగదాసు చివరపట్టెలు తీసుకొన్నారు. రామనాయుడు కొడవలి బట్టుకొని కోస్తే తెగదా అని మొదట అనుకొన్నాడు. కాని వాలు గుపగలేదు. పంతులుకలం బట్టించడంకంటె గొడవలిబట్టుకోడం యొక్కువ

కష్టంగా కనబడ్డది. ఎదటివాండ్లు పట్టుకోవడంచూచి అలవాటు చేసుకున్నాను: కానేపు కోసేవరకు బాగా చెయ్యితిరిగింది. మరి కొంతసేపటికి నొప్పిపుట్టింది. కలంతో వ్రాస్తేనే నొప్పిపుడుతుంది. ఇంతలావు కొడవలితో కోస్తే నొప్పిపుట్టదా అనుకొన్నాడు కొడవలి పట్టుకోవడంకంటె దంటు కట్టలు గట్టడం ఎక్కువచిక్కుగా వున్నది. ముడి వేయకుండా దంటు మెలిడిప్పి విడిపిస్తే కట్ట ఎట్లా నిలుస్తుందని ఆశ్చర్యపడ్డాడు. రెండు కట్టలుకట్టి పడవేస్తే బాగానే నిల్చినవి. కొంతసేపు అయ్యేవరకు కొడవలి ఒత్తుకొని వేలు బొబ్బ పోయింది. దంటు మెలిపెట్టడంవల్ల యీ నెలు బొటనవేలు కోసుకొన్నవి. యెవరితోను చెప్పలేదు. మునుము పూర్తి అయింది. సంగదాసు సందిగ్ధంలో పడ్డాడు. కోసినకట్టలు మేడాలువేయించక వోదెలు ఆరేటందుకు చేనిమీదనే ఉంచితే మర్నాడు కూలీలు సమ్మెకట్టవలసివస్తే తన యజమానికి నష్టం చేసినవాడినవుతానేమో అని సందేహం. ఆకాశం కావురు గప్పింది. తూర్పున మబ్బేలింది. వాన కురిస్తే కంకులు మట్టగొట్టుకుంటవి. యిద్దరుకూలీలను ఎప్పటివప్పుడు మేడాలు వెయ్యమని యేర్పాటు చేశాడు. రెండవమునుము ప్రారంభించారు. రామానాయుడికి అలుపువచ్చింది. సంగదానువంకచూస్తే తక్కినకూలీలకంటె వొకడుగుముందుండి వాండ్లను సెలకట్టనీయకుండ కోస్తున్నాడు. యితడు అన్నిటికీ సమర్థుడుగానే ఉన్నాడే అని రామానాయుడు ఆశ్చర్యపడ్డాడు. సంగదాసు స్నేహితుడి అవసగమనించలేదు. రామానాయుడు రెండవ మునుము ప్రారంభించాడు. చివరదాకా లాగాడు. వొక బొబ్బ పగిలింది. రెండుచుట్లకె ప్రొద్దున నంజిన అన్నమరిగిపోయింది. అన్నం వచ్చేవరకు ఆలస్యమవుతుందేమో ననుకొన్నాడు. మూడవ మునుము ప్రారంభించేవరకు కూలీలకూడ తలాయించడం ప్రారంభించారు. మొదటి ఉరవడి తగ్గింది అందువల్ల ఆయనకుకూడ కొంత విశ్రాంతి చిక్కింది సంగదాసు మొదటిపట్టు సళ్లినా వూపిరి సలపకుండా కోయిస్తునే వున్నాడు. రామానాయుడికి తన పట్టెలో చిన్న దోసపండు దొరకింది. అదికోసి కొరకితింటే దిల్ ఘసంసుకంటె తియ్యగావుంది. కాని ఆకలితీరలేదు రెండుజాములు కావచ్చింది. కావురువిచ్చిపోయి యెండ చిటపటలాడింది. యింటినుంచి తనకు వెండిగిన్నెలో అన్నం రావడంచూశాడు. "కాస్తే తెచ్చినట్లున్నారు. చాలుతుందా" అనుకున్నాడు. అక్కలక్ష్మి కుంటగట్టుకుపోయి గిన్నె పెట్టుకొని కూర్చున్నది. రామానాయుడుకి యీకూలీలు యేవాళకు అన్నానికి పోరేమని అనిపించింది. మునుము పూర్తికాంగానే సంగదాసు అన్నం వచ్చింది భోజనం చెయ్యండన్నాడు. అందరు బయలుదేరారు. రామానాయుడికి వొళ్లు చమటబోసి తోపయింది స్నానంచేస్తె బాగుండు ననుకున్నాడు గాని అంగవస్త్రమూ తువాలా లేవని ఊరుకున్నాడు. కొంచెం గాలిదోలేవరకు చెమట ఆరి చొక్కా లోపల చల్లబడి హాయిగావుంది. స్నానం అవసరమైనట్లు కనబడలేదు. అందరు యెడమచేతిలో అన్నపుముద్దబెట్టుకొని కుడిచేతితో తింటూంటే తమాషాగా కనబడ్డది. తానట్లాతినడం బాగుండదనివూరుకున్నాడు ఆకలి రెపరెపలాడడం చేత తెచ్చిన అన్నం నిమిషంలో అయిపోయింది. అంతా చేతులు కడుక్కొని చుట్టలు గాల్చి మళ్లీ పని ప్రారంభించారు. రామానాయుడు చుట్టలుకాల్చడం చూస్తూ జమ్మిచెట్టుకింద కూర్చొని సొమ్మసిలి వుత్తరీయం తలకింద బెట్టుకొని తాను పొలమువచ్చిన సంగతికూడ మరచిపోయి నిద్రబోయినాడు. సంగదాసు యేదో సంగతి అడగవలెనని వచ్చి పలకరించాడు.

కాని జవాబులేదు. అంతట అక్కలక్ష్మిని యింటికి పొమ్మని సంగదాసు కోతలోకి పోయినాడు.

పొద్దు దిరిగింది. రామానాయుడుమీదికి యెండ వచ్చింది. మెళుకువ రాలేదు. మూడుజాములు పయినయింది. వొళ్లువిరిచిలేచి కూర్చున్నాడు. ఆనందసముద్రములో నుంచి పైకి తెప్పతేలినట్లు కనబడ్డది. తాను యెక్కడఉన్నదీ తోచలేదు. చేనివంక చూచేవరకు కూలీలు కోస్తున్న చప్పుడు వినబడ్డది. అప్పుడు వెనుకటి సంగతి జ్ఞాపకం వచ్చింది వీండ్లప్పుడే కోత మొదలు బెట్టారే అని కొడవలి తీసుకొన్నాడు. కొడవలి కాలి చుర్రుమన్నది. కొంచెం చల్లబడ్డతరువాత పోదామని అనుకున్నాడు. పొద్దువంక చూచేవరకు చాలాసేపు నిద్రబోయినట్లు కనబడ్డది. లేచి చూచేవరకు రెండుమూడు మునుములు యెక్కువ కోశారు. రామానాయుడు నిద్రలేచిన సడికని పెట్టి సంగదాసు తన మునుము పక్కవాండ్లకు గలిపి కుంటదగ్గరకు వచ్చాడు.

సం___చాలసేపు నిద్రబోయినట్లున్నదే.

రా___నాకేమీ తెలియదు.

సం___కథ యెట్లా వున్నది?

రా___కొత్త ప్రపంచంలో తెచ్చిపెట్టావు. యీ లోకంలో మూడుగంటలకు యేమీ ఫలహారములు లేవా?

సం___మా లోకంలో అసలు ఫలహారాలే లేవు. అయితే నిజమైన ఫలాహారాలను తెచ్చిపెట్టగలను. దోసఫలాలు పయిస్తనా?

రా___పాతిక కాయలు తెచ్చి యిట్లాపడవెయ్యి.

సం___పాతిక కాయలే!

రా___పాతిక దోసచెట్లుకూడా సమూలంగా తింటా.

సంగదాను నాలుగుకాయలు తెచ్చియిచ్చాడు

రా___మాచేతోవేగా. యింకా తీసుకురా.

సం___అవి కానియ్యండి తెస్తా.

రా___రెండుకాయలు తినేవరకు పండ్లు పులిసినవి.

రా___దాసూ! దోసకాయలు పండ్లు పులుస్తవా యేమి? నాకిక నోరుపట్టదు. యెట్లా యీ ఆకలి?

సం___యింటికిపోయి ఫలహారం చేస్తారా?

రా___అక్కడికి యీ శరీరాన్ని మోసుకపోయేదెట్లా?

సం___ఫలహారం త్వరగా తెప్పించనా?

రా___అందాకా నిలిస్తేకద?

సం___పూచబియ్యం కొట్టిపెట్టనా?

రా___తినేవి యేమయినా సరే తీసుకరా. ధ్వంసం చేస్తాను.

సంగదాసు కొనకంకి విరిచి పూచబియ్యం కొట్టిపెట్టాడు.

రా___కొట్టవోయ్, యింకొకకంకి. పోయేటప్పుడు కట్టుకుపోతావా? పీనాసి లాగున్నావే?

సం___అవి తినేవరకు కొట్టలేనా?

రా—ఒండ్లునొప్పేమి?

సం—పులిసినవంటిరిగిదా. తియ్యనిపూచబియ్యం తింటే పులవడం పోతుంది.

రా—ఇప్పుడు బాగా నములుతున్నాకాని నాకు దవడలు నొప్పిపట్టుతున్నవి. యెందుకీపాడుశరీరాలు? వాండ్లుజూడు రాళ్లవలె పనిచేస్తున్నారు,

సం—దానికేం? యెవరుచేసేపని వాండ్లుచేస్తారు.

రా—నీవందరు చేసేపనులు చేస్తావే? కాస్సస్థిమితపడ్డదిగాని మంచినీళ్లు కాసిని తెచ్చిపెట్టు.

సం—మీరుపోయి తాగుదురూ. ఆ కూలివాండ్లు చూస్తే అల్లరిచేస్తారు.

రా—యేమి చేస్తే? యింట్లోనుంచి వెళ్లగొడతారు. దానికి సిద్ధమయ్యే కూర్చుంటిని. మీ యింటికి రానిస్తావా? నేనే తాగివస్తాలే

సం—నే నొక సంగతి అడుగుతా చెప్పండి. ఆకలంటే యేమిటో తెలిసిందా?

రా—ఆకలంటే యెక్కడ ప్రారంభిస్తుందో యెక్కడికి యెక్కుతుందో ఎంత వరకు వ్యాపిస్తుందో, అప్పుడు శరీర మేస్థితిలో వుంటుందో నాలుగు పర్వాలకింద వొక భారతం వ్రాస్తా.

సం—మీకింత ఆకలెందుకు కక్కువయింది?

రా—పొద్దున పనిచేయబట్టి.

సం—పొద్దుగూకులూ పనిచేసేవాండ్లకు ఎంత ఆకలి వుంటుందో యోచించుకోండి. మడతకుడుము లంటే కూడా యేమిటో తెలిసిందా?

రా—అవి అనుభవంలోనికి రాలేదే.

సం—మీరీపూట దోసకాయలూ పూచబియ్యం తినకుండా యీ రాత్రి పూరికే పడుకుంటే అప్పుడు మీకు మడతకుడుములంటే యేమిటో బోధపడుతుంది.

రా—కూలీలంతా మూడుగంటలకు దోసకాయలూ పూచబియ్యం ఫలహారము చేయరా?

సం—యజమానుడు చూస్తె ముల్లుగఱ్ఱలు విరుగుతవి.

రా—కొట్టడం నేరంకాదా?

సం—బీదవాండ్లను కొడితేకాదు. మునసబుగారి గట్టుమీదిగా నడిచినందుకు నాలుగురోజులనాడు మా మేనత్తను కొడితే ఆమె చావుకు సిద్ధంగావుంది. పొద్దున గుంటూరు అనుపత్రికి పంపించా.

రా—పాపం ఆమెకు ఎట్లావుంటుందో?

సం—ఎట్లా అయితే నేమి? బీదవాండ్ల ప్రాణాలకు విలువలేదు.

రా—బావా! నా కిదంతా కొత్త ప్రపంచంగా వుంది. నీవు చెప్పే సంగతులన్నీ కొత్తవే. యిదివరకు నా జీవితమంతా వృధాగా గడిచిపోయింది ప్రపంచ పరిస్థితులు యథార్థంగా తెలియవు.

సం—మీ జీవితమంతా భగవత్సేవకు మొదుగట్టారు గదా. మానవసేవే భగవంతుని సేవ.

రా—నిశ్చయం, మా నాయనగారు వచ్చి వుంటారేమో? యీరోజు కూలి విషయం తగాదాలోకి వస్తుందా?

సం—వచ్చారని తెలిసింది, మానసబును దూషిస్తూ తక్కిన ఆసాములతో ఆలోచిస్తున్నారట. వూళ్లో రెండుపార్టీలు పడేటట్టుగా వుందట.

రా—కొంపెరయినా ధర్మపక్షాన నిలబడితే మంచిదే.

సం—వాండ్లు ధర్మంకోసం వచ్చేవాండ్లు కారు. బసివిరెడ్డి మీ నాయనగారి మీద కక్షచేత పార్టీ నిలవదీస్తున్నాడు. దీనివల్ల కొంత తాత్కాలిక లాభం వున్నప్పటికీ వీరు వుద్యమాన్ని నిర్వహించలేరు. ధర్మకవచమును ధరించిన మీబోటివారే సాధనోపాయముల తారతమ్యముల గుర్తెరిగి నడిపించవలసి వుంటుంది.

రా—దాసూ! నీముందు నే నెంతవాడిని, నీ చాటున నిల్చి పనిచేయడానికి సిద్ధంగా వున్నా.

సం—యిది మనకు మామూలేకదా. మనను యితరులెవరూ పొగడకపోయినా మనమైనా పొగుడుకుందాం.

రా—దాసూ! నాదొక ప్రార్థన వుంది.

సం—యిదేమి యిలా సాగించారు. దయచేసి అనుజ్ఞ యివ్వండి.

రా—అంగీకరిస్తానంటే చెపుతా.

సం—ఏమిటో చెప్పండేనా?

రా—నామీదంత నమ్మకం లేదా?

సం—అనక విధిలేదా? చెప్పండి:

రా—అంగీకరిస్తావా?

సం—తప్పదంటిరిగా.

రా—మన వుభయులకుగల ప్రేమరస పానీయములలో అడ్డపుల్లలుగా వున్న మర్యాదా వాచకములను ఉపయోగించవద్దు.

సం—ప్రతిబంధకములు చాలా వుంటవి.

రా—ప్రతిబంధకముల కేమి?

సం—మన వుభయులు మాత్రమే మాట్లాడుతున్నప్పుడు వుపయోగించనులే.

రా—సాయంత్రపు వ్యవహారం యేమిటి?

సం—మీ నాయనగారు ప్రతిపక్షనాయకులలో వొకరుగా వున్నట్లు కనబడుతుంది. వారితో విషయం పూర్తిగా చర్చిస్తె బాగుండును.

రా—మనకు న్యాయమని తోచింది. వారికి మాత్రం యేల తోచదు?

సం—అట్లా అనడానికి వీలులేదు. వొకవేళ తోచినా స్వలాభ విషయంకదా. అయినా మనం యీపూట ముందుగా పోయి మాట్లాడితే బాగుంటుంది.

రా—నేను వూరికే దగ్గర వుంటా.

సం—బయలుదేరండి మీరందరూ. యిప్పుడు మొదలుపెట్టిన మునుము పూర్తి చేసి రాండి.

వుభయులూ బయలుదేరారు.

రా—నాకు కాళ్లు వత్తులవలె మడతలు పడుతున్నవి.

సం—కడుపులో యెత్తులేక. అన్నము లేని వాండ్లు యేమిపని చేస్తారు?

రా—పనివాడికి కడుపునిండా కూలి యివ్వండి పని చేయలేరని యజమానులు

యెప్పుడు గ్రహిస్తారో స్వలాభాన్నిబట్టి చూచినా కూలితగ్గించడం చివరకు యజమానులకు కూడా నష్టమే.

సం—మనుష్యులకు దూరాలోచన తక్కువ. తాత్కాలిక లాభమే చూస్తుంటారు.

రా—యింటికి యెంతలో వచ్చాం.

సం—దారికి నిచ్చెనవేసిమిగ్గా యేదో వొక కథ సాగింది. మీ నాయనగారు తన గదిలో కూర్చున్నారు. నీవు నీళ్లుపోసుకొని త్వరగా ఫలహారం చేసిరా.

---

## పదునాఱవ అధ్యాయం

# సాహుకారు

నల్లమోతువారిది చాలాప్రశస్తమైన కుటుంబం. గుంటూరుజిల్లాలో యీయింటిపేరటివారు యెక్కడవున్నా అన్నవస్త్రాలకు లోపంలేకుండా మర్యాదగా జీవిస్తూ పౌరుషవంతులని ప్రకాస్తి గలిగివున్నారు. నల్లమోతువారిసొమ్ము మేడిమొల్చిందాకా వదలదని ఐతిహ్యమున్నది. పూర్వం కంపెనీప్రభుత్వంలో శిస్తు లెక్కవకట్టినప్పుడు నాదెళ్ల తిమ్మాపురములలోని నల్లమోతువారు సుప్రసిద్ధవీరుడైన నల్లమోతు రామన్న చౌదరిగారి నాయకత్వంకింద తిరగబడి దేశములో పన్నులియ్యకుండ జేసి వ్యవసాయం మాన్పించి చేలోగట్టివున్న నాగండ్లూ, మేళ్లు అక్కడనే విడిచిపెట్టి తిప్పి నాటిన మేడి నాటుకొని చిగిర్చేవరకూ అనగా బహుకాలం సమ్మె కొనసాగించినట్లు చెప్పుకొంటారు. చౌదరయ్యగారి కుటుంబం పూర్వంనుంచి తండుబంగలది. తండ్రి చనిపోయేటప్పుడు వీరికుటుంబానికి రెండువందల యెకరాలుపల్లం నూరుయెకరాల మెట్టా వుండేది. చౌదరయ్య సీగయెగ్గట్టి పెత్తనానికి వచ్చినప్పటినుంచీ చౌకధరలో కొనీ బాకీలకింద కట్టుకొని కోర్టుపేలంలలో కొట్టివేయించుకొని యిప్పటికి అయిదువందలయెకరాల పల్లం, మూడువందలయెకరాల మెట్టా సంపాదించి మూడులక్షలవరకూ కవిలె పెంచాడు. మంగళాపురంలోని తూర్పుబజారులో పడమటిశ్రేణియందున్న విశాలమైన ఆవరణంలో యెత్తయిన భవంతీ పురాతనపు పాటిప్రహరీగోడలమీద వేసిన పశువుల కొట్టములూ ఉండేవి. చౌదరయ్య హయాంలో కాపురంవున్న యింటికి యెదురుగా తూర్పుశ్రేణిలో వున్న వొక పెద్ద బ్రాహ్మణసంసారం చితికితే పారియిండ్లూ, దడిమాలిన ఆవరణం, దానికి ఆనుకొని తూర్పుగావున్న పదహారుఎకరాలపొలం దామాషాగా తనబాకీకింద కట్టుకొని అక్కడవిశాలములైన కొట్టములు వేయించి ఆపొలంలోవి పద్ధాలుగు యెకరాలు పాడిపశువులకని వూరిదగ్గర బీడుగా వుంచాడు. లక్ష్మమ్మ యింటిఆవరణంలోనే గొడ్డూ బిడ్డావుండడం శుభం అనీ వేరేకొట్టాలు వేయడం పనికిరాదనీ పట్టుపట్టింది గాని పాడిపశువులను మాత్రం ఆవరణలో కట్టివేసే యేర్పాటుతో ఆమెను సమాధానపరచి వాటికోసం వెడిగెలగావున్న పెద్దకొట్టంమాత్రం వుంచి శేషించినవి వూడదీయించి వీధిగోడమీద పెద్దమేడ వేయించాడు. మేడకిందిభాగంలో నడుమ ఉత్తర దక్షిణములు పెద్దసావిడీ, దానిఉత్తరమునా, దక్షిణమునా విశాలమైన గదులూ; సావిడిపారున తూర్పునా, పడమరా డాబాపంచలూ, తూర్పుపంచలో ఉత్తరపువైపునా, పడమటి

పంచలో దక్షిణపువైపుస మేడమీదికి మెట్లూ వుండేటట్టుగా మిద్దెవేసి క్రిందిసావడికీ గదులకూ పంచలకూ వరవడిగా పైన మేడ కట్టించాడు. మిద్దెలో దక్షిణపుది చౌదరయ్య కచేరిగది. వుత్తరపుదాంట్లో సంగదాసు వుంటాడు. సావిడి ఖాళీగా వుంటుంది. మేడయావత్తు రామానాయుడు వుపయోగించుకుంటాడు. దక్షిణపుగది పడకకూ సావిడి కులాసాగా స్నేహితులతో కూర్చుండేందుకు ఉత్తరపుది పరాయిలతో వ్యవహారములు మాట్లాడుకునేందుకు వుపయోగించుకుంటాడు. మేడమీది ప్రతిగదీ, తివాసులు, కుర్చీలు, బల్లలతో నిండివున్నది. ప్రతిగదికీ విశాలమైన కిటికీ లమర్చబడ్డవి. లక్ష్మమ్మ సాధారణంగా మేడలోకిరాదు. ఆమెకు మొదటినుంచీ భవంతే అలవాటు. పాడికి వంటకు, భోజనాలకు, చౌదరయ్య పడకకు భవంతిలోనే ఏర్పాటు. చౌదరయ్య అన్నకొడుకు వెంకటయ్యకూడా భవంతిలోనో కొట్టంలోనో అవసరాన్నిబట్టి పడుకుంటాడు. చౌదరయ్య రెడ్డిగంవేసుకొని తివాసీమీద తనగదిలో కూర్చున్నాడు. బుర్రమీసాలూ, పుస్తీలు, కొంచసిగా, కోరతలగుడ్డ పూర్వపు కమ్మవారియొక్క క్షాత్రమునకు రాజఠీవికి బాహ్యచిహ్నములుగా ఆయనయం దింకా నిల్చివున్నవి. యీకాలంలో అన్నికులాలవాండ్లు అచ్చుకొట్టినట్లు బోడితలలూ బోడిముఖాలూ పెట్టుకోవడం ఆయనకిష్టంలేదు. నల్లనిముఖంమీద మెండుగా స్ఫోటకంమచ్చ లున్నప్పటికీ మనిషి వికారి కాడు. కొంతకాలం క్రింద ఖాయిలా పడడంచేత శరీరం దొందపారింది గాని పొడుగుమీద లావనిపించదు.

చౌదరయ్య మంచి వ్యవహర్త. చదువనూ, వ్రాయనూ బాగా నేర్చినవాడు. యెవరైన నమ్మకస్తుడని తోస్తే యతుబారీగా పనివాండ్లమీద వదలివేస్తాడు. కవిలిలెక్కా, కోర్టువ్యవహారాలూ, కంఠంరాజా చూస్తాడు. సంవత్సరానికి పుట్టెడువడ్లు, బార్యాభర్తలకు సరిపోయే మిరపకాయలూ, అపరాలూ తద్దినానికి వరహారొఖ్ఖం, పండుగమోయిను తండ్రికాలంనుంచి భూతాదిగా ఆయనకియ్యడం మామూలు. పంతులు కొంచెం పెట్టుకుమనిషి. పైనపావు ఛౌదంతిన్నా యజమానిని చెడనియ్యడని చౌదరయ్యకు నమ్మకం. సాధారణంగా పెట్టుబడి యావత్తూ ఆయన సలహాలేనిదీ జరగదు. వ్యవసాయపు అజమాయిషీ ఐవజు అమ్మడం నిల్వచేయడం సంగదాసుపని. భోజనమూ, నెలకు ౧౨ రూపాయలు జీతము అతనికిచ్చే యేర్పాటు. సంగదాసు పైసాజాయా పోనియ్యడని గ్రామంలో వాడుక. చౌదరయ్య తలగుడ్డ చిలుకుకు తగిలించి చుట్టతాగుతూ యెవరితోనో కొంచెం మాట్లాడి ధుమధుములాడుతూ చుట్టపారవేసి లోపలికి వచ్చాడు.

చౌ—పిల్లవాడేడి?

ల—మేడమీదికి యిప్పుడే పోయినాడు.

చౌ—మీఅబ్బనాడేన్నడైనా మీవాండ్లు కోతలు కోశారూ?

ల—బాగావుంది సరాగం. యెన్నడో పోయిన మాఅబ్బసంగతెందుకు? ఇప్పటి మీసంగతి ఆలోచించుకోండి. మా అబ్బ గొంతులోనికెన్నడూ మీ గటక జారలేదు. యెప్పుడూ మీకంటె పైచెయ్యిగానే వున్నాంగాని మీకు లొంజుగాలేరు.

చౌ—పిల్లవాణ్ణి కోతకెందుకు పంపించావు?

ల—నే పంపించాను? వాడేమి పాలుతాగేవాడా నే పంపడానికి?

చౌ—ఈమాలసావాసాన చెడిపోతున్నాడు. మాలవాడు లేపా మేడమీది కెక్కడం యెందుకు?

ల—తండ్రి మాలవాణ్ణి మిద్దెలో పడితే కొడుకు మేడమీద పెట్టాడు. పది మంది వచ్చేయింట్లో ముఖ్యస్థలం మాలకూటంగా యెవరుచేశారు? మొన్న మీ వియ్యంకుడు భోజనం చేసి యెరక్క వాడిగది తీసివుంటే దాంట్లో మంచంమీద పడుకొన్నాడు. తరువాత తెలిసి నొచ్చుకొని స్నానంచేశాడు

చౌ—నీవు అర్థమైనవాండ్లకు బియ్యాలూ, పప్పులూ అప్పులు పెట్టడంఎందుకు? పొద్దిటిపూట చల్లసత్రం, మధ్యాహ్నం దారినపోయే గుంపులకు అన్నసత్రం కొంప గుల్లవుతున్నది.

ల—పిల్లవాడిమీదికోపం నామీదికి తిరిగింది. వూళ్లో బీదసాద వుంటే బాగులు సదులూ పుట్టనీయకపోతే బాగుంటుందా? వున్నవేళ వుంటుంది లేనివేళ వుంటుంది. మనకు యింతవున్నా వొకసమయాన యేదో నిండుకుంటుంది. కాకపోతే ఎప్పుడైనా కాస్త తక్కువరకం బదులు తెచ్చిస్తారు. దానివల్ల కొంప గుల్లవుతుందా? మీరిచ్చే బాకీలన్ని తిరిగివస్తున్నవీ?

చౌ—గేదె లిన్నెందుకు? అమ్మివేస్తా

ల—అమ్మకొండి. తిరిపెపునీళ్లు పోయవలసివస్తుందనేనా అమ్మకోవడం? వూళ్లో ప్రతివాళ్లకూ గొడ్లుంటవీ? వాడంతా వట్టికూడు తినవలసిందేనా? మన వంతులువంటి వాడికి గొడ్డులేదే. మట్టం వస్తాడు. పక్కం వస్తాడు. కోణిదడు మజ్జిగ నీళ్లుకూడా పునీయకపోతే యెందుకీ పెద్దసంసారాలు?

చౌ—అన్నసత్రం అవిచ్ఛిన్నంగా జరుగవలసిందేనా?

ల—అన్నసత్రం పెట్టానూ? మన సత్రాన్నే అంతావచ్చి చూడుతున్నారు. దారినిపోయేవాడు ఆకలికి చెవులు ఖుడియున్నవి 'గంజినీళ్లు పొయ్యమ్మా' అని అడిగితే యింత మజ్జిగ అన్నం కలిపిపోస్తున్నా. తక్కువ ఖర్చంతో లాభమూనూ యిది దుబారానా? యింతకాలము నాకు యెట్లాగో జరిగిపోయింది. మీ కోడలు మేడమీది నుంచి క్రిందకే దిగదు. యిక వాడు పెట్టేదీలేదు. వీడ్లు తినేదీలేదు. అప్పుడంతా వడ్డీకే యిచ్చుకొందురుగాని. నాకు దగ్గరకు వచ్చింది. ఈ నాలుగురోజులూ యిట్లాగే జరిగిపోనియ్యండి. యీ తగాదా యివ్వాళ యెందుకు వచ్చింది.

చౌ—(లక్ష్మమ్మ మాటలకు కొంత జమికి)—వాణ్ణి వుద్యోగానికి పొమ్మను.

ల—పోకుండా నే కట్టుకున్నానా? మీకు దుబారాఖర్చు లేకుండా నేను వాడి దగ్గరనే పడివుంటా, మీరు పూటకూలి యింటికి పొండి. ఏమీ నష్టముండదు.

చౌ—సగం వాడిని నీవే చెడగొట్టుతున్నావు. వాండ్లు 'నీవు నీ' వనే పిలుచుకోడం యిప్పుడే విన్నా.

ల—నేను అట్లా పిలుచుకోమని చెప్పలేదు. నాకివ్వన్నీ తెలియవు. వారోజులు నేను వెళ్లబుచ్చుకుంటా. మీ తగాదాలన్నీ నాతో చెప్పవద్దు. యెవరిష్టం వచ్చినట్లు వారుండండి.

చౌ—అన్నం పొలాని కెందుకు పంపావు?

ల—పంపమంటే పంపా.

చౌ__కూలివాండ్లతో కోతికోసి వాండ్లతో కూర్చొని అన్నంతింటే గౌరతకు భంగం రాదా?

ల__ఆ సంగతి వాడికి తెలియదా?

చౌ__మాలవాడూ, వీడూ కలిసి మొన్న గురువు పాదాలు పట్టారట.

ల__యెవరన్నారు?

చౌ__వెంకటసుబ్బయ్య యిప్పుడు చెప్పాడు.

ల__గురు వెవరు?

చౌ__ఎవరో బ్రాహ్మణుడట. ఆ బ్రాహ్మణుడు యీ మాలవాడికి గురువెట్లా అయినాడో. ఈ యీడున తనకు గురువుపాదం బట్టడం యేమి అవసరం వచ్చింది?

ల__నాకేమి తెలుసు యివన్నీ? కాలు గడపవతల పెట్టనిదానికి.

చౌ__మాలవాడు వీణ్ణి యింకా చెడగొడతాడు. వాడు మనకొంపకు ముసలమైనాడు.

ల__ఇద్దరూ కలిసి యెక్కడికో ప్రయాణంటే! పిల్లవాడనె.

చౌ__ఎప్పుడు పోతారట?

ల__అది నాకు తెలియదు.

చౌ__గురువుదగ్గరకు గాంవాలె. బాగానేవున్నది.

చౌదరయ్య దాహంతాగి తనగదిలోకి పోయినాడు.

---

## పదునేడవ అధ్యాయము

## కూలీ

చౌదరయ్య యేమీతోచక మళ్లీ చుట్టముట్టించాడు. పిల్లవాడు దారితొలుగుతున్నాడని చాలా విచారపడుతున్నాడు. "సంసారమంతా తలకుచుట్టి ఈడుకోమంటే బాగుంటుంది. యీ పొలం బోవడంగూడా వొకవిధంగా బాగానేవుంది. సొమ్ముమీద కాపీనం బుడితేనేగాని బాగుపడ"డని మళ్లీఅనుకొన్నాడు. చౌదరయ్యకు భార్యతో మాట్లాడినప్పుడున్న ఉద్రృతం తగ్గింది. మనిషి శాంతపడ్డాడు. "కూలివాండ్లు వచ్చేవేళ అవుతున్నది. మనసబు చీలిపోయినందుకు సంగదాసైనా మనపక్షంవుంటే బాగుండును యేమో అబ్బా యిటుంటాడని నమ్మకం లేదు. యెటూ చేరకుండా ముభావంగా వున్నా కొంతమెరుగే. అయినా వాయించిచూతాం. యెట్లామోగేనీ తెలుస్తుంది. పిల్లవాడుకూడా దగ్గరవుంటే దాసు యెగ్గరించి పోగూడదు" అని అనుకున్నాడు. రామానాయుడు మెట్లుదిగి వస్తూవుండడం కనిపెట్టి చౌదరయ్య సంగదాసూ అని పిలిచాడు

సం__తనగదివాకిటిలోకి లేచివచ్చి__అయ్యా పిలిచారా?

చౌ__అబ్బాయి దిగుతున్నట్లున్నది లోపలికి రమ్మను.

సం__అయ్యగారు పిలుస్తున్నారండి.

రామానాయుడు గదిలోకి వచ్చి కూర్చున్నాడు. సంగదాసు పెంత్రపట్టుకొని నిలిచి__

సం__కూలివాండ్లు వచ్చే వేళవుతున్నది. రెండుబస్తాలు వాకిట్లో వేయించనా?

చౌ__ఆసంగతి మాట్లాడడానికే పిలిచాను కూర్చో.

సం__ఇక్కడ నిలుచుంటాలే చెప్పండి.

చౌ__సావకాశంగా మాట్లాడి తరిచి నిగ్గుదీతాం.

సం__సంగతి విప్పుష్నంగా ముందు జెప్పండి.

చౌ__కూలివాండ్లకు పూర్వం రోజుకు పావలాపంతున యిస్తూవుండేవారు. దరిమెలా అరణాలదాకా పెంచారు.

సం__పూర్వం రూపాయంటే బండికల్లుగావుండేది. నాణెముల ప్రచారం తక్కువగావడంచేత ధాన్యం యియ్యడమే నాణెంగా కనబడి వస్తువిచ్చి వస్తువే బదులు దీసుకుంటూవుండేవాండ్లు. ధరలు య్యేప్రకారంగా వున్నా వస్తుకే చెలామణి అవుతూ వుండేది. పత్తివిడతకూ, మిరపకాయలకోతకూ, కంకుగిల్లడానికి యెన్నడైనా మీ బుద్ధెరిగినతరువాత డబ్బు కూలి యిచ్చారా? యేపంట కైలుచేస్తే అదేకూలిగా యిస్తూ వుండేవాండ్లు. ఆ పద్ధతి ఉభయులకూ వునులుగానే వుండేది.

చౌ__యిప్పుడు మనము డబ్బేయిస్తామంటే వచ్చిన చిక్కేమి?

సం__అట్లా మార్చడానికి వుద్దేశమేమి?

చౌ__వుద్దేశ మేదయితేనేమి? లాయిలాసా వొకటి కనపడేదేగా?

సం__నేను తరిమి అడిగానని కోపపడవద్దు. విషయం చర్చిస్తున్నాంగదా. లాయిలాసా లేకుండా చేసుకోవడమే మీ అభిప్రాయమా?

చౌ__డబ్బు యివ్వడం మనకు లాభమనుకో.

సం__యెట్లా లాభం?

చౌ__అడ్డెడు జొన్నలకూలి నాలుగుకట్టలకూ వొక తవ్వెడుగింజలు కట్టుకోండి. రూపాయికి నాలుగు మానికెలపంతున అడ్డెడు దవ్వెటికీ పదణాలవుతుంది. చొప్పుఖరీదు వొకఅణా యెక్కువ అనుకోండి. రోజుకూలి పదకొండణాలు మదింపు వేయవచ్చు.

సం__కొన్నాళ్లు మూడుమానికెలుకూడా అమ్మారు. ముందు అయిదు మానికెలు గావచ్చు. దేనినిబట్టి డబ్బుకూలి నిర్ధారణ చేస్తారు?

చౌ__ఈరోజు ధరలు మనసులో బెట్టుకొని ఆరణాలు నిర్ణయిస్తామనుకో.

సం__ఈ ఆరణాలకింద యిప్పటి ధరలనుబట్టి మూడుదవ్వలకూలి యేర్పరచడం మీ కిష్టమేనా?

చౌ__నా అభ్యంతరం లేదు. అట్లా ఆసామీలందరిచేత వొప్పిస్తా.

సం__రేపు రూపాయికి మూడు మానికెలయితే మీ కుమారుడు మానెడే చేస్తానంటాడేమో నే?

చౌ__యెందుకంటాడులే.

సం__పేస్తరు తీయుపలెననే వుద్దేశం మనుష్యులకు యెప్పుడూ వుండేదేగా.

చౌ__డబ్బు మీవాండ్లకు చేదయినట్లు కనబడుతున్నది.

సం__నేను కూలిపనివాణ్ణి కానుగా.

చౌ__కూలీలకే అనుకో.

సం__యిప్పటిధరలనుబట్టి పదకొండణాలు పుచ్చుకోవడానికిసిద్ధంగావుంటారు

వాండ్లకు గింజలిచ్చినా లేక వాటి ఖరీదిచ్చినా వొకటే. ప్రతిరోజూ ఖరీదు కట్టుకోవడం చిల్లర పంచిపెట్టడం చాలా లాయిలాస. ధాన్యమే యిస్తుంటే ధరలనుబట్టి మార్పవసరంలేదు. డబ్బుపద్ధతి రావడంతోటే ధాన్యపుఖరీదంటూ కట్టి యివ్వకపోయినా అప్పుడప్పుడు కూలి మార్చవలసే వస్తుంది. ఆ మార్పుకూడా అడ్డగోలు వ్యవహారం అవుతుంది గాని నిలుకుండదు.

చౌ—మనం సజావుగా మాట్లాడుదాం. అన్ని ధాన్యాలు అడ్డెడే తీసుకుంటారా?

సం—గట్టిధాన్యాలు అడ్డెడూ, పొట్టుధాన్యాలు అడ్డెడుశవ్వెడూ లేక మాడు మానికెలూ రివాజునుబట్టి యిస్తున్న వేగా.

చౌ—అయితే ధాన్యానికిగూడా నిలుకు లేదే,

సం—యేకంట్రాకైలు జేస్తే అది యివ్వవలసిందే గా. దానికి నిలుకేర్పడేవున్నది.

చౌ—గోడలు బెట్టినందుకు యేమి పంటిస్తావు?

సం—పూర్వులు డబ్బుకూలేర్పాటు చేసింది యిటువంటివాటికోసమే. పయిరుకు సంబంధించనప్పుడే డబ్బుకూలి యేర్పాటు. గింజల ధరలనుబట్టి అదీ యిప్పుడు కొంచెం పెరిగింది. మీరు దానిని దెచ్చి వ్యవసాయపు పనులకు లంకె పెడుతున్నారు. మెట్టుకు మీ అభిప్రాయమేమిటి?

చౌ—అరణాలకూలి చాలా యెక్కువని. అంతకుమించితే రయితుభరించలేడు అందరిక్షేమమూ విచారించాలె. కూలి పావలానుంచి అరణాలకు పెంచితే నూటికి యాభైవంతున పెంపకం. ఆసాములు చాలా ఔదార్యం జూపించినట్లే యెంచవలసి వుంటుంది.

సం—పంటకు యేమాత్రం ధర పెరిగింది?

చౌ—ధాన్యమూ, ప్రత్తీ, మిరపకాయలూ, అపరాలూ సగటున మూడునాలుగు రెట్లు ప్రియమయినవి.

సం—అంటే పూర్వం నూరు రూపాయలు అమ్మేది ఇప్పుడు నాలుగువందలమ్ముకున్నవి. కూలివాండ్లకు చాలా ఔదార్యం జూపించి అరరెట్టి యెక్కువజేస్తామంటున్నారు. ధరలతేడాలవల్ల వచ్చే పేస్తరులో కూలివాడికంటె ఆసామి నాలుగు మొదలుకొని ఆరురెట్లవరకూ వుదారబుద్ధితో యెక్కువ తీసుకుంటానంటాడు.

చౌ—నీవు కూలివాడికి భూస్వామితో వొంతు పెడతావేమి?

సం—మీరడిగిన విషయం కొంత లోతుకుదిగి విచారిస్తేనే గాని తేలదు. మన దేశంలో భూమిలో స్వామ్యం వ్యవసాయదారులకు లేదు. అది ప్రభుత్వానిది గాని మందికి గాని చెందివున్నది. మందిమీద జరుగవలసిన పనులను దాసితరపున రాజుపాలిస్తూ వుంటాడు. ఆసాములు మందిదగ్గరనుంచి భూములు కౌలుకు పుచ్చుకొని మందికి యేజంటైన రాజుకు ముచ్చిల్కాలు వ్రాసి ఆయనవల్ల పట్టాలుపుచ్చుకొని మందికి చెల్లవలసిన ముక్తా శిస్తురూపకంగా రాజుకు చెల్లిస్తారు. వసూలు ఖర్చులుపోను మిగిలినడబ్బు మందికి ఉపయోగపడుతుంది. ఆసామికి వుండేదల్లా కౌలుహక్కు. ఆసామి ముక్తా యియ్యకపోతే యజమాని అయిన మంది ఆసామిని వెళ్లగొట్టవచ్చు. లేక ఆసామికి యింకా జరుగవలసిన కౌలు శిస్తు మొత్తానికవసరమయినంతవరకు వేలం వేయవచ్చు. న్యాయాన్నిబట్టి ఆసామీ భూమిని బలపర్చడానికి ప్రోత్సాహకరంగా వుండేటందుకూ

కిస్తువసూలుపని సులభంగా తేలిరావడానికి కొన్ని భాగాలలో శాశ్వతజిరాయితీ హక్కులూ మరికొన్నిచోట్ల దీర్ఘకాలపు పట్టాలూ యియ్యబడ్డవి. ప్రభుత్వానికిష్టమయితే ఆసాములను కారణం చెప్పకుండానే కాలునష్టం కట్టియిచ్చి మార్చవచ్చు. కాబట్టి మీకున్నది జిరాయితీ హక్కు. అది ప్రభుత్వం యిష్టప్రకారం శాశ్వతపుదీ గావచ్చు. తాత్కాలికపుదీ గావచ్చు.

చౌ___మీ కూలివాండ్లంతా ప్రభుత్వందగ్గరనుంచి పైపోటీబెట్టి నా పొలమంతా కౌలుకు తీసుకుంటారా?

సం___మనం మాట్లాడే విషయం అదిగాదు. యిప్పుడు మాట్లాడినంతవరకు ఆసామీలకున్నది జిరాయితీ హక్కేనని చెప్పాను. అనగా స్వంతదారైన ప్రభుత్వం కొంత హక్కును కౌలుదారుకు పరివర్తనజేసింది. పూర్వం ప్రభుత్వంవల్ల హక్కుబొందిన దేశముఖులు లేక జమీందార్లు కొన్ని భూములు స్వంతకమతం కింద వుంచుకొని మిగిలినది రయితులకు కౌలుకిచ్చేవారు. ఆ కాలంలో కమతగాండ్లుగా వున్నవాండ్లు చాలామంది యిప్పటి భూస్వాములైనారు. పూర్వం కమతగాండ్లకు కొంతపాలిహక్కుండేది. ఆ పాలేరు మారి యిప్పుడు జీతగాడైనాడు. అందువల్ల భూమితో అతనికుండే సంబంధం పోయింది. మామూలు కూలివాని స్థితిలోకి అక్రమంగా అతణ్ణి తీసుకొని వస్తున్నారు.

చౌ___కూలివాండ్ల సంగతి ముందు తేలనియ్యి. జీతగాండ్లను తరువాత లేపెట్టి ఆసామీలమీదికి యెగదోలుదువుగాని.

సం___యిప్పుడు మనం మాట్లాడే విషయానికి కమతగాండ్ల సంబంధం వస్తుంది. సంవత్సరాలకొలది యేర్పరుచు కొన్నవాండ్లు జీతగాండ్లు, రోజుపనివాండ్లు కూలీలు. వ్యవసాయవిషయంలో జీతగాండ్లూ, కూలీలూ ముఖ్యులు. చెమటవోడ్చి జనానికి భోజన పదార్థాలు సృష్టిజేసేవాండ్లు. వాండ్లు స్వంతంగాదున్నే కౌలుదార్లుసైతం వీండ్లలోనే చేరతారు. వందలకొలది యెకరాలకు ప్రభుత్వంవల్ల కౌళ్లుపొందిన పట్టాదార్లు పట్టి తనిఖీదార్లు. వాండ్లువొకవిధమైన వర్తకులు. వ్యవసాయంవల్ల వచ్చేలాభం విశేషంగా యీ తనిఖీదార్ల జేబులోకే పోతూవున్నది. ముందు మేల్కొన్న పైతరగతులవాండ్లు ప్రభుత్వంవల్ల కౌళ్లు సంపాయించుకోవడంచేత ఆలగాలకు యేమీ లేకుండా పోయింది. మీరు చెప్పినట్లు కూలివాడికి భూస్వామితో పంతుపెట్టడం నాది తప్పే. వ్యవసాయానికి కూలీ ముఖ్యుడుగాని మీరు చెప్పే భూస్వామిగాడు.

చౌ___అయితే నీవిప్పుడు కూలీకి యేమియ్యడం న్యాయమంటావు?

సం___నన్ను న్యాయమడిగితే యింకా చాలా చెప్పవలసివుంటుంది. యిప్పుడు వున్నదే తగ్గించవచ్చునా, లేదా? అనేకదా మన ఆలోచన.

రా___నీవు న్యాయమని యేదనుకుంటావో అదంతా వివరంగా చెప్పు.

సం___తమరు అడిగే విషయానికి తరువాతవస్తాను. యిప్పుడు అయ్యగారు చెప్పే ప్రకారం కూలి యింకా తగ్గిస్తే కూలివాడు యెట్లా జీవిస్తాడు?

చౌ___కూలివాండ్లంతా యెట్లా జీవిస్తారో మాకవసరంలేదు. వాండ్లందరినీ పోషించవలసిన బాధ్యత మాకులేదు. వొకవేళ పోషించవలెనని అనుకొన్నా మా చేతగాదు. మనము చేయించుకుండేపనికి మనం యెంత యివ్వవలసిందో విచారించుకుందాం.

సం___యింత విచారణ యెందుకు? మీ చిత్తం వచ్చినంత యివ్వవచ్చునుగదా?

చౌ—వాండ్లు పుచ్చుకోకపోతేనో?

సం—పూరికే చేసిపోతారో లేక అసలే మానుకొంటారో!

చౌ—పూరికేచేస్తే చేయించుకుండే దెవరు? అసలే మానుకుంటే పుభయులకు నష్టమేగదా?

సం—వారి నష్టసంగతి మీ కెందుకు? మీ నష్టంసంగతి వారికెందుకు? వొకరి కొకరు సహాయం చేయవలసిన బాధ్యతలు లేవుగదా? మీ యెనిమిదివందల యెకరాలు మీకే దున్నుకోండి.

చౌ—యింకోరికి కౌలు కిచ్చుంటాను.

సం—వారికివట్టుకు కూలివాండ్లవసరం లేదా? వారికి కూలివాండ్లు కావుంటె యెవరూ మీ దగ్గర కౌలుకే పుచ్చుకోరు.

చౌ—యీ కూలివాండ్లకే కౌలు కిస్తాను.

సం—అంటే పట్టాలు మాత్రం మీ పేరవుండి భూములు కూలీలకు స్వాధీన మౌతవని అర్థం.

చౌ—ధర్మమైన ముక్తాలు పుచ్చుకోమా?

సం—వారు దయదలచి యిచ్చినంత.

చౌదరయ్య పూరకున్నాడు.

సం—కాబట్టి కూలివాండ్ల విషయమై బాధ్యత మన కేమున్నదని రయితులు అనడానికి వీలులేదు. వ్యవసాయం ఆసాముల మీదకంటే యెక్కువ కూలీలమీదనే ఆధారపడివున్నది. వారి పోషణ విషయమై మీరు యోచించక తప్పదు.

చౌ—మమ్మలను యెట్లా వాండ్లను పోషించమంటావు?

సం—అధమం ప్రస్తుతమిచ్చే కూలైనా యివ్వడం అవసరం. వారు పడుతుండే బాధలన్నీ ప్రస్తుతం మీకు వినిపించడ అవసరంలేదు. యిదివరకిస్తున్న రోజుకూలీ వాండ్ల కొకరోజుకుగూడా సరిపోదు.

చౌ—ఆలుమగలు కూలికివస్తే వాండ్లకు కాంగా మిగులుతుంది.

సం—యెల్లకాలం ఆలు మగడే వుండరు. యింట్లో ముసలమ్మ వుంటుంది. భార్యకు నీళ్లాడుపొద్దులు రావచ్చు. ప్రసవపురోజులూ, బాలింతనెలలూ గడవాలె. రెక్కలురానిపిల్లలను పోషించాలే. యివన్నీ తమరు యోచించండి? కూలిరోజులలో పోషణజరిగినా వ్యవసాయపు పనులైనతరువాత వాండ్లేమిగావాలే? పస్తులైనావుండాలె, పరులయిండ్లయినా దోచాలే, పస్తులున్నవాండ్లు మీకేమి పనిచేయగలరు? యెద్దువంటిదానికి బలంలేకపోతే మీ వ్యవసాయం యేమిసాగుతుంది? యీ పూట దాణా వెయ్యకపోతే రేపు పని నష్టసమేగదా. ఇవన్నీ తమరు యోచించి కనికరించవలసి వుంటుంది.

చౌ—నీవు శ్రీరంగనీతులు యిన్ని చెపుతావుగాని కూలివాడికి కడుపునిండా అన్నముంటే పనిచేస్తాడటోయి. వొకపక్క కొస్త కాలుతుంటే పనికోసం దేవులాడుతాడుగాని కడుపునిండితే పనిమట్టే. నీకేమిదెలుసు పిల్లకాకివి. నలభైయేండ్లనుంచి బొప్పలుతిన్నా. ఆరణాలు సిస్సులైనకూలే. వొకరిచేత నేను చెప్పించుకునేవాణ్ణిగాను వొప్పుకోమని చెప్పు. నీవు చెపితే అంతావింటారు.

సం—నే జెప్పినా వినరండీ.

చౌ—యింత సేపటినుండి నీవు యిన్ని మాటలు చెప్పావుగదా. నేను వొక్క మాటి చెపుతా విను. కడుపులో వొక చెంప కాలుతుంటే మునసబు గారిమీద వాండ్లు సమ్మె కట్టేవాండ్లేనా? వాండ్లకు అన్నం యెక్కువైంది. యెక్కువ గాకపోతే మాలపల్లీ, మాదిగపల్లీ, తొగటపాళెం, తురకపాళెం కూలీలకోసం యిన్ని మాట్లు మనం దిరగాలెనా? మనిషి తిరగవల్లాడా అంటే నాకు తెగులు. ఈ వూళ్లో పద్నాలుగు వీసాలు కూలిజనం నావల్ల బతికేవాండ్లు. యెదురుదిరిగి వాండ్లను నా చేలో అడుగు పెట్టనియ్యను. నూరారయ్యేది నే మాటదిరగను. చెడిపోతారు చెక్కు.

సం—యింత యిస్తువగలవాండ్లము మనము తొందరపడడం యెందుకు? దస్కతుజేసిన మునసబు చీలిపోయినాడుగదా!

చౌ—నామీది కచ్చచేత యిత గాడు తిరిగిపోయినాడు గాని పెద్దవాండ్లంతా దీనికి వోటుకొని వున్నారు.

సం—నే మనవిజేసేదేమంటే కీడెంచి మేలెంచమన్నారు. మనవాండ్లది కప్పులతక్కడ వ్యవహారం కూడిరాదు. పెద్దలంటే మాటలకు అంతా పెద్దలే. క్రియ వచ్చేటప్పటికి యేవోసాకులూ. ధర్మపన్నాలూ. చెప్పి తప్పుకుంటారు. మనము ముందు మిగిలితే అవలక్షణ మనిపించుకోవడ మవుతుం దని నాభయం. చుట్టుపట్ల వూళ్లు నిలవక కూలీలచేత మనంమాత్రమే సమ్మెకట్టించుకొని చివరకు మునసబు గారి మోస్తరుగా లొంగిపోవలసివస్తుందేమో. ఇటువంటి వ్యవహారాలు తమరు లక్షజూచి వుంటారు. తమకు నేనా జెప్పేది. తమరే ఆలోచించుకోండి.

చౌ—చిన్నవాడివైనా నీవు చెప్పినమాట యోచించదగిందే, యిప్పుడేమంటావు?

సం—యీరోజు మామూలు ప్రకారం పోనియ్యండి. రేపటిసంగతి ఆలోచింతాం

చౌ—చిన్నపరెడ్డి యేమనుకుంటాడో నే. ఈరోజుకు కూలి అన్నలేయియ్యకుండా దాటవెయ్యలేవా? రేపటికి భృగువు యావత్తు తెలుస్తుందిగా.

సం—ప్రయత్నం జేతాం. కొట్టంలో కూర్చుంటే బాగుంటుందేమో.

చౌ—అట్లాగేకూర్చుందాం.

సం—నాయుడు గారూ! తమరుగూడా దయచెయ్యండి.

చౌ—రారా.

---

## పదునెనిమిదవ అధ్యాయం

# ముతరాచు ముసలిది

కూలిజనం వీధిలో మూగింది. కిందటిరోజున మునసబు గారింటిదగ్గర కూలి విషయమై గలభాజరగడం, కూలివాండ్లు వారిచేనికిరామని కట్టుకట్టడం. దానిమీద మునసబు సర్దుకొని కూలి ముబాదలాగా యియ్యడం, యిచ్చినా శేషయ్యపార్టీ యెగత్రించి చౌదరయ్యచేనికి పోవడం వూళ్ళో పసిబిడ్డబాలాది అందరికి తెలిసి అట్టుడికి నట్టుడికింది. ఈవ్యవహారంలో మందికి తలకట్టుగావున్న చౌదరయ్య యీ పూట యేమి చేస్తాడో చూదామని అలగాజనం చాలామంది పోగయినారు.

చౌదరయ్య యీజనాన్ని జూచి "యిదండా రభసలోకి దిగేటట్టుగావుంది. అలగా జనంతో వేగటం కష్టం. పొరుగూరివాండ్లు నిలువబడకపోతే మనం లొంగిపోవడం, అదుగో చౌదరయ్య చేకాడోయ్ అని నలుగురిలో తలవంపుల వ్యవహారం కావడం, సంభవిస్తుందేమో", నని విచారిస్తున్నాడు. చౌదరయ్యా, నాయుడూ సరాసరి కొట్టం లోకిపోయి అరుగుపైన చాపమీద కూర్చున్నారు. సంగదాసు కూలివాండ్లుమాత్రం లోపలికి రండని పిలిచాడు గాని యావత్తుజనం లోపలికి తోసుకున్నది. ఆడ కూలి లంతా వొక చెంప నిలుచున్నారు.

చౌ__జనమంతా తోసుకొనివస్తే యెట్లా? కూలీలల్లో ముఖ్యమైనవాండ్లు ముందుకురాండి.

శేషయ్యా, రంగదాసూ, వీరదాసూ ముందుకు వచ్చారు.

చౌ__యీ ముగ్గురి యిష్టప్రకారం మీరంతా పోతారా?

కూలీలు__వొప్పుకుంటాం. మేముగూడా యిక్కడ వుండే వింటాం.

చౌ__వీరదాసూ! నీవు జొన్నకూలికి పోతున్నావా?

వీ__మరేనండి, కోరీలలో నీళ్లునిండినవి. రాతిపని జరగడంలేదు.

__యింతమందిజనం మీ మాటప్రకారం పోతామంటున్నారు. మీరు ముఠాలకు నాయకులైనందుకు అందరినీ జాగ్రతగా సగరొప్పుకొని రావాలె.

నాయకులు__మరే, నామకా పెద్దలమేగాని వాండ్ల కిష్టంలేకపోతే వినిపించే సత్తా మా దగ్గర లేదండి.

చౌ__యేమంటారో చెప్పండి?

రం__దొరలే శలవియ్యండి. మే మేమి జెపితే సాగేటట్టుంది?

__సాగకేమోయ్, చెప్పు.

రం__నాదొక్కటే మనవండి, మీరు తండ్రులు, మేము బిడ్డలవంటి వాండ్లం. మామూలు ప్రకారం వెళ్లబారిపోనియ్యండి. యెందుకు మధ్య యీ లట్టాలు.

చౌ__నేనూ తేడా మనిషినిగాను. నలుగురితోపాటు మనమూను. యివ్వాళ గిద్దెడుగింజలు విడిగాలేవు. పాతరదీసి రేపుసాయంత్రం రెండురోజులదీ కలసి యిప్పిస్తా.

రం__యీపూట నలుగురమూంకి పానరడ్తాం. పొద్దున్నే యిప్పించండి. తలా బొక్కెడూ వండక తిని పొలంమీద బోతాం.

శే__యీ రంగదాసు జమీందారీ సికలు పోతాడు. మాకీపూట బోలెగాలదు. యిప్పుడియ్యకపోతే.

కూలీలు__శేషయ్యసరి వున్నమాట తెగజెప్పాడు.

శే__నాకీ వసవసలు పనికిరావు. వున్నమాట అనితీరాలే.

చౌ__తొందర పడబోకవోయ్. శేషయ్యా! మా యిబ్బందులుగూడా మీరు చూడాలె.

శే__మీ యిబ్బందులు చూచే మాత్రపువాండ్లమా? మా కడుపాత్రం మాది.

చౌ__నేనేమి రోజులతరబడి ఆగమన్నా గనుకనా? వీలైనంతవరకు రేపు సాయంత్రమే యిస్తానంటుంటెని.

వీర__పొట్ట చేతబట్టుకొని పొద్దున్నే యే ఆసామి దగ్గరకో పోతేనే గాని

మాకు జరగదు. ఈపూట వస్తువదుకొని పొద్దున యేమి పనిచేయగలం ?

చౌ__నేను పూరికే మెత్తగా మాట్లాడుతుంటే మీరు పైపైకెక్కుతున్నారు గాని మా ఆసామీలం మిమ్మును కూలికి పిలవకపోతే మీరేమి జేస్తారు ?

వీ__యీ గడ్డమీద బత్తెముంటే వుంటాం. తీరితే కాగర్లో అంటూ దేశాల పాలయిపోతాం.

శే__ఆసాములు మమ్ములను కూలికి పిలువకపోతే కాస్త వెనుకా ముందూ వారూ బయలుదేర వలసేవస్తుంది.

చౌ__మాకేమి పోయినదాకా ?

శే__పోకపోతే పొలాలు బీడుబెట్టుకొని గడ్డిమేపొయ్యాలె. మేము రేపుపొద్దున వెళ్లి కొయ్యకపోతే మీ యిరవై యకరాలజొన్న మట్టగలుస్తుంది. గనిమెలుతీసి నీళ్లు గట్టకపోతే అయిదువందల యెకరాలపల్లం యిగిరి చెక్కగడుతుంది. రేపు మీ జీతగాండ్లను బందుచెయ్యనియ్యండి. పొలాలు బీళ్లుగాక యేమాతవో ?

ఒకకూలి__శేషయ్యమామ అతికేట్టు జవాబు చెప్పాడు.

చౌ__వాడెవడోయ్ ? అంతా మొనగాండ్లయినారు.

రం__వాడి మొగంలెండి పిల్లసన్నాసి. మా కష్టం తమకు చెప్పుకోకపోతే యెవరికి చెప్పుకుంటాం మాకు యేరోజుకూలి ఆరోజు కొంగులో బొయ్యందీ జరగదు.

చౌ__అంత జరగనివాండ్లు యివ్వాళ మునసబుమీద సమ్మె యెట్లాగట్టారు ?

రం__మాకు సమ్మె లేమున్నవండీ. కడుపులో యెత్తులేకపోతే నడచిపోలేక పడుకుంటాం.

చౌ__సరే మీరంతగా చెపుతున్నారు గనుక నా మాట మీరయినా వినాలి, మీ మాట నేనయినా వినాలె. కోమటింట్లో యిప్పిస్తా పుచ్చుకోండి.

రం__దొరలు యేదోవొక మార్గం జెయ్యాలెగాని లేకపోతే సన్నకారు బతగ్గలదా ?

చౌ__సంగదాసూ ! వీండ్లకు తలావొక అరణాల గింజలూ యిప్పించు. తేడావుంటే తరువాత చూసుకుందాం.

అయ్యా ! యిట్లా మధ్య పెడితే సాగేరోజులు పోయినవండి. మనిషికి పన్నిండణాలవంతున యిప్పించమనండి; కోమటింట్లోనే ఆయెను.

చౌ__దాసూ ! వాండ్ల కంతనమ్మకం లేకుండావుంటే మనమే యిబ్బందిపడదాం. విడిగా గింజలేమయినా వున్నవా?

సం__హానీహానీగా వాండ్లకు సరిపోవచ్చు.

చౌ__కొలిపించు.

చౌదరయ్య ఆవులదొడ్లోకిపోయి తనిఖీచేస్తున్నాడు. సగందాను జీతగాండ్ల చేత నాలుగుబస్తాలు బయటవేయించి కూలీలకు కొలిపిస్తుంటే రామానాయుడు చూస్తూ కూర్చున్నాడు.

సం__కూలీల నాయకులను దగ్గరకు బిలిచి__చౌదరయ్యగారు కూలి మామూలుగా యివ్వడంచేత వూళ్ళో వాండ్లుకూడా యిస్తారు. రేపు సాయంత్రం చౌదరయ్యగారు బాహుశా తగ్గిస్తామంటారు. రేపుమీరు వూళ్ళో ముఖ్యమైన ఆసామీల

పొలాలకు మామూలు కూలి యేర్పాటు చేసుకొని పొండి.

శే—సరే. మీమాట కింక అడ్డేమున్నది?

రా—దాసూ! నీవు జూదం బాగా ఆడుతావా యేమి?

స—ఈజీవితమే జూదం.

రా—జూదపుయెత్తులు వేయడం తప్పు లేదన్నమాటే.

స—చేసేపని మంచిదయితే దుస్సాధనాలు వుపయోగించినా తప్పు లేదని కొందరంటారు గాని అది నేనంగీకరించను. వొక కార్యం నిర్వహించవలసివస్తే సామదానభేదదండోపాయాలు సమయానుకూలంగా వుపయోగించవచ్చు. సామోపాయం అన్నిటికంటే మంచిది. సాధారణంగా ముందవలంబించవలసిందీనే అయినా కార్యాలు కొన్ని దానివల్ల చక్కబడవు. అందువల్ల కార్యభంగమూ కావచ్చును. తక్కినవుపాయాలు దోషాలనడానికి వీలు లేదు. వుపేక్ష అనే పంచమోపాయం వొకప్పుడు వాటన్నిటికంటే యెక్కువ పని చేస్తుంది.

కనిచీకటిపడ్డది. ఆదంసాహేబు గింజలుకొలుస్తున్నాడు. యింటిదగ్గర పిల్లలు యేడుస్తుంటారని కొందరు ఆడకూలీలూ, యింటికి దీసికొనిపోయి దంచి అన్నం వండుకోవలెనని మరికొందరూ ముందు కొలిపించుకొని వెళ్లుతున్నారు. "నీవు నిక్కచ్చిమనిషివి. నీవు లేకపోతే యీపూట టోపీపడేవాండ్లమే" నని కూలీలు శేషయ్యను పొగుడుతున్నారు. సంగదాసు నిప్పులలో దూకమంటే దూకు తానని శేషయ్య అన్నాడు. నాయుడుగారు పైకి అనకపోయినా అంతరంగంలో మనపక్షమేనని రంగదాసు వీరదాసుకు చెవులో చెప్పాడు. యింతలోకి చౌదరయ్య తిరిగివచ్చేవరకు రామానాయుడు ఆయనతో గలసి యింటికి వెళ్లేసరికి అక్కడ రామానాయుడు హృదయాన్ని నీరుజేసిన చిత్రరంగం కనబడ్డది.

ఒకముసలిది—లచ్చక్క దొరసానీ!

లక్ష్మమ్మ—ఎవరు నీవూ?

ము—నేను ముతరాచ ముసలిదాన్నమ్మా—

రా—అమ్మా నిన్ను లచ్చక్కని పిలుస్తారేమే?

లక్ష్మ—నేను యివ్వాళ యెంత పనికిరానిదాన్నైనా యిందాకా మా నాయన మా వంగసం మంచిదికాదని చెప్పినా మాఅమ్మమ్మ లచ్చక్క అనేఆమె నలభైయేండ్లు సాల్పుగా జమీ యేలింది. ఆకలనే మాట ఆమెచెవుల వినలేకపోయేది.

చౌ—ఆమెకు జమీందారీవుంది గనుక సత్రాలు పెట్టించె. ఆమె మోస్తరుగా నీవు సత్రాలు పెడతానంటే మట్టిపిసుకొని బతికేవాండ్లం మేము యెట్లా భరిస్తాం?

ల—మీరు సత్రాలు పెట్టేవారే. కూలిగింజల కోసం యింతసేపటినుంచి ముగతికలు పడుతున్నారు.

ము—వో లచ్చక్క దొరసానీ! నా మొరాలకించండమ్మా. ఆకలికి ప్రాణాలు పోతున్నవి. యింత గంగపొయ్యమ్మా.

చౌ—యెవతో యిదొక వేషం వేసుకొని వచ్చింది. కోటివిద్యలూ కూటికేగా

ల—నీకు అన్నీ వేషాలే. యేమిటే?

ము—ఇవ్వాళకు ఏడురోజులయింది అన్నంతిని. ఇంక బొద్దాక వుపకబెట్టు

కొని తిని బతుకుతున్నా సోషకువచ్చింది యింత గంజిపొయ్యమ్మా.

చౌ—సోషవచ్చిందట. యిక్కడికి యెట్లా నడచివచ్చిందో?

ల—సిబ్బిలో అన్నం పెట్టుకొని వచ్చి—యిదిగో పట్టు.

ము—ఏమిటమ్మా అదీ?

ల—అన్నం.

ము—అన్నం మింగుడుపడుతుందమ్మా యిప్పుడు?

చౌ—అన్నం తెచ్చావుగాదూ! చల్లకూడా తెమ్మంటుంది; ఆతర్వాత పూరగాయలు తెమ్మంటుంది. పెట్టే పెట్టివాండ్లుంటే సరి.

ల—నీవు అవతలికిపో - అయితే యేమంటావు?

ము— కుం దింత గంజిపొయ్యమ్మా. ధారకం అవుతుంది.

ల—గంజి తెచ్చి—ఇదిగో, గిన్నె తీసుకో.

చౌ—ఈపెవన్నీ వేషాలు. గిన్నె యిసున్నది దానికి. వెండి గిన్నేనా?

ల—వుండూ, నీవు వూరికేనూ ప్రతిదానికీ హేళన.

ముసలిది గిన్నె తీసుకొని ఆత్రంగా తాగబొయ్యేవరకు మింగుడుబడక వుక్కిరిబిక్కిరయింది.

ల—ముసలిదాని తలబట్టుకొని కూర్చొని — అయ్యో పాపం యిదేమిటీ గుడ్లు తిరిగిపోతున్నవి?

చౌ—తెచ్చిపెట్టావు. యేదో కొంపమీదికి. సోషకువచ్చి చస్తున్నదిగాబోలె? వీధిలోకయినా పట్టండి. మద్దెలోగుండా శవాన్ని తీసుకపోవలసివస్తుంది.

ల—అబ్బా. నీవు అవతలికివెళ్లుమూ. అయ్యోపాపం. ఆకటికి ప్రాణం కడపట్టిందర్రా. నాయనా! రాముడూ! ఇట్లా దీన్ని పట్టుకో. గొంతులోకి గంజిసాధకంచేతాం.

రామానాయుడు వెనుక ఆనుకొని కూర్చున్నాడు.

చౌ—ఇకసరే. (అని లోపలికి పోయినాడు)

ముసలిది నోట్లోబడ్డ జావను కొంచెం చప్పరించింది. కొద్దిగా గొంతులోకి జారింది. మళ్లీ నోరుతెరిచింది. కొద్దిగా మళ్లీ వేసేవరకు చప్పరించి మింగింది. యీప్రకారంగా నాలుగైదుసార్లు మింగేవరకు పేగులు గుట్టున అగచినవి. ముసలిది యిక తిప్పుకునే చిన్నెలు కనుపడ్డవి. కాని జావ కడుపులోకి పోయిన కాసేపటినుంచీ కాళ్లు చేతులు కొంగర్లుపోయినవి. మనిషి మొదటిమాత్రంకూడా లేకుండా కట్టెవలెబిగిసింది వొళ్లు చెమటలుపట్టినవి. చలనంలేదు. అంత్యదశేనని అనుకున్నారు. చెమటవల్ల కొంచం వేడితగ్గింది. వుభయులూ పట్టుకొని కూర్చున్నారు. తెమ్మెరవీచింది. భగవంతుడు స్వయంగానే వీచాడు అయ్యో! పాపం తనబిడ్డమీద యెంతప్రేమ! కొంచెం సేపటికి కాలుగదిలించి. మరి రెండు నిముషాలకు నిట్టూర్పు విడిచింది తరువాత చింపిరినెత్తి గోక్కున్నది. యింకా కాస్తజావ పొయ్యమ్మా అన్నది. మళ్లీ కాస్తజావ తాగినతరువాత రెండు మెతుకులు యెంగిలిపడతావా అంటే యిప్పుడు ఆరాయించలో లేను, వొక్క కునుకుబోయి లేస్తానన్నది. అంతట లక్ష్మమ్మ చాపకోసంపోగా చౌదరయ్య కోడలిచేత అన్నంపెట్టించుకొని తిని చుట్టపొగ దీసుకుంటూ మంగిటిలోకి వచ్చి గర్రున తేపాడు.

రా—నాయనా! ముసలిది బతికింది.

చౌ—పోనీ. వుద్ధరించింది. యిక భూములు యేల్తుందిగాఁవాఁలె.

రా—కిందనే పడుకుంటున్నదే!

ల—ఇదిగో చాపతెస్తిని.

చౌ—ఓహో! ఆబిడకు పవ్వళింపుసేవజేస్తున్నారూ! తల్లికీ కొడుక్కూ బాగా దొరికిందిసేవ. ఇగనైనా అన్నానికిపోతారా. మీరీ సంబ్రంలో వున్నారు. యిప్పుడల్లా వచ్చేటట్టులేదని ఆకలవుతుంటే తిని వచ్చాను. (అంటూ అక్కడ వాల్చివున్న మంచంమీద చల్లగాలికి పడుకున్నాడు.)

ల—మెల్లగా నేనిక్కడ వుంటాగాని; నీవులేచి అన్నంతిను. ఆయన లేచి సణుగుతాడు.

రామానాయుడు పోయి భోజనానికి కూర్చునా ం ముసలమ్మ దీనాలాపం, కండ్లు తిరగడం, కొంగర్లు పోవడం, అదే ఆలాపన అన్నది. ముసలమ్మ స్థితి జాలి పుట్టించింది గాని తండ్రి యింతకనికరం లేకుండా వున్నాడేమా అని యెక్కువ జాలి పుట్టింది. లోకంలోవుండే దుఃఖాన్నీ, బాధనూ చూచి జాలిపడకపోగా యింత నిరసన గలగడం యెందుకా అని ఆలోచించాడు. కావలసినన్ని ధనధాన్యాలున్నవి. తలచుకొంటే యెంతమందికో బాధనివారణ చేయవచ్చు. యితరులకు బాధలువుంటవన్న గమనమే ఆయనకు లేదు. యితరులకు బాధలున్నవేమో నని తెలుసుకోవటానికి ప్రయత్నంగూడా చేయడు. ప్రయత్నంజేసినా గ్రహించేశక్తిగూడా ఆయనకు లేదనుకుంటాను. హృదయశూన్యుడు. నిజంగా విచారిస్తే దయాసత్యశౌచాలు లేనిదే దారిద్ర్యంగాని, ధనధాన్యాలు లేనిదిగాదు.

రామానాయుడు భోజనంచేసి వచ్చేవరకు ముసలిది అన్నం తింటున్నది. మజ్జిగన్నంతో దేహం పూర్తిగా స్వస్థపడ్డది.

రా—అవ్వా మీదేవూరు?

ము—యీవూరే నాయనా.

రా—నీకు బిడ్డలు లేరూ?

ము—వొక కొడుకుండేవాడు. ఏరికోరి వొక పెళ్లాన్ని చేసుకుంటే అది వొకణ్ణి తీసుకొని లేచిపోయింది. అంతటితో వానికి ప్రపంచంమీదభ్రమేపోయి కొంపాగోడూ వదిలిపెట్టి యెక్కడనో మఠంలో గలిసిపోయినాడు. చచ్చిపోయినాడని జాడా తెలిసింది. బాగుచేసే నాథుడులేక ఆస్తి యెక్కడిదక్కడ పందకమైపోయింది. ఇక్కడికి పదేండ్లనుంచీ నా రెక్కలమీద జీవిస్తున్నా. వొకరోజు కొండకుబోయి కానీ పుల్లరిచ్చి తవ్వెడు కలేపండ్లో పరిగెపండ్లో పుల్లేరుకాయలో తెచ్చుకొని పరునాడమ్ముకొని తవ్వెడుగింజలువస్తే రోజుకు సోలెడుగింజలు జావకాచుకొని తాగుతూ రోజులు గడుపుతున్నా. ఆ నారాయణమూర్తికి యెప్పుడు దయవస్తుందో అని కనిపెట్టుకొని వున్నా. వూరు దూరమైనకొద్దీ కాడుదగ్గరవుతుందిగదా.

రా—యేడురోజులనుంచీ అన్నంలేదంటివే అది యెందుకల్ల?

చౌ—(మంచంమీద పరుండి యీ కథంతా వింటూ) ఆ కథ మీరన్నం పెట్టడంకోసం కల్పించింది. మీరు మళ్లీ అడిగేవరకు కొత్తకథ వచ్చింది. యెందుకూ మీ

కాపె చరిత్రలన్నీ ? చెవులు దోరలుబెట్టుకొని మరీవింటున్నారు. పుణ్యామా ? పురుషార్థమా ?

మా—నే చెప్పినదాంట్లో చింతాకంత అబద్ధంలేదు. చావడానికి సిద్ధంగా వున్నాకదా.

చౌ—చావడ మేమిఖర్మం. ఆకు తిరగబడ్డది. యీరోజునుంచీ మళ్లీ కొత్త కవులు ప్రారంభం. శాశ్వితపట్టా ఆడక్కపోయినావూ? నీవు లేకపోతే లోకానికి యెంతలోటూ. ఇట్లాగే వెర్రివాళ్లు దొరికితే కథలుచెప్పి బతుకుదువుగాని.

ల—ఆమాటలతో నీకెందుకు ? నీసంగతి పూర్తిగా జెప్పు.

చౌ— నే నిద్దరబోతాలెండి. వింటే యేదో అనవలసి వస్తుంది.

మా—వారంరోజులనాడు కొండకుబోతే యెవరో కొత్తయిజారాదారు పాట బాడాడు. ఆయన వారంరోజులదాకా చీటీయ్యడన్నారు. నాకు యెడమచెయ్యిగూడ నొప్పి. పైకిలేవదు. యేమిచుని చెయ్యగలను ? ముష్టికి పోవడానికి మనసొప్పక— ఎన్నడూ ముష్టికి పోయిందాన్ని కానమ్మా—మా కులంలో తప్పు—వూరగొండకు బోయి యింత బొడ్డాకు కోసుకొని వుడకబెట్టుకొని తింటున్నా. రోజూ అదేతింటే నవపక పాసనాలు బట్టినవి. అందువల్ల బొడ్డాక్కూ పోలేకపోయినా. పొద్దుగూకేవరకు సోషకు వచ్చింది. ఎంత ముసలిదానికైనా ప్రాణమంటే తీపికదా. నీవాకిట్లో వచ్చిపడ్డా. మీ కడుపులుచల్లంగా యిప్పటి కీ స్థితిలో వున్నా. రేపేమిగావలసి వున్నదో (అని కునికిపాట్లు పడ్డది.)

రా—ఇందాక అన్నం కొద్దిగా తిన్నావే. మళ్లీకొంచం తింటావా?

మా—వారంరోజులనుంచీ అన్నం తినకపోవడంచేత యింకా దింటే హరాయించుకోలేను. కడుపులో నొప్పి పుడుతుంది. మీరు పోయి పడుకోండయ్యా. నే నిక్కడే పడుకుంటా.

రా—కప్పుకోవూ?

మా—అలవాటు లేదు.

రా—చలిలేదా?

మా— మొదట వుండేది. కప్పుకోవడానికి గుడ్డలేక చర్మం బిరుసెక్కి చలి దూరనియ్యదు. తమరు బోయి పండుకోండి.

---

## పందొమ్మిదవ అధ్యాయం

రామానాయుడు మేడమీదికి పోయినాడు మేడమీది సావిట్లో దీపం వెలుగుతున్నది. మెట్లదగ్గిరతలుపు మూసి సావిట్లో పడకకుర్చీమీద పండుకున్నాడు. కూలివాండ్లూ, ముసలమ్మా జ్ఞాపకంవచ్చారు. "ముసలమ్మకు చలేలేదట. అలవాటుదప్పి అన్నమే తినలేకపోయింది. చలిమటుకు అలవాటు దప్పదా? ముసలమ్మ దురవస్థ సంగదాసు చూస్తే ఆలపటించేవాడు. అతడు చిత్రమైన మనిషి, మంచి మేధావి; యోగ్యుడు. దయాదాక్షిణ్యా లపరిమితంగా వున్నవి. నిర్వహించే నేర్పులేనిది పరోపకారబుద్ధి

వుండి ప్రయోజనమేమి? వొకకార్యం పూనుకున్నాడంటే వేయికండ్లతో కనిపెట్టి పనిచేస్తాడు. రేపటి కేమి ఆలోచన చేస్తున్నాడో కనుక్కుందా" మని గడియారం వంక చూచేవరకు పన్నెండు గావస్తూవున్నది. "నేను మధ్యాహ్నం తెగనిద్రపోయి నాను. అతడు దేహం వాల్చలేదు. అయినా చూతాం"మని మేడదిగి సంగదాను గది దగ్గరకు పోయే వరకు తలుపుసందులగుండా వెలుతురు వస్తూవున్నది. కొంచెం నిదానించి చూస్తే లోపల దగ్గినట్లు వినపడ్డది. తలుపు మునివేళ్లతో గొట్టి దాసూ! అని పిలిచాడు. దాసు లేచి తలుపు దీసి,

సం—నీవు యింకా మేలుకొనే వున్నావా?

రా—నాకు నిద్రపట్టలేదు. నీవూ పడుకోలేదేమి?

సం—యిద్దరం వొక అవస్థలోనే వున్నాం. నిద్ర పట్టించుకో.

రా—పైకి పోదాం రా?

సం—ఇశ్శో! అబ్బా! నే రాలేనండీ.

రా—ఇంతవరకూ బాగా మాట్లాడి యిప్పుడు ఆపసోపాలు పడతావేమి? వోల్లో నిన్ను కట్టివేయనులే. సాయంత్రం విషయంలో న్యాయపద్ధతి సంగతియెత్తి వదిలిపెట్టావు. చెప్పుదువుగాని రా.

సం—మంచిలగ్నం పెట్టారే. పొద్దున మాట్లాడగూడదూ?

రా—వస్తావా రావా?

తలుపు తాళం వేసి ఉభయులూ మెట్లెక్కుతున్నారు. చౌదరయ్య యావగల వాడు. రామానాయుడు వీధిమెట్లు దిగడం గనిపెట్టి యేమో కుర్రవాడు వొంటరిగా వున్నాడుగదా అని వూరుకున్నాడు. మళ్లీ యిద్దరు మనుష్యులు మెట్లెక్కినట్లు వినపడ్డది వుపేక్షించి వూరకున్నాడు. రామానాయుడూ, సంగదాసూ చెట్టాపట్టాలు పట్టుకొని వచ్చి సావిట్లో కుర్చీలమీద కూర్చోవడం కిటికీలోగుండా కనుపడ్డది. మనిషి కుప్పలు గూలిపోయినాడు. "వీరి వ్యవహారం శ్రుతిమించి రాగానబడ్డది. అయినా చూతాం" అనుకున్నాడు.

రా—దాసూ! సాయంత్రం వొక ముసలమ్మ సోషవచ్చి పడ్డది. నీవు చూస్తే మూర్ఛపడిపోదువు.

సం—నే చూస్తునేవున్నా. యిటువంటివి మాపల్లెలో అనేకం జరుగుతుంటవి. ఆ ముసలమ్మ మీ యింట్లో వచ్చిపడ్డది గనుక బతికింది గాని మా పల్లెలో ఈ విధంగా అనేకులు రాలిపోతూనే వుంటారు. వాండ్ల అవస్థ యెండకాలంలో వుంటుంది. కప్పల వలె యెంత జీవంతో వున్నవాండ్లు చినుకులు పడంగనే బెకబెకలాడి మీ ఆసాములకు పంటలు పండించటానికి వస్తారు.

రా—దాసూ! లోకవిషయం తెలిసినకొద్దీ నాకు మనసులో వేదన యెక్కువవుతున్నది. వీండ్లకు దిక్కేమి?

సం—నేను దేవుడే యేడుగడని తలంచేవాణ్ణి. తిక్కన జెప్పినమాటే నిజం.

కం. కారణము లేకయును నుప
కారపరత్వమున నొరులకార్యంబులకున్
వారని యలజడివడియెడు

వారేనూ యేడుగడయుఁ వసుధకు నధిపా.

ఈ నిర్భాగ్యులకొరకై అర్ధరాత్రి యైనా ఆవేశపడే మీబోటి పరోపకార పారీణులే దిక్కు. మా మేనత్త యీరోజు ఆసుపత్రిలో చచ్చిపోయిందట విన్నావా?

రా—అయ్యో! పాపం. ఆసుపత్రిలో శస్త్రం జేయలేదా?

సం—గూడదాకా పుల్లి శస్త్రానికి వీలుగా లేదట.

రా—కేసు పెట్టించి నేరస్తులను శిక్షించకపోతే యేమి ప్రయోజనం?

సం—అదీ అంతగానే వున్నది. వెంటట మా వాండ్లు యీకేసు రిపోర్టే చేయలేదు. అంధేరాగా వూరకొన్నారు. చచ్చిపోకముందు డాక్టరు మరణవాఙ్మూలం పుచ్చుకున్నాడట. అదన్నా వుంటే కొంతపని జరిగేది. మీ నాయన శిక్షచేత మాకు పూతమిచ్చి తనమీద పనిచేయిస్తాడేమోనని మనసబు నిన్న సాయంత్రం బోయి డాక్టరును కిట్టుకొని అయిదువందలరూపాయలు ఖర్చపడి వాఙ్మూలం తీసి పారవేయించి శస్త్రంజేస్తే వాయిగమ్మి చచ్చిందని వ్రాయించాడట.

రా—ఈ నేరస్తులు శిక్షనుపొందే మార్గమేమిటి?

సం—దేవునికే వదలిపెడదాం. భాగ్యవంతులు ఆయననుగూడా లోబరచుకోకపోతే వచ్చేజన్మలోనైనా శిక్షిస్తాడు.

రా—దాపూ! నాకు రానురాను మనసు వికలమైపోతున్నది. ఇంకో జన్మలో శిక్షిస్తాడంటావు. ఏ జన్మలో శిక్షించినా యీ తప్పు జేసినందుకు యీ శిక్షని తెలిసేటట్టు శిక్షిస్తే ప్రయోజనమున్నదిగాని వూకవుమ్మడిగా సంచితమంతా వొకగాదెలో బోసి ప్రారబ్ధమని పేరుబెట్టి జన్మబత్తెం చేటలా బోసి తినమంటే యేమి ప్రయోజనం? శిక్ష త్వరగా అనుభవించినా, ఆలస్యంగా అనుభవించినా, ఇందుకని తెలియకపోతే శిక్షించిన ప్రయోజనంగూడా లేకపోయింది.

సం—నేను త్వరగా భగవంతుడి దగ్గరకుబోయి యీ పద్ధతిని మార్చమని సవరణ నిమిత్తం దరఖాస్తన్నా పడవేస్తా.

రా—ఆయనకు పురాణపురుషుడనిపేరు. యిన్నాళ్లనుంచీ నేర్చుకోంది కొత్తగా ఆయనకు రావచ్చిందా. “నే నింత పెద్దవాణ్ణి. జిట్టెడులేవు. నాకు నీవు సలహా చెప్పవచ్చావా” అని నీ దరఖాస్తు తోసివేస్తాడు. అందాకా యెందుకు? యిక్కడనే పది కాలాలపాటు బతికి యీ నిర్భాగ్యులకు వుపకారంచేస్తూ చాలూ.

సం—అది మన వశమా?

రా—అట్లా అంటివేమి?

సం—యేమన్నా?

రా—నీవు వశమా అన్నప్పుడు నీ ముఖం యేదోపాలిపోయి నిర్జీవంగా కనపడ్డది

సం—దాని కింతాలోచ నెందుకు? వుత్తరక్షణం మందిగాదు. నా ప్రయాణానికి అడ్డంకి వచ్చిందే. అది తీర్చుకోవద్దా?

రా—ఏమి అడ్డు వచ్చింది?

సం—శవాన్ని రేపు తెల్లవారేవరకు యిక్కడికి తీసుకొనివస్తారట. మేము కాకులకు వేసేవాండ్లం గాదు. శవాన్ని పారవేసి కలాపమంతా వగదెగి నచ్చేవరకు రైలు మిగులుతుంది.

రా—వాన వొకలాగ తోస్తున్నది. నేను వుదయంబండికి వెళ్లి కమీజాలకూ, కుళాయీలకూ గుడ్డపట్టించుకొని సిద్ధంగా వుంటాను. నీవు సాయంత్రం యెనిమిదిగంటల బండికి వస్తే భోజనంచేసి వెంటనే బైలెక్కవచ్చు.

సం—నేను నాలుగురోజులు పనిలోకి రానని మీనాయనగారితో చెప్పివస్తాను

రా—రేపు మన మిద్దరమూ యిక్కడ లేకపోతే కూలీలవ్యవహారం చెడుతుందేమో?

సం—యేమవుతుంది? వరికోతలదాకా నడుతుంది. మనం యిప్పుడే వెళ్లడం అవసరం.

రా—మానాయనగారు యీవిషయాన్ని దాక్షిణ్యదృష్టితో చూడటానికే ప్రయత్నించరు. ఆయనవిషయమై మనం ఆశ వదులుకోవలసిందే.

సం—ఇంతవరకూ స్పష్టమే. అక్రమమైనా తనకోపు నిర్వహించుకోవాలనే బాగా పట్టుదలగూడా వున్నట్టున్నది. చిన్నపరెడ్డి కొంచెం పట్టువిడుపులుగలవాడు. మీనాయనగారు వుశీయందీ ఆయన పైకిరాడు మీనాయనగారిని మార్చడం నాచేతగాదు. ఆయనహృదయవీణను తీగెలంటే సప్తస్వరాలూ విజృంభింపజేసి నవరసాలు వొలికేటట్టు పలికించేవాడిని. శ్రీకృష్ణునియొక్క వేణుగానసహితం ఆయనహృదయ శైలాన్ని ద్రవింపజేస్తుందని నాకు నమ్మకంలేదు. దుర్మార్గుడు లోకానికి విభ్రాంతం గలిగేటట్టుగా ధర్మశూరుడికి అపాయంజేస్తే అందువల్లనే ధర్మప్రతిష్ఠాపనకు తోడ్పడడం తటస్థించినప్పుడో లేక స్వార్థపరుడు తన స్వప్రయత్నాలకూ స్వగౌరవానికీ పూర్ణమైన వ్యాఘాతం కలిగేటప్పుడో లొంగిపోవచ్చు. ధర్మవిజయ మెప్పుడూ బలి గోరుతుంటుంది. ధర్మనిర్వహణకై సోక్రటీసు విషం గ్రహించాడు. క్రీస్తువు శిలువ నెక్కాడు. ప్రహ్లాదుడు సమస్తకష్టాలు పడ్డాడు. హరిశ్చంద్రుడు సర్వత్యాగం జేశాడు. అమరుడు శిరశ్ఛేదం బొందాడు. రామానుజశిష్యుడు అంధుడైనాడు. సారంగధరుడు కరచరణచ్ఛేదమును బొందాడు. కన్యక అగ్నిప్రవేశమయింది. హేమలత ఆత్మహత్య గావించుకొన్నది. తిలక్ మహాశయుడు నిరంతరకారాబద్ధుడైనాడు. పశువధ లేనిదే యజ్ఞం లేదు. పశువులన్నిటికంటే వుత్తమమయింది స్వార్థపశువు.

రా—నాకొక సందేహం బాధిస్తున్నది. నీవిచ్చిన దృష్టాంతాలవల్ల బలమైంది. పాపకర్మలకు శిక్షవున్నదా?

సం—పాపములు కొన్ని వొక్కరిని బాధిస్తవి. మరికొన్ని లోకకంటకాలుగావుండి అనేకులను బాధిస్తవి. వొక్కొక్కవ్యక్తినిమాత్రం బాధించేపాపాలకు వెంటనే సాధారణంగా శిక్షకనబడుతుంది గాని ధర్మాన్ని నిరోధించే లోకకంటక కార్యాలకు శిక్ష వెంటనే కనబడదు. శిక్షలు భిన్నంగా వుంటవి. ధర్మనిరోధప్రయత్నంలో బాధకలుగజేసేవాండ్లకూ బాధపడేవాండ్లకూ ప్రత్యేకవ్యక్తిత్వ ముండదు. ప్రత్యేకవ్యక్తులయొక్క జయాపజయాలకు ధర్మవిజయంతో సంబంధంలేదు. భారత యుద్ధములో వుభయపక్షాల పోరుతుండే మహాపురుషులూ నశించారు. పాండవులది ధర్మపక్షమయితే వారిపక్షంవా రేల నశించారు? కౌరవులది అధర్మపక్షమయితే వారిపైపున కొంద రేల మిగిలారు? అనిప్రశ్నలు పుట్టడానికి అవకాశం లేదు. యెందువల్ల? భారతయుద్ధంలో ప్రత్యేకవ్యక్తులకు పోరాటం లేదు. ప్రాణస్నేహితులూ సహితం

తమున్నేహాన్ని విడువకుండానే పృథక్పక్షాలా వుండి పోరాడారు. విజయం ధర్మపక్షమయిన పాండవపక్షాన నిలిచింది. ఆవిజయం పాండవపక్షం వారి కందరికీ కలిగినట్లే దుర్యోధనుని అపజయం రథికత్రయానికి కలిగినట్లే. పై చెప్పిన మహానుభావులు పడిన బాధలు వారి కపజయములు గావు. వారు పూనిన ధర్మానికి బలియై ధర్మస్థాపనకు మార్గమేర్పరిచారు. వారిశత్రువుల కది అపజయమే. ప్రత్యేకవ్యక్తుల పాపపుణ్యాల గూర్చి మనమిప్పుడు విచారించవలసివున్నది.

రా__ఆప్రశ్ననిలిపి కూలీలకు న్యాయంగా యెంతరావలసివుంటుందో చెప్పు. నిన్నసాయంత్ర మీ విషయం ఆపివేశావు.

సం__ఇప్పుడు పనివాండ్లకిచ్చే కూలి చాలదు. యంత్రాలలో పనిచేసే కూలిలకు సంవత్సరంపొడుగునా పనివుండి కూలి విడువకుండా దొరుకుతుంది. వ్యవసాయపుకూలీల కట్లా గాదు. వ్యవసాయదారుకు సంవత్సరంలో వొకటిరెండు తరుణాలలో పంటయావత్తూ చేతికి వస్తుంది. మెట్టపైర్లకు వేసేటప్పటికంటె కోసేటప్పుడు కూలీలఅవుసర మెక్కువ వుంటుంది. పునాసా. పయిరా అని మెట్టపైర్లు రెండు కాలములలో రావడంచేత రెంటికోతలకూ కూలీ లవసరమవుతారు. పల్లపుపైర్లకు ఆ బేధం లేకపోయినా నాట్లకూ, కోతలకూ రెండుసార్లు కూలీలు కావలసివస్తారు. కొంచెం పెద్దవ్యవసాయం గలవాండ్లకు సంవత్సరపుజీతగాండ్లు వ్యవసాయము చేస్తుంటే ఆసామి తనిఖీ చేస్తుంటాడు. సన్నకారు రహితులు జీతగాండ్లపనిగూడా తామే చేస్తారు, సాధారణంగా భూమిలో పండేపంటకు నలుగురు హక్కుదార్లు వున్నట్లు తెలుస్తుంది. మందీ లేక ప్రభుపూ అసలు హక్కుదారుడు అతనివల్ల కవులు పొంది వ్యవసాయం తనిఖి చేసే ఆసామి రెండవవాడు వ్యవసాయపుపనులు నిర్వహించే కమతగాడు లేక జీతగాడు మూడవ హక్కుదారుడు. నాలుగవవాడు కూలీ. ప్రస్తుతపు స్థితిగతులనుబట్టి పై నలుగురిలో మొదటివారు తరువాతి వారికంటె ఎక్కువ ప్రాముఖ్యతను గలిగివున్నారు. నిజం విచారిస్తే ప్రాముఖ్యత పైవాండ్లకంటె తరువాతి వాండ్లకే ఎక్కువ యియ్యవలసి వుంటుంటుంది. లేక భూమి హక్కునుబట్టి విచారిస్తే మొదటివారికీ, పనినిబట్టి విచారిస్తే చివరవారికీ ప్రాముఖ్యత యియ్యవలసి వుంటుంది. జీతగాండ్లు లేనిచోట రెండుమూడు సంఖ్యలవారు వొక్కరుగానే వుండవచ్చు. తనిఖీదారుకు తన కవులుహక్కు మాత్రమే గాకుండా పశువుల పెట్టుబడికూడా పెట్టవలసివున్నది. గొడ్డం మగపశువులకు ఆడపశువులకు వదలిపెట్టే యెడల యెనుపు అందరూ హక్కుదారులకూ వుపయోగించినా ఆడపశువులకు పుట్టిన మగదూడలు యెద్దులలో నశించినవానికింద తీస్తె శేషించిన ఆడదూడలో పాడీ ఆసామికి లాభించిన వస్తుంది యెద్దుల పెట్టుబడికి యీ లాభమే సరిపోవచ్చు, కాబట్టి పండినపంటలో వొకటి రెండు సంఖ్యల హక్కుదార్లకు మూడవవంతు; కూలీలకు మూడవవంతు, కమతగాండ్లకు పూర్వపు మామూలుప్రకారము నాలుగోవంతు, మిగిలిన పన్నెండోవంతు తనిఖీకింద గాని యెద్దుల పెట్టుబడికిగాని పంచిపెట్టవలసి వుంటుంది. న్యాయంగా చూస్తే తనిఖీదారుకు తనిఖీహక్కు, పెట్టుబడి హక్కు తప్ప యితర హక్కులులేవు. క్రౌలు హక్కు నామమాత్రం. వొకటవ హక్కు జవాబుమాత్రం చేయవలసి వుంటాడు. కూలివాండ్లకు వచ్చే మూడవవంతు ఆదాయము మక్తాగా కూలిలకిస్తే మామూలుకంటే యెక్కువ

త్వరగా పనిముగించి పనిలేనప్పుడు వుపయోగించుకుంటూ తమ విరామకాలమును యిప్పటివలె పశుప్రాయులుగా వుండకుండా తమ జ్ఞానాభివృద్ధికి, దేశక్షేమ నిమిత్తం పాటుబడడానికీ రాజకీయ సాంఘిక మతవ్యవహారాలలో జోక్యం కలిగించుకోవడానికీ వుపయోగపడుతుంది. అట్లాగాకపోతే కృషి వాణిజ్య పాశుపాల్యాదాయములు కొందరి చేతులలోనే చిక్కి, మరికొందరు సంవత్సరమున కారు నెలలు అన్నంలేక మాడుతుంటే మరికొందరు భోగపరులై అమితవ్యయాలు చేయడానికి అవకాశములు గలుగుతున్నవి. కూలీలకు చదువువస్తే కూలిపని చేస్తారా అని కొందరికి సందేహం. తెల్లవాండ్లలోనూ జపానులోనూ యెక్కువ కూలియిచ్చినా చదువుకున్న పనివాండ్లు కావలె నంటారు. యిప్పటి పరిస్థితులు మారడానికి సంఘధర్మాలుగూడా అడ్డంవస్తున్నవి. అలగావాండ్లకు అన్నంవొరికే మార్గం జూపకుండా సాంఘిక హక్కులిచ్చినా ప్రయోజనకారులుగావు. అవి నిలుపుకొనే శక్తిగూడా వారికుండదు. "సర్వేగుణాః కాంచన మాశ్రయంతే" అని ధనాకర్షణ మార్గాలు చూపించనీ, తక్కిన మంచిగుణాలు అలవాటుపడవు. కాబట్టి అలగాజనుల అర్థస్థితి బాగుజేయడానికి ముందు ప్రయత్నాలు చేయవలసివుంటుంది. చేతిపనులు మొదలయినవి నేర్పి కొందరికి వృత్తులు గల్పించవచ్చు. కాని అది ప్రస్తుత విషయంగాదు.

రా—సంగదాసూ! నీవిక వెళ్లి పడుకో. నీవు బద్ధకించినా బలవంతపెట్టి తీసికొని వచ్చినందుకు క్షమించు.

స—నాబద్ధక మెంత. పొద్దున నీవు ప్రయాణం జేయవలసినవాడవు నిద్దురబో. యిప్పుడు వెళ్లి నేపడుకుంటే ఈవిషయాలు తెల్లవారినే మళ్లీ రమ్మన్నదాకా నా మనసుకురావు నాకవసరమనితోస్తే యీ తలంపులన్నీ తోసివేసి సాయంత్రం యేడుగంటలకే నిద్రబోగలను. యీ అలవాటు లేకపోతే వుద్యమాలు నెత్తినవేసుకొని తిరిగేవాండ్లకు నిద్రాభంగమై ఆరోగ్యం చెడుతుంది.

రా—నాకది చేతగాదు. యీరాత్రి నాకు నిద్రపట్టుతుందని తోచదు. అయినా ప్రయత్నిస్తాను.

యిద్దరూ లేచీ తమ గదులలోనికి పోయినారు.

చౌదరయ్య తూచాలు బోకుండా విన్నాడు. సంగతులన్నీ మననంజేసి ఆలోచించాడు. మాలవాడు పిల్లవాణ్ణి చెడగొట్టినట్టే. ఏడి సావాసం వదిలించి వేరేవ్యాపకంలో పెడితేనేగాని కుదటబడడు. రామేశంగారితో మాట్లాడి పిల్లవాడిని మెడలు విరిపించి వుద్యోగంలో ప్రవేశపెడితే ఆ ధోరణిలోదిగి పడివుంటాడు. వీండ్లిద్దరూ రేపు వూరికిపోవడం బాగానే వున్నది. యే గురువునో చూచివస్తాడు. ఈలోగా కూలీల వ్యవహారం ఫైసలు చేసుకోవచ్చు. యీరోజు కూలీ పూర్తిగా యిచ్చాం గనుక రేపు వూళ్లోవున్న కూలీలనందరిని పోగుజేసి జొన్నకోత పూర్తిజేయవచ్చు. యేమయినా కురదలా వుంటే జీతగాండ్లు నెమ్మదిగా కోస్తారు. రేపుసాయంత్రం ఆరణాలకాడికి యిష్టముంటే పుచ్చుకోండి, లేకుంటే మానండని బెట్టుబెడితే సంగడు వుండడు గనుక దక్కినస్తూ తీసుకుంటారు. యెల్లుండినుంచి వూళ్లో ఆప్రకారమే జరుగుతుంది. వోపలేని

వాండ్లకు వద్దనేవాండ్లు కన్నతల్లి. వొకదారిబెట్టి సాగిస్తే యెక్కువ యిస్తాననే వెట్టి ఆసామీ యెవడూ వుండడు. పోతుగడ్డ మనవూళ్ళ నిలిస్తే తక్కినవూళ్లు నిలవడానికేమి? నలుగురు కూలీలూ వొప్పుకొని పనిజరిగిపోయిన తరవాత ఆందోళన చప్పబడుతుంది. వరికోతలప్పటికి కొత్తపద్ధతి పాతబడిపోతుంది. మాలవాడుమటుకు కెర్లిస్తూనే వుంటాడు. వాడెప్పటికైనా గడ్డే.

# ఇరువదవ అధ్యాయం

## మాదిగన్నం

సంగదాసు చీకటితో లేచి యింటికి బోయినాడు. రైలుకు వెళ్లడానికి అయిదు గంటలకల్లా యెద్దుబండి వాకిట్లో నిలవబడ్డది. వెంగన్న ట్రంకుపెట్టె బండిలో పెడుతున్నాడు. రామానాయుడు తల్లితో చెప్పి బండెక్కడానికి వాకిట్లో వచ్చేసరికి తండ్రి అదివరకే యెక్కడికో వెళ్లి వాకిటిదగ్గిర యెదురుగా వచ్చాడు. రామానాయుడికి ఆయనను చూడంగనే మనస్సులో డక్కుమన్నది. యేమన్నా అవనీయు మని మెల్లగా "నాయనా! నేను రైలుకు పోతున్నా" నన్నాడు. "సరే వచ్చేటప్పుడు పిల్లలను తీసుకొనిరా" అని చౌదరయ్య లోపలికి పోయినాడు. రామానాయుడికి ఆశ్చర్యమైంది. పిడుగులు వర్షిస్తవని భయపడ్డంనుకు మబ్బు తేలిపోయింది. బతుకు జీవుడా అని బండిలోపడ్డాడు. తానెక్కడికిబోయేదీ. తెలియకపోవడమే యీ శాంతానికి కారణమైయుంటుందని వూహించి రైలందదేమో యెద్దు నదలించమని వెంగన్నకు జెప్పి కునుకుతూ జేరగిలబడి కూర్చున్నాడు. "జా" అని ఒకపర్యాయం తోకమట్టు కదిపి వెంగన్నగూడా ట్రంకుపెట్టెమీదికి వొరిగాడు యెద్దుగూడా కొంతసేపు అడుగులు లెక్కపెట్టి విసుగెత్తి బండి లంకలోకి తొలిగించి వూరకోవడమేమని మెయ్యడం ప్రారంభించింది. రామానాయుడు దీర్ఘాలాపనలోబడి వుదయం తండ్రియెదురుపడ్డప్పుడు గుండె గుబుక్కుమనడం దృష్టికి వచ్చి తుళ్లిపడిలేచి వెంగన్న నిద్రపోవడం జూచి తమముగ్గురిలోకి యెద్దే బుద్ధిమంతురాలని వెంగన్నను లేపేవరకు అతడు గొణుగుతూ "నన్నేమి చెయ్యమంటారు? బండి అరకై ఆగిపోయింది. వెనక్కుసద్దుకోం"డని తరమడం ప్రారంభించాడు. బండి గేటుదగ్గరకు వొచ్చేవరకు రైలువచ్చేవేళయిందని పోర్టరు పెండిం తియ్యలేదు. బండి అక్కడ ఆపి ట్రంకు వెంగన్న నెత్తిన బెట్టి రైలుకట్టమీదుగా స్టేషనులోకి బోయి టికెట్టు తీసుకుండేవరకు రైలు పొడగట్టింది. ట్రంకు రైలులో బెట్టించుకొని జాగ్రతగా కూర్చున్నాడు. ఆది వేగానికి పేరుపడ్డ దక్షిణమహారాష్ట్రరైలు. మందగమనంయొక్క రీతులుజూపింది. తాగుబోతువలె ముందుకువూగింది. పక్కలకు సోలింది. సంగీతం బాడి వెనుకకు తట్టుకున్నది. నిలుచబడ్డది నీళ్లువెళ్లగాసింది. పొద్దుటిమోస్తరుగా లంకలోకి దిగి మేత మేస్తున్నదేమో అని రామానాయుడు తొంగిచూచాడు. మేత మేయడంలేదు. కాని నీళ్లు తాగుతున్నది. అలుపు తీర్చుకున్నది. తటతటలాడి కొంతదూరం పరుగెత్తి స్టేషనులో ఆగింది. తూర్పుబండి అప్పుడే వస్తున్నది షుమారు వొకవూరిజనం ప్లైదానంమీద నిలవబడ్డది. వ్యవధానం వుందని తెలిసినా యావత్తుమంది రెండుబండ్లనూ

వొక్కమాటు మట్టడించారు. లోపలివాండ్లు అరుంధప్రాణులై మోహరించి నిలవబడ్డారు. శకటవ్యూహంలో ప్రతిద్వారం దగ్గరా పోరు ఘోరమైంది. ద్వంద్వయుద్ధం సాగింది. ట్రంకులకు ట్రంకులు మోటించారు. బాహాబాహి ముష్టాముష్టి ట్రంకాట్రంకిగా కొంతవరకు యుద్ధం నడిచి తుములసంగరములోకి దిగింది. నలిగినకాళ్లూ విరిగినవేళ్లూ గీచుకున్న గోళ్లూ చిరిగినరుమాళ్లూ రణరంగమును భీభత్సం గావించినవి. రణముఖాన పలురంగములలో యోధులు బలాబలముల ననుసరించి జయాపజయములు సమకూడినవి. పెళ్లిమేళానికి బోయే తవసానిని బంపవచ్చిన వైశ్యయువకుడు మెరుములమధ్యయున్న మేఘంవలె ప్రకాశిస్తున్నాడు టికెట్లకోసంబోయి రాని తనతండ్రికై వొక గొల్లపడుచు కొండకేకలు పెడుతున్నది. ఒక సౌమాసి మూట నెత్తినిబెట్టుకొని తాంబూలంనవిలి దవడలుతాటిస్తూ అడుగులను ననుకరించి చెవుల కుండలాలు తాండవమాడుతుండగా పరుగెత్తుకునివచ్చి మూటదించి రైలెక్కి ఆతొందరలో మూటమరచి టికెట్టు పారవేసుకొని బండెక్కి కూర్చున్నాడు. వొక నిర్వ్యాసంగుడు స్టేషనుదగ్గర ఫలహారం జేసి రెండవతరగతి బండివద్ద నిలిచి పక్కబండినిచూస్తూ ఆనందిస్తున్నాడు. రామానాయుడు సెకండుక్లాసు బండిదిగి విశ్రాంతిగదిలో సామాను బెట్టించి వూళ్లోకి బయలుదేరాడు; వూరుచూడంగనే మనస్సునకొకవిధమైన ఆనందం కలిగింది. విశాలమైనవీధులూ చక్కనిరోడ్లూ, నీడలనిచ్చు వేపవృక్షములూ, తెల్లని సూర్యకాంతులూ, హృదయానికి వికాసం కలిగిస్తున్నవి. స్టేషనుమైదానములమీద మిరపకాయలబోరెంలూ, దూదిబేళ్లూ, కుప్పతిప్పలై ఆపట్టణంయొక్క వాణిజ్య వైభవాన్ని చాటుతున్నవి. కళాశాలాగోపురం ఆంగ్లవిద్యజదువుబాలుర ఆరోగ్యం వలె పైకిబోయినకొలదీ సన్నగిల్లుతున్నది. ఈపట్టణంలో నీళ్లు మధ్యం. కత్తెరగుండ్లు మృగ్యం. జనులు దేహబలమూ చురుకుదనమూ గలిగి భోళాతనం ముఖములప్రకటిస్తూ వుత్సాహంతో అనేక వుద్యమాలలో పాల్గొంటారు. ఆధునికులు యీవిషయములు కొన్ని నాగరికానికి భంగమని తలుస్తారు. యిప్పటి నాగరికలక్షణాలు కొన్ని లేవనే చెప్పవచ్చు.

రామానాయుడు కోడిస్తంభంమీదుగా గుడ్డలకొట్లకుబోయి చొక్కాలు చింపించుకొని, కుడితినీలూ కమీజులూ పూర్తాయించి కట్టించి స్టేషనుకువచ్చి భోజనం చేసి విశ్రాంతిగదిలో పండుకున్నాడు.

సాయంకాలమైయింది. యేడైంది యెనిమిదైయింది. గుప్పిటపట్టుకోవడానికి వీలయ్యేటట్టు చీకటి దట్టమైంది. వెలుతురు అంధకారాన్ని నెట్టుకొనిరావడం కష్టంగా ఉన్నది. గంటకొట్టారు. కేక వినబడ్డది. రామానాయుడు బయటకివచ్చి పడమటగా చూచాడు. అంధకార సముద్రంలోనుంచి వొక పెద్దవెలుగు బొబ్బటిల్లుతూ కొట్టుకొని వస్తున్నది. అంధకార గర్భంలోనుంచి వొకటి తరువాత మరియొకటి వెలుతురు గూళ్లు బయల్పడ్డవి. మైదానంమీద చీకటిపాపలు బండి వెంబడి పరుగెత్తుతున్నవి. రామానాయుడు ప్రతిబండీ చూస్తూ వచ్చాడు. సంగదాసు గాలిపడిగెవలె నేలమీద వ్రాలాడు. ట్రంకు కిందికి దింపుకుంటూవుండే రామానాయుడు తోడుపట్టాడు. ఎవరో యిద్దరు మనుష్యులు బండిలోకెక్కి కెంగానికి పట్టె చాటుజేసి చూస్తున్నారు.

సం—పెట్టెలు యిక్కడబెట్టి భోంచేసి వత్తామా?

రా__వూళ్లోకిపోయి రావడం కష్టం. స్టేషనులోనే భోజనం మన యిద్దరికీ తయారు చేయించాను.

సం__యిక్కడ నీచుకలుస్తుందేమోనే ?

రా__నీచుకలవకుండా ప్రత్యేకం శాకాహారమే చేయమని చెప్పా.

సం__నీవు తొందరపడుతున్నావు. వ్యవహారం చెడుస్తుంది. ముందు చేయవలసిన పని చాలా వున్నది.

రా__ఇది ముందుచేయవలసిన పనే

సం__"వేగిరించ నేదియూ విషమము" నని నీతివాక్యమున్నది.

రా__"ఆలస్య మమృత విషం" అనేదికూడా నీతివాక్యమే.

సం__ఈ నీతులను దేశకాల పాత్రము లెరిగి వుపయోగించవలసి వుంటుంది.

రా__అది నే నంగీకరిస్తాను.

సం__పరే అభిప్రాయభేద మంటావు. పోదాంపద. అయితే బెజవాడకు రెండు గంటల బండిలో పోదామా ?

రా__నీవు తర్కాలుమాని త్వరగా పని తెమలనిస్తే యీబండే అందవచ్చు.

సం__పద.

వీరిని చూడంగనే కుసినీవాడు బల్లమీద తెల్లని దుప్పటిరేకు పరచి, రెండు కుర్చీలు బల్లకుదగ్గరదోసి రెండుపింగాణీ పళ్లాలు బల్లమీదబెట్టి యెడమవైపున ముళ్లగంటా కుడివైపున కత్తీ యెదుట చెంచాలూ పెట్టి రెండుతట్టలతో అన్నం కూర తెచ్చి బల్లమీద పెట్టాడు.

రా__నీవే వడ్డించు.

కుశిని__యెస్సార్.

రా__శుభ్రమయిన వడపోసిన నీళ్లు తీసుకొనిరా.

కు__మంచిరకాలు వున్నవండి సార్.

రా__నీళ్లే తీసుకురా.

కు__ఎస్ సార్.

రా__కొంచం వేయి.

కు__యెస్సార్.

సం__యీ కత్తులూ కఠార్లూయేమి చెయ్యాలూ ?

రా__వుపయోగించు.

సం__లైసెన్సు కావలేనేమో! యీ తగాదా యెందుకు? ఇవి అవతలబెట్టి చెంచే ఉపయోగిస్తాను.

రా__తరువాతేమిటి ?

కు__పుడ్డింగు సార్. వెరీ నైస్ సార్.

రా__తే.

కు__యెస్సార్.

సంగదాసు కొంత భోజనంజేసి మాట్లాడుతూ చంచా తనవైపుపెట్టి కూర్చున్నాడు. యింతలో కుసినీవచ్చి యిక భోజనం చాలించాడని పళ్లెం యెత్తుకొనిపోయి

వాడు. సంగదాసు మాటలసందడిలో యీసమరచి గమనించలేదు—కొంతసేపటికి

సం—అయ్యో! నా పళ్లెమెత్తుకొని పోయినాడేమి?

క—మీరు వదిలివేస్తే తీసివేశానండి.

రా—యింకా యేమైనా వున్నదా?

క—నోమోర్ సార్.

రా—బిల్లు తే.

క—ఈపూటకు అయిదురూపాయలు సార్.

రామానాథుడు రెండుపూటలకు కలిపి యెనిమిది రూపాయిలూ పైగా వొక అర్ధరూపాయి యీనామూ పళ్ళెంలో పెట్టాడు.

క—థ్యేంక్యూ సార్.

సం—నాయుడూ! నీకేమైనా మతిపోయిందా యేమి? యీతిండేమిటి? యీ డబ్బేమిటి?

రా—మతిపోయిన పనులే. మనమిక రావద్దులే.

ఎవరో యిద్దరు మనుష్యులు వాకిటికి రెండుమొత్తల చాటుగా నిలువబడి వింటున్నారు.

రా—యెవరు వారు?

ఒకడు—నేను మునసబును,

రా—అక్కడ నుంచున్నారేమి? లోపలికిరండి.

మునసబు—మీరు భోంచేస్తున్నారు గదా అని యీకడ వున్నాం? మీరు రైలుకు వస్తారేమో కనుక్కుందామని యిటువచ్చాం. మీరు వస్తె యీరాత్రే యింటికి పోవచ్చు.

రా—మేము బెజవాడ పోతాం.

ము—బెజవాడేమి పని?

సంగదాసు మొగం చిట్లించుకొన్నాడు.

రా—అక్కడ రేపు పెద్దసభ జరుగుతుంది.

ము—సభాపతి యెవరు?

రా—వెంకటరెడ్డిగారు.

ము—మా రెడ్లసభా యేమిటి?

రా—కాదు. పంచములది. ఆదిమాంధ్రులసభ అంటారు. వెంకటరెడ్డి రెడ్డిగాదు పూరక పెట్టుకున్న పేరు.

ము—మాల చాదర్లుగూడా వున్నారా?

రా—వున్నారేమో!

రెండవవాడు—లేకేమి.

ము—పంచములకూ ఆదిమాంధ్రులకూ భేదమేమిటి?

రా—పంచములంటే అయిదవ కులంవారు. ఆదిమాంధ్రులంటే యీ వరసకు సంబంధం లేనిపేరు.

ము—పంచములసభకు మీరు వెళ్లుతున్నారేమి?

రా—అభిమాన మున్నవాండ్లు యెవరైనా వెళ్లవచ్చు. మీరు వస్తారా ?

మా—ఇక్కడు విసులుబాటు లేదు. అయితే అక్కడికి పోవడానికి ముందు మాదిగకూడు తినవలెనా యేమి ?

రా—అన్నం మాదిగన్నమా ?

రెండవవాడు—వండి వడ్డించేవాడు మతంలో గలిసిన మాదిగ. శంకించి భోంచేసేవాడు పచ్చిమాల. కాబట్టి యిది మాదిగన్నంకాదు ? యింతమాత్రం నీకు తెలియదా ?

రా—తగవులాటకు వచ్చారా ?

ము—వూరికే అడిగాం దీనికి తగవేమున్నది.

రా—భోంచేశాం. యేమిచేస్తారో చెయ్యండి.

ము—మరే. మే మేమి చెయ్యగలం ? భాగ్యవంతులు యేదిచేసినా చెల్లుతుంది.

రెండవవాడు—వాండ్ల వూసు మన కెందుకు. మనం పోదాంపద. మునసబు కరిణీ వాడికి సైగచేశాడు. వాడు వొక సీసా దీసుకొని పక్కదారిన మైదానంమీదికి వచ్చి మునసబు కిచ్చి తిరిగి లోపలికి వచ్చాడు.

రా—ఏమిటోయ్ ఆదీ ?

క—కొత్తరకం జొన్న.

రా—డబ్బియ్యలేదేమి ?

క—మాకు ఖాతాదారండి. వందరూపాయిల వరకూ యీయనకు పెట్టుబడి పెట్టవచ్చునని కంపినీ వుత్తరువున్నది.

సం—రామానాయుడూ ! యేమీ ప్రపంచం !

రా—సంగదాసుకు తెలియనిదికూడా ప్రపంచములో కొంతభాగమున్నదని సంతోషిస్తున్నాను.

స—ఘంట కొడుతున్నారు పద.

వుభయులు ట్రంకులు పట్టించుకొని బండెక్కారు.

---

## ఇరువదిఒకటవ అధ్యాయం

# వర్ణాశ్రమములు

రాత్రి పదిగంటలయ్యేవఱకు బండి బెజవాడ బోయింది. స్టేషను దగ్గఱకు కార్యదర్శులలో వొకరైన రామేశ్వరరావూ కొందరు బాలభటులూ ప్రతినిధుల సాహ్వానం చేయడానికి వచ్చారు. ప్రతినిధులకు పాకలలోనూ అభిమానులకు సత్రం లోనూ వసతులు యేర్పరచబడ్డవని చెప్పారు. రామేశ్వరరావుగారు సంగదాసును విచారించి "తమరు సభాపతిగారి పాకలో బసచేసి రేపుసాయంత్రం విషయ నిర్ణయ సంఘంలో పెట్టవలసిన చిత్తుతీర్మానములను వారితో సంప్రతించి తయారు చేయవలసినదని ప్రార్థన.

సంగ—సభాపతిగారు యెప్పుడు వచ్చారు ?

రా—యీ సాయంత్రమే వచ్చారు.

సం—నా స్నేహితులొకరిని సభాపతిగారి పాకకు తీసికొని పోవచ్చునా ?

రా—అభ్యంతరం లేదుగాని, మీకు ఇరుకుగా వుంటుందేమో.

సం—యేదో విధంగా సర్దుకుంటాం.

రామే—బాలభటుడెక్కడయ్యా ? వీరిద్దరినీ బండికుదిర్చి సభాపతిగారిబసలో దించండి.

రామానాయుడూ సంగదాసూ జట్కాబండెక్కి సభాపతిగారి బసకు పోయ్యే వరకు వారప్పుడే భోజనంచేసి తాంబూలం వేసుకుంటున్నారు.

సం—నమస్కారమండీ నేను సంగదాసును.

వెంకటరెడ్డి—ఆహా ! సంగదాసుగారా ! మీ కోసమే యెదురు చూస్తున్నాను. కుర్చీలో దయచేయండీ. తమరుకూడా కుర్చీలో దయచేయించండి. వారి నామధేయం ?

సంగ—వారు నల్లమోతు రామానాయుడుగారు. వారికి మన సంఘముమీదగల అభిమానం ఇంతని చెప్పడానికి వీలులేదు.

వెం—నాకు ఆశ్చర్యం వేస్తున్నది. రామేశ్వరరావుగారికి రామచంద్రచౌదరి గారికి మనయందుగల అభిమానంలో శతాంశమైనా మనవాండ్లకుంటే మన సంఘం బాగు పడిపోను. యిక రామజోగిగారూ, భీమసేనరావుగారూ తమ జీవితములనే మన సంఘ సేవకు ముడుపుగట్టారు; దీనినిబట్టి చూస్తే మనసంఘానికి ముందు మంచిరోజులున్నవని తోస్తుంది.

రా—మా అభిమానం యెంత. యిదివరకు మా సంఘాలు దిగువజాతులకు చేసిన అపకారాన్నిబట్టి చూస్తే యిది వుపకారమే కాదు. పాపపరిహారానికి మేము ప్రయత్న పడుతున్నాము.

సం—బుద్ధిపూర్వకంగా అపకారం జేశారని నేననుగాని యీ మధ్య వుపేక్ష మాత్రం జరిగింది. దాని ఫలం అన్నిజాతులమూ అనుభవిస్తూనే వున్నాం.

వెం—సంగదాసుగారు కొంచెం మెుగమాట పడుతున్నారు. పర్యవసానమే మైనా సత్యం వెల్లడించడమే నా యభిప్రాయం.

రా—ఈ విషయంలో సంగదాసుగారితో నేను కొంతవరకు యేకీభవించక పోయినా ఆయన ముఖప్రీతికోసం సత్యం చెప్పడానికి జంకుతాడని నే ననుకోను. కఠిన విషయములుకూడా యెదటివాండ్ల మనసు నొచ్చకుండా చేప్పే సామర్థ్యం ఆయన కున్నది. ధర్మాతిక్రమణం లేకుండా నేర్పుతో కార్యం సాధించడం ప్రశంసనీయమే.

వెం—కొంచెం జంకి—దాసుగారియందు నాకత్యంత గౌరవమున్నది. కాని పైకులాలు మనకు బుద్ధిపూర్వకంగా అన్యాయం చేశారనే నా యభిప్రాయం.

సం—చేశారా ? చేస్తున్నారా ?

వెం—చేశారు. చేస్తున్నారు.

స—ఇది యెటుచెప్పడానికీ కొంచెం కఠినవిషయం. మన ఆర్థికస్థితి విచారింతాం రాచరికం కృషివాణిజ్య పాశుపాల్యములూ ధనాకర్షణకు ముఖ్యసాధనాలు వృత్తి విభాగం జరిగినప్పుడు ఆ నాలుగుసాధనాలు రెండు మూడు నాలుగుజాతులకే వచ్చినవి.

ఒక బాలభటుడు—అయ్యా ! తమకోసం యెవరో యిద్దరు వచ్చారు.

వెం—ఆ కుర్చీలు యిటులాగి లోపలికి రమ్మను—రామచంద్ర చౌదరిగారా !

కుర్చీమీద దయచెయ్యండి.

చౌ—వీరు మా బంధువులు. పేరు రామసోమయాజులు గారు. మన వుద్యమ విషయమై వీరికి చాలా అభిమానం. గుంటూరినుంచి వచ్చే పదిగంటల రైలుకు దిగారు.

సం—చాలా ఆలస్యమయినదే.

చౌ—ఆలస్యమంటే—రైలు టిక్కెట్టు పోయిందట. గేటుదగ్గిర కొంచెంసేపు వేధించి నాలుగణాలు వదిలించి పంపించారు. బండివాడు బాడుగ కుదరనియ్యకపోతే పాపం నడిచివచ్చారు.

సం—బాలభటులు కనుపడలేదా?

చౌ—పాపం వారికి బాలభటులంటే యేమిదెలుసు? చాలాకర్మిష్టి.

వెం—సోమయాజులు గారూ—నమస్కారం దయచేసి కూర్చోండి. మా వుద్యమాన్ని తమరు ఆశీర్వదించాలే.

సో—చేతిలోవున్న కొల్లాయగుడ్డ కుర్చీమీద బెట్టి—నేను చాలా అభిమానంతో వచ్చాను. వూళ్లోకివచ్చికూడా ఈరాత్రి తమదర్శనం చేయకుండా వుండడమేమని చౌదరయ్యగారికి కొంచెం శ్రమయిచ్చి యిప్పుడేవచ్చాను. తమందరూ మత విషయంకూడా శ్రమ చేయవలసిందని నా ప్రార్థన.

సం—తమరు యిప్పుడే యిక్కడికి రావడంకూడా మేలే అయింది. మా సంభాషణలో తమరూ, చౌదరయ్యగారూకూడా కలవడం అవసరం. విషయమిది, యింత వరకు వచ్చాం.

సో—తమ పేరేమి?

వెం—వారిపేరు సంగదాసుగారు. వీరు రామానాయుడుగారు

సో—ప్రశస్తంగా వింటూవున్న పేళ్లే. సుదినంగనుకనే తమదర్శనంగూడా అయింది. "ఏకక్రియా ద్వ్యర్థకరీ" అన్నాడు. మహాదేవా అని యిక విషయం సెలవియ్యండి.

సం—తక్కినవృత్తులలో నేత ముఖ్యమైనది. దీనిలో ధనాకర్షణవున్నది. వ్యవసాయంతోపాటు యెడతెగకుండా జరుగవలసిందినీ. యివి మాలలకూ నాలుగవజాతిలో మిగత తరగతులకూ యేర్పాటు చేశారు. గర్మకారవృత్తి మాదిగలకియ్యబడ్డది. వొకటవతరగతివారికి ధనాకర్షణకై వృత్తి యేర్పాటుచేయలేదు సంఘమే వీరిని పోషించవలసిందన్నారు

వెం—సోమరులుగా కూర్చోమన్నారు.

సం—పనిమాత్రం వారికి తక్కువ బెట్టలేదు. విద్యావ్యాసంగం, విజ్ఞానాభివృద్ధి, యాజనం, అధ్యాపకం, మతబోధ—యివి వీరు చేయవలసి వున్నవి. ఆర్యమత సంప్రదాయానుసారంగా బోధకుడు స్వోదరపోషణకై కాలం వ్యయపెట్టగూడదు. జంగాలూ, సాతానులూ, దాసరులూ డబ్బుకై పనిచేయడం ధర్మచ్యుతిగా తలుస్తారు. వీరు చేసే పనులలో స్వల్పంగా ధనాకర్షణవున్నా పడేశ్రమకు పతిఫలం కాజాలదు. సభాపతిగారన్నట్లు వీరిలో కొందరు సోమరులు లేకపోలేదు. అట్టివారన్ని తరగతులలోను వున్నారు. మన పూర్వాదర్శాలు మారిపోయి ముందుగా ఖరీదుగట్టని యేపనీ చేయగూడదంటే నే జెప్పలేను. గాని స్వామి సేవయే నాకు ప్రధానం. విలువ గట్టకనే

జ్ఞానాభివృద్ధికై పాటుపడతానన్నే భావంతో ఔన్నత్యం లేకపోలేదు. యేకాలంలోనైనా విద్య ధనాకర్షణకు పెద్దకారణమే అయినా అన్నకానికై దాని నంగడిలో బెట్టకపోవడం స్వల్పవిషయం గాదు. మన విద్యలవిషయమై ఆదరణపోవడంతో వారిలో చాలామంది పూర్వనియమితమైన వృత్తులు లేకపోవడంచేత తక్కినవారి వృత్తులలోనే ప్రవేశించి ధనాకర్షణ చేస్తున్నారు. ఈవిధంగానే నేతవృత్తి బోగొట్టుకొన్న సాలె, జాండ్ర, మాలలూ పూర్వవృత్తులు నశించిన జంగమసాతానులూ తమకు చేతనైన ఇతర వృత్తులలో వొదిగారు___సభాపతిగారడిగిన ప్రశ్నలవల్ల మనం ప్రస్తుత విషయాన్నుంచి తొలిపోయినాం___వృత్తులు అందరకీ పంచిపెట్టారు.

రా___ధనాకర్షణకు యెక్కువ వీలైన కృషివాణిజ్యాదులు కొందరకిచ్చి కూలిపనులు తక్కినవాండ్లకియ్యడంలో యేమి న్యాయమున్నది?

సం___వృత్తి విభజన చేయడానికి పూర్వం ఆయావృత్తు లదివర కెవ్వరికీ రావనీ అదివరకు ఆవృత్తులు యెవరూ చేయడంలేదనీ భావించకూడదు. అదివరకే జనులు అన్నందింటున్నారు. గుడ్డలు గట్టుకుంటున్నారు. కొందరావృత్తులను చేస్తూనే వున్నారు. యెవరో కొందరావృత్తులు చేయకనూ తప్పదు. సామర్థ్యం ననుసరించికూడా వృత్తులు పంచిపెట్టబడేవి. వృత్తిసాంకర్యం గాకుండా చేయడమే వృత్తివిభజన కొక కారణమై యుండవచ్చు.

వెం___యెవరి కిష్టం వచ్చిన వృత్తులు వారు అవలంబిస్తారు. వృత్తి సాంకర్యంవల్ల వచ్చిన దోషమేమి?

సం___వృత్తిపోషణకొరకు వృత్తివిభజనం జరిగింది. వొక తాలూకా గుమాస్తాపని ఖాళీ అయితే అయిదువందల దరఖాస్తులు వచ్చిన మోస్తరుగా యితరవృత్తులు మాని మరివొకరి వృత్తిలో ప్రవేశించడంవల్ల వృత్తులు నశించకుండా వుండేలాగు ఆయావృత్తులవారు స్థిరమైన వృత్తులేర్పరచుకొని వాటి నభివృద్ధి చేస్తుండేటందుకూ వృత్తిజ్ఞానం పారంపర్యంగా వచ్చి వృత్తుల అభివృద్ధికి తోడ్పడడానికీ వృత్తివిభజనం జరిగింది. ఈ విభజనను గూర్చి ధర్మశాస్త్రాలు ఋషిప్రోక్తాలేగాక రాజశాసనాలుగా యేర్పడ్డవి. మెకాలే శిక్షాస్మృతిని, స్టీఫెను సాక్ష్యచట్టమునూ, యితర ధర్మశాస్త్రజ్ఞులు యితర చట్టములనూ రచించి రాజశాసనం బడసినట్లు పూర్వం ధర్మశాస్త్రాలు ఋషిప్రోక్తంలై రాజానుమతిని బడసినవి. ఈశాసనములు అమలులో పెట్టబడ్డప్పుడు అప్పటికాయావృత్తులు చేసేవాండ్లను వాటియందుంచి కొన్నివృత్తులకు యెక్కువ జనం కావలసివుంటే వృత్తి యేర్పాటులేని యితరులను వారి తెలివితేటలనుబట్టి ఆయా వృత్తులలో ప్రవేశపెట్టి వుందురు. పూర్వం యిట్టి యేర్పాటు చేయడమే కాకుండా ప్రతి గ్రామంలో అన్నిరకాల వృత్తులవారినీ ప్రవేశపెట్టి వారా గ్రామాలు విడువక స్థిరంగా నిలిచి గ్రామజీవితానికి తోడ్పడేలాగు యీనాము లేర్పరచి చాకలి, మంగలి, కమ్మరి, వైద్యుడు, పురోహితుడు, పంతులు మొదలగు వృత్తులవారు ప్రతి గ్రామంలోనూ వుండి గ్రామవాసుల కవసరమై నప్పుడు సహాయం చేస్తూవుండేలాగు ప్రపంచంలోకెల్లా అద్భుతమయిన గ్రామ పరిపాలనా పద్ధతి స్థాపించబడ్డది. ఆంగ్లప్రభువులు ప్రతి గ్రామమందు పూర్వ ప్రభువులచే అద్భుతంగా మలచబడ్డ గ్రామపాలనా ప్రతిష్ఠాపనం విధ్వంసం జేసారు. మెయిన్ అను ఆంగ్ల ధర్మశాస్త్రకర్త ఆంగ్లప్రభువులను యీ సందర్భానికై యెంతో నిందించారు.

వెం.___సాంఘిక విషయములలో ప్రభువులు జోక్యం కలుగజేసుకొని జనులను శిక్షించడం అక్రమం.

సం.___యీ ప్రతిష్ఠాపన కేవలం సాంఘికంగాదు. దీనికి సాంఘికానికంటే ఆర్థికానికే ఎక్కువ సంబంధమున్నది. యూరోపులోని ప్రభుత్వాలు ప్రస్తుతం దేశాని కభివృద్ధికరమయిన ప్రతివిషయంలోను జోక్యం కలుగచేసికొంటూ దేశాభివృద్ధికి తోడ్పడుతున్న మోస్తరుగా పూర్వపుహిందూప్రభువులు ఆర్థికసంబంధమయిన వృత్తివిభజనంలో జోక్యం కలిగించుకున్నారు. దేశంయొక్క విత్తరక్షణకు, వృత్తిరక్షా వృత్తిరక్షకొరకు వృత్తివిభజనం జరిగినది. ప్రభువొకనిని వొక వృత్తిలో వుండవలసిందని ఆజ్ఞజేసి తక్కిన వాండ్లను ఆవృత్తిలో ప్రవేశించడానికి స్వాతంత్ర్యమిస్తే మొదటివాడికి అన్యాయం చేసినవాడౌతాడు. వొకనినివృత్తినివిడువవద్దని రాజుఎప్పుడుశాసిస్తాడో రెండవవాణ్ణి దాంట్లో ప్రవేశించవద్దని శాసించకతప్పదు. కనుక ధర్మశాస్త్రాలు వృత్తిసాంకర్యం చేసిన వాండ్లను కఠినంగా శిక్షిస్తవి. యీ శిక్షలు కొన్ని మరీ కఠినంగాతోచవచ్చు. నేరము జరిగినప్పుడల్లా యావత్తుశిక్షా విధించారని చెప్పడానికివీలులేదు. సాధారణపు చౌర్యానికి మూడు సంవత్సరముల కఠిన శిక్షను స్మృతి విధించినా వారంరోజులలోపు శిక్షతో అనేక కేసులు ఫైసలు చేస్తారు. అంతేగాక ప్రపంచంలోని పూర్వకాలపు శిక్షాస్మృతులు యిప్పటివాటి కంటే యెక్కువ శిక్షలు విధించేవి. వురిశిక్ష యింగ్లండులో అనేక నేరములకు వేసేవారు. తప్పుసృష్టికి వురిశిక్ష వేసేది. చాలా దేశములలో దొంగతనానికి చేతులు తెగగొట్టేవారు. ఈ శిక్ష కొన్ని తురకదేశాలలో యిప్పటికీ అమలులో వున్నది. కనుక యీ విషయం కొంతవరకు సాంఘికమే అయినా ప్రభుత్వంవారు జోక్యం కలుగజేసుకోవడంలో అక్రమంలేదు.

వృత్తివిభజనమే సంఘములోని యెక్కువ తక్కువలకు కారణమయిందనడానికి వీలులేదు. ఈ హెచ్చుతగ్గులు వృత్తివిభజనము చేతనేగాక వృత్తి భేదమువల్ల గూడా వస్తున్నవి. ధనం బలం కలుగజేస్తుంది. రెంటినీ జ్ఞానం వంచుతుంది. జడమును శక్తి, శక్తిని చైతన్యమూ నడుపుతవి. యిది ప్రపంచ ధర్మం.

హిందూదేశంలో యీ ప్రతిష్ఠాపనం బాహుళ్యంగా నిర్మించారు. కొన్ని దేశాలలో యీ విభజనం లేకుండానే వృత్తులు కాపాడడానికి ప్రయత్నంచేశారు. మరికొన్ని దేశాలలో కొన్నివృత్తులే విభజించారు. "లోకోభిన్నరుచి" యని అనేక తోవలుతొక్కారు. యీ పద్ధతులు సంఘక్షేమానికై వుద్దేశింపబడ్డవిగాని సంఘనాశన నిమిత్తముగాదు ఈ యేర్పాట్లు బుద్ధిపూర్వకంగా చేశారనే నేనూ నమ్ముతాను. కాని అన్యాయం మాత్రం వుద్దేశించలేదు. వృత్తులు పారంపర్యం జేయడంవల్ల కొన్ని సంఘాలకు అన్యాయం గలిగింది. కొన్నివృత్తులు నశించడములో ఈ అన్యాయం మరింత యెక్కువయింది.

ఇప్పటికి వర్ణవిభజనమనే మహాసౌధం శిథిలమయిందనే చెప్పవచ్చు. ప్రభుత్వం పరాధీనం కాంగనే క్షత్రియవృత్తిపోయింది. క్షత్రియులందరూ యితరవృత్తులలో మగ్నమయిపోయినారు బ్రాహ్మలు చాలావరకు యితరవృత్తుల నాశించారు. వాటికీ పారతంత్ర్యం పూర్తిగా ప్రాప్తమయింది. క్షత్రియేతరులు పూర్వకాలమందే క్షాత్రధర్మం అవలంభించారు. శూద్రులనేకులు రాజులైనారు. ప్రస్తుతం ప్రజాప్రభుత్వమే వుత్తమమైందిగా పరిగణిస్తున్నారు. కూలివాడు సహితం తన వోటిచ్చి ప్రభుత్వాన్ని నడపడమే వుత్తమ

పాలన మార్గంగా యిప్పటి ప్రభుత్వధర్మం చెప్పుతున్నది. క్షత్రియజాతితో యిక అవసరం లేదు. బుద్ధ, రామానుజ, బసవ చన్నబసవ మొదలైన మతసంస్కర్తలు నిరసించి యితర కులములలో మతప్రచారక సంఘములను తయారుచేసారు. వేమన, వీరబ్రహ్మం, సిద్ధప్ప, లక్ష్మప్ప, రామమోహనుడు, దయానందుడు, వీరేశలింగం మొదలైన వీరసంస్కర్తలు వర్ణవృక్షంపైద తమ గండ్రగొడ్డండ్లను ప్రయోగించారు. కాని కోట శిథిలమయిన తరువాత నిలిచివుండే మొండిగోడలవలె యీ ప్రతిష్ఠాపన ఖిలమయినా కిందబడక మూరు ముసలుతున్నది. వృత్తులు నశించడంతో చిత్తం నశించింది. దేశం దుర్భరమయిన దారిద్ర్య స్థితిలో మునిగింది. సంఘం నిర్జీవమయి శవాకారంగా వున్నది.

రా—హిందూసంఘం యావత్తూ పునర్మాణం చేయడం అవసరమని మీ యభిప్రాయమైనట్లు తోస్తుంది.

వెం—మనసంఘం బాగయ్యే యేర్పాట్లు ముందు జూడండి. పుట్టి కెక్కిన తరువాత స్వర్గానికి కెక్కవచ్చు.

సం—హిందూ సంఘమంతా పునర్నిర్మాణం కావలసిందనే నాయభిప్రాయం. అది నాబోటివారికి సాధ్యమయ్యే పనికాదు. తల్లిసంఘంయొక్క క్షేమంవిడచి పిల్ల సంఘాల క్షేమానికిమాత్రమే పూనుకొంటే దానికీ ప్రతిబంధకాలున్నవి. యావన్మంది క్షేమం మనము విచారించకపోయినా చిన్నసంఘాల అభివృద్ధికై మన మవలంబించే మార్గాలు పెద్దసంఘంయొక్క క్షేమానికి భంగంగాకుండా వుండాలి. ఇంతేకాకుండా దేశంలో అందరూ తమ చిన్న సంఘాల క్షేమానికేపూనుకుంటే దేశ మొత్తానికి సంబంధించిన పెద్దసమస్యలన్నీ మూలబడి చిన్నప్రయత్నాలు సయితం నిష్ఫలమవునవి.

తక్కిన అన్నిప్రయత్నాలూ మానివేసి మనం మాలలయొక్క ప్రధానవృత్తియైన నేతఅభివృద్ధికి పూనుకున్నా మనుకోండి. చూడటానికి ఈపని చిన్నదిగానే కనుపడుతుంది. అందరూ మగ్గాలుకొని నేయడమే గదా అని అనవచ్చు కాని సప్తా యేదు. రాజకీయ సమస్యలు తేలుతేనేగాని యిది తేలదు. ఇది తేలకపోతే మన నేతా మగ్గమూ అభివృద్ధిపొందే మార్గమేది? మనకు భూములూ లేవు. వుద్యోగాలు చేతామంటే చదువులేదు. చదువుకొనేటందుకు డబ్బులేదు. ఏ రకం యేమిపెట్టి చేస్తారు. చివరకు ఘటకుటికా ప్రభాతమవుతుంది. ఇంకా వొక వుపమానం. సంఘనిర్మాణమంటె వొక పెద్దమేడ కట్టడం మోస్తరు. ఆయానికి దగినదూలాలూ గోడలకు దగిన మొకరాలూ తగినంత కలపా వుండాలె. సమస్తభాగాలు వొకదానికొకటి పొసిగేటట్లుగా అమర్చాలె సంఘనిర్మాణంయొక్క యేర్పాట్లన్నీ యీవిధంగా నేవుంటవి. అందరమూ మొకరాలమె కావలెనంటె ప్రయోజనం లేదు. నీవు దూలానివి కావడమేమి? నేను యెండకు యెండి వానకుతడిసే పెంకును గావడమేమి? అని అడిగితే ఏమిజబాబు? పెంకులన్నీ గలసి దూలం గావలెనంటే అవుతదా? కాబట్టి మహాసంఘంయొక్క క్షేమం దృష్టిలో లేకుండా చేసే ప్రయత్నాలు నేలవిడచి సాము జేసినట్లై అవుతవి. హ్రస్వదృష్టితో మనంజేసే ప్రయత్నాలు చిన్న సంఘాలకు తాత్కాలికంగా వుపయోగించినట్లు కనుబడ్డా మహాసంఘానికి అపకారములై మహాసంఘంతోపాటు మనమూ నష్టపడటమే కాకుండా మనము దేశద్రోహులమూనూ సంఘద్రోహులమూనూ కావలసివస్తుంది. ఆఖరకు మహాసంఘముయొక్క క్షేమానికి

ప్రయత్నం చేయలేకపోయినా మహాసంఘనిర్మాణంయొక్క రాస్తాగుర్తెరిగి దానికి అనుసంధానంగా చిన్నసంఘాల అభివృద్ధికి పాటుబడితే పెద్దసంఘముయొక్క అభివృద్ధికి వొకవిధంగా తోడ్పడ్డవాళ్లమే అవుతాం.

అట్లుగాక మహాసంఘంయొక్క విపత్తునివారించుటకూ, దానిక్షేమ మెంచ గూర్చుటకూ త్యాగం జేయవలసివచ్చినప్పుడు యేవో వంకలు బెట్టుకొని మూల మూలలు దాగి దున్నడానికి దూడలలో మెయ్యటానికి యెద్దులలో జేరుతూ హక్కులు పంచుకోవలసివచ్చినప్పుడు పెద్దకోరికెలు గోరడం హాస్యాస్పదం.

సోమయాజులుగారు కునికిపాట్లు పడుతున్నారు— ఎఱ్ఱరాళ్లకుండలాలు దీపం యెదుట తళతళ మెరుస్తున్నవి. ఒక చిన్నకాసు బంగారం యెక్కువబెట్టి చేయించుకోవడంచేత కొంచంబరువై తమ్మెలు నొప్పియెత్తుతున్నవి. చిన్నప్పుడు గుట్టించిన దోసకాడ నాజూకుగానే వున్నది. తీయించవలెననుకుంటె ముసలమ్మ వద్దన్నది. గడియారం కొట్టడం ప్రారంభించింది. సోమయాజులుగారు తుళ్లిపడి లేచి లెక్కబెట్టి పన్నెండూ అని చెప్పాడు.

రా—పునర్నిర్మాణంయొక్క దార్లు మేము వినవలసివున్నాం. యిప్పటికే చాలాపొద్దుబోయింది. మళ్లీ సమావేశ మెప్పుడు?

వెం—దాసుగారిపేరు నేనిదివరకే వింటూవచ్చాను. వారితో సంభాషించడం ప్రారంభించినతరువాత వారియందు నాకుగల గౌరవం యిబ్బడయింది. విషయం యావత్తూ వారినోట కొనదాకా వినవలసివుంటుంది. మీరు చెయ్యబొయ్యే సమావేశంలో నేనుగూడా వుండేటట్టు జూడండి.

సం—తమరులేకుండానా— సభ రేపుఉదయం పదిగంటలకుండి పచ్చివతరువాత ప్రారంభిస్తాంట. యేడుగంటలకు సమావేశం గావడానికి అందరికీ వీలేనా? ఇక్కడనే అయితే బాగుంటుంది. సోమయాజులుగారుగూడా తప్పకుండా దయచెయ్యవలెనని నాప్రార్థన.

సో—(కొంచెం తొట్రుపాటుతో) —చిత్తం—అవశ్యంగా దయచేస్తాను. నాకు వొక్క అరగంట వ్యవధికావలె. ఇదివొకటి బెట్టుకున్నా గనుక కొద్దిగా కలాపం వుంటుంది.

వెం—సరె—సరిగా యేడున్నరగంటలకు కలుసుకొందాం. దాసుగారూ! రేపుప్రొద్దున మనకింకొక పనివున్నదే. చిత్తుతీర్మానాలు వ్రాయవలసియున్నవి. అది కొంచం బండుపని ఆబరువు మీ వొక్కరిమీదనే వేస్తా.

సం—సరే—సోమయాజులుగారి కలాపముయ్యేలోగా నాకలపంకూడా పూర్తి చేస్తా.



## ఇరువదిరెండవ అధ్యాయం

# ఆర్యవిజ్ఞానం అందరిసొమ్ము

సంగదాసు చీకటితో లేచి తీర్మానాలు వ్రాస్తున్నాడు. కొంతసేపటికి రామానాయుడు లేచివచ్చి దాసు తీర్మానాలు వ్రాయడంజూసి "నన్నుగూడా లేపక పోయినావా?" అన్నాడు.

సం — నేను యింకొక అరగంటలో చిత్తుతీర్మానాలు తయారుజేస్తా. నీవింతలో ఫలహారంజేసివస్తే సవరించి సాపు వ్రాస్తువుగాని. సమావేశమయ్యేలోగా ఫలహారంజేసి నేనూ తయారుగా వుంటాను.

సభాపతిగారు, సంగదాసూ వుదయానుష్ఠానాలు తీర్చుకొని ఫలహారంజేసి దొడ్లో చాపలమీద కూర్చున్నారు.

రా — మీకొక కుర్చీ తెప్పించనా?

వెం — అక్కరలేదు. జాతీయపద్ధతి ప్రకారమే కూర్చుందాం. సంగదాసుగారి ఉపన్యాసం విన్నతరువాతగూడా కుర్చీలుగావలెనంటే బాగుండదు. అదిగాక పదిమంది పెద్దమనుష్యులు వస్తూపోతూవుంటారు. సభలోకిగూడా కుర్చీలు వద్దని కబురంపించా. అదుగో దాసుగారు రానేవచ్చారు.

దా — సోమయాజులుగారు, చౌదరయ్యగారూ దయచేశారా?

వెం — ఆ వచ్చేది చౌదరయ్యగారేనా?

రా — ఔనే.

సం — సోమయాజులుగారు రావడంలేదేమి చెపుమా.

వెం — వండలాదు పులికాపుచేస్తున్నారేమో. ఆపద్ధతీ తమాషాగానే వున్నది. పూర్వం దాసులైవరైనా యజ్ఞాలు చేశారేమో?

సం — దృష్టాంతాలు కనబడవు. పెద్దవాండ్ల నడిగితే తెలియవచ్చు. మనలో విశేషం భక్తిజ్ఞాన యోగాలు వ్యాపకం. యిప్పటికి భక్తిజ్ఞానయోగులు అనేకులున్నారు గాని కర్మపరులు గనబడరు. బసవాచార్యులవారు యజ్ఞయాగాదిక్రతువులు పనికిరావని యజ్ఞోపవీతమే త్రోసివేసి వీరశైవం స్థాపించారు.

వెం — చౌదరయ్యగారూ! సోమయాజులగారేరీ?

చౌ — భోజనప్రయత్నం మన సమావేశమైన తరువాత పెట్టుకొంటే సభకడ్డమువస్తుందని చీకటితోనే స్వయంపాకం ప్రారంభించారు. నేను వారిబసకు వెళ్లేటప్పటికి గడపచేలో గుంటకుతోలినట్లు కర్మ నడుస్తున్నది. యిప్పటికి భోజనం ప్రారంభించివుంటారు. దాసుగారి ఉపన్యాసం వినవలెనని క్లుప్తంజేసి జపిళ్లె హోమా సరుగా పోనిస్తున్నారు. రాత్రి వీరి ప్రసంగం విన్నతరువాత వీరంటే వారికి పరమానందం.

వెం — పాపం వారు రాత్రి పూర్తిగా విన్నట్లులేదు.

చౌ — మొదటిభాగం కొంతవరకు అవగాహన చేసుకున్నట్లే కనబడుతుంది— అదుగో నురుగుదబ్బలుండుతూ రానేవచ్చారు.

సో — సభవారికందరికీ నమస్కారం. ఆలస్యానికి క్షమించాలి.

గంట యెనిమిది గొట్టింది. అతిచమటకు సోమయాజులుగారి బొట్టు తడిసి చెంగి కిరణాలవలె అష్టదిక్కులా వ్యాపించింది. చూచేవాండ్లకు కడుక్కుంటే బాగుండు ననితోచిందిగాని వారితో చెప్పడానికి సంశయించారు.

సో—అయ్యా! సంభావన యేమాత్రం నడిచింది?

సం—లేదు. యింకా గమిడిదాటలేదు. తలవనితలంపుగా మతవిషయంలోకి దిగాం. తమరు సమయాని కందుకోవడం ముఖ్యం.

సో—చిత్తం చిత్తం—తమరు సరస్వతీవిగ్రహం. యెదట పొగడ రాదని విరమిస్తున్నాను. యీ పూట మతప్రసంగమే సాగనివ్వండి.

వెం—సోమయాజులుగారు శలవిస్తున్నారు గనుక ఆలాగే కానివ్వండి సాయంత్రం సభ అయినతరువాత అవసరం వుంటే మళ్లీ కూర్చుందాం.

సం—సోమయాజులుగారూ! మాసంభాషణ యింతవరకైంది. మీ అభిప్రాయాలు పూర్ణంగా వెల్లడించాలె. శైవులు యజ్ఞోపవీతాలు తోసివేశారు. వేదశాస్త్రులు పనికిరావన్నారు. వ్యాసుని సంహరించినందుకు గుర్తుగా వ్యాసతోడు లింగాయితులు వూరేగింపు జేస్తారు. బసవపురాణాది ప్రమాణగ్రంథాలను కొత్తగా రచించి వేదాల స్థానంలో వాటిని బెట్టారు. మహమ్మదీయులను సహితం హిందూమతంలో గలిపి వారితో సంబంధ బాంధవ్యాలు జేశారు. యింకా అరవైనాలుగు వంశాల బ్రాహ్మణుల యజ్ఞోపవీత విసర్జన జేసి జంగాలైనారు. బసవాచార్యులవారితో యేకీభవించక పండితారాధ్యులవారు కర్మమీద ప్రేమచేత కొత్తశాఖను యేర్పరచి యజ్ఞోపవీతమూ, లింగధారణా రెండూ కావలసిందన్నారు. రామానుజులు వుభయ వేదాంత ప్రవర్తకులు. రెండు వేదాంతాలను ఒక రేవులో నీళ్లుదాగించారు. దొడ్డయాచార్యులవారు సాతానులతో సంబంధాలు చేయవలెనని ప్రయత్నించారు. వేదాంతదేశికులు దీనిని నిరోధించారు. కొందరు వైష్ణవమత ప్రచారకులు తమ సోదరులైన శూద్ర పంచమ వైష్ణవులకు యజ్ఞోపవీతమూ వేదపఠనమూ నిషేధములైతే పక్షపాతము గలవి గనుక అవి తమకు అగ్రాహ్యములవి యజ్ఞోపవీతసన్యాసమూ వేదసన్యాసమూ గావించారు. ఆహా! యీ శైవ వైష్ణవ సంస్కర్తలయొక్క సర్వసమత్వ ధర్మము యెంతవరకు బోయింది! రామమోహనులు యజ్ఞోపవీతం త్యజించలేదు. పూర్వ సంస్కర్తలైన జినబుద్ధులు వేదశాస్త్రముల ప్రామాణ్యము నంగీకరించక పోయినా పూర్వవిజ్ఞానమును విసర్జించక పోవడమే గాకుండా వీరి అనుచరులు సంస్కృతములో అనేక గ్రంథాలు రచించారు.

సో—వేదశాస్త్రులూ కర్మలూ విసర్జించుకుంటే మనకు మిగిలిందేమున్నది! కర్మవిసర్జనం యెవరికి సాధ్యమౌతుంది? మనమందరంగూడా కర్మలు ఆచరించవలసిందే. యజ్ఞోపవీతధారణం చేయవలసిందే.

వెం—సోమయాజులుగారు తమ అభిప్రాయాన్ని గట్టిగా జెప్పారు.

సం—అందుకనేగదా సోమయాజులుగారు మనకు కావలెనని కోరుతున్నాం.

——బాగు బాగు. పనులన్నీ మానుకొని కమ్మగా గాచిన నెయ్యి కడుపులో వేసుకోకుండా బూడిదపాలు చేస్తామంటారు. భక్తిజ్ఞానయోగాలు చాలవా?

రామానాయుడు కడుపుబ్బ నవ్వాడు.

సం—(ఒకకాలు మార్చి రెండవకాలిమీద గూర్చొని పైపెదవి పంటితో నొక్కి)

చాలవనిగాదు. ఆ రెంటిలో వొకటైనా చాలు. అందువల్ల రెండవది పారవెయ్య నవసరం లేదు. కర్మవల్లనే మోక్షం వస్తుందని జైమినిఋషియొక్క అభిప్రాయమైనా, కర్మ చిత్తశుద్ధికి సాధనమని ఆస్తికులంతా అంగీకరించారు. కర్మ కంచెవంటిది. పైరు పెరగడానికి యెరువూ, యెండా, నీళ్లూ సాధనమైనా చెడుగొడ్లను లోపలికి రానియ్యదు. మనకు కావలసింది లోపలి తోనలూ గుజ్జే. అవి వుండేచాలు. కాని అవి తొలక లేనిదీలభించవు కర్మ యెప్పటికైనా విసర్జించ వలసిందేగాని భోగ్యసమయం వచ్చేవరకూ తొలక రూపకముగా అంటుకొనే వుంటుంది.

సో—పరమానందం.

సం—హిందూజ్ఞానమనేది తరుగుల్మలతాదులలో గూడిన మహారణ్యం యెవరెవరి యోగ్యతకు యెవరెవరి రుచులకు తగినసాధనలన్నీ యేర్పర్చబడ్డవి. భక్తులూ యోగులూ జ్ఞానులూ తేనెటీగలవలె యిప్పటివరకూ విజ్ఞానమధువును కూరుస్తూనే వున్నారు. యితరమతములలోవలె పిల్లడిమొదలు పితామహుడివరకూ తొడిగేటందుకు వొకటేరకం లత్తులు తయారు గాలేదు. హిందూ ఆకాశం యెన్ని వన్నె చిన్నెలతో చెన్నుమిగిలివుంటుందో హిందూభూమి యెన్ని చిత్రరంగముల హృదయంగమంగా ప్రదర్శిస్తుందో హిందూమానసఫలకం అన్ని విచిత్రాలనూ ప్రతిఫలిస్తుంది. యీ హిందూ భూమ్యాకాశాలు యెవరికి వారసత్వమో హిందూవిజ్ఞానం సహితంవారందరికీ దాయార్హమే. ఆద్యులయిన ఆర్యఋషులు ఆచండాలాంతమూ అందరికీ పూర్వీకులే. అందరితోనూ సంబంధము చేశారు. అందుకనే ఆర్యసమాజస్థాపకులైన దయానందులు ఆర్యవిజ్ఞానం అందరికీ పంచిపెట్టమన్నాడు ఆర్యవిజ్ఞానాన్ని ఆర్యావర్తానికేకాక అన్ని దేశములవారికీ ఆనందము నియ్యవచ్చునన్నాడు.

గంట టాం టాం అని మోగింది.

సో—శుభం.

వెం—ఈస్థితిలో విరమించడం యెంతకష్టమైనా యిప్పుడు లేస్తేనే గాని భోజనమయి పదిగింటల కందుకోలేము.

సో—సభను వొంటిగంటకు విశ్రమిస్తే బాగుండదా?

వెం—శాస్త్రిగారి వుపన్యాసం వింటూవుండటానికి మనకు బాగానే వుంటుంది, గాని వందలకొలది ప్రతినిధులకూ అభిమానులకూ సంకటంగా వుంటుంది.

సో—సరే చిత్తం—యింతేప్రాప్తం.

వెం—శాస్త్రిగారూ! మీతో సంభాషణ అయినతరువాత నేను అచ్చు వేయించిన వుపన్యాసం ప్రకటించటానికి యిష్టంలేకుండా వున్నది. కొన్ని అభిప్రాయాలు మారినవి.

సం—సత్యమందు మీ కెంత గౌరవ మున్నదో దీనివల్ల స్పష్ట మౌతున్నది.

## ఇరువదిమూడవ అధ్యాయం

# సంఘనిర్మాణం

సభ పదిగంటలకు జరుగుతుందని బెజవాడంతా తెలిసింది. సభాపతిగారి వూరేగింపుకు రామేశ్వరరావుగారు బ్యాండుమేళం ఏర్పాటుజేసి వారిక్కడదగ్గరనుంచి చేవుత్తరం పుచ్చుకున్నారు. రామేశ్వరరావుగారి గుర్రపుబండెక్కి మాలమాదిగలు మేళంతో వూరేగుతారని వూరంతా విడ్డూరంగా చెప్పుకుంటున్నారు. మంత్రిమహాసాటి కట్టుబళ్ల ప్రకారం వూరేగింపుకు ఆటంకం పెడదామని శంకితులు యోచిస్తే అడ్డునేరమవుతుందని ప్లీడర్లు సలహా చెప్పినారు. అన్నశ్రాద్ధంబెట్టే కొందరు వైశ్యులు పూర్వాచారపరాయణులైన వకీళ్ల దగ్గరకుపోయి వ్యాజ్యం దాఖలుజేసి వూరేగింపు కాకుండా యింజక్షను యిప్పించమని కోరితే ప్రయోజనం లేదని చెప్పారు. వూరేగింపు బయలుదేరింది. వెంకటరెడ్డిగారూ సంగదాసుగారూ బండిమీద కూర్చున్నారు. అభిమానులంతా బండికి ముందు నడిచారు. ముందాయన మాలశాస్త్రిలనీ, వెనకాయన మాలపంతులనీ, నడిమాయన మాలచౌదరనీ కేళాకోళాలు సాగించారు. పందిరి బాగా అలంకరించారు. అరుంధతీ విగ్రహం సింహద్వారంమీద అమర్చబడ్డది. వశిష్ఠ శక్తి పరాశరవ్యాసాదులు విగ్రహాలూ, శంబములయిన ద్రావిడభక్తుల చిత్తరువులూ చక్కని ద్వారాలలంకరిస్తున్నవి. సభాపతిగారి వేదిక దగ్గర మేలుకోట దేవాలయపు తస్వీరు వ్రేలాడగట్టారు. సభ ప్రారంభమైంది. చౌదరయ్యగారు సభికుల నాహ్వానించి తమ సానుభూతిని తెలిపారు. వెంకటరెడ్డిగారిని సభాపతిగా యెన్నుకోనే తీర్మానాన్ని ప్రస్తాపించడానికి సంగదాసుగారు లేవంగనే సభికులందరూ అత్యుత్సాహంతో "సంగిదాసుకు జై" అని కేకలువేస్తూ చప్పట్లు కొట్టారు. ప్రస్తావన అయిన తరువాత వొకరులేచి ఆమోదించారు. మరియొకడు సమర్థించారు. విరోధకులు లేరని తెలిసిన తరువాత సభాపతిగారు సభికుల కరతాళధ్వనులు చెలరేగుతుండగా సభాధిపత్యం వహించి వుపన్యాసం ప్రారంభించారు. తనను సభాపతిగా యెన్నుకొన్నందుకు ఆహ్వానసంఘమువారికి కృతజ్ఞత తెలిపి దిగువజాతుల పూర్వచరిత్రం వినిపించి ప్రస్తుత దీనస్థితిని కరుణారస మొలికేటట్టుగా వర్ణించి ఉద్యమంయొక్క వ్యాప్తిని నిర్వచించి మహాసంఘమునకూ అంతస్సంఘములకూ వుండవలసిన సంబంధములను వివరించి స్వసంఘాభివృద్ధికై చేయవలసిన పనులను విశదీకరిస్తూ సంఘములయొక్క పునర్నిర్మాణాన్ని గూర్చి ఈ ప్రకారంగా గంభీరోపన్యాసం జేశారు.

"ఆర్యులారా! నేను సంఘముల పునర్నిర్మాణాన్ని గూర్చి చెప్పబోయే సంగతులు ఘోరనేకసార్లు సంగదాసుగారివల్ల వినేవుంటారు. సంగదాసుశబ్దము సంగదాసు శబ్దభవంగా తీసుకుంటే యీ పేరు వారికి తగివుంటుంది. (సంగదాసుకూ జై అనికేకలు) సంఘసేవే వారికి ఆదర్శం. వారు మన సంఘానికి చెందినవారైనా మహాసంఘాభివృద్ధి ప్రధానంగా యోచుతుండే విశాలహృదయులుగాని సంకుచితాభిప్రాయములు గలవారు కారు. అందుచేత స్వసంఘాభివృద్ధికి ప్రయత్నించకపూర్వం మహాసంఘనిర్మాణానికి దారులు తెలుసుకోవలసిందని వారి అభిప్రాయం. యిప్పుడు ప్రపంచములో వుండే అన్ని దేశాలలో పూర్వపు కట్టుబడులు శిథిలమై ప్రస్తుతకాలమునకు అనుపయోగములైనవి. పూర్వము సంఘధర్మములుగా యెంచబడేవి యిప్పుడావిధంగా యెంచబడవు. అట్టివితే

మన హిందూదేశంలోగూడా తటస్థించినది. ఫ్రాన్సు, అమెరికాదేశములలో క్షత్రియ వర్గమూ మతపీఠములూ పూర్తిగా నశింపజేసి ప్రజాప్రభుత్వం స్థాపించుటకు ప్రయత్నాలు చాలాకాలంక్రిందనే జరిగినవి గాని ప్రజాప్రభుత్వానికి బదులుగా ధనికప్రభుత్వమేర్పడి దిగువజాతులకు మునుపటికంటే యెక్కువబాధాకరమైంది. ప్రజలలో బహుమందియొక్క అభిప్రాయప్రకారం గాకుండా ధనికులలో బహుమందియొక్క అభిప్రాయప్రకారం అమలు జరుగుతున్నది. యీ స్థితిని మార్చడానికి అలగాలు ప్రయత్నిస్తున్నారు. ఇటలీదేశములో ధనికులయంత్రాగారాలు కూలీలు స్వాధీనపర్చుకొని చివరకు వోడిపోయారు. రాజీపడ్డారు. రష్యాదేశంలో పంచాయితీ (సోవియట్) ప్రభుత్వం స్థాపించబడ్డది. వీరి వుద్యమానికి బోల్షివిజమని పేరు. బోల్షివిజమనగా విశేషజనులయొక్క అభిప్రాయమని అర్థం. దానిప్రకారంగా ప్రభుత్వం జరగవలయునని వారి ఆదర్శం. రష్యాదేశంలో జనులకు వ్యవసాయమే జీవనం. భూములు చాలాభాగం వ్యవసాయం చేయని జమీందారుల చేతులలోనూ భూస్వాముల చేతులలోనూ వుండెవి. ప్రభుత్వంలో ప్రజలకు యేవిధమైన పలుకుబడీ లేదు. జారుచక్రవర్తి నౌకర్లయొక్కయూ జమీందారులయొక్కయూ ధనికులయొక్కయూ చేతులలో కీలుబొమ్మయి వారికోరికల ప్రకారం మహాజనులను బాధించాడు. ఈదుష్ప్రభుత్వం వందసంవత్సరాలకు పైగా సాగింది. జనులు దుర్భరమైన దరిద్రంలో మునిగారు. తుదకు మొన్నటి యూరోపా యుద్ధసమయంలో నౌకరువర్గం, ధనికవర్గం సజారంగా కూలేరు కుంగినట్లు కుంగింది. పంచాయితీ ప్రభుత్వమేర్పడి గ్రామప్రభుత్వానికీ, జిల్లాప్రభుత్వానికీ, రాష్ట్రప్రభుత్వానికీ, దేశప్రభుత్వానికీ పంచాయితీవర్గా లేర్పడ్డవి. ఈపంచాయితీలలో సభికులు అయిదుగురే వుండవలసిన అవసరంలేదు. అదివరకు భూములు ఆసామీలకూ, జమీందారులకూ స్వంతహక్కు కలిగివుండేది. సోవియటు వర్గంవారు భూములలో ప్రత్యేక వ్యక్తుల హక్కును తొలగించి పంచాహక్కుగా మార్చి పంచాయితరఫున భూము లన్నీ స్వాధీనపరచుకొని కేవలం స్వంత చేతితో వ్యవసాయం చేయువారికే వారు చేయగలంతవరకు విడదీసి జనులలో పంచిపెట్టారు. కోటీశ్వరుల భవనములూ ధనమూ యంత్రాగారములు మొందితరఫున సోవియటుసర్కారువారు స్వాధీనపరచుకొని పని జరిపిస్తున్నారు. దేశంలో భాగ్యవంతులకుగాని బీదలకుగాని స్వంతహక్కు లుండగూడదు. దేశంలో వుండే యావత్తు్తనూ మందిసొమ్మే. మంది పంచాయితీ సర్కారుద్వారా యంత్రములనూ వ్యవసాయమునూ ఆజమాయిషీ చేసి వచ్చేఆదాయములోనుంచి దేశజను లెవ్వరికీ అన్నలోపం లేకుండా పంచిపెడుతుంది. పనిచేసేవాండ్లకే గ్రామసోవియటువారు మోయిను చీటీస్తారు యెవరు యేయేపని చేయవలసిందీ పంచాయితీసర్కారే నిర్ణయిస్తారు. భోజనసామగ్రులూ, వస్త్రాలూ, చెప్పులూ, మొదలైన యావత్తు అవసరవస్తువులూ టిక్కెట్లు పొందిన కుటుంబములకే గ్రామసోవియటుభండారములో యిస్తారు. సోమరులకు పనిలేదు. వ్యాధిగ్రస్తులకూ, వృద్ధాప్యంచేతగాని, అంగవైకల్యంచేతగాని బొత్తిగా పనిచేయలేనివారికీ పనినిర్బంధం లేకనే చీటీస్తారు యిది మహాప్రయత్నం. యేసుక్రీస్తుయొక్క బోధలు దీనికి అనుగుణ్యంగానే వుంటవి. పూర్వం మునిపల్లెలలో యీపద్ధతే జరిగేదనుకుంటాను. పూర్వపుగ్రామపద్ధతీ యిదే. యీ ప్రభుత్వపద్ధతి యెంతవరకు నిలుస్తుందో చెప్పలేము. యీప్రకరణయొక్క నిర్మాణకులుమాత్రం అత్యుత్సాహంగా పనిచేస్తున్నారు

ఈమూలశాసనధర్మకర్తపేరు లెనిన్ మహాశయుడు వీరి బావమరిది ట్రాట్‌స్కీ అను ఆయన వీరికి చేదోడు. వీరుభయులూ యోధులు, సృష్టిలోవున్న వస్తుభండారం అనుభవించడానికి అందరికీ సమానహక్కు వున్నదనీ అందరూ పనిచేసి అనుభవించ వలసినదనీ కొందరు అన్నవస్త్రాలులేక మలమలమాడుతుంటే మరికొందరు భోగములలోనూ దుర్వ్యసనములలోనూ మునిగి తేలడం న్యాయంగాదనీ వీరిముఖ్యసిద్ధాంతాలు, వీరి సిద్ధాంతాలు తప్పుపట్టడానికి యెవరికీ సాధ్యంగాదుగాని ఆచరణలో పెట్టడం అసాధ్యమని కొందరికి సందేహం. రష్యాలో ధనికులభూములూ, యంత్రాలూ. పంచాయితీ సర్కారు ముంది తరఫున జమకట్టుకొని బీదజనులకు పనిచేసేనిమిత్తమిచ్చినప్పుడు వారుసంతోషపడ్డారు గాని యంత్రాలవల్లా వ్యవసాయంవల్లా వచ్చేఆదాయం పనిచేసేవాండ్ల కుటుంబాల అనుభవానికి సరిపోగా మిగిలేదియావత్తూ సోవియటు సర్కారుకు స్వాధీనపర్చుమంటే వెనుదీస్తున్నారు. యిప్పటివరకు బలత్కారంగానో బుద్ధిపూర్వకంగానో సోవియటు సర్కారుకు దేశాదాయం యావత్తూ జమపడూనే వున్నది. జను లీపద్ధతికి అలవాటుపడి జరుపుకుంటారో తిరిగివిప్లవంవచ్చి పాతపద్ధతులే అమల్లోకివస్తవో లేక యేకొత్త రూపంగా మారునో చెప్పలేము. ఈబోల్షెవిక్ సిద్ధాంతాలు ప్రస్తుతం అమలులోవున్న సామ్యసిద్ధాంతాల కన్నిటికీ వ్యతిరేకం. లెనిన్ ప్రభృతులు ఈ సిద్ధాంతాలను తమ దేశంలో స్థాపించడమే కాకుండా ప్రపంచమంతటా వ్యాపింపజేస్తామని ఢంకా బజాయిస్తున్నారు. అందుకొరకై కోట్లద్రవ్యం ఖర్చు పెడుతున్నారు. పూర్వపు రష్యా చక్రవర్తులు జయించిన పరరాష్ట్రాలకు పంచాయితీ సర్కారు స్వాతంత్ర్యప్రదానం జేసి మా రాజులపాపమును క్షమింపుడని కోరుతున్నారు ఈరాష్ట్రాలలో సోవియటు ప్రభుత్వాలు స్థాపించబడుతున్నవి, బోల్షెవిక్ భావాలు చెదపురుగులవలె తమకండిన పాతప్రతిష్ఠాపన లన్నింటిని భగ్నంచేస్తున్నవి. జర్మను ఆస్ట్రియాదేశముల కిదివరకే వ్యాపించినవి. అమెరికా ఫ్రాన్సుదేశాలలోని ధనికవర్గాలు కంపంబొందుతున్నవి. బోల్షెవిక్కులు యింగ్లండుదేశంమీద తమదృష్టి సారించారు బోల్షెవికు భావతరంగాలు ఆంగ్ల మానస కాసారములను చలింపజేస్తున్నవి. ఆంగ్లధనికవర్గం యీభావాలను రాకుండా కొట్టవలసిందని వుద్ఘోషిస్తున్నది. భావాలను ఫిరంగులు యెట్లా గొట్టగలవని ప్రభుత్వంవారంటున్నారు. ఆంగ్లరాజ్యప్రకృతి మిక్కిలి పురాతనమైనవాట్లలో వొకటి. ప్రభుత్వం వారు యీ పాతకట్టడాన్ని బూజుదులిపి మరమ్మతు చేయడానికి ప్రయత్నిస్తున్నారు. స్త్రీలకు యెన్నిక అధికార మియ్యబడ్డది. ప్రభుసంఘాన్ని యెన్నికపద్ధతుల ప్రకారం యేర్పర్చవలెనని ప్రయత్నిస్తున్నారు. ప్రజాసంఘంలో కొత్తయెన్నికలు జరిగితే కూలీ సభికులసంఖ్య యెక్కువకావడం నిశ్చయం. కూలీప్రభుత్వం యేర్పడి ఆంగ్లదేశంలో యేమార్పులు వస్తవో, యిండియాప్రభుత్వాన్ని యెట్లా మారుస్తారో చెప్పలేము. బీదలకు ప్రభుత్వంవారు యిండ్లుకట్టించియిస్తున్నారు. గనికూలీలు యీమధ్యగట్టినసమ్మె దేశమంతటా పరవంచి. గనులను నీళ్లలోనూ, దేశాన్ని విప్లవంలోనూ ముంచివేస్తుందని భయపడ్డారు. తక్కిన కూలీసంఘాలుకూడా వొక్కమదుపున గనికూలీలతో చేరినట్లయితే అయిదు నిమిషాలలో ఆంగ్లదేశం రెండవరష్యా అయిపోయేది. అటువంటిస్థితి రాకుండా యజమానులూ, కూలీలూ రాజీపడుతున్నారు. తెగినదాకా బిగించేపద్ధతి ఆంగ్లేయుల దగ్గర లేదు. గట్టిగా లాగితేనేగాని వారువంగరు. బోల్షెవిక్కు

తాకుడుకు ఆంగ్ల రాజ్యప్రకృతి వొక్కటిమాత్రమే నిలువగలదని తోస్తుంది. జనులలోని అన్ని సంఘాలకూ ప్రభుత్వంలో పలుకుబడివుంది. జమీందారులూ, మఠాధిపతులూ ప్రభుసంఘంలో సభ్యులు. ప్రజాసంఘంలో ధనికులకూ, కూలీలకూ సమానమైన పలుకుబడి యేర్పడుతున్నది. మనదేశంలో కూలీలకు యెన్నికధికారమే లేదు అన్ని దేశాలకంటే మనదేశంలోనే పునర్నిర్మాణం యెక్కువ అవసరం, ప్రపంచమందంతటా కూలీలు బీదలేకాని కోట్లకొలదిగా అన్నంలేనివా రుండరు. మనదేశంలోనూ ధనం వ్యవసాయకులకూ, వర్తకులకూ హస్తగతమైవున్నది. పూర్వపు వృత్తివిభజనమే దీనికి కారణం. వృత్తివిభజనపద్ధతి పనికిరాదని అందరూ అంటారుగాని పూర్వపద్ధతివలన గలిగిన లాభాలు వదులుకోకుండా కొత్తపద్ధతులవలన యెక్కువలాభాలు వస్తేపొందుదామంటారు. కొత్తలాభాలతోపాటు కొత్తచిక్కులుగూడా వస్తవనిగమనించరు. మనము విప్లవమార్గాలకు దిగగూడదు. ఇంగ్లండులో యేర్పడుతున్న పద్ధతుల ననుసరించి అచి అడుగువేయుడం వుత్తమమార్గం. భూస్వాముల నందరినీ భూములు అందరికీ పంచిపెట్టమంటె అంగీకరిస్తారా? అది మనం కోరడమూ భావ్యంకాదు. మనం పారమార్థికం విచారించినప్పుడు వారుకూడా న్యాయానికి కట్టుబడి పండేపంటలో కూలీలకు తగిన భాగం యివ్వడానికి పోరంబోకులలోనూ, అడవులలోనూ సారవంతమైన భూములను దిగువజాతులకు దరఖాస్తులమీద యివ్వడానికి వారంగీకరించవలసివుంటుంది. మన విద్యను అభివృద్ధిచేయువలసిన బాధ్యత ధనికులది. ఈవిషయమై యికమీద వారెంత మాత్రం అశ్రద్ధచేయగిట్టదు! దేశపాలనలో కూలీలకు అరస్థాన మియ్యవలసిందని కోరడం యెక్కువకోరిక గాదు.

మన వుద్యమం పవిత్రమైనది. దానియందు ద్వేషభావాలకు చోటులేదు. ద్వేషపూరితమైన వుద్యమమేదీ నిలువజాలదు.

“మావిద్విషావహై” అని భగవంతుణ్ణి మన మందరం ప్రార్థన చెయ్యాలె. కొందరెవరైన మనలో కేటించేవారున్నా మన ధనికసోదరులు మనవుద్యమాన్ని నిరసించకూడదు. కృష్ణాప్రవాహంవచ్చి కట్టలు పొంగి కొంతదేశానికి నష్టంగలిగించినా పులవరం బోయిన వెంటనే ప్రవాహం యథాస్థితికి రాకతప్పదు. కొంతనష్టం గలిగినా నది యెండిపోవడంకంటె వరదలే మేలుగదా! సంచలనం చైతన్యచిహ్నం, జడత్వం మరణచిహ్నం. ప్రాణముంటే యెప్పటికైనా బాగుపడవచ్చునని ఆశ వుంటుంది, కాబట్టి మనలో కొన్ని లోపాలున్నా పంచమేతరులు మనల మన్నించి మనకు తోడ్పడుదురు గాక.

నా వుపన్యాసం ముగిసింది. తమ రందరూ మన సంఘాభివృద్ధికై అవసరమైన తీర్మానాలు చేయవలసి వుంటుంది. విషయనిర్ణయసంఘ మేర్పడి చిత్తుతీర్మానాలు తయారుచెయ్యాలె మన నాయకులైన సంగదాసు గారు చిత్తుతీర్మానాలు వ్రాసివుంచారు. అవి వారు మీకు చదివి వినిపిస్తారు. విన్నతరువాత విషయనిర్ణయ సంఘ మవసర మని మీకు తోస్తే యేర్పాటు చేయవచ్చు. లేకపోతే మనం వెంటనే మహాసభ ప్రారంభింతాం.

సంగదాసు గారు చదివిన తీర్మానాలు.

౧. మనసంఘము వారు నీచమైనపేళ్లు పెట్టుకోకూడదనీ తమ పేరకు అన్నా, అప్పా, అయ్యా, అమ్మా, అక్కా మొదలైన మర్యాదవాచకాలను చేర్చుకోవలసిం

దనీ, వొకరినొకరు మర్యాదగా పిలుచుకోవలసిందనీ, అట్లు చేయకపోవడం మన ఆత్మ గౌరవానికి భంగమనీ యీ సభవారు తీర్మానిస్తున్నారు.

౨. మన పిల్లలందరికి సామాన్యవిద్యా వృత్తివిద్యా విధిగా నేర్పించవలసిం దని యీ సభవారు కోరుతున్నారు.

౩. మన సంఘీయులు వృత్తిగౌరవం గలిగి, నేతా, చర్మకారవృత్తి, వృద్ధిచేసి మన సంఘంయొక్క అర్థస్థితి బాగుజేయవలసిందని యీసభవారు సిఫార్సు చేస్తున్నారు.

౪. సంఘగౌరవానికి లోపంగానూ, అర్థాభివృద్ధికి భంగకరంగానూ వున్నటువంటి మద్యపానాదిదుర్వృత్తులను మానివేయవలసిం దని యీసభవారు తమ దృఢాభిప్రాయమును నొక్కి వక్కాణిస్తున్నారు.

౫. ఆరోగ్యాభివృద్ధికిగాను స్నానం మొదలైన శౌచపద్ధతులను విధిగా అవలంభించవలసిందని సంఘంవారిని యీ సభవారు మరీమరీ హెచ్చరిస్తున్నారు.

౬. జీతగాండ్లకూ యితరకూలీలకూ వోట్లిచ్చు అధికారం యియ్యవలసిం దని యీసభవారు కోరుతున్నారు.

౭. అడవులలో వ్యవసాయానికి పనికివచ్చేభూములను దిగువ జాతులకుమాత్రమే దరఖాస్తుల కిప్పించవలసిం దని యీసభవారు కోరుతున్నారు.

౮. యిదివరకు పంచములకని దరఖాస్తులకిస్తున్న భూములు చాలావరకు పంచమ క్రైస్తవులకే చెందుతున్నందువల్ల హిందూపంచముల సంఖ్యనుబట్టి వారిభాగానికి రాదగిన భూములను వారికే యిప్పించవలసిం దని యీ సభవారు ప్రార్థిస్తున్నారు.

౯. యిండ్లనిమిత్తం స్థలములూ యిండ్లుకట్టుకొనుటకు ద్రవ్యసహాయం యిప్పించవలసిం దని యీసభవారు కోరుతున్నారు.

౧౦. పైతరగతులవారు విద్యాధికులై వున్నతోద్యోగాలను ఆక్రమించుకొని వున్నందువల్లనూ దిగువతెగల కింతలో ఆ స్థితి లభించే ఆశ లేనందువల్లనూ పోలీసూ, రివిన్యూ, సివిలూ, ఫారెస్టూ, మిలిటరీ మొదలగు శాఖలలో స్వల్పవుద్యోగాలను దిగువ జాతులకు ఆపుదల చేయించవలసిం దని యీసభవారు ప్రార్థిస్తున్నారు.

౧౧. మునిసిపల్‌సొమ్ము వుపయోగించి యేర్పరచిన విద్యాలయాలు, బావులు, చెరువులు, సత్రాలు, దేవాలయాలు మొదలైనవాటిలో దిగువతరగతుల హక్కులను అంగీకరించవలసిం దనీ, వాటిలో కొన్నిటిని ప్రస్తుతం వారికై ప్రత్యేకించవలసిం దనీ యీ సభవారు కోరుతున్నారు.

౧౨. బహిరంగస్థలాలలోకూడా పంచములను దూరస్థుల జేసే ఆచారం ఆత్మ గౌరవం గల పంచములకు దుస్సహంగా వున్నదని తదితర సంఘాలకు తెలియపరుస్తున్నారు.

౧౩. వ్యవసాయపుపనులలో పనివాండ్లకిచ్చు కూలి స్వల్పంగా వున్నందువల్ల తగురీతిని హెచ్చించవలసిందని రైతులకు యీ సభవారు విన్నవించుకొనుచున్నారు.

౧౪. ప్రధానస్థలములలో పంచముల వుపయోగం నిమిత్తం వృత్తివిద్యా, సామాన్యవిద్యా నేర్పే పెద్దవిద్యాలయం స్థాపించి వసతిగృహం యేర్పరచడం అత్యవసరమని యీ సభవారు తీర్మానిస్తున్నారు.

చిత్తుతీర్మానా లందరూ విని విషయనిర్ణయసంఘం అవసరం లేదనీ, కొత్త

తీర్మానాలు చేయవలసివుంటే సభాపతిగారికి పంపవచ్చుననీ, సభ ఫలహారా లయిన తరువాత జరుపవలసిన దనీ నిశ్చయించారు.

మూడుగంటలకు సభ తిరిగి సమావేశమైంది. తీర్మానాలన్నీ సక్రమంగా ప్రస్తావించబడి ఆమోదించబడినతరువాత సభవారిచే అంగీకరించబడ్డవి. నూతక్కి రామయ్యగారు పంచములనిమిత్తం తమవూరిపల్లెలో రాములవారి దేవాలయం కట్టిస్తానని ప్రమటించారు. రామచంద్రచౌదరిగారు తమ గ్రామంలో వుండే పంచములతోపాటు ఆంజనేయస్వామివారి దేవాలయానికి మూడెకరాల తరిభూమి చదివించారు.
మరివొకరు:

౧౨. కూలీలకు సక్రమమైన కూలి యివ్వక వారి శ్రమవలన వచ్చే ఆదాయంలో విశేషభాగం భూస్వాములే అనుభవిస్తున్నందువల్ల వేతల కోతల కాలాలలో కూలీలు సమ్మెకట్టి సహాయనిరాకరణ మవలంబించవలసిందని యీ సభవారు తీర్మానిస్తున్నారనే కొత్తతీర్మానాన్ని ప్రస్తావించగోరారు.

౧౩-వ తీర్మానం సౌమ్యంగా వ్యవహారం పైసలుచేసుకోవడానికి వ్యవసాయదారులకు అవకాశమిస్తున్నందున శరణార్థికి చంకదుడ్డు పనికిరానట్టు యీతీర్మానం ప్రస్తుతం విరమించవలసిందని సభాపతిగారు కోరినందువల్ల ఆపివేయబడ్డది. నిర్వాహకసంఘ మేర్పడి సంగదాసుగారు కార్యదర్శిగా నియమించబడ్డారు. సోమయాజులుగారు తమ ఆనందాన్ని వెలిబుచ్చుతూ మంగళశ్లోకాలు చదివారు. సభాపతిగారు సభను విరమిస్తూ తమ వుపసంహారోపన్యాసంలో సంగదాసుగారిని ప్రశంసించి వారి త్యాగంవల్లనే మనవుద్యమం నెరవేరవలసివుంటుందని చెప్పి చరమోపన్యాసం ముగించారు. వందనాలతో సభ ముగిసింది.

ఇరువదినాల్గవఅధ్యాయము

# నన్ను మరచిపోబోకు

రాత్రి పదిగంటల రైలుకు సభాపతిగారు హైదరాబాదుకు పోయినారు. సర్వారావుపేటబండిమీద రామానాయుడూ, సంగదాసూ ప్రయాణమైనారు. కాన్ఫరెన్సును గురించే చాలాసేపు ముచ్చటించారు. వూళ్లో సమ్మెయే మైవుంటుందో ననుకొన్నారు. నామకా నేను కార్యదర్శినైనా పని నిర్వహించేభారం నీమీదనే వుంటుం దని సంగదా సన్నాడు.

సం—రామానాయుడూ! రైలులో కూర్చున్నప్పటినుంచీ నాకేదో తమాషాగా కనబడుతున్నది. యీ రైలే వొక ప్రపంచములా గుంది. జీవితంకూడా వొక ప్రయాణంవంటిదే. మనమంతా వొక్కచోటు యొక్కలేదు గదా! కానీపు మనకు కొందరితో సంబంధం గలిగింది. కాలము తీరిపోయినవాండ్లు చచ్చిపోయినట్లు ప్రయాణంత్యం కాంగనే ప్రతివాడు దిగుతాడు ప్రపంచంలో చచ్చేవాండ్లను అవతలకు యీడుస్తాము పుట్టేవాండ్లను ఆహ్వానం చేస్తాం, యిట్లా యెప్పటినుంచి జరుగుతున్నదో! యింకా యెంతకాలం జరుగుతుందో! యిదంతా యేమిటయ్యా అని యెవరినయినా అడిగితే తలావొక జవాబు చెపుతారు. ప్రపంచం పుట్టినప్పటినుంచీ

యిప్పటివరకు ప్రశ్న అడగడం తటస్థిస్తున్నది. మతకర్తలు పుట్టారు. యిదంతా యేమిటయ్యా 'అనే ప్రశ్నను పట్టుకొని లాగులాడారు. తపస్సులుచేసి తల్లకిందు లయినారు, దీర్ఘచర్చలు చేసి పవాలక్ష గ్రంథం వ్రాశారు. వొకరిజవాబు వొకరికి పొసగదు. మొత్తంమీద చూస్తే వొకరికీ అంతుపట్టినట్లు లేదు. చివరకు,

శ్లో॥ "శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః,
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్"

అనేదే తేలుతున్నది.

రా—ఏమి టిది? నీబుద్ధి చాకచక్య మంతా వదలిపెట్టి యిట్లా నీరసంగా మాట్లాడుతున్నావు

సం—నవబుద్ధులు కణిపెడేసి కొలబుట్టలు. వీటినిబెట్టి అనంతుణ్ణి కొలవాలెనని ప్రయత్నం చేస్తాం. యెట్లా తేల్తుంది? యిది సాధ్యంగానినే సద్గురుడు,

శ్లో. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః."

అని ఆఖరుమాట చెప్పాడు:

రా—స్టేషను దగ్గరకు వస్తున్నది. సామాను సద్దుకో.

సం—సద్దుకొనే దేమున్నది?

"పోయ్యేటప్పుడు వెంటరాదు వొక పుచ్చిన వక్కైనా" అన్నాడు. నిన్ను విడిచిపెట్టి పోవడమంటే నాకు కష్టంగా వుంది. మళ్ళీ యెప్పటికో చూడడం.

రా—నీవు లేనిరోజులు నేను యెట్లా గడుపుతానో. నీవు కృష్ణుడివి నేను అర్జునుడుగా రోజులు గడుపుతుంటిమి.

సం—నాయుడూ! నేను వెళ్లుతున్నాను. నన్ను మరచిపోబోకు.

ఉభయులు కావలించుకొన్నారు. యిదివరకు మనసులుమాత్రం కలసిపోయినవి. యిప్పుడు దేహాలుకూడా వొకటైనవి. సంగదాసు కిందికి దిగాడు గంట కొట్టారు. రైలు సాగింది. ఉభయులు దూరమైపోయినారు. వాతావరణం మారిపోయింది. సంగదాసు స్టేషనులోకి పోయి టిక్కెట్టిచ్చాడు. గంట రెండు దాటింది. కాసేపు తాళి పోదామని బల్లమీద పడుకొన్నాడు. వేళదప్పి నిదురపట్టలేదు. నల్లులుకుట్టడం ప్రారంభించినవి. లేచి కూర్చున్నాడు. మూడువిన్నాడు. యాదాలాపాన నాలుగు లెక్కపెట్టడం మరచిపోయినాడు. చిరుచలితో మిశ్రమమై రవ్వగాలి సాగింది. పదినిమిషాలలో బడలిక తీరింది చుక్క పొడవంగనే బయలుదేరాడు. నడచినకొద్దీ వుత్సాహమూ యెక్కువయింది. బాడిగబండ్లు రాతిబల్లలెత్తుకొని యెదురుగా వచ్చినవి. తూర్పున చీకటి దండెలు విచ్చడం ప్రారంభించింది. వూరువగ్గరకు పోయేసరికి ధళ్లున తెల్లవారి ఆకాశాన యెర్రదాలు గప్పింది.

సంగదాసు రావడం కసగదిలోకే వచ్చాడు. తాళంతీసి కోటు తలగుడ్డ చిలుకకు తగిలించి తలుపువేసి వేపపుల్లకోసం ఆవులదొడ్డిలోకి పోయినాడు.

సం—ఆదంసాహేబూ! వూళ్ళో కథలేమిటి?

ఆదం—కథ లేమిటి, వూరంతా అట్టుడికినట్టు వుడుకుతున్నది.

సం—కూర్చుందాం. కథంతా నాకు చెప్పు. మీరంతా కూర్చోండోయ్.

అ—ఇప్పుడు వొకటికి రెండు కథలైనవి. ఇక్కడ సమ్మెకథ. అక్కడ మీటింగుకథ. ముందు మీటింగుకథ చెప్తాను. చిన్నయ్యగారు వస్తే చాల గడబిడ అయ్యేట్టుంది. అసలు పెద్దయ్యగారు అనుకోవడం మీ రిద్దరూ గురువుదగ్గరకు పోయినారని. బెజవాడ పోతారని తెలిస్తే ముహూర్తం కదలనిచ్చేవాడే కాడు. మీ రిద్దరూ కలిసి యెక్కడో స్టేషనులో మాదిగవాడిచేత అన్నం లొట్టలు వేసుకుంటూ కేకలు కొట్టుతూ తింటున్నారట. మన మనసులు మీ దగ్గరకువస్తే వూరించి తిందువుగాని రమ్మన్నారట. అయన మీ కిదేమి చేటుకాలమని మందలిస్తే గల్లంతా యిస్తామన్నారట. మీ నాయన గారితో చెప్తానంటే మీ తాతకు చెప్పుకోపొమ్మన్నారట. రామానాయుడుగారు మాలపల్లెలోనే పేడవేసి కాపురం పెడతారని చెప్పుకుంటున్నారు. మనసులు వెలి వేయించవలెనని నాలుగు కులాలవాండ్లనూ పోగుచేస్తున్నాడు. లక్ష్మమ్మగారికి నిన్నల్లా అన్నంలేదు. ఏమీతోచక కాలుగాలిన పిల్లివలె తిరుగుతున్నది. యిక చౌదరయ్యగారు నిన్ను చూస్తే మింగేట్టుగా ఉగ్రుడై మండిపడుతున్నాడు.

సం—యిక రెండోకథ చెప్పు.

అ—రెండోకథా! వూళ్లో కూలివాళ్లంతా నిన్న కోతలకు వస్తారని చౌదరయ్యగా రనుకొన్నారు. మీరు బందుచేసిపోయిన సంగతి వస్పురివారికి తెలియనే తెలియదు. నాలుగువందలమంది కూలీలను పోగుచేసి సాయంత్రానికి కోత అయిందనిపించాలె నని చూశాడు. జీతగాండ్లందరిని అరకలకు పంపడం మానిపించి కూలీలను పోగుచేసుకొని కోతలకు పొమ్మన్నాడు. వెంకయ్యను పల్లెకు పంపాడు. తాను కాలిన బలపం గట్టుకొని వూళ్లో యిల్లిల్లు తిరిగాడు. యిదంతా సాయంత్రం కూలి బిగపెట్టడానికి ప్రయత్నం. కూలీలంతా బలేపని జేశారు. శేషయ్య అందిస్తే అల్లక పోయే మనిషి. మీరు చూచాయగా అనిపోయినారు. వాడు ప్రబలంజేశాడు. కూలీలు అంతా వస్తామని చెప్పారు. వూళ్లో ఆసాములు ఎవరియిలాకా కూలీలను వాండ్లు చాటుగా ముందు కూలిచ్చి గట్టి జేసుకున్నారు. వొకరి సంగతి వొకరికి తెలియదు. అంతా తోడు కొంగలే, పెద్దయ్యగారు తాను అన్నందిని స్వయంగా బయలుదేరాడు. కూలీలంతా తిరువాళ్ల ప్రజగా సాగారు. వీండ్లంతా తన చేనికే వస్తున్నా రనుకున్నాడు. గమిడి దాటంగనే పిలిచినా పలక్కుండా వాండ్లలో వాండ్లు నవ్వుకుంటూ యెవరిదారిన వాండ్లు దూసుకున్నారు అయ్యగారు దిగాలపోయి పల్లెపంక పోయేవరకు వెంకటయ్య బిక్క మొగం వేసుకొని యెదురుగా వచ్చి మోసంజేశారని చెప్పాడు. అంతట యింటికిజేరి పంతులునూ బిలిపించి కచేరీలో గూర్చొని చాలానేపు తల పట్టుకున్నాడు. వాండ్లు యెంతాలోచించినా దీనికి ఖుబస్సు చిక్కలేదు. వాడికీ ఉలిపికట్టె వెంగన్నకు సారాయి విషయంలో కటకటజేశారని మీరంటె సరిపడదు. పంతులువచ్చి బాడబందీస్తే నీకే బందోబస్తు చేసిపోయినావని చెప్పాడు. అప్పుడు నీకోసం పెద్దయ్యగారు నన్ను మాలపల్లె తరిమితే వచ్చి కనుక్కుంటే మీరు వూరికి వెళ్లిపోయినారని చెప్పారు. ఆ సంగతి వచ్చి చెప్పాను. పెద్దయ్య పండ్లు పటపటగొరికి యిదంతా వీడు చేసిపోయిందేనన్నాడు అంతట నేనూ పంతులూ ఆయనా గలిసి పొలం బోయినాం. చిన్నపరెడ్డి పదిమందిలో ఒట్టుకొని "నీ దెబ్బదూ లోకులను ముంచే వ్యవహారమే. నీతో వ్యవహారం యిక్కడికే తలబట్టింది. కూలిసంగతి యిక నాతో తలబెట్టవద్దన్నాడు.

చౌ—పొరబాటు జరిగింది, మాలవాడు నన్ను దుబుకించాడు.

చి—అవును తాటిచెట్టంతవాడికి తలదన్నేవా డుంటాడు.

చౌ—నామాట చెవిదూరనియ్యవేమి? యిక్వాతు మిగిలిపోయిందేమిటది!

చి—ఆట్లా అనకున్నావుగామాలె. యిప్పుడు మిగిలివున్న దేమున్నది! మీ పూరిమాట విని ఆసాములంతా బెదిరిపోయినారు. కాకపోయినా నిన్న మాల మాదిగెలు బెజవాడలో సభజేసి యింకా జీతమూ, కూలీ యెక్కించమని గోలెత్తారట. యింతకుముందే బెజవాడనుంచి మనుష్యులు వచ్చారు. ఇప్పుడు మనం తగించడానికి ప్రయత్నంజేస్తే అల్లరెక్కువవుతుంది. యీ సభ అంతేమోచూచి పర్యాయితీన చూచు కుందాం. ప్రస్తుతం సంతోషించు.

చౌ—నే నిప్పుడు వూళ్ళోకి పోతే గేలిగొట్టరా! యిరవై పుట్ల జొన్నలూ మట్టిలో గలసినా నేను వెనక్కుబోను.

చి—మట్టిలో గలిస్తే వచ్చే సెబ్బరేమిటి! మంచుకు విత్తనాలు జల్లకుండా పండుతవి. యింట్లో మక్కిపోతున్న పాతళ్ళు పదేండ్లు తినవచ్చు.

చౌ—నీదంతా పరియాచకం. వూళ్ళో తలయెత్తడానికి నాకు మొగం చెల్లడం లేదు. ఇక అందరూ తాతా అనిపిలవడం ఆరంభిస్తారు.

చి—నీకు మనుమడు యిదివరకే పుట్టాడుగదా. తాతవు యిదివరకే అయినావు. పూరికె విపర్యాసాలుపోక యింటికిబో. వ్యవహారాని కెప్పుడూ లగువు బిగువులుండాలె సమయం గనిపెట్టి పోవాల్నేగాని దూకుదామంటే కుదరదు. భోజనానికి ఈ పూట కిక్కడనే నిలువు. తరువాత నీ యిష్టం.

చౌ— కాదు పోవాలె. నేను కూలివాండ్ల మొగం చూడడానికి యిష్టంలేదు. యీయేటికోతలు మా పంతులుగారికి వొప్పజెపుతాను.

అని యింటికి వచ్చాడు. యిది జరిగినకథ. తరువాత నీయిష్టం. యిదేమయినా నెరవేరేదేనా? చౌదరయ్యగారి పుక్రోష మణిగేదాకా ఆయనయెదుట బడవద్దు. యీ వేళా, రేపూ కాస్త తమాయించు.

స—మీరు అధైర్యపడవద్దు. మనం గెలుస్తాం.

యీ సంభాషణ జరుగుతుండగా చౌదరయ్య వీధిలోకి వచ్చాడు. సంగదాను గదికి తాళంలేకపోవడం జూచి వెంగన్నను బిలిచాడు. వెంగన్న అయ్యా అని దొడ్లో నుంచి పొగాకు నములుతూ బయటికి వచ్చాడు.

చౌ—మాలవాడు రాగానే చెప్పమంటె చెప్పలేదేమి?

వెం—ఆపనిమీదనే వున్నా. ఆవులదొడ్లో జీతగాండ్లకు బడిబెట్టి బోధ జేస్తున్నాడు,

చౌ—వీడు నన్ను నిలువనిచ్చేటట్టు లేడు,

అని అక్కడ పడివున్న రాగోల బుజాన బెట్టుకొని బయలుదేరాడు. యీన రావడంజూచి జీతగాండ్లు ఆవులదొడ్డితలుపు లోపలి తూర్పువాకిలిగుండా గోళ్లెము వేసి బీట్లోకి పరుగెత్తారు. చౌదరయ్యతలుపుతన్ని "తీయితలుపు" అని కేకలేశాడు. దాను మెల్లగా తలుపుదీసి లేడిపిల్లవలె బిత్తరచూపులు జూస్తూ వోరగా నిలువబడ్డాడు.

చౌదరయ్యకు పండ్లు పటపటమంటున్నవి. దేహం స్వాధీనంలోలేదు. శరీరం

కట్టెవారింది. ముఖమంతా మడతలుబడ్డది. కండ్లు బైత్తులై పైకుబికినవి. పెదవులు బిగిసి వుశ్వాసమాగిపోయింది. దేహం జేవురించి చెమర్చింది. మనసు క్రోధపూరితమై ఘూర్ణించింది. వేళ్ల ఆకవడిబడేటట్టుగా రాగోల బిగబట్టి తలమీద గొట్టాడు. సంగదాసు అల్లుదీసిన తీగెవలె చతికెలబడి నేలకొరిగాడు. తల దానిమ్మపండువలె బద్దలయింది. లోకంలోని అక్రమాలనుజూచి ఆక్రోశించిన రక్తం, వున్నతభావాలకు వుద్రేకించిన రక్తం, పరులసేవలో పాలిపోయినరక్తం పవిత్రభావాలచేత పావనమైన రక్తం, గొట్టాన జిమ్మినట్లు ప్రవహిస్తున్నది భూమి పావనమైంది. చౌదరయ్యకు రక్తం జూచేవరకు కళ్లు బైర్లుగమ్మినవి. రాగోల జబ్బలో విసిరివేసి తలుపు గొళ్ళెం తగిలించి యింట్లోకి పరుగెత్తాడు. యెవరో వెంటబడి తరుముతున్నట్లు దోచింది. లక్ష్మమ్మ ముంగిట్లోకి యెదురుగావచ్చి యేమిటంటే మాట్లాడక భవంతిలోకి పరుగెత్తి పడమటింట్లోజొరబడి పత్తిమండెక్కాడు. లక్ష్మమ్మ లోపలికి పరుగెత్తుకొచ్చి యేమిటో కొంపమునిగింది, చెప్పమంటే చెప్పవేమని అడిగింది.

చౌ—మాలవాడిని ఆవులదొడ్లో కర్రతో గొడితే చచ్చాడు. దబ్బున పోయి దిబ్బలో పాతివేయించు.

“కొట్టడమేమిటి?—చావడమేమిటి—యిదేందో ముంచకపోయేందుకువచ్చిం” దని లక్ష్మమ్మ కత్తివాటేసినా వెంగాన నెత్తురు లేకుండా వీధివాకిట్లో నిలుచున్నది.

బీట్లోకి పరుగెత్తిన జీతగాండ్లలో వొకడు రాగోల పైకెత్తడం చూచాడు. ఫెళ్ళున దెబ్బ వినబడ్డది. “అయ్యో చంపాడురా” అని కేక వేశాడు. జీతగాండ్లంతా పరుగెత్తుకొని వచ్చారు. రక్తప్రవాహం జూచేవరకు ఆవేశమెక్కింది. అయ్యో మన రత్నం బోయిందన్నారు తలుపు గొళ్లెం వేసున్నది మాడుతన్నులకు విరిగి పడ్డది. ఆ యెర్రమీద యేడి యేడని వీధిలోకి పరుగెత్తారు. లక్ష్మమ్మను జూచి,

జీ—ఏడీ? వాడేడి? చంపి యింట్లో జొరబడ్డాడు.

ఆదం—ఏడీవాడు? రక్తం కండ్లజూస్తా;

సత్తి—ఏడీ? పేగులు తీకి జందెం వేసుకుంటా.

నాగడు—కండ్లగ్గనబడితే ముక్కలుగా నరికి గద్దలకు పారేస్తా.

లక్ష్మమ్మకు తొందర బుట్టింది. నిబ్బరించుకొని “యింట్లోకి రాలేదు. కొట్టంలోకి బోయినా” డన్నది. కొట్టూ కొట్టూ అని జనమంతా కొట్టంలోకి పరుగెత్తారు. లక్ష్మమ్మ తటాలున తలుపువేసి గడియ బిగించింది. చౌదరయ్య కొట్టంలో కనబడలేదు. మళ్ళీ వీధిలోకి అంతా పరుగెత్తారు. తలుపు వేసివున్నది. వీధిలో నిలుచుండి తలుపులు పగలదన్నమని కేకలువేస్తున్నారు. పదితన్నులకైనా తలుపు కదలలేదు వుద్రేకం కొంత అణిగింది. మదురుబోసిన ప్రహరీగోడవంక చూశారు. గోడ చేతికి మిగిలివున్నది మృగం తప్పించుకొన్న వేటగాండ్లవలె రోజుతూ అందరూ నిలువబడ్డారు. కొంత శాంతం వచ్చింది.

సత్తి—ఆదంసాహెబూ! నేను మాలపల్లెకు బోయి వాండ్లవాండ్లను తీసుకొని వస్తా. మీరు మునసబుకు రిపోర్టు చెయ్యండి.

సత్తిగాడు మాలపల్లెకు పరుగెత్తాడు. కొందరు దొడ్లోకి పోయినారు. ఆదం సాహెబు మునసబు దగ్గరకుబోయి జరిగినసంగతి రిపోర్టిచ్చాడు.

ము—మీరాసాహెబూ! తక్షణం నీవుబోయి పోలీసుస్టేషనులో రిపోర్టిచ్చిరా. ఇదుగో మాట (రహస్యంగా) ఇన్‌స్పెక్టరుగారితో వేవిటు చేను వుండీదని చెప్పు. బాగా సిబ్బందితో రావాలె,

మీ—చిత్తం వంటంతా మీరందరూ వొడుపుకున్నా కాశిని గట్టుతైవా జూకు బెట్టించండి. పిల్లలుగలవాడిని.

మునసబు—పనిశుభుడుగా చేసుకురా, నీకు లేకపోతుంటిట.

మీరాసాహెబు రిపోర్టుదీసుకొని బేడీలూ, తుపాకులతో పోలీసుఘాటు తీసుకొనివస్తానని పుకారుబుట్టించి పోయినాడు. వాకిట్లో అల్లరి అణగంగనే లక్ష్మమ్మ అక్కలక్ష్మిని దిడ్డివాకిట పంతులింటికి బంపించి వడసుటింట్లోకి వచ్చింది.

చౌ—యెవరది?

లక్ష్మమ్మ—నేనే.

చౌ—యేమిజేశావు?

ల—ఏమిజేసేటట్టుగావుందిప్పుడు. జీతగాండ్లు చంపుతాం కరుస్తామని యింటిమీదబడ్డారు. దరవాజాతలుపు బిగిస్తే కానేపు అల్లరిజేసి వెళ్లిపోయినారు. యిప్పుడు బయటికి తలజూపేటట్టులేదు. పెద్దవాడు పొలమునుంచి రాలేదు. అక్కలక్ష్మిని పంతులుకోసం పంపించా.

చౌ—పంతులు అటుచేరడుగదా? ముందుగానే యిక్కడవున్నానని చెప్పబోకు. నీవు మండెమీదికెక్కి పత్తితీసి నామీదగప్పి పటికెట్టలు దానిమీదబెట్టు.

లక్ష్మమ్మకు కాళ్లలో కలక గనిపించలేదు. చివ్వున మండెమీదికెక్కింది. పత్తిమీదవేసి తట్టలు పెట్టింది. చౌదరయ్యకు ఊపిరిసలపక వుడ్డు కుడుచుకున్నట్టయింది. వొళ్లు చెమటపోసి దాహమయింది. పత్తికాకకు నిలువలేకపోయినాడు. కొంచెం ముసిలేవరకు తట్టలు క్రిందికి దొర్లిపోయినవి.

చౌ—ఇవి సమయానికి పుట్టినుంచుతవేమో. అయినా మళ్లీ బెట్టు.

అక్క—అమ్మా! పంతులు దొడ్లోకి వచ్చాడు. రమ్మనేదా?

లక్ష్మమ్మ—రమ్మను.

లక్ష్మమ్మ బయటికి వచ్చి గదితలుపు వేసి "తమ్ముడూ! నా మనువుకుంకానికి తెరువులు వచ్చినవి. తరువాతసంగతి యేమైనా, అవమానం జరిగేటట్టుగా వుంది. యేబావో చూచుకోవలసిందేగాని ప్రజల మొగం చూడటానికి వీలులేదు. చిన్నపిల్లవాడుగూడా లేడు. వూళ్లో అల్లరికే యిదవుతుంటే అన్నలుకే మోపంవచ్చింది. మేము నడిసముద్రంలో వున్నాం. గట్టెక్కేమార్గం మేమైనా చూస్తావా లేదా? నేను యీవూరు వచ్చి ముప్ఫైయేండ్లయింది. తలలో నాలికవలె వున్నాను. ఏమిజెట్టానో ఏమిజేశానో రెండోకంటివాండ్లెరుగరు. వొక్కమాటనుకోలేదు. మీబావను వొడ్డుజేర్చుకుండే భారం నీదని గోడుగోడున యేడ్చింది.

పం—అక్కా! నీవింతగా చెప్పనవసరంలేదు. నీవు వొకరివంటిదానవుగావు నీది యెముకలేనిచెయ్యి నీధర్మగుణమే నిన్ను రక్షించాలె. మునసబు రిపోర్టులో యేమీ వసలేదు. డబ్బును బావ సంపాయించాడు కాని బావను డబ్బు సంపాయించలేదు. సమయమిటువంటిది. మునసబుదగ్గరనుంచి డిప్టీసూపరెంటుదాకా అన్నిచోట్లా

గట్టాలి. నాలుగయిదు సంచులు వదలక తప్పవు.

లక్ష్మమ్మ తలుపు తీసింది. చౌదరయ్య సంభాషణ వింటూనే వున్నాడు.

లక్ష్మమ్మ—ఏమంటావు? పంతులు వచ్చాడు.

చౌ—పంతులూ! నాలుగింటితో సరిపుచ్చలేవా? అని బావిలోనుంచి వచ్చినట్లు శబ్దం వినపడ్డది.

పం—బావా! నీవు నాకు చెప్పాలెనా? నాశయుక్తులా చూస్తా. అవసరమైతే వొకటో, అరో పైన అంటా. వొకవేళ తండ్రిని లోబరచుకోవలసివస్తుందేమో.

చౌ—తండ్రిమాట తలపెట్టవద్దు. మాలవాడిగాడు దండగలిచ్చి యీ వూళ్ళో యింకా నిభాయించవా? ఆఖరుకు అయిదైనా సర్కారుకు గట్టు. అవి మొగపిల్లని సందుమాత్రం యెక్కడా వుంచవద్దు. పోలీసువాండ్లను మన యింటిదగ్గరకు రానియ్యకుండా అంతా మీ యింటిదగ్గరనే ఫైసల్ చేయించు. పోలీసులు వూరువిడిచినతరువాత యిక్కడికి రా.—యేమేవ్! అయిదుసంచులూ దిడ్డివాకిట పంతులింటికి జేర్పించు. వీధివాకిలిమాత్రం తియ్యవద్దు.— పంతులూ! నీవు దిడ్డివాకిట రావడం యెవరైనా జూశారా?

పం—యెవరూ నా కెదురుపడలేదు.

పంతులు వెళ్లిపోయినాడు.

---

# ఇరువదియైదవ అధ్యాయం

## మనం గెలుస్తాం

సత్తిగాడు మాలపల్లి బోయి యింట్లో జెప్పి రామదాసు పొలంబోయినాడంటే అక్కడికి పోయినాడు. వెంకటదాసు "వాడిశిరను యీవాళ నేలబడా" లెనిగండ్రగొడ్డలి దీసికొని పరుగెత్తాడు. మాలక్ష్మి పిల్లలను తీసుకొని యేడుస్తూ వచ్చింది. వెంకటదాసు 'యేడీవా, డ్బటూ చౌదరయ్యయింటికిబోయి "ఆడదానివలె యింట్లో దాక్కున్నావా? బయటకు రా." అంటూ బూతులుతిట్టి గండ్రగొడ్డలితో తలుపుమీద నాలుగుపెట్లు పెట్టాడు. ప్రతిధ్వనితప్ప మరి జవాబులేదు. వెంకటదాసు రాంగానే శీలగాండ్లూ, వూళ్ళో కూలివాండ్లూ మళ్లీ చెలరేగి యింటిమీద రాళ్ళవాన గురిపించారు. శేషయ్య సాయంత్రంలోగా ప్రాణానికి ప్రాణం బలి పెడతానని వాక్రుత్తి వీధులవెంబడి తిరుగుతున్నాడు. రంగదాసు వెంకటదాసు చేతులో గొడ్డలి లాక్కొని యింటికి బంపాడు. వీరదాసు రెండు వైపులా పుట్టెలు లేవక తప్పవని మోహరించి గడపమీద గూర్చున్నాడు. వెంకటయ్య పొలమునుంచి వచ్చి కథ యావత్తూవిని గోలజేసేవాండ్లందరికీ దణ్ణాలు బెడుతూ కాళ్లూ కడుపులూ పట్టుకొని బతిమాలాడుతూ "మాకిదివర కేమయినా విరోధాలున్నవా? ఎవండ్ల పెద్దలను యెవరు జంపారు? కానిరోజులు వచ్చేవరకు అన్నీ అట్లా తటస్థపడతై" వని అందరినీ శాంతింపజేస్తున్నాడు. మాలక్ష్మి గుండెలుకొట్టుకుంటూ "మానాయన యేడీ? మా బంగారుకొండ యేడీ? మాసంగన్న యేడీ?" అంటూ వినేవాండ్ల హృదయాలు కరిగి

పొయ్యేటట్లుగా సన్నగొంతుతో రోదనంజేస్తూ వచ్చింది. "అది మాలకులస్తురాలయినా దానినోట ఒక్క పరుషవాక్కు అయినా వస్తుందేమో చూడండి. వాండ్లందరూ మంచిచేశ్త్రరు" అని వెంకటసుబ్బయ్య అన్నాడు. రంగదాసు మాలక్ష్మిని చేయిపట్టి ఆవులదొడ్లోకి తీసుకొనిపోయినాడు. రక్తప్రవాహం జూచేవరకు తల్లి కడుపు తరుక్కొనిపోయింది, కండ్లు భ్రమలు కప్పినవి. 'ఏడీ మాసంగన్న?' అని నేలగొట్టి మీదబడి ముద్దుపెట్టుకున్నది. "ఓరిసంగడూ! నాముద్దుల సంగడూ! నీకాలిన ముల్లుగుచ్చుకుంటే నాప్రాణాలు విలవిల లాడేవి. నీతల వదిచక్కలైతే చూచి నాగుండె వక్కలుగాలేదు. నేను నిర్భాగ్యురాలిని. యేఅదృష్టవంతురాలి కడుపునన్నా పుడితే నీకు అచ్చటా ముచ్చటా జరిగేవేమో. పెండ్లిలేదు పేరంటం లేదు. మానాయనకు యిరవై అయిదేండ్లు వచ్చినా ప్రపంచధర్మ మెరుగడు. ఆడవాండ్లు పోతూవుంటే తలయెత్తి చూడడు. అశుకయోగి యేదో తపోభంగమై అరుంధతి బుట్టినట్లుగా మామాలకొంపలో బుట్టావుగాని మాకెందుకు దక్కుతావయ్యా నీవు. తండ్రి! నీవు పుట్టడంవల్ల మేము ధన్యులమైనా మనుకొన్నాం. మా మాలపల్లె పవిత్ర మైపోయింది. యింట్లో చుట్ట తాగడానికి భయపడ్డారు, మాలపల్లెంతా సారాయి మానుకున్నది. యింట్లో యేమూలజూచినా పుస్తకాలే. మాలగూడెంలోకి రామాయణభారతాలు జొరబడ్డవి నాయనా! భావులు తవ్విస్తానంటివి. దేవాలయాలు కట్టిస్తానంటివి. బళ్లు బెట్టిస్తా నంటివి. మాలపల్లెలు మునిపల్లెలు చేయవలెనంటివి. ఏవీ? నీరోజులు లెక్కచూసుకోకుండా కోరికెలు కోరావేమి?"

రం—ఇంకా ప్రాణముందయ్యా. పెదవులు కదిలిస్తున్నాడు. మాలక్ష్మి! నీవు మాట్లాడించిచూడు?

మా—సంగడూ—అమ్మను—మీఅమ్మనూ—పలక వేమి?

రం—ఏదో అంటున్నాడు. నిశ్శబ్దంగా వుండండి.

సం—మనం గెలుస్తాం.

రం—అదేదో తిరుపుమరుపుమాట, సంధి ప్రారంభించింది.

ఆ—దెబ్బ తగలబోయే ముందు నాతో యీమాటె అంటున్నాడు.

వం—సంధిసమయంలో వెనుకటిమాటలే మళ్లీ అంటూవుంటారు.

రామదాసు పరుగెత్తుకుంటూ వచ్చాడు. చూచి నిర్ఘాంతపోయినాడు. సద్గురూ! నీదయ యిట్లా వచ్చిందా అని దగ్గిరకూర్చొని చెక్కిళ్ళు సవరించాడు ఎదురురొమ్ము మీద చెయ్యిబెట్టుకొని తదేకదృష్టితో సంగదానువంక చూస్తూ కూర్చున్నాడు. ఐదు నిమిషాలు గుటగుటలాడి నోరు టక్కున మూతపడ్డది. పోతున్నది పోతున్నదన్నారు. మాలక్ష్మిని రామదాసు ఏడువవద్దన్నాడు. మాలక్ష్మి విరుచుకొని పడిపోయింది. రామదాను దుఃఖాన్ని. ఆయనవేదాంతం ఆపలేకపోయింది. పెద్దపెట్టున సంగన్నా! అని కేకవేసి యేడ్చాడు. అయిపోయిం దన్నారు. యేమైపోయిందో యెవరికీ తెలియదు. జనంలో ఆహాకారాలు బుట్టినవి. శవంమీద గుడ్డకప్పి అంతా నిశ్శబ్దంగాకూర్చున్నారు.

ఇంతలోకి మొహతాదు వచ్చి మునసబుగారితో పోలీసుఘాటు వస్తున్నదని చెప్పాడు.

వం—మీరంతా అటు పొండర్రా యెందుకిక్కడ. చూర్లుబార్లు తీరిపోయినవి.

శేషయ్య—మనుష్యులను చావగొట్టి కమ్మి చెయ్యి. మేమంతా పోతాము. అసలువాడిని రమ్మను. బొమ్మవు మధ్య నీవు వచ్చావెందుకు?

వెం—శేషయ్యావా! నీవెందుకు తొందరపడతావు? సంగడంటే దేవుడుగా చూచుకున్నాంగాని మరొకటిగాదు. వాడే యజమానుడు. నేనే వాడికిందచేతగాడుగా పనిజేశా. కాల మిట్లా వచ్చింది.

పం—అంతా తొందరపడితే లాభంలేదు. ముందూ వెనకా ఆలోచించుకోవాలె. పోలీసువాండ్లు రావడం, పరీక్షలు చెయ్యడం, శవాన్ని డాక్టరు దగ్గరకు మోసక పోవడం, పాడు కొయ్యటం, నానా అపస్మారకం చెయ్యడం జరుగుతుంది. మాలక్ష్మి చెప్పినట్టు వాడేదో తపోభంగమై పుట్టినపురుషుడు. అటువంటివాడి శవానికి యీ చుమ్మర్లన్నీ కలగడం అంటే నేనే భరించలేకుండా వున్నాను. ఇక తలిదండ్రులమాట చెప్పనే అవసరంలేదు. యీ రభసంతా జరగడంకంటే యింత పూలూ, బుక్కా యీ చల్లుకుంటూ వూళ్ళో వూరేగింపు చేసుకుంటూ ఆనందంగా వుత్తరక్రియలు జరిగించు కుంటే బాగుంటుందని నా అభిప్రాయం. చిన్నవాడినో, పెద్దవాడినో చెప్పాను, నేను ఇటువంటి వ్యవహారాలు అనేకం జూచి బొవ్వులు దిన్నవాడిని, తర్వాత మీయిష్టం.

తోగట వెంకమ్మ—నల్లని స్థూలశరీరం, తెల్లనిపండ్లు, నల్లనికండ్లు, కల్లలేని మనస్సు, జాలిగుండె, బోళాతనమూ—ప్రకటిస్తూ—అంతవరకన్నా మాకు దయ చేయండి. అదే పదివేలనుకుంటా మన్నది.

జనమూ—పంతులుగారు చెప్పిందే బాగుంది. యిక్కడే ఉత్సవం చేసుకుందాం.

పంతులు—రామదాసూ! నేను వొక్కమాట జెప్పుతావిను. పుత్రశోకంచేత బుద్ధి పరిపరివిధాల బోతుంది. నీవు మనస్సును జయించి తామరాకులో నీళ్లమోస్తరుగా సంసారంలో వున్నవాడివి. పోయినవాడేమో మళ్ళీ రాడుగదా? యెవరివల్ల యేమి జరిగిందో యీ మహాజనంలో వొక్కడుగూడ కండ్లతో జూడలేదు. కుండకు మూతవుంది గాని నోటికిలేదు. పదుగురు నాలుగుదార్లుగా అనుకుంటారు. అనుమానాలనుబట్టి వ్యవహారం జరుగదు. ఒక్కమాట—(చిన్నంగా)—అయిదువందల రూపాయిలు ఇప్పిస్తా; మాపుచేయించి వేతాం.

మాలక్ష్మి—అయ్యో, పంతులుగారూ! మాబంగారు కొండను అయిదువందల రూపాయలకు అమ్ముకుండేమా? నాయనా! మా నాయన మాంసం అమ్ముకొని తినమంటావా? నేను యేబీదకొంపలో బుట్టినా ఆ పుణ్యావంతుడింటిలో వచ్చిపడ్డాను. తినా గుడవా లోపంలేకుండా జరిగింది. కడుపున నాలుగుగాయలు కాసినవి. అదృష్టవంతురాలినే అనుకున్నా. నా అదృష్టం నేటితో అధ్వాన్నమైపోయింది. ఇక బిడ్డమాంసం అమ్ముకొని దరిద్రం దీర్చుకోనా? నే నా మాట చెవులవినలేను అయిదు దమ్మిడీలు గూడా మాకు వద్దు. ఇక వాడిని చంపారంటారూ, మా కర్మమే మా నాయనను జంపింది. దేవుడు చంపంది యింకొకరు చంపలేరుగదా. ఎవరు చంపారో మేము కండ్లతో చూడలేదు. మా కెవరిమీద అనుమానం లేదు. ఏచుమ్మర్లూ లేకుండా మా నాయన వెళ్లిపొయ్యే మార్గం చూడండి.

రామ—నాది వొక్క కోరిక వుంది.

మాల—మనకు యే కోరికలూ వద్దు. వూరుకో.

రాము — వుండవే చుమ్మర్లు మేము చూచిభరించలేము. ఆశరీరం నేలబడ్డగట్టు చోటనే భూస్థాపన జేసి కాస్త తిరుపళ్ళికట్టుకొని మా నాయనపేరుతో ఆరాధన జేసుకుందామని వున్నది. ఈ మూల వలభాగజాలు బజారుధరకు యిప్పించండి.

వెం — అది అందరూ కోరవలసిందే. ధరమాట చూచుకుందాం. యీభాగజాలు యిప్పుడే వొద్దు పెట్టిస్తా.

పం — తథాస్తు. గ్రామస్థులు మీ రిద్దరూ రాండి. పోలీసువారు వూళ్లోకి వచ్చారట. మాట్లాడివస్తాం.

పోలీసువారూ, గ్రామస్థులూ, పంతులూ కలిసి మాట్లాడి తిరిగివచ్చారు.

పం — శాస్త్రిగారూ! తమరు బండమీద దయచెయ్యండి.

ఇన్స్పెక్టరు — రామదాసూ! నీ కొమారుడు యెట్లా జచ్చాడో తెలుసునా?

రాము — ఆయువుమూడి చచ్చాడు, యింకోకవిధం యేమున్నది?

శాస్త్రి — అది సరే. యెవరు చంపారో నీకు యెవరిమీదనైనా అనుమానమున్నదా?

రాము — నాకు యెవరిమీద లేదు.

శాస్త్రి — పంతులుగారూ! వ్రాయండి.

పం — నేనొక పంచాయితీదారును, మునసబు కరణాలు యిద్దరు వీరదాసూ, శేషయ్యకూడా వుంటే బాగుంటుంది.

వీ, శే — మేము వుండం. మా కెందుకు ఈ కర్మమంతా.

శాస్త్రి — వుంటారా వుండరా?

వీ, శే — మీరు యేమన్నా జెయ్యండి, మే ముండం.

పం — ఇన్స్పెక్టరుగారూ! వాండ్లను వదిలివెయ్యండి. వీండ్లిద్దరినీ వెయ్యండి.

శాస్త్రి — వాండ్లెవరు?

పం — ఎవండ్లో కన్నెన్నలు. పంచాయితీదార్లకెవరైతే నేమి! వెంగన్నా, ఫరీదుసాహెబు.

శాస్త్రి — బంధువుల వాంగ్మూలాలమీద దస్కతులు పెట్టించండి.

పం — ఊఁ అయింది.

శాస్త్రి — లేటు సంగదాసు ఆత్మరోగంవల్ల చనిపోయినాడు అని వ్రాసి పంచాయితీదార్ల దస్కతులు పెట్టించు.

పం — కర్ణంగారూ! పెద్దలు మీ దస్కతు కానియ్యండి.

కరణం — నా అభ్యంతరం యేమీలేదు. మునసబుదస్కతు కానియ్యండి.

పం — నీవే కానియ్యవయ్యా. సివిలు మేజిస్ట్రీటు అధికారాలు కలవాడవు.

మా — కానిస్తాంలే, తొందరేమి.

పం — తొందరేమిటంటే శవాన్ని వూరేగింపుచేసి ఖననం చెయ్యాలెనా వద్దా! యిప్పటికే అపరాహ్ణమైంది. జనమంతా పసిబిడ్డ బాలాదీ భోజనం లేకుండా కూర్చున్నారు.

మా — వాండ్ల వ్యవహారాని కేమి అడ్డమూంది, కానిచ్చుకోమనండి.

శా — కానియ్యరాదటయ్యా. నీవొకజాగు.

మా—నేను తనమాటకు కాదంటున్నానా? దస్కతులుకూడా తనదగ్గర లెందుకు?

కం—రామదాసూ! మీ ఋణప్రయత్నం మీరు చేసుకోండి.

రా—ఆదే మాకు పదివేలు.

ము—యిక లేవండి. పంతులింటికి వెళ్లుదాం.

గ్రామస్థులూ, పోలీసులూ, పంతులూ లేచారు.

కా॥ స్త్రీ—హాస్యంగా—ముసలమ్మా! యేమిటి నీ యనుమానం?

ము—అనేక వ్యవహారాలు చూశామంటారు. డబ్బు చేతిలో పడందే దస్కతు పెట్టమంటారేమి?

కా॥ స్త్రీ—పంతులుదగ్గరకు యీపత్తు పైకం వచ్చిందట గా?

ము—వస్తే, మీవాళ్లో పడ్డట్టేనా? మీకు తెలియదు. పంతులు అసలు లేవు దారీయుండాలోడుకు. దస్కత్తు లైతే మీకు మళ్లీ కనబడతాడా?

కా॥ స్త్రీ—తుపాకిని కొట్టించను,

ము—ఈసంచులు దక్కేట్లయితే అందుకూ వొప్పుకుంటాడు. చౌదరయ్యలో సగం మంకలవాడు. ఇద్దరిదీ వొకటే మనువు. వొక్క బళ్ళో జదివినవాళ్ళే.

కా॥ స్త్రీ—వెర్రిచేశంటివి. మూడువేలతోనే పోనిచ్చావేమి?

ము—మీపన్ను చిమిడిందా. మూడుసంచులు చాలవూ. ఇంకా కాస్తనొక్కితే యింకొకసంచి రాల్తుందిగాని యేదో అనుకున్న ప్రకారం పోనియ్యండి. పంతులు వెనుకకు జారుతున్నాడు చూచారా

కా॥ స్త్రీ—యేమి పంతులూ! పరారీ అవుతున్నావు.

కం—యెంతమాట అన్నారు! మీరేదో రహస్యం మాట్లాడుతూవుంటే నేను తగ్గాను. నాసంగతి యేమంటారు?

కా॥ స్త్రీ—రా అన్నీ వొకమాట పైసలవుతవి.

అందరూ పంతులుగారి యింటికి పోయి కూర్చున్నారు.

..............................................................................................

..............................................................................................

పం—నాసంగతి యేమిటి?

ము—నీకు అయిదోసంచి వుందిగా.

పం—నాకు మళ్లీ వేరేనా?

ము—వేరే యేమిటి. అన్నీ వొక యినుపపెట్టెలోవే.

పం—ముసలమ్మ యికనైనా దస్కతు పెడతాడా?

ము—తేకలం. 'రైటుసడిచినట్టు నడుస్తుంది. కరణమూ! నీవు దస్కతు చేసి తక్కినవాండ్లవి నిషానీలు పెట్టు.

కా॥ స్త్రీ—వాండ్లు నిషానీదార్లేనా?

పం—కాపుని తగాదాకువస్తే చూతాం. యిప్పుడు వాండ్లకోసం యెవరు పోతారు.

కా॥ స్త్రీ—కొంటటీ లేవు.

సం—మాటవరుస కన్నా. నాకునుట్టుకు భయంకాదా?

అంతా వెళ్లిపోయినారు. సంతులు లేచి దిడ్డివాకిట చౌదరయ్యయింట్లోకి వచ్చి అబ్బా అని తూర్పు యింట్లో కూలబడి అటు శవాన్నీ, యిటుపోలీసులనూ సాగదోలి వచ్చా. అయిదు సంచులతో యీవత్తూపూర్తి అయింది.

చౌ—(లోపలనుంచి) నే లేచి రావచ్చునా?

సం—నిరభ్యంతరంగా రావచ్చు.

బావిలోపడ్డవాడివలె వొళ్లంతా పాలిపోయి దిగచమటలతో దూదిపింజలు దులుపుకుంటూ బైటికి వచ్చాడు.

ల—కండ్లనీళ్లుబెట్టుకొని—యిప్పటికి అదృష్టవంతులమే. గట్టునపడేశావు.

సం—బావా! యిక నీవు స్నానికిలే. నేను శవాన్ని చూశాను. పైగా మాలస్పర్శ తగిలివట్టున్నది. జంధ్యాలువేసుకొని భోజనంచెయ్యాలె, మజ్జిగబొట్టు యివ్వేళ పోయించుక పోలేదుగాంవాలె.

ల—అక్కలక్ష్మిచేత పంపిస్తాపో. వీధివాకిలి తీయవచ్చునా?

సం—అన్నట్లు కొంచంఆపండి. వాండ్లు శవాన్ని వూరేగింపు జేసుకుంటారట. అల్పపు ముండాకొడుకులు కొందరు రాళ్లువేస్తారేమో. వెంకటయ్యను దిడ్డివాకిట లోపలికి పంపిస్తా. ఖననమై అంతా పోయేవరకు తలుపుతీయవద్దు.

వెంకటయ్య యీభైగజాలస్థలం హద్దుపెట్టాడు. శవాన్ని గంధమూ, పూలూ, బుక్కాయీ చల్లుతూ మేళతాళాలతో వూరేగింపుజేశారు. చాలామంది కొత్తగుడ్డలు తెచ్చి కప్పారు. పూలదండలు వేశారు. యిండ్లదగ్గర వాళ్లుపోశారు నడివీధులలో ఖడ్గాలుచదివి వీరంగాలు వేశారు. అన్నికులాల కూలీలు తలా కాసేపు శవాన్నిబట్టారు. వేదాంతం కోటమ్మ గురుపుత్రుడని నమస్కారం పెట్టింది. మూడుఝాములవుడు శవరత్నాన్ని భూస్థాపితం జేసి అందరూ ధర్మమట్టి జల్లి వెళ్లిపోయినారు.

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .



ఓం!

బ్రహ్మ కృపాహి కేవలమ్

# మాలపల్లి

## రెండవ భాగము

## ఒకటవ అధ్యాయం

## పుట్టిల్లు

రామానాయుడు నరసారావుపేట దగ్గరదిగి గుఱ్ఱపుబండి జేసుకొని నాదెండ్ల వెళ్ళాడు. చంద్రివీధిలో వున్న మేడ దగ్గర బండిదిగి యెత్తైన గచ్చు మెట్లెక్కి లోపలికి పోయినాడు. ముంగిట యెఱ్ఱని పీకె కుడిచేతిలో బెట్టుకొని యెడమచేతితో తాషాబండి లాగుతూ పొంకమైన పిరుదులమీద బంగారు చిరుగజ్జెలు కిణికిణిశబ్దముల రవళితో విరాజిల్లుతుండ మెడను హనుమంతబిళ్ళా, చేతుల యెఱ్ఱరాళ్ళవత్తులూ, కాళ్ళకు గజ్జెల కడియాలూ వేష మమరియుండే దివ్యదిగంబరాకారుండగు నొక కిశోర చక్రవర్తి నేత్రపర్వంగా బెళుకుచూపులు నిగుడ్చుతూ "అమ్మా! అప్ప వచ్చా"డని కేకవేసి తాషారవమును అడుగుదమ్ముల గునగున నడకలతో లయించి, మేళవించుతూ, పరుగెత్తి వచ్చి తండ్రి కాళ్ళను కౌగలించుకొని పాలపండ్ల లావణ్యమూ, చిఱునగవుల ధావళ్యమూ, ముక్కుపై నీలిమా, బుగ్గల అరుణిమా నవ్వైగొని పున్నమ చందురుం దులకించే మోముటందము అతిశయింప తలయెత్తి తండ్రి మోముం దిలకించగా నాయని కందొవలు వికసించి మోము చందురుడు హసింప బింబ ప్రతిబింబభావ మొనగూడింది. రామానాయుడు తన వేలుగొనలతో బుగ్గలు పుణికి చిన్న పెదవులు చెణికాడు.

పిల్లవాడు—అప్పా! చిన మామయ్య నాకు తాషా బండీ, పీకె కొన్నాడు. మన వూరికి తీసుకపోదాం.

రామా—అట్లగే పద.

పిల్ల—ఎప్పుడు పోదాం?

రామా—రేపు.

మేడమీదనుంచి—అమ్మా మీ అల్లుడుగారు వచ్చారట—అబ్బాయి కేక వేస్తున్నాడు.

అనంతమ్మ—కాళ్ళకు నీళ్ళుదెచ్చి—కడుక్కోండి—అంతా బాగావున్నారా? సాహూ! మీ నాయనను నడిపించుకొని వస్తూవున్నావా?

సాహూ—రేపు నా బండెక్కి పోతాం. యేమప్పా! మనకు యింట్లో బండెందుకు?

రామా—యీ బండేనా? విరిగిపోతేనో?

సాహు—యింతమాత్రానికే విరుగుతుందా? నిన్న మూడు రాళ్ళు మోసింది.

రామా—యెంత రాళ్లు?

సాహు—పెద్దవే. గోలుగుండ్లకంటేగూడ పెద్దవే.

అనంతమ్మ పకపక నవ్వింది.

రామానాయుడు కాళ్లు కడుక్కొనివచ్చి బల్లమీద కూర్చున్నాడు. సాహు బల్లమీద బండిపెట్టి తండ్రి తొడలమీద వెల్లకిల పండుకొని పీక నోట్లోబెట్టి "అప్పా! నీ చేతవుతుందేమో వూదు, చూతాం."

రామానాయుడు పీక నోట్లోపెట్టుకొనేవరకు రంధ్రంగూడా లోపలికిబోయి వూదుడు బడలేదు.

సాహు—నీచేతగాదు. నేవూత్తా తెమ్మని చెవులు గింగురుమనేటట్టుగా వూది గర్వంతో తండ్రివంక జూచాడు.

రామా—అబ్బా! యెంతబాగా వూదావురా!

సాహు—నాకు యెవరూ నేర్పలా. నేనే నేర్చుకున్నా. నీకు నేర్పుతా పట్టు. బొక్కంతా నోట్లో పెట్టుకోకుండా వూదు.

రామానాయుడు యీసారి బాగా వూదాడు.

సాహు—అంతే. అమ్మమ్మా! మా అప్పకూడా వచ్చింది..

మేడ మెట్లమీదనుంచి మెట్టెల కాళ్లచప్పుడు వినపడ్డది. కమలమ్మ వూరికిపోదామని అభ్యంగనంజేసింది. నగలు పెట్టుకోలేదు. వెంట్రుకలు తడి ఆరలేదు. తొందరగా పెద్దకీలుగంటు వేసుకున్నది. సహజమైన తెల్లని యెరుపునకు స్నానం చేవయెక్కించింది, యింకా బొట్టు బెట్టుకోలేదు కళంకమనేమిషతో చంద్రుడు పోటీకివస్తాడని భయంగాఁవాఁలె, లేకపోవడంచేతనే వొకవన్నె చంద్రునికంటే వాసిగనపడ్డది. తల దువ్వకపోవడంచేత ముంగురులు చెలరేగి కారుమబ్బులవలె ముఖచంద్రుని కప్పుతున్నవి. వొక్కముఖానికే కమలసామ్యమేమి? వొడలంతా కమలమే. కనుబొమ్మలు వంపులైవాలి వొండొంటింబెరసి గిరిదిరిగి సాముద్రికులకు కొంచమనుమానమూ, రసికుల కానందమూ గలిగిస్తున్నవి. కన్నులు బేడిసమీలవలె సంచరిస్తున్నవి. నీల బిగిసిన తెలిరాల ముక్కుపుడక తెలుపులో చాయజూపడానికోయన మెరుస్తున్నది. తామరతూడును తెలిదమ్మిల బొదివినట్లు చలువజేసిన సన్నని తెల్లచీరగట్టుకొని దోరెములుదీసిన మల్లురవిక పిక్కటిబిర్లుగా తొడుక్కున్నది. చేతులకు చెరివొక బిల్లేరిగాజుమాత్రమున్నవి. కాని మోటని కాళ్లకు నగలు మానివేసింది. కాన్పు యెడంగావడంచేత కొంచం వొళ్లువచ్చినా ముఖానా నవకమూ, శరీరంలో జిగివీ తగ్గలేదు.

కమలమ్మ—మీరు నిన్ననే వస్తారనుకున్నాం, మీఅబ్బాయి బండికూడా సిద్ధం జేసి అట్లేపెట్టాడు.

రామా—తాపాబండేనా?

అనం—అదే. మగపిల్లలు యిద్దరూ మొన్న బడిసెలవులకు యింటికి వచ్చి పెండ్లిండ్లని అత్తవారిండ్లకు పోయినారు. మీ మామగారు యెల్లుండి వస్తారు. మీరు బేస్తవారం పోగూడదా?

రామా—రేపుసాయంత్రం స్టేషను దగ్గరకు బండికూడా పంపమన్నా. పోవలసిందే.

అనం—బండివస్తే తిరిగిపోతుంది. రాకరాక వచ్చారు. మధ్య మూడురోజు లేకా యెడం?

రామా—సరే చూతాం.

కమలమ్మ—మెత్తబడ్డారులే, మేము పొయ్యేలోగా అబ్బాయిలుకూడా వస్తే బాగుండు.

రామా—వాళ్ల అత్తవారిండ్లలో వాళ్ళుండనక్కరలేదా?

కమ—రాముడు మొన్ననేగా సంవత్సరం వెళ్లజేత పోయివచ్చాడు.

అనం—యెండనుబడి వచ్చారు, స్నానానికి నీళ్ళు దోడు.

కమ—అబ్బా! నేను తోడలేనమ్మా—నీవు తోడుదు.

రామా—ఆడవాండ్లు పుట్టింటికి వస్తె మగవాండ్లమీద గౌరత పోతుంది.

కమ—యేమిపోయిందేమిప్పుడు?

రామా—పాపం పెద్దదాన్ని అమెను తోడమంటా వెందుకు?

కను—ఆమె పెద్దదైతే నేను చిన్నదాన్ని.

రామా—అవును. చిన్నఅమ్మాయివి.

అనం—చిన్నదిగాక పెద్దదా? మాపిల్ల మాకు చిన్నదే. నేను తోడుతాలెండి. అంగవస్త్రం కావలెనేమో చూచి యియ్యి. అదీ వారినే చూచుకోమంటావా?

రామా—అనేటట్టుగానే వున్నది.

కమ—తప్పా యేమి?

రామా—ఇక్కడ వున్నరోజులలో యేతప్పులూ లేవు. యీ ధోవతి తడుపుతాలే.

కమ—మాఅమ్మ గనుక నన్ను కూచోబెట్టి పనిజేస్తుంది. వొకమ్మ గన్న బిడ్డ మీద మీ కెందుకు జాలి వుంటుంది?

రామా—ఆమెను కూచోబెట్టి పనిచేయడంబోయి నిన్ను కూచోబెట్టి ఆమె పనిజేయవలెనా?

కమ—ఆమెను కూచోబెట్టవలసివచ్చినప్పుడు కూచోబెడతాం, యిప్పుడు వూరక అన్నంపెడతామా?

అనం—నాకెవ్వరూ వూరికే కూర్చొబెట్టి పెట్టవద్దు. చాకిరి చేయించుకొనే పెట్టండి. రెండుజాములు కావచ్చింది. లెండి.

రామానాయుడు స్నానానికి లేచాడు. సాహు పీకె పాడుతూ వాకిట్లో తాపాబండి యీడ్చుకుంటున్నాడు.

అనం—కమలం! వారు భోజనానికి వచ్చారు. పిల్లవాడు రాడా?

కమ—వారిదగ్గర అలవాటు లేదు. నాదగ్గెర కూర్చుంటాడులే.

అనం—వారు లేచేదాకా మేడమీదకు పోబోకు ఏదైనా అందిస్తువుగాని.

కమ—నిమిషం వూరకోనియవుగదే. యీ బల్లమీద పడుకుంటున్నా. కావలిస్తే పిలువు.

అనం—యేమి కష్టపడుతున్నావే పనిచేయలేక. అక్కడా యింతేనా?

కమ—తల్లే వూరుకోనీకపోతే అత్తవారు వూరుకోనిస్తారూ? నేల బెట్టి కాల రాస్తారు.

రామా—ఇంతేనా ఫిర్యాదులు? ఇంకేమైన వున్నవా? మా అమ్మ యెదటి వాండ్లకు పనే చెప్పదు.

కమ—చెయ్యనివాండ్లకు చెప్పదు. మాతోడి కోడలికీ జెప్పదా?

రామా—ఆమె చెప్పకుండానే చేస్తుంది.

కమ—సరే. నేనే చేయనిదాన్ని, అటూయిటూకూడా లక్షాధికార్లయితేనే చాకిరెందుకు జెయ్యాలె?

అనం—వారి భోజనమైంది. తాంబూలమిచ్చి పిల్లవాడిని తీసుకొనిరా.

కమ—ఆయన షికార్లు గొడుతుంటాడు. సాహూ! అన్నం తిందువు గానిరా?

సాహు—పోవే, యెప్పుడూ అన్నమన్న మంటావు.

కమ—వొక్క పూటైనా సాగదీయకుండా అన్నానికి రావుగదా. నీకు దెబ్బలు తగులుతవి. యిటరా.

సాహు—అమ్మమ్మా - చూడవే - యెప్పుడూ దెబ్బలు తగులుతవి, దెబ్బలు తగులుతవి అంటుందీ.

అనం—ఏవరా అనేది?

సాహు—ఇంకెవరూ? యీ కమలమ్మగారు.

అనం—యెందుకే వాడికి దెబ్బలు. పొన్నెమ్మలాగ అన్నానికి వస్తేనూ.

సాహు—చూడు, తానింకా రాలేదు. నాకు దెబ్బలు తగులుతవట.

కమ—ఈవేళ వచ్చావు లేవోయ్. నామీద నేరం బెట్టడానికి.

సాహు—నేను వేరే కూర్చుంటా.

కమ—ఇంకా యెంతసేపయ్యా నీ సాధింపు. నాదగ్గర గూర్చో.

అనం—వాడు వేరే కూర్చుంటాడట, కూర్చోనియ్యి.

కమ—వాడు వేరే కూర్చుంటే నాకు తిన్నట్టుండదు. మా నాయన అలిగాడమ్మా. అలిగావా?

సాహు—అలిగా?

కమ—మానాన్నా రావే.

సాహు బుడ్డమూతి బెట్టుకొని దగ్గరకు వచ్చాడు. తల్లిదగ్గరకు లాక్కొని ముద్దు బెట్టుకొని తొడమీద కూర్చోబెట్టుకున్నది.

సాహు—నాకు అప్ప పీట వెయ్యి.

కమ—పెద్ద పీట తీసుకురావమ్మా మా నాయనకు.

సాహు పెద్ద పీటమీదకి దుమికి కూర్చున్నాడు.

కమ—నీకేమి గలిపేది?

సాహు—పప్పుగలుపు; నెయ్యి నా చేతులో వెయ్యి.

కమ—ఊఁ, యికకలుపుకో, కారిపోతున్నది.

సాహు—ఇంకా.

కమ—ఊఁ ఇక కానీ.

సాహు—ముచ్చికి ముమ్మాటు.

కమ—నచ్చికి నాలుగుమాట్లో, ఊఁ సరేనా?

సాహు అన్నం దింటూన్నాడు. కమలమ్మ పిల్లవాడి అన్నం పోసుజేస్తూ కూర్చున్నది.

అనం—నీవు కలుపుకోవేమే?

కమ—వాడి కడుపు నిండనియ్యి, నాకు తొందరేమివచ్చింది?

అనం—వాడికి కలిపి పెడితివిగా.

కమ—నా ధోరణిలో నేవుంటే యేబల్లినో చూస్తూ కోర్చుంటాడు.

ఎవరోవచ్చి యేమమ్మో యని పిల్చారు.

అనం—అదుగో నీ సావాసగత్తె. నీవు వచ్చావని చెప్పారుగాఁవాలె వచ్చింది.

క—నా సావాసగత్తెవరూ?

కో—ఎవరనేకాడికివొచ్చిందీ? నేను లింగబల్జివారి కోటమ్మను.

క—నీవటోయి—యెప్పుడువచ్చావ్? అరుగుమీద కూర్చో.

కో—యింతకు ముందుగానే. నీవు వచ్చావంటే ప్రాణం లేచివచ్చింది. నీకోసం బండివచ్చిందని విని కండ్లైనా చూసిపోదామని వచ్చా.

క—గురువారం బోతాం. యీ మూడురోజులూ మస్తుగా గవ్వలాడుకుందాం కావచ్చింది వస్తున్నా.

కో—తొందరేమీ లేదులే. నిదానంగానే కానియ్యి.

కమలమ్మ చెయ్యికడుక్కొని మూతి తుడుచుకుంటూ వచ్చింది.

క—యెన్నాళ్లకెన్నాళ్లకు చూసుకున్నాం.

కో—ఎన్నాళ్ళైగాకేమి! నీకొమారుడి పుటకలకేగా. బొందిలో పాణా లుంటే యెప్పటికైనా చూసుకుంటాం. మా చిన్నక్కయ్య కాలంచేసిందిగా. అంతా పదినెల్లు గాలేదు.

క—అయ్యోపాపం! కలుపుగోలుతినంగల మనిషి. యేమైనా పిల్లలూ?

కో—తొలినా మలినా వూరికేనేపోయె. తల్లిచావుమూనమట్టు కున్నాడు. వాడికీ యెప్పుడూ గోరాలు, యీనేనా నీకొమారుడు? పేరేమి పెట్టారు?

క—ఈయనే. సహదేవరావు. తగవుల చక్రవర్తి. నీకేమయినా పిల్లలా?

కో—చెంపన చెయ్యిబెట్టుకొని ఏమోవొదినా, నా కాపురమంతా చీకాకుగావుంది. ఆయనకు యిల్లూ వాకిలీ బట్టదు, యెవతెనో పెట్టుకొని పేటలోనే పడి వుంటాడు. గంపంతసంసారం. ముసలాయన దేనికని పాకులాడుతాడు? యిగ సంతానంసంగతి అడిగినట్లేవుంది. యిప్పటికి మూడు ముక్కలైనవి. మళ్ళా తీసుకొని వచ్చారు. నాకు యేమీ వొంట్లో వుసులు లేదు. శోకపెట్టుకొన్నాను. యెన్నో అయినవి. నా సొద చెపితే తీరేదికాదు. మీవూళ్లో సంగతులు జెప్పు.

క—యింతవరకు బాగానే వున్నామమ్మ. అనంతమ్మా! నీఅల్లు డెవరికైనా పెట్టుకున్నాడా?

అ—ఆయన్నే అడగలేకపోయినావూ. నాకూతురిని పెట్టుకున్నాడు.

క—పెట్టుకున్నాడూ నీకూతురిని - ఆమాట అనమనూ.

కో—ఆయన మేధకుడు. అటువంటిగుణాలు లేవు. వొదినెవు యింకా నిన్ననవచ్చు.

అ—యెవడో మీజీతగాడులా గున్నాడు. అటుబోయిచూడు.

రామానాయుడు మేడమీదినుండి చూచి దిగివచ్చి - యెందుకురా వచ్చావు?

జీత—వెంకటయ్యగారు వుత్తరమిచ్చారు.

రా—వెంకటయ్యగా రెందుకు యిచ్చారు? అంతా బాగా వున్నారా?

జీ—అన్నీ అందులోనే వుంటవి, చూడండి.

రామానాయుడు వేళ్లువణుకుతూ వుత్తరంజదివి జారవిడిచి, బల్లమీద కూలబడ్డాడు.

క—వుత్తరంలో సంగతు లేమిటీ?

రా—ఏమున్నది. దాసును మానాయనకొడితే చచ్చాడుట - అయ్యో దాసూ, అయ్యోసంగడూ!

క—అయ్యో - అయ్యో - యెంతపని జరిగింది? -

అ—దాసెవరే?

క—మా జీతగాడమ్మా. వాడు జీతగాడటే. రుషేవాడూ. సమస్తం దిద్దేవాడే. వొక్కనలుసు రేజా పోనిచ్చేవాడుగాడమ్మా! యింటివాండ్లకుందిటమ్మా అంతశ్రద్ధా! యేమి తెలివే! ఆయన కొట్టడ మేమిటి! వీడు చావడ మేమిటి! అంతా మాయగావుంది. మెల్లెవలె ఆచూపులూ, వాడూ కండ్లలో మెదులుతున్నాడమ్మా!

అ—ఆయనను పట్టుకున్నారా?

రా—అవన్నీ వ్రాయలేదు. వాడినడగండీ.

క—యేమిరా వెంకడూ! సంగతులన్నీ జెప్పు.

వె—వొకటే సంగతి. అందరికీ బోధచేస్తున్నాడని కోపంవచ్చి వొకపెట్టు బెట్టేవరకు నసాళంబగిలి కిందబడిపోయినాడు. కాసేపటికి వూపిరి బోయింది. పైటాలకల్లా పోలీసుగాటు దిగేవరకు వూరంతా దద్దరిల్లిపోయింది. పంతులు అయిదు సంచులతో అంతా మాపుచేశాడు. శవాన్ని మట్టిగూడా జేశారు. పంతులు యీసంగతి ఎక్కడా అనవద్దన్నాడు.

రామానాయుడు—లేచి మేడమీదికిబోతూ - నేనిప్పుడే వూరికి వెళ్ళుతా. గుర్రపువాణ్ణి బండిగట్టమను.

క—నేనూ వస్తా.

రా—నీయిష్టం.

అ—సరే వెళ్లూ, వుండమనడానికి నోరు వచ్చేటట్టుందా?

క—కోటమ్మ! వెళ్ళుతానోయి.

కో—వెళ్లండమ్మా, చూడడంపట్టుకైనా తటస్థించింది.

రామానాయుడు మేడమీదికిబోయి వుత్తరం మళ్లీ చదువుకొని "నాసంగడూ, నన్ను విడచిపెట్టి వుండలేనంటివే. నన్ను వదలిపెట్టి పోయినావేమి! నీకు అన్నీ

తెలుసు. స్టేషనుదగ్గర నీవన్నావు. నా కిప్పు డర్థమవుతున్నది. నాతో చెప్పకుండా నన్ను మోసంజేసి పోయినావు. చేశావుమోసం.

అయ్యో—యెంతమాటన్నా! సంగడా మోసంజేయడం? ఓ చాదరయ్యా! సంగణ్ణి చంపినవాడివి నన్నుగూడా జంపరాదూ? మాయిద్దరికీ యేమి భేధమున్నది; గంగిగోవును జంపావేమయ్యా? సంగడూ! నేను రానా నీతోటి? నాకేమీ దారి చెప్పలేదేమి! నీచాటున పనిచేదామనుకొన్నానే, నన్నే పెద్దవాణ్ణి జేశావూ?"

సామాను వేశాడని కేక వినపడ్డది. ముగ్గురూ బండెక్కి బయలుదేరారు.

---

## రెండవ అధ్యాయం

# గుయ్యారం

ముగ్గురూ హుటాహుటీ నరసారావుపేట వచ్చి రైలెక్కి రెండుగడియలపొద్దు కల్లా యింటికి జేరారు. రామానాయుడు బండి దిగాడు. సంగదాసుగదవంక చూడడానికి మనసుగొల్పలేదు. ఇల్లు యిల్లుగా గన్పడలేదు. గుయ్యారంలోకి పోయినట్టుగా తోచింది. అతని అలోలనేత్రములూ, పలచని శరీరమూ, కత్తిరింపుజుట్టూ, ముఖకవళికలూ మంగళాపురం వచ్చినప్పటినుంచీ దృష్టికి రావడంలేదు. అతని భౌతికమూర్తి మానసపథంనుండి అంతర్ధానమైంది. అతని సౌశీల్యం, పవిత్రభావాలూ, వున్నతాదర్శాలూ, కరుపుగట్టి పోతబోసి మూర్తీభవింపజేసినట్లు మానసగోచర మవుతున్నవి. ఆమూర్తియందు మనసు విలీనమైంది. తాదాత్మ్యభావం బొందింది. రామానాయుడు రామానాయుడు కాడు.

కమలమ్మా, పిల్లవాడూ భవంతిలోకి బోయినారు. లక్ష్మమ్మ వలవలయేడ్చింది.

క—కండ్లనీళ్ళుబెట్టుకొని—చెడురోజులువస్తె అన్నీ అట్లాతటస్తమవుతవి. యిప్పటికింకా అదృష్టవంతులమే. అంతా పరిసిపోయినట్టేనా.

ల—పోయినట్టే అనుకుంటాను. ఆవేళ వున్నవునికి ప్రపంచాన్ని మళ్లా కండ్ల చూస్తామనుకోలేదు. ఆమాట తలుచుకుంటే యిప్పుడుగూడా నావొళ్లు గలదరిస్తున్నది. ఆరక్తప్రవాహంజూపి అలబరిజనమంతా కంపరమెత్తి కర్రలుదీసుకొని యింటిమీది కెగబడ్డారు—నే నప్పుడే గడపలోకి పోయినాను. వొక్కక్షణంలో లోపలికి తోసుకొనివచ్చేవాండ్లే. నాకేమీతోచక ఆవేళకు యేమిబుద్ధిపుట్టిందో, కొట్టంలోనే వున్నాడనేవరకు, అట్టేకొట్టంలోకి బరుగెత్తారు. నేను తటాలున తలుపువేసి గడియబిగించి యేమిజేస్తారో చూదామని నిలుచుండేవరకు గుంపంతా మళ్ళీవచ్చి తలుపుతన్నడం ప్రారంభించారు. పూర్వోత్తరపు తలుపుగనుక కదల్లేదు. ఆకంపరంమీద వాండ్లకు తోచలేదుగాని దిడ్డితలుపు వొక్కతన్ను కెగిరిపోయేది. తలుపురాకపోయేవరకు జనమంతా మునసబింటికీ మాలపల్లెకూ పరుగెత్తారు. పెద్దవాడు పొలంబోయిరాలేదు. యెవరుకబురంపించారోగాని వచ్చి జనాన్నంతా కాళ్లా

రా—మీదేశంలో కూలీలకు క్రైస్తవమతం యేమాత్రం తెలుసు? పెద్దవాళ్లకే అంతంతమాత్రమే!

బ్రౌన్—మాకూలీలలో క్రీస్తువుపేరు విననివాండ్లరుదు.

రా—యీ కూర్చున్న మాల, మాదిగె, యెరుకల, యేనాదులలో రామకృష్ణులకు సంబంధించి పేర్లు యెన్నివందల వున్నవో కనుక్కోండి. వీండ్లలో శిఖలేనివాండ్లెవరైనా వున్నారా?

బ్రౌన్—మీరు మాబోధ వినవలసిందని సర్కారువారు బలవంతం లేదు. యిష్టం వున్నవాండ్లే వినవచ్చు.

రా—అట్లయితే నా ఆక్షేపణ లేదు రేపటినుంచీ వినదల్చుకున్న వాండ్లకు హిందూమతం నేను బోధిస్తాను. మీకుకూడా యిష్టం వుంటే వినవచ్చు.

భార్య—దొరగారు—ప్రశ్న లడిగితే—జవాబులు—చెప్పగలవా?

రా—వారికి ధైర్యం వుంటే అడగమనండీ!

పు—క్రీస్తుమతం వినడానికి యిష్టం లేనివాండ్లు యిక్కడికి రానవసరం లేదట అటువంటివాండ్లు లేచి పదండి

జన మంతా లేచి కేకలు వేస్తూ అందరూ తమగుడిసెలకు వెళ్లిపోయినారు.

బ్రౌన్—రామదాసును యిక్కడికి తీసుకొనిరావడం తప్పయిందే.

పౌ—ఇత డెక్కడున్నా తప్పే. పుల్లప్ప వొకడు యితనికి తోడైనాడు. గోల మొదలుపెట్టారు.

బ్రౌన్—నిన్న తేలికయినపని యియ్యడం మనపొరపాటు.

పౌ—ఈరోజు మట్టిపనికి యితరులను పొమ్మన్నాను. రామదాసూ, పుల్లప్పా కుంటపనికో, రాళ్లుకొట్టడానికో పోవలసివుంటుంది.

బ్రౌన్—సరే పంపు. దానితో అన్నీ అణుగుతవి. యితనికి డబ్బిచ్చేవాండ్లెవరైనా వున్నారా? అన్ని సంగతులూ ఆలోచించి తగినమార్గం వెతుకు. పుల్లప్ప కూడా మనకు అడ్డమే వస్తున్నాడు.

పౌ—అన్ని సంగతులూ యోచిస్తాను

బ్రౌన్—ఆతనికూతురువిషయం యేమైంది? జతపడితే అన్నిచిక్కులూ వదులును. ప్రయత్నం చేయరాదా?

పౌ—సులభంగా వంగేటట్టు లేదు. యేదో బెట్టమాత్రం ఆలోచిస్తేనేకాని తేలదు.

బ్రౌన్—పో, యీ వేళకు! యేసంగతీ ఆలోచించు.

పౌలు గుడిసెలదగ్గరకు బోయి నవ్వుమొగంతో,

పౌ—మామగారూ! మతం అంటే మీ కెంతపట్టుదలండీ! మీ కున్నంత పట్టుదల నా కుంటే బాగుండు ననిపిస్తుంది. భోజనం అయిందా?

రా—వంట అవుతున్నది.

పౌ—పనికి వేళ కందలేదే. జనం బయలుదేరుతున్నారు. రాత్రే వంట చేయించకపోయినారా?

రా—అన్నం మిగిలితే రాత్రి పస్తున్నవాండ్ల కిచ్చివేశాం. అదిగాక రాత్రి అన్నం అక్కడికి కట్టుకొనిపోయేటందుకు బాగుండదు. రేపటినుంచీ పెందరాళే వంట చేసుకుంటాం. ప్రార్థనకు రానవసరం లేదుగనుక భోజనం త్వరగానే కావచ్చు.

పా—ప్రార్థనసంగతి తమతో తరువాత మనవిచేస్తా. కాని పనికి బోవడం విషయంలో యే మాలోచించారు?

రా—యీపూట అందుకోలేను మధ్యాహ్నానికి వస్తా.

పా—మిమ్మలను తీసుకొనిపోవడానికి జవా నుండడు. కొలనుకొండ రాతిపనికి పోవాలే. యెంతప్రయత్నం చేసినా మట్టిపని మీకు యేర్పాటుచెయ్యడానికి వీలు పడ్డది కాదు. ప్రతిదానికీ అంత పట్టుదలెందుకు? కుంటప నెత్తుకోండి.

రా—నేను నలుగురుపోయే దారిన పోవలసినవాడినిగాని కేటించి పనిచేయడం నావల్లగాదు. రాతిపనికే పోతా.

పా—రాతిపనికి మధ్యాహ్నానుంచీ పోవడానికి వీలుండదు.

రా—లేకపోతే పోనియ్యండి.

పా—మరి మీకు భోజనం?

రా—దేవుడే వున్నాడు.

పా—దేవుడు అన్నం తెచ్చి పెడతాడా?

రా—నమ్మితే తప్పకుండా పెడతాడు. కాకపోతే "దేవుడా! ప్రతిరోజూ మాకు రొట్టె పెట్టు!" అని మీరు ప్రొద్దున ఎందుకు ప్రార్థించారు?

పా—మామగారూ! యెప్పుడూ పెడసరంగానే మాట్లాడుతారుగదా!

రా—ఈకాసేపటిలో మామగారూ అని రెండుమాట్లన్నారు. మూడవమాటంటే తగినశాస్తి చేస్తా!

పా—తెల్లబోయి—అబ్బా!మీది యెంత కఠినవాక్కండి! దొరగారిమీది కోపం నామీదికి దొర్లింది. మీరంతతీక్ష్ణంగా మాట్లాడితే నేను సహించలేను.

రా—యీనాటకాలన్నీ నాకు తెలుసు కాని మీరు నాతో మర్యాదంగా మాట్లాడండి. మళ్లీ యింకొకమాటు నాచేత చెప్పించుకోవద్దు.

పా—రుద్రులైనారే! మీపనిసంగతడగవచ్చునా? పనికిపోయే యేర్పాటేమి?

రా—దానికి జవాబు అదివరకే చెప్పా. వంకపెట్టుకొని నాతో మాట్లాడవద్దు.

పా—యీసంజాయిషీ అంతా దొరగారికి నే జెప్పాలె. ఆయన నన్ను వేధిస్తాడు.

రా—భోజనం లేకపోతే వా రేర్పాడు చేస్తారా?

పా—యేదైనా పని చూపిస్తారు.

రా—రాత్రి పస్తున్నవాండ్లందరికీ ఆయన యేమిపని చూపించాడు?

పా—పని చేయకపోతే మే మేమిచేస్తాం?

రా—బయట యిచ్చేకూలి యిప్పిస్తారా? పొద్దుగూకులూ పని చేసినా వొచ్చేకూలి వొంటిపూటభోజనానికే చాలదు. అర్ధాన్నంతో యెంతకాలంపనిచేస్తారు?

పా—డబ్బు వారిచేతినుంచి పెట్టమంటారా?

రా—కడుపునిండేకూలి యిప్పించలేనివాండ్లు వీండ్లనందరినీ యెందుకు పోగు చేశారు?

పౌ—వూళ్లో దోస్తుంటే యిక్కడ బెట్టారు.

రా—యిక్కడ మీరు చేయిస్తున్నదేమిటి? మీదొరగారు వీండ్లందరికీ భోజనం యెట్లా జరుగుతున్నదని మిమ్ములనడిగితే చేతనైనవాండ్లు కన్నాలువేసి బతుకుతున్నారని చెప్పండి.

పౌ—అయితే మీ కీరోజు పనక్కరలేదా?

రా—మధ్యాహ్నానికి అక్కరవుంది.

పౌ—అట్లా వీలు లేదు.

రా—లేకపోతే పోనియ్యండి.

పౌ—యీసంగతులే దొరగారితో చెపుతా.

రా—నిరభ్యంతరంగా చెప్పవచ్చు. యింతకంటె యెక్కువ చెప్పవద్దు.

పౌ—పాదిరీ మీమీద యిదివరకే కోపంగా వున్నాడు.

రా—ఎందుకో, వారితాతతండ్రులను సంహరించానా?

పౌ—యెందుకైనాగానీ క్రోధాలు మరీ పెంచుకోవడం అవుతుంది. పెద్దవాండ్లతో జగడం పనికిరాదు.

రా—యింతకంటే నన్నేమిచేస్తారు? నేనూ చిగురువరకూ చూడదలుచుకొనేవున్నా.

పౌ—మీరు పంగనామాలు పెట్టడానికి వీలులేదు. యివన్నీ నే నంటున్నాననుకోకండి.

రా—యెవ రన్నా యిబ్బంది లేదు. నేను పెట్టేతీరుతా!

యింతలో పుల్లప్ప వచ్చి,

పుల్లప్ప—మాజన మంతా నామాలు పెట్టుకుంటారు. నామం దొరక్కపోతే యేతెల్లమట్టయినా రాచుకుంటారు.

పౌ—యిట్లా అల్లరిచేస్తే మీరే కష్టపడతారు.

పు—మమ్మును కష్టపెట్టి మీరు పూరాపడ్డప్పటికి చూస్తాను.

పౌ—కొడతావా?

పు—నీ వేమిచేస్తావు?

పౌ—న్యాయ ప్రకారం శిక్ష వేయిస్తాం.

పు—నీవు చేసేపనులకు నేనూ అంతే చేయిస్తా. నీకంటె నేను యెక్కువ నేరాలు చేయడంలేదు.

రా—మనకు దౌర్జన్యం వద్దు న్యాయప్రకారం పోదాం.

పౌ—సరే కానియ్యండి—

పౌలు వెళ్లిపోయినాడు.

———

# పదమూడవ అధ్యాయం

## మతసమ్మెలు

రామదాసూ, పుల్లప్పా మాట్లాడుతూ గుడిసెదగ్గరకు వచ్చి నిలబడ్డారు. వంటచేస్తున్న మహాలక్ష్మి వాకిట్లోకి వచ్చి,

మా—పుల్లన్నా! షాపులో యేది కొనబోయినా పెట్టుధరలుగా వున్నవి. ధరలు రెట్టింపు అయితే యెంతకాలం కొనగలం? వుండవల్లిపోయి కొనుక్కోకూడదా?

పు—వల్లగాదు. ఆషాపు యీపాలుగాడే పెట్టించాడు. దొరకు వాడు చెప్పినంత కద్దు. షాపువల్ల తనకు నష్టమనీ, తాను పెట్టడానికి యిష్టం లేదనీ నటించి షాపు పెట్టమని దొరచేత బలవంత పెట్టించుకున్నాడు. బయటివాళ్లెవరైనా పల్లె బేరానికి అనేకులు రావడానికి సిద్ధంగా వున్నారు. వాళ్లు దొంగలతో మరీకు అవుతారని దొరను భయపెట్టాడు బయటివాళ్లనెవ్వరినీ యీ చాయల రానివ్వడు. "మేమంతా వొక్కమాటు యేఆదివారమో పోయి కొనుక్కొంటాం, మాతో పోలీసులను పంప"మంటే, అదీ వల్లగాదన్నాడు.

మా—మాకు డబ్బుపంపే యేర్పాటు జరిగితే రొక్కం తీసుకునేదానికంటే సరుకే తెమ్మంటే బాగుండు.

పు—అది మీరు వొక్కరే పెట్టుకుంటే నెగ్గలేరు. యెరుకల గూడెపువాళ్లు వొక్కరాత్రి దులుపుకొని చక్కాపోతారు దానికన్నీ కట్టుబాట్లు చేసుకోవాలె.

రా—ఈపోలీసులంతా యేమౌతారు?

పు—వాళ్లూ వుంటారు వొకమూల దొంగలుపోయినతరువాత వచ్చి అందరినీ అదలాయిస్తారు. అమావాస్యరోజులలో పెద్దలాట్లు వచ్చేచోట్ల బాతినీచిక్కితేకొందరు పోలీసులుకూడా ఫారా యితర్లకు వొప్పజెప్పి దొంగతనం స్వయంగా నడిపిస్తారు.

రా—దొంగలంతా వాళ్ల వెంటనే వుంటే యిక్కడ యింకా ఫారా యెందుకు?

పు—ఆసమయంలో బయటివాళ్ళు వచ్చి తనిఖీచేస్తే కుళ్లుఅంతా బయటబడుతుంది.

రా—దానికి అధికారులు పూనుకోవాలె.

పు—అధికారులు న్యాయం చేయదలచుకుంటే యీ సెటిల్మెంటు యిట్లా యెందుకుంటుంది? దానికొక మొనగాడున్నాడు తాడేపల్లిలో. మునసబుతమ్ముడే రామిరెడ్డిని, బలే హోషుమీదున్నాడు. దొంగలు బయటికి బోయేరోజున మనవల్ల బాతినీ కనుక్కొని రెండువందల జనంతో వచ్చి కమ్ముతాడట

రా—దొంగలు యేరోజు పోయేదీ మనకు దాఖలా యేముంటుంది?

పు—రాత్రి బయటికి పోయేరోజున వాండ్లు సాధారణంగా పగలు బయటికి పోరు. రహస్యాలోచనలుకూడా యెక్కువే అవుతవి. నాలుగురోజులనుంచి రామిరెడ్డి రాత్రి రెండుజాములప్పుడు దొంగలు బయలుదేరినసంగతి కనుక్కొనిపోవడానికి

మనిషిని పంపిస్తున్నాడు. నేను మాగుడిసె వెనకవున్న కటకటాలదగ్గరకు పోయి చెప్పినస్తా.

రా—యిన్స్పెక్టరుయిల్లు మీయింటిదగ్గర కావాలనే! నీవు మాట్లాడడానికి వీలవుతుందా? ఆయన మంచివా డంటారు.

పు—ఆయన వొక అరవంధం. మంచివా డని పేరు. యేమిమంచి? కామంచి. సమర్థత లేనిమంచితన మెందుకు? మంచివా డంటే వ్యర్థు డని అర్థం. పోలుగాడిని చూస్తే యీయనకు భయం చోరీసొత్తులో వాడు దయవచ్చి యిచ్చినంత తీసుకొని వూరుకుంటాడు.

రా—అశక్తమూ, దుర్జనత్వమూ రెండూ వున్నవన్నమాట.

పు—రేపు సమ్మెకట్టించడం నిశ్చయమేనా? మీరందరూ కలిసివస్తే సరే. లేకపోతే నేనైనా మానివేస్తా. మీరు మనమతం బోధిస్తారా? పొద్దున అక్కడ బోధసమయానికి యిక్కడ పోటీసు కాణం పెడదాం.

రా—మన మెవ్వరం బోధకు పోకపోతే నిర్బంధించడానికివీలు లేదు. మతంలో మనం కలవకపోయినా వినేవాళ్ళ యినా లేకపోతే యీ సెటిల్మెంటే తీసివేస్తారు. యివి సగం అందుకు బెట్టినవే?

పు—బోధకు పోకపోతే పాదిరీలు సెటిల్మెంటు తీసివేస్తా రని అందరకూ బాగా బోధిస్తా. నలుగురినీ వొక రేవుకు తేవడానికి ఏదన్నా వుచ్చిలి పుట్టించాలె. వీళ్లంతా చెట్టుకొకరూ పుట్టకొకరూ పుట్టి వచ్చినవాండ్లు. వీళ్లందరినీ వొక రేవుకు దేవడం సామాన్యమా?

రా—అవును బాగానే వున్నది. వెనుక భూము లిస్తామని మిమ్మును యిక్కడికి తీసుకొనివచ్చారుగదా, యెవరికైనా యిచ్చారా?

పు—మంచివాళ్ల కిస్తారట. మంచివా ళ్లంటే యుద్ధంలోకి పోయేవాళ్లూ, మతంలో కలిసేవాండ్లూను.

రా—కొన్ని సెటిల్మెంట్లలో యితరులకుకూడా యిచ్చారటే?

పు—దాని కెంతో గడబిడ చేస్తే యిచ్చారు. యిక్కడ నలుగురినీ కూడగట్టే తల కనబడలేదు. మీరు వచ్చారుగనుక మాకు ఆలనాపాలనా గలగాలె.

రా—మతబోధకుతోడు భూములసంగతికూడా కలిపి బోధించు మూడవది బడిగూడా యిక్కడ పెట్టించి చేతిపనులు నేర్పించమని అడుగుదాం. మనకు జీవనమైనా కలుగుతుంది. యేమీ లేకుండా ఈపోలీసులమీదా దొరలబంగాళాలమీదా డబ్బు వృథాచేయడ మెందుకు?

పు—యీమూడూ మువ్విరిన బెట్టామా అంటే పెనుసుకుంటుంది. మనిషి బీరుపోకుండా సమ్మెలో చేరుతాడు.

రా—యిక్కడ సెటిల్మెంటే పనికిరా దందాం. చుట్టూ వ్యవసాయానికి లాయకైనబంజ రున్నచోట పెట్టాలెగాని యీపరశురామక్షేత్రంలో మన మెందుకు? కొన్ని సంవత్సరాలల్లో సెటిల్మెం ట్లన్నీ వూళ్లయ్యేట ట్లుండాలె.

పు—అడవులలో మంచి కండగలభూము లున్నవి. ఈజిల్లాలో వందల సెటిల్మెంట్లు పెట్టవచ్చు. మొదట భూము లిస్తా మని అల్లించి బెల్లించి తెచ్చి మాకు భూము లియ్యందీ వెళ్లిపోతా మంటే తుపాకులు పెట్టి కాల్పించేస్థితిలోకి వచ్చారు.

రా—ఈ సెటిల్మెంటులో భూము లిస్తామంటే మనవా ళ్లెట్లా నమ్మవచ్చారు?

పు—అసలు మనది పిచ్చిజనం. భూము లిస్తామంటే ఆశపడ్డారు. పెత్తనం పోతామంటే ఆశ యెవరికైనా వుండేదే. ఆలోచనపడడానికి నలుగురం వొకచోటినుంచి వచ్చామా? దొరికినచోటనల్లా పట్టుకున్నారు

రా—యీ కారణా లన్నీ వాళ్లమనసు కెక్కించు. సంగతులు పూర్తిగా తెలియందీ ముందుగానే సమ్మెకడితే మనయిద్దరినీ యింకొకచోటికి తోసివేస్తారు. వుద్దేశాలు వెల్లడైతే అంతా నిలుస్తారు యీపోలీసులనుకూడా మనం కొందరిని చేర్చుకోవాలె.

పు—పైకారణా లన్నీ యెక్క జెప్పితే బుట్టలు మర్నాడు పారవేస్తారు. భూములసంగతి పెడితే అంతా చేరేవాండ్లే మూడురోజులకు వొకమాటు పోయే ఈవుద్యోగాలమీద యెవండ్లకూ ఆశ లేదు. చూస్తుండండీ? కిరస్తానీలుగూడా మనలో చేరారు!

రా—ముందు పోలీసువాండ్లతో మాట్లాడవద్దు. గుంపుపెద్ద లంగీకరిస్తారా, సగంపని అయినట్టే! వాండ్లద్వారా జనాన్ని స్వాధీనం చెయ్యి

పు—అది పద్ధతి కాదు. జనానికి నచ్చజెప్పితే పెద్దలు వద్దన్నా మానరు. తమపెద్దరికం నిలుపుకోడానికి జనులతోపాటే వారూ వస్తారు. పనికి పోవడానికి జనం అంతా పోగవుతున్నారు. చాలాభాగం కొండకే వస్తుంది ఇవ్వేళ వొకమాటు అందరికీ నొలిగలుపుతా. మధనపడుతుంటారు. రేపు ఆదివారం అంతా యిండ్లదగ్గరనే వుంటారు. రెండోవుగ్గ భోధించినతరువాత, చాలామందిని రేపే కట్టులో చేర్చవచ్చు.

రా—యీవత్తూ రహస్యంగా జరగనివ్వు. అంగీకరిస్తే యేవిధంగా పోవల. సిందీ ఆలోచించుకుందాం.

పుల్లప్ప వెళ్లాడు రామదాసు లోపలికి వచ్చి "వంటయిందా?" అన్నాడు.

మా—అయింది. పప్పు యెనపడమే ఆలస్యం యెనగలవడంలేదు.

రా—అప్పు చేసి పప్పుకూడు తిందామనుకున్నావా?

మా—వొకరోజుకే బయటబడతా వెందుకూ? రంగడు పప్పని యేడుస్తుంటే "గోచికంటె గొప్పదరిద్రమా" అని యివ్వాళ వేశా!

రా—అమ్మాయికూడా పప్పు కావలె నన్నదా?

జో—నే ననలే దయ్యా! నామీదికి వస్తున్నావు.

రా—నీవు మంచిదానవమ్మా !

మా—యేమిమంచో! చేతిబొబ్బలు నీరుపోసి సలుపుతున్నవట. వొక్క పూట పనికే మూలపడ్డది

రా—నాలుగురోజులు అలవా టైంధాకానే యిబ్బంది. తరువాత నలుగురితో పాటు మనమునూ. చేతులు కాస్త గట్టిపడాలె.

మా—సమ్మెలు కట్టిస్తున్నావని మనను యింకెక్కడికైనా మారుస్తారేమో!

రా—మార్చనీ! యివి మనపూర్వార్జితమా? అది కాకపోతుందా? నీళ్లరుణ మున్నచోటికి పోతాం.

అంతా భోజనాలు చేశారు. ద్వాదశపుండ్రాలూ పెట్టి రామదాసు చాపమీద కూర్చున్నాడు. బ్రౌన్‌సన్‌గారి నవుకరు వచ్చి, దొర మిమ్మలను పిలుస్తున్నాడు. యెక్కడిదో బండి వచ్చింది.”

మా—మనవూరిదే అయివుంటుంది.

రా—వెంకటయ్యగారు వస్తానని చెప్పినతరువాత తప్పుతారా?

రం—అయ్యా! నేనుకూడా వస్తా.

న—దొరగారు పిలువమన్నది నిన్నొక్కణ్ణే! ఆపిచ్చిబొట్లన్నీ యేమిటి? దొరగారు చూస్తే కర్ర తీసుకొని వెంటబడుతారు.

రా—అయితే యేమి చెయ్యమంటావు?

న—ఆపట్టెలు కడిగివెయ్యి. లేకపోతే దొగగారే కడిగిస్తారు?

రా—ఆయనే కడిగిస్తే నాకిక్కడ శ్రమ యెందుకు? యెట్లా కడిగిస్తాడో చూతాం పద.

నవుకరు రామదాసును తీసుకొనిపోయి బ్రౌన్‌సన్‌గారిపంచాదిలో నిలువ బెట్టాడు. యింతలో రామానాయుడూ, వెంకటయ్యా జీతగాడూ, అక్కడికి వచ్చారు.

వెం—రామదాసూ! నీమన సెప్పుడైనా భేదపడుతుందా?

రా-దా—స్త్రీలకు మానభంగం కలిగినప్పుడు తప్ప నామనసు మరొకప్పుడు భేదపడదు. (అని తీక్ష్ణంగా చూచాడు.)

వెం—నీకష్టా లింతటితో అత్యంకాలేదా?

రా-దా—అవుత వని తోచదు.

(యింతలో బ్రౌన్‌సన్‌గారిభార్యవచ్చి)—జార్జ్! యీపిచ్చివేషం చూచావా? యేమి టాపీడమొగం?

బ్రౌన్—నీ వదంతా తుడిచివెయ్యి.

రా-దా—మీ నవుకరు మీరే తుడిపిస్తారని చెప్పాడే. అయినా చూతామని వచ్చా!

బ్రౌన్—యెందుకట్లా పూసుకున్నావు?

రా-దా—దానికి సవాలక్షగ్రంథ మున్నది. మీకంత సులభంగా భోధపడదు.

బ్రౌన్—నాకు తెలియదా? అది మీజాతిభేదాలను తెలియపర్చేగుర్తు.

రా-దా—కాదు. అన్నిజాతులూ పెట్టుకోవచ్చు.

బ్రౌన్—దానిపేరు కాస్టుమార్కు కాదా?

రా-దా—కాదు. దానిపేరు బొట్టు దానికి ఆత్మార్థం చాలా వుంది.

బ్రౌన్—దొరసానిగారు అసహ్యపడుతున్నారు, తుడిచివెయ్యి.

రా-దా—మీకు ఆక్షేపణ లేదుగదా?

బ్రౌన్—నేనటువంటివి లెక్కచెయ్యను. దొరసానిగారు కోపపడుతున్నారు.

రా-దా—ఆమె కెందువల్ల అయిష్టం?

భా—యేమి టావికారరూపం?

రా-దా—కొత్తవన్నీ వికారంగానే కనబడతవి. మాకు పరిపాటిఅయిపోయింది. మీరు మంచి వనుకునే ఆచారాలు మాకూ కొన్ని అసహ్యంగానే కనబడతవి.

భా—వీడు అధిక ప్రసంగిలా గున్నాడు ఆనందం! తుడిచివెయ్యి!

రా-దా—యిది నేర మవుతుంది. దొరసానిగారికీ, నీకూకూడా శిక్ష జరుగుతుంది. ఆలోచించుకొని మరీపనిచెయ్యి!

ఆనందం సందేహించేవరకు "నీవు భయపడితే నేను తుడుస్తా"నని దొరమీదికి వచ్చాడు.

వెంకటయ్య—(కఱ్ఱ పైకెత్తి)—నిలు వక్కడ, బొట్టంటుకున్నావంటే దెబ్బ పయిన బడుతుంది. జాగ్రత్త!

బ్రౌన్—(వెనుకకు తగ్గి)—నీ వెందుకు వస్తావు?

వెం—నీ వెందుకు వచ్చావు?

బ్రౌన్—దొరసానిగారు ఆబొట్టు చూచి సహించలేరు.

వెం—నీవు చేసే దుర్మార్గం చూసి నే సహించలేను

రా—మనం వ్యవహారప్రకారం పనిచేసుకుందాం, మీవుభయులూ శాంతించండి.

వెం—వ్యవహారంతో నా కేమీ పనిలేదు. కావలసివుంటే ఆయననే జరుపుకోమను.

బ్రౌన్—ఆనందం! వీళ్లను బయటికి తరుము.

వెం—రండి, మీయిద్దరినీ చుట్టబెడతా. ఆయనను చూచేదందుకు వుత్తరువిచ్చావు. చూచికాని వెళ్లం!

బ్రౌన్—త్వరగా చూచి వెళ్లండి.

వెం—అట్లా దారికి రండి.

రా-దా—అయ్యా! మీరు నాకోసం యెంత శ్రమపడుతున్నారు!

రా-నా—యీరాక్షసమధ్యంలో లోకంకోసం మీరుపడే శ్రమలో మా శ్రమ యెన్నోవంతు? మేము పాత్రసామానూ, మంచాలూ, గుడ్డలూ, తెచ్చాం. యింకా యేమయినా కావలెనా?

రా—అప్పడివాళ్లు యెట్లా వున్నది? మీతో రాలేదేమి?

రా-నా—నిమ్మళంగానే వున్నది. ప్రస్తుతం ప్రయాణం చెయ్యడం కూడ దంటే అతనితో చెప్పకుండానే వచ్చాం. భోజనం మనింటిదగ్గిర జేసి మందిరంలో పడుకుంటున్నాడు.

రా—మందిరం సాగుతున్నదా?

రా-నా—శేషయ్యకొడుకును పంతులుగా యేర్పాటుచేశాం. అప్పాదాసు గ్రంథాలయము చూసూ పైక్లాసులకు చెపుతుంటాడు.

రా—రామన్న చురుకయినకుఱ్ఱవాడే! తండ్రి చిక్కులలో వున్నప్పుడు కుటుంబానికి ఆధార మయినాడు.

వెం—యీయిరవయిరూపాయిలూ దగ్గర వుంచుకో. కూలికి బోవడం పెట్టుకో బోకు. యీతడవ వచ్చినప్పుడు మళ్లీ యిస్తాను. డబ్బువిషయమై యేమీ చిక్కులు పడవద్దు.

రా—మీకు నమస్కారం చెయ్యడం తప్ప యేమిప్రత్యుపకారం చెయ్యగలను?

వెం—మాధర్మం మేము నెరవేరుస్తున్నాం. దానికి ప్రత్యుపకారం అవసరం లేదు.

రా-దా—ప్రత్యుపకారంమాట యెత్తడమే తప్పు.

బ్రాక్—డబ్బు నాచేతి కియ్యండి వృథాగా ఖర్చుచేస్తారు

వెం—ఆయనదగ్గిర వుంచుకోవచ్చునులే.

బ్రాక్—కూడ దని కాదు. వృథా ఖర్చవుతుం దని

వెం—అట్లా చేసేవాడు గాదు. ఆయనదగ్గిరనే వుండనియ్యండి.

రా-నా—నారాయణరావుగారితో మాట్లాడాను స్వంతడబ్బు ఖర్చుపెట్టుకో డానికి యెవరివుత్తరువూ అవసరం లేదుట. మిమ్మును సెటిల్ మెంటులోనుంచి తొలిగించేసంగతి కలెక్టరుగారితో మాట్లాడుతా నన్నాడు. వర్తనవిషయమై వొప్పించవచ్చు. జామీను కేసులు ప్రారంభమైనప్పటినుంచీ చోరీలు చిత్తవత్తుగా జరుగుచుండడంచేత వారంరోజులు ఆగి మాట్లాడడం మంచి దన్నాడు. మిమ్ములను సులభంగానే వదిలిపెట్టవచ్చు నని అంటాడు. భగవదనుగ్రహం యెట్లా వున్నదో!

రా—యెట్లయినా నా కొకటే! యీపోలు పిల్ల విషయంలో దురాగతం చేసేట ట్టున్నాడు.

రా-నా—అంటే?

బ్రాక్—మీయిష్టంవస్తే వివాహం చేసుకుంటాడు. కాదంటే మానుకుంటాడు. దాంట్లో దురాగత మే మున్నది?

రా-దా—క్రమంగా తెలుస్తుంద.

వెం—అటువంటివి జరగడానికి గుండె లున్నవా?

బ్రాక్—యిస్తే వివాహం చేసుకుందా మని తప్ప వేరేవుద్దేశ మతని కుండదు.

రా-దా—సరే తెలుస్తుంది. సెటిల్ మెంటుయొక్క స్థితిగతులు చాలా అన్యాయంగా వున్నవి. మనకు బయట వినేసంగతులకంటె యెక్కువ దుర్నయాలు జరుగుతున్నవి. నింద యావత్తూ నివాసులమీద పెట్టడానికి వీలులేదు. సంగతులు యావత్తూ క్రమంగా అవే బయటబడుతవి. యిన్నాళ్లు దుర్ణయాలు జరుగుతుండడానికి మన పెండ్ల ఆలసత్వమే కారణం. యీ సెటిల్ మెంట్లవల్ల దేశానికి మహోపకారం జరగబోతుంది. స్వరాజ్యం వస్తేనేకాని మన దేశకష్టాలు తీరవని సంగడు చెపుతుండేమాట వాస్తవం. సేనలోకి మనుష్యులను చేర్చుకొనడానికీ, క్రైస్తవమతం వ్యాపింపజేయడానికీతప్ప యీ సెటిల్ మెంట్లవల్ల యితరప్రయోజనం లేదు. స్వరాజ్యం వచ్చినతరువాత పద్ధతు లన్నీ మార్చి వీటిని గ్రామాలుగా చేయవలసివుంటుంది. ప్రస్తుత మివి వున్న స్థలాలు యిందుకు పనికిరావు.

బ్రాక్—మీ కిచ్చినకాలం ముగిసింది. యిక వెళ్లవలసింది.

రా-దా—యీ సెటిల్ మెంట్లేర్పరచడంలో ప్రభుత్వమువారికి చేదోడైన రాఘవేంద్రరావుగారు తిరిగీ వీటివంక చూడడంలేదు. దేశనాయకులు తమ దృష్టిని వీటిమీదికి తిప్పడం ఆవసరం. వొకమాట సత్యం.

బ్రాణ—ఇక మీరు వెళ్ళండి.

రా-నా—యింకాఅయిదునిమిషాలగడువున్నది. గడియారంచూస్తూనేవున్నా.

వెం—చేత తీసివేసేది కాదుగాని నీదుఃఖం మేమూ కొంత భరిస్తూనే వున్నాం. నీ వీవతుగా వుండడం చూచి యింటికి పోవడానికి కాళ్లాడడంలేదు.

రా-దా—యెక్కడవున్నా మీ అనుగ్రహంవల్ల ఖులాసాగానే వుంటాం. వీరి నిర్బంధములవల్ల నాదేహానికి పారతంత్ర్యం గలిగిందిగాని ఆత్మ సర్వస్వతంత్రంగానే వున్నది.

వెం—నీకు భగవత్పారతంత్ర్యందప్ప యితర పారతంత్ర్యం లేదు.

రా-నా—భగవంతుడిలో అక్రమం గనబడితే ఆయననుగూడా ధిక్కరిస్తానసుకుంటాను

రా-దా—అయ్యా! నాకొక గొప్పవిషయం బోధించారే. మీమాటలవల్ల వెంకటదాసు నాదృష్టిలో యిప్పుడాకాశమెత్తు పెరిగాడు.

రా-నా—రామదాసుయెదుట వుంటే జ్ఞానవర్షం కురుస్తూనేవుంటుంది. యిక మేం వెళ్లుతాం.

రా-దా—చిత్తం. కాసేపు మంగళాపురం చూపించారు.

వెంకటయ్యా, నాయుడూ, జీతగాడూ వెళ్లుతున్నారు. వొకరినొకరు పలకరించుకోలేదు. సెటిల్ మెంటు ఆవరణపువాకిలిదగ్గరకు పోయేవరకు వెంకటయ్యకు భ్రమవచ్చి నుచ్చిళ్లు ప్రారంభమయినవి. రామానాయుడు పట్టుకొని కొంచెంసేపు నిలిపి—

రా-నా—అన్నా! కాస్త కూర్చో.

వెం—తిప్పుకున్నదిలే! పద. యీమహాయోగికి యెందుకు వచ్చిన వీకష్టాలంటాను! మనోవాక్కాయకర్మలా హింసావర్జితుడే!

రా—ఆప్రశ్న కాయనే జవాబు చెప్పాలే. ప్రారబ్ధం అనుభవించక తప్పదు. కాని యెన్నికష్టాలు వచ్చినా ఆయనకు ఆత్మోత్తేజానికే తోడుపడుతున్నవి. వాటికింద ఆయన మణిగిపోవడంలేదు. అన్నీ వరప్రసాదాలవుతున్నవి. ఇనుము జీరకాక కాచి నీళ్లలో ముంచితేనేకాని కరుకెక్కదు.

వెం—సాధారణప్రజనులు దుఃఖభారంకింద కుంగిపోతారు.

రా—ఆయనఆత్మ వంగేదీగాదు, కుంగేదీగాదు. పెచ్చుయెండినకొద్దీ విత్తానికి బిగివి చిక్కినట్టు శరీరం కృశించినకొద్దీ ఆయనఆత్మకు బిగి పెక్కుతున్నది. జన్మలెత్తడంయొక్క ప్రయోజనమంతేకదా!

వెం—జన్మవల్ల ప్రతివానికీ లాభమున్నదన్నమాటేనా?

రా—కొద్దో గొప్పో వుండకతీరదు. పండి జారినకాయలకూ, రాలిన పూబిందెలకూ తారతమ్యం వుంటుంది.

వెం—మనిషి బొత్తిగా తడపై పోతున్నాడు,

రా—ముఖంలో తేజ మెక్కువయింది. తీగె తిరగబారంగనే గడ్డకు బల మెక్కినట్టు వొంటిలో జవంతా ఆత్మలో గడ్డగడుతుంది.

వెం—మరణంవల పంచభూతాలూ పంచత్వం పొందడం గాకుండా దేహ మంతా ఆవరించివుండే ఆత్మశక్తికూడా జన్మలో సంపాదించబడ్డ కర్మఫల మంతా మూటగట్టుకొని స్వస్థానం చేరుతుంది.

రా—దేహంలో పంచభూతాలను పట్టిపుంచిన ఆత్మశక్తి సళ్లువిడవంగనే అవి చలికిలబడి వూరుకుంటవి. మరణంవల్ల నిజంగా జరిగేది షష్ఠత్వంగాని పంచత్వం గాదు.

వెం—మరణ మంటే పండినపంట కయిలుచేసుకోవడం. పనిదీరిన, చెత్తను వేరుపరచి, పంటను అనుభవానికి తెచ్చుకోవడమే. బాగా పండితే సంచితంగూడా వృద్ధి అవుతుంది

రా—ఆ పంటలో పాపమూ పుణ్యమూ కలిసేవుంటవి.

వెం—వడ్లల్లో సంకులు లేకుండావుంటవా?

జీతకాడు బండి గట్టాడు. అంతా తాడేపల్లిలో భోజనంచేసి వూరికి పోయి నారు.

---

## పదునాల్గవ అధ్యాయం

## నా సృష్టి

నాయుడువ గ్గిరాలు వెళ్లిపోంగనే రామబాస్తు సామాను యింటికి మోసుకుం టున్నాడు. భార్య యెదురుగా వచ్చి అందుకున్నది. కొంతసేపటికి బ్రాన్సనుగారి భార్య వచ్చి,

భా—నీవు యిక్కడినుంచి త్వరగా వెళ్లిపో. నీముఖం తెల్లగా అసహ్యం వేస్తున్నది.

రా—సామాను తీసుకున్న తరువాత వొక్కనిమిష ముండను. యిదుగో చూడండి! వొళ్లంతా తెల్లగావుంటే అసహ్యం లేనిది నాముఖంమీది కాస్తతెలు పేమి చేసింది.

భా—జార్జ్! వీడికావరం చూడు!

బ్రా—నీవు లోపలికి రా. వాడు “నీవెం”తని యెదిరించేస్థితిలో వున్నాడు. కావలసినపని పాలు చేస్తాడు. నీవు వోపిక పెట్టుకో.

రామదాసు యింటికిబోయి చాపమీద గూర్చున్నాడు, జోతి తండ్రిమోకాటి మీద గడ్డం ఆనించి ఆనందంగా తండ్రిమొగం చూస్తున్నది.

మా—సంగతు లేమో సరసగా జెప్పు. అప్పుడివొంట్లో యెట్లా వుంది?

రా—వొంట్లో నిమ్మళంగానే వున్నదిగాని వైద్యులు ప్రయాణం చేయవద్ద న్నారుట. అంటే బాగా ఖులాసాలేదని అర్థం. మనను యిక్కడినుంచి విడిపించ డానికి ప్రయత్నిస్తారుట.

మా—మన మెప్పటికయినా మంగళాపురం చూడడం తటస్థించేనా?

రా—మనం వచ్చి నాలుగురోజులు కాలేదే!

జో—కాలవ్యవధికంటె పోలేమనేనిరాశే యెక్కువ బెంగ పుట్టిస్తుంది.

మా—'యెప్పటికైనా పోలేకపోతామా' అనేఆశ వుంటే రోజులు లెక్క పెట్టుకుంటూ కాలం గడుపవచ్చు. ఆశ రోసులు దాటిస్తుంది.

రా—కాకపోతేమట్టుకు యిప్పుడక్కడ మించిపోయే దేమున్నది?

మా—రోజూ మనకొండరాళ్లవంక చూడడం, అలవాటైనవీథులలో నడవడం, మనసుకలిసినవాండతో మాట్లాడడం, ఆఖరుకు పగవాండ్లవైనా పాతమొగాలూ చూస్తుండడంకంటే భాగ్యభోగ్యాలు యెక్కువ ఆకర్షిస్తవా? నేను ముప్ఫైయేండ్లనుంచీ వొక్క కవ్వంతో చిలికా. రోజూ మసెలమీదినుంచి కవ్వం దింపడానికి నే పట్టుకుండేచోట అరవడిపడ్డది. నామనసులోమాత్రం కవ్వం ఆరవడిగిట్టదా?

రా—సన్న్యసించి అడవులలో కూర్చున్నవాండ్లకుకూడా 'నే గూర్చుండే చెట్టూ' 'నాచుట్టుపట్ల అల్లుకున్నతీగా' అని మమకార మేర్పడుతుందట!

జో—భగవంతుడికి 'నాసృష్టి' అనేమమకార ముండదా?

రా—మమకారం మనుష్యులకు బంధమైతే ఆయనకుమాత్రం కాదా?

మా—మనతో సంబంధం లేనిభగవంతుడితో మనకుమాత్రం సంబంధం యెట్లా వుంటుంది?

జో—మనను ప్రేమించనిదీ నిర్గుణబ్రహ్మమైనా మనం ప్రేమించవలసిన స్వభావమూ ధర్మమూ గూడాను.

మా—ఆయనకు మనవిషయమై యేధర్మం లేకపోతే మన కాయనవిషయమై ధర్మా లేముంటవీ? ధర్మాలెప్పుడూ అన్యోన్యాశ్రయాలే! ప్రేమించడం మన స్వభావ మని నీ వన్నందుకు ప్రేమించేస్వభావం ఆయనకు లేనిదీ మన కెక్కడనుంచి వస్తుంది. ప్రేమ యెప్పుడూ అన్యోన్యమే!

జో—యెదటివారిలో లేకపోయినా ప్రేమ ప్రేమను పుట్టిస్తుంది.

రా—రెండూ ప్రేమించేస్వభావం కలిగినవైతే.

మా—కాకపోతే ప్రేమించడానికే వీలులేదు. అయినా యీవాదా లన్నీనా కెందుకు? పొద్దున బోయి సామాను కొనక్కరావాలె. పనికి పోవలసివస్తుందే మోనని సాయంత్రానికి తేలేదు ఇంట్లో పెట్టిపోవడానికి భయంగా! వాకిలి కేమయినా అడ్డమేర్పరిస్తే బాగుండు.

రా—తడికె కుక్కల కడ్డంగాని మనుష్యుల కడ్డమా? సత్తెయుగంలో వాకిండ్లకు తలుపు లుండేవి కావట.

మా—దొంగలు రాకపోతే మనమూ తీసేవుంచవచ్చు.

రా—వెంకటయ్యగారు యిరవైరూపాయి లిచ్చారు. యివి యెవరిదగ్గర దాచను?

మా—నాతీగె విడిపించుకుని మిగిలినవి మనముగ్గురిదగ్గరా తలా అయిదురూపాయిలు వుంచుకుందాం. మిగిలినరూపాయిపెట్టి సామాగ్రి తెస్తా. మనం వొకరం

యింటిదగ్గిర వుంటూ, యిద్దరం పనికి పోతే బాగుండు. కాస్త కోనగావలి లేకపోతే బాగుండదు.

రా—మీయిద్దరూ రోజుమార్చి రోజుయింటిదగ్గిర వుండి వంటచేయండి. నాతో వొకరు పనికి రండి.

జో—"అయ్య కొత్తరా కోళ్లగం" పని నీవు రోజూ పనికి బో!

రా—నాకు వంటచేయడంకంటే కూలికి పోవడమే సులువు. అదిగాక నే లేకుండా మీ రంతదూరం పోవడం నాకిష్టంలేదు

జో—యింట్లో వొంటరిగా వుండడంమటుకు మంచిదా?

రా—యిక్కడ పరవాలేదు. సామానుకు నేబోయివస్తా. నీళ్లకు నీవు పో.

---

పదునైదవ అధ్యాయం

## కన్నీళ్లలో కాలు జారెను

కూలికి బోయినవాండ్లందరూ యిండ్లకు వస్తున్నారు. ప్రొద్దున కొందరు గంజితాగి పోయినవాండ్లు. మరికొందరు చద్దెన్నం తిన్నవాండ్లు. కొంతమంది వట్టినే పోయినారు. మధ్యాహ్నం యెవరికీ అన్నం లేదు. పొద్దుగూకులూ పనిచేసి ఆకలికి ప్రాణాలు వెసబోయివున్నవి. అప్పుడు జొన్నలు దంచి వండుకోవడానికి వోపికలేక అందరూ బియ్యమే తెచ్చుకున్నారు. వాండ్లకు జొన్నన్నం తింటే దిండుగా వుంటుంది. కాని అప్పెసం వరిమెతుకులు తినడంచేత మనుష్యులు వూలపోతున్నారు. షాయిలోకి చిన్నకట్టలుగట్టి తుత్తురుపుల్ల లమ్మతారు. అవి యెన్నిగాల్చినా బుసుసన పోతవిగాని జొన్నన్నం ఘడుకైనా పట్టదు. అటి కాలే గట్టిపుల్లలు వుంటేనేకాని వుడకదు సగం వంటచెరుకు లేకనే జొన్నలు మానుకున్నారు. అందరూ భత్యాలు తెచ్చుకొని అన్నం కాంగనే నిప్పులమీద నీళ్లు చల్లినట్టు తలా కాస్తా తిన్నారు. అన్నం తిన్నతరువాత గుంపులనాయకులను పోగుచేసుకొని పుల్లప్ప రామదాసు యింటికి వచ్చాడు.

పు—రామదాసుగారూ! గుంపులనాయకు లంతా వచ్చారు. మీరు చెప్పిన ప్రకారం పోవడానికి సిద్ధంగా వున్నారు. మీతో మాట్లాడవలెనని వాండ్లకు కోరిక. మీభోజన మైందా?

మా—వంట అయింది. మాట్లాడడం పొద్దుపోయేట్టుయితే త్వరగా తినే కూర్చోవచ్చు.

పు—పొద్దుపోయేవరకు కూర్చోవడానికి వీలేలేదు. యెనిమిదిగంటలకు గస్తీ ప్రారంభం అవుతుంది. ఆపైన యెవంగూంట్లో వాండ్లుదూరక తప్పదు.

రా—బయట సంచరించేగుంపులు దప్పు!

పు—వాండ్లు దొరలే అయిరి. మనమాట లన్నీ వొకగంటలో ముగించాలె. యితడు దొమ్మరగూడానికి నాయకుడు. పదిమందిగలకుటుంబం. యింటిదగ్గిర వ్యవసాయం, వొకవంద సన్నజీవాలూ వున్నవాడు యిక్కడికి చేర్చడంచేత అవన్నీ అమ్ముకొని ఆడబ్బు రుక్కొని తింటున్నాడు. యింకొకయేడాదికి సెట్టి మిగులుతాడు. తరువాత యీగుంపు యెట్లా బతకాలెనో తెలియదు

రా—యిప్పుడు కూలి చేయడంలేదా?

పు—యీ పదిమందిలోనూ యేడుగురు వొళ్ళు దాచుకోకుండా పని చేసేవాండ్లు. వీండ్లకు వారపుమొత్తంమీద వచ్చేకూలి మూడురోజులకు హానీహానీగా సరిపోతుంది. తక్కిన నాలుగురోజులకూ యింటిదగ్గిరనుంచి తెచ్చుకుని తినాలె.

రా—నీ పేరు?

దొమ్మర నాయకుడు—రాము డంటారండి.

రా—నీవు వచ్చి యెన్నాళ్లయింది?

రాముడు—మేము వచ్చి నాలు గేండ్లకు పైన అయింది. మాగోడు యింకా శానా వుంది. ముందు మేము యింటిదగ్గిద కమ్మగా పాడి తాగినవాండ్లం. యిక్కడికి వచ్చినప్పటినుంచీ తెల్లనీళ్ల మొగమైనా చూడలేదు. మాపిల్లలఘోష యెవరికి తగలవలసినదో తెలియదు.

రా—ఆయ నెవరు?

పు—అతను యెరుకల కిష్టడు.

కి—అయ్యా! మాయెరుకలగుంపు వందగడప వున్నది.

పు—వాళ్లగుడిసెలకుమటుకు గడపలు లేవు.

కి—వుండవయ్యా నీదంతా చమత్కారం! మా దరిద్రానికితోడు ప్రతివాండ్లకూ గుంపెడుపిల్లలు. రెక్కలు విరుచుకొని పనిచేస్తాం. మా కిచ్చేకూలి వొంటిపూటకు చాలదు. కూలి దొరకనిరోజులలో మేము పొట్ట నాయగట్టుకొని పడుకున్నా పిల్లలు పస్తుపడుకుండడం చూడలేక జాలిగుండెగలవాండ్లంతా సంచారాలు మొదలుపెట్టారు. నాబోటికటికగుండెలవాండ్లం యింకా వటిస్తూనేవున్నాం. నేను ముగ్గురిపెట్టు బరువులు మోస్తా. యిద్దరిపెట్టు తింటా. నేనుగనక గడ్డపార తీసుకుంటే రాయి వణకాలె!

పు—రాములవారు బాణం తీసుకుంటే సముద్రం వణికినట్టు.

రా—పుల్లప్పా! యీకథ లన్ని యెప్పుడు చదువుకున్నావోయ్?

పు—అయ్యా! నేను వొకఅందాన చెడ్డానా?

రా.దా—బాగుంది, నీకథ గానీ!

కి—నిత్యం నావల్ల పని దీసుకుని పావలాడబ్బు లిచ్చేనాదుణ్ణి చూపించండి! కేరు నీలిమోపులు గుత్తకు మోసుకొని ముబ్బడికూలి సంపాయించేవాణ్ణి. నేను చోరీ యిదివరకు చేసినట్టుగాని, యిప్పుడు చేస్తున్నట్టుగాని వొక్కరిచేత అనిపించండి. యెరుకలవాడినై పుట్టినందుకు యిక్కడ దొంగలగూడెంలో తగుదునంటూ పెత్తనం చేస్తున్నా. యింటిదగ్గిర చక్కగా జీవించేవాడిని యిక్కడబెట్టి చంపుతున్నారు.

నేనేగనుక దొంగతనాలు సాగిస్తే వూళ్లూ వుహాలూ గూడా ఆగవు. యింకా పస్తుయిస్తున్నా.

రా-దా—యిక్కడింత కూలి తక్కువ గిట్టడానికి కారణ మేమి?

కి—యిక్కడ యింతమందిజనానికి యేమిపని వున్నది? మామూలంగా చుట్టుపట్లవూళ్లలో కాపురంవుండే కూలీలకు జీవనం పోయింది. వాండ్లు దొంగజాతులలో చేరినవాండ్లు కారుగనుక బయటవుండే దొంగతనాలు ప్రారంభించారు. సమీపగ్రామాలలో యెవరూ యిప్పుడు కూలి సరిగా యివ్వరు. వీడ్లంతా యిక్కడ తేరగా వచ్చిపడ్డారని పోలుసు లోగట్టుకొని వాండ్లయిష్టంవచ్చినట్టు గుత్త కేర్పాటు చేసుకుంటారు అందులో యీ కొత్తదొరగారు వచ్చినతరువాత కూలీలనోట మట్టే! పోలుబ్యాంకులు నింపుతున్నాడు!

పు—మమ్మలను అసలు మోసంచేసి తీసుకొనివచ్చారు. కర్నూలుజిల్లాలో వొకడిప్యూటీకలక్టరు, 'మే మంతా రా' మని తిరగబడితే మా ఆడవాండ్ల నందరినీ 'అమ్మా, అప్పా' అని మంచిమాటలాడి మేహావానుపొందేటందుకు స్వంతకర్చుతో గాజులు తొడిగించి చీరలుకొనిపెటి తోడబుట్టినవాడిమోస్తరుగా వాండ్లను లాలించి వొప్పించాడు. మామగవాండ్లతో కోరుకున్నభూము లిస్తామని, సర్కారువారు దయదల్చి మాదరిద్రదవిచ్చితు చేయడానికి పూనుకున్నారనీ చంకబిడ్డల జారదీసేమాటలతో మాదాసరిగూడేలను లేవదీశాడు. ఆయనమాటలు నమ్మి మా కున్నపొలాలూ, యిండ్లూ, చరాస్తీ అమ్ముకొని యిక్కడ సేద్యాలు వెలిగింతామని వచ్చాం. ద్వారపూడిపచ్చపువాండ్లకుకూడా వుచ్చులు అట్లాగే తగిలించారు. సెటిల్ మెంటులో అడుగు పెట్టాం, పస్తులు ప్రారంభమైనవి. చేతిలో మెల్లా వున్నవాండ్లు వచ్చినంతవరకు ఖుస్చుపెట్టుకొని తిన్నారు. ఆకాస్తా అయిపోంగనే లగ్గల కెక్కారు. మాపోరణచడానికి దక్షిణాదికాఫీతోటలకు పట్టించారు. ఆకొండలనిండా నీళ్లు. కాలుపెట్టేవరకు జలగలు పట్టుకుండేవి. మావొంట రక్తమాంసా లుంటేగా! తరిపిదూడలవలె కాసేపు గంజి పూరుకుండేవి జనానికి రోగాలు మోపై చాలామంది నిశించారు. రోజూ పీనుగలు వెళ్ళుతున్నా తోటలదొరలు యేడ్చే పెండ్లాలనూ, బిడ్డలనూ పనులు చేయ మని వేధించేవాండ్లు. 'యెట్లాగైతేనేమి. చావడానికని గుండె రాయిచేసుకొని యావన్మందిమీ "జాఃపరమేశ్వరా" అని చెప్పకుండా లేచాం.

రా-దా—యెక్కడికి?

పు—ఏలేందుకు లేవుగాని యెత్తుకతినేందుకు వూళ్ళు చాలావున్నవి. తిడితే తప్పగాని తిరుచుకుంటే తప్పలేదు. బిడార్గు లేపేవరకు తోటలదొరలు తుపాకులు దీసుకుని మావెంటబడ్డారు. మేము రాళ్ళు దీసుకొని వానరయుద్ధం ప్రారంభించేవరకు ధొరయ్యలు యళ్లోయెళ్ళు! వాండ్లేం వూరుకున్నారా? కలక్టరును రిజర్వుపోలీసులను బంప మని అడిగారు. అయ నెవరో మంచివాడట. వాండ్లయిష్టంవచ్చిన సెటిలుమెంట్లకు పంపవలసిం దని ఆర్డరు వేశాడట.

రా-దా—చాలా గొప్పవరమే!

పు—అప్పటి కట్లాగే అనుకున్నాం. దిక్కుదోచక తలా వొక సెటిల్మెంటు పేరు చెప్పాం. పెనంమీదనుంచి మంగలంలోకి దూకినట్లైంది. యిక్కడ దూకడానికి

కూడా వీలులేదు కొలనుకొండంతా యీనాం అయి మాపాలబడ్డది. మేము వాటికీ లొంగం, అవి మాకూ లోబడవు కొండరాళ్లూ మేమూ ద్వంద్వయుద్ధం చేస్తున్నాం. యిదివరకు దొంగతనం యెరగనివాండ్లుకూడా కొందరు—

ద్వారపూడినాయకుడు రాఘవులు—ఆసంగతి యిప్పు డెందుకోయ్, పెద్ద మనుష్యులతో?

పు—యేమి చెపితే? తల తుంపుతారా? పాలించేవాడు వచ్చినప్పుడు యావత్తుసంగతులూ చెప్పవలసిందే.

రాఘ—యిప్పుడేమిచేయవలెనని నీయభిప్రాయం? నీవు యేమిచెయ్యమంటే అది చేస్తాం. తిరుగు లేదు.

యానాది సుబ్బడు—తెగతెంచుకొని పారిపోదా మని!

రా-దా—ఎక్కడికి పోతారు?

సు—గడిదాటి పొమ్మంటే పోతాం.

రా-దా—పోలీసులు అందరినీ పట్టుకవస్తే సెటిల్మెంటుచట్టంకింద తలా వొక సంవత్సరం వొడ్డుతారు.

పు—మొదట ఖైదంటే కాస్త వెరిచాం. యిప్పు డాచలి తీరింది. ఈసెటిల్మెంటుధర్మాన అందరికీ కొత్త తీరింది. రాజుగారిరొట్టెలు చాలాభాగం రుచి చూచాం. మేమూ దాసంగాలలో ధప్పళాలు కొట్టినవాండ్ల మే!

రాముడు—కాళ్లకట్టతాడు కోశారు అంత్యానికి వచ్చింది. నీతినియమాలు విడిచాం. కూడు లేక యెంతకాల మని మాడుతాం? "జైలుకు పోతే నామోషి" అన్నమాట పోయింది.

రా-దా—అయ్యో! అన్యాయం! అ దేమి?

పు—సెటిల్మెంటుకాంపౌండు దాటితే నేరం. మొదటిసారి ఆరునెలలూ, రెండోసారి సంవత్సరం, ఆపైన అంతస్తులుగా శిక్ష పొడిగిస్తారు నీతికి భంగం లేని పను లన్నీ నేరాలుగా జేసి జెళ్లు చూపించారు చాలాభాగం తెల్లకుళాయీల మల్లా నల్లకుళాయీల మైనాం. ఆవరణపుగీత దాటినందుకు దొంగల మని శాశ్వతపు పట్టా లిచ్చారు. నల్లకుళాయీలవెంట యెర్రకుళాయీలను తగిలించారు జవానులను వెంట బెట్టుకొని జమీందారుసెకలు వెళ్లబోస్తున్నాం. యిప్పు డెక్కడికి దేంగామంటే, యేదో వొకవంకపెట్టుకొని వెనుకు పోవడం. ఆరునెలలు పోయిగావడంతో జైలు సౌకర్యాలు తెలుస్తవి. వేళ కింత న్నం. కట్టుకోను చల్లాడం, కప్పుకోను కంబడి, గచ్చుటిండ్లు అక్కడ మావొక్కకిటికీ కుండేయినుపసామాను గొప్పవాండ్ల మేడలకు సరిపుచ్చవచ్చు! నిద లేవడానికి మేలుకొలుపులు, తూర్యరవాలు రాజదండం చేత బట్టుకొని యెప్పుడూ వెంట జవాను, వందలునినే డాక్టర్లు, అడిగేవూ మా వైభోగం! చుట్టూ కోటగోడ రాజలాంఛనాలు వృద్ధిపడుతుంటవి మాఆడవాండ్లకుకూడా యిదే మోస్తరు ప్రత్యేక యేర్పాట్లు వుంటవి. నవాబుగారి జనానాకంటెకూడా యెక్కువ ఖాయిదా మేము సెటిల్మెంటు వచ్చినాలుగేండ్లయింది మాఆడవాళ్లకు గుడ్డ కొని పెట్టినపాపాన పోలేదు. వొకపూట అయినా అన్నంపెట్టలేనివాండ్లం గుడ్డ లేమిస్తాం?

నగం యీమానభంగం సహించలేక నేఖైదుకు పోతున్నాం. ఖైదులో ఆడవాండ్లను వొళ్లునిండేపడ్డయినా యిస్తారు.

రా దా—ఈసెటిల్మెంటు చట్టంవల్ల జనంలో ఆత్మగౌరవమూ, నీతిగౌరవమూ చంపా రన్నమాట.

దాసరినాయకుడు కేశవులు—పుల్లప్పా! నీ వాగరా! అయ్యా! నే నిప్పుడు తొంభై మోపడిలో వున్నా. మా అయ్య కాలంచేసి యిప్పటికి అరవై సంవత్సరాలైంది. ఆయన చావంగనే నాకు యిరవై ఆయిదో సంవత్సరం వెళ్లు జాత కుల పెద్దను చేశారు. డెబ్భయేండనుంచీ మాకులచరిత్ర బాగా యెరుగుదును. చాలామందిమి వ్యవసాయదారులుగా వుండేవాండ్లం. రానురాను ముప్పాతిక వంతుకు కూలిజీవనమైంది. యిప్పటి కిరవై యేండ్లక్రిందట నాలుగుకులాలతోపాటు తప్ప మావాండ్లల్లో విశేషదొంగతనం లేదు. యీనడుమ కొంచెం సంఖ్య హెచ్చినమాట వాస్తవమే. దానికి కారణం కూలి దొరకకపోవడమే. యిప్పటికీ నలుగురితోపాటు మర్యాదగా జీవించేవాళ్లు సగానికి యెక్కువగా వున్నారు. మాకు సర్కారువారు దొంగలజాతి అని పేరు పెట్టారు. వైష్ణవదాసరులమల్లా దొంగదాసరుల మైనాం. మాబైసు బయటబడ్డది. నేనూ నాకొడుకూ వేళ కెవరైనా వస్తే గుక్కెడుగంగపోసే స్థితిలోనే యిప్పటికీ వున్నాం. నాబిడ్డ పొద్దుగూకితే గడపదాటి యెరుగడు. దొంగదాసరుల మని ఈ సెటిల్మెంటులోకి తెచ్చారు. యిక మమ్మను పెద్దమని పనేవాడు యెవడూ వుండడు కదా? మే మిప్పుడు కొత్తగా దొంగతనం చేసి పేరు చెడగొట్టుకొనేది లేదు. బిడుదు యేద్రోహమూ చేయకుండానే సంపాయించుకున్నాం. యిక మంచివాండ్లం కాబోయేది లేదు. సత్యగా వుంటే మనకు వొరిగే దేమున్నది? రాత్రిళ్లు కన్నాలకు బయలుదేరుతా నని మాపిల్లవాడు నన్ను రోజూ గోకాడుతున్నాడు. యెర్రపిల్లవాండ్లను ఆడవేషాలకు పిలిచినట్లు బక్కపలచగా వుండడంచేత కన్నంలో దూరడానికి బాగా పనికివస్తా డని పోలుగారు పిలిపిస్తున్నారు. పొమ్మంటావా? వద్దా?

రా-దా—వ్రతం యెట్లాగూ చెడ్డది సుఖ మెందుకు దక్కించుకోగూడ దంటావు? యితరమార్గాలు ఆలోచించుకుంటున్నాంగా.

కే—సరే ఆలోచించు.

రా-దా—నిర్భయంగా జైళ్లకు పోవడానికి తయారైతే అన్నిపనులూ చక్కపడతవి.

కే—అంతేకదా నీకు కావలిసింది? మేము యింకొకందుకైనా జైలుకు పోవడానికి సిధ్ధంగా వున్నాం యిప్పుడు జైలుకు పోవడం సులభమే. సర్కారువారు చాలా సదుపాయం చేశారు. యీఆవరణందాటి అవతల అడుగుపెడితే జైలుప్రాప్తే. దూరంగూడా పోనవసరంలేదు.

రా-దా—ఈసెటిల్మెం ట్లన్నీ కిరస్తానీమతాలు. మనం ప్రార్థనకు పోకపోతే యీపాదిరీలు మన కొకసలాం పెట్టి లేచిపోతారు దున్నడానికి వీలైనచోట సెటిల్మెంటు పెట్టి అక్కడుండమంటే మన ముండడం, లేకపోతే మనదారి మనం చూచుకోవడం. పారిపోతే పోలీసులను పెట్టి కాలిపిస్తా మంటారు. దానికేమిచెపుతారు?

పు—దానికీ మనంతయారు కావలసిందే. యెంతమంది ఆడవాండ్లనూ, పిల్లలనూ కాలుస్తారో చూతాం!

రా-దా—చావుకు వెరుస్తామని కాదు. ముందుగా కన్ను పొయ్యేటంత కాటుక పెట్టుకోవడ మెందుకు? రేపుపొద్దున యావత్తుమందిమీ ప్రార్థనకు పోవడము మానివేతాం. దానిమీద కదలిక పుడుతుంది మనబాధలు యావత్తూ తెలుపుకుందాం. ప్రయోజనం లేకపోతుందీ, యీ కాంపౌండుబయట బిడారులు దింపుదాం. గవర్నమెంటువారు మెదలకుండా వుంటారూ, ఎవరిదారిన వాండ్లం పోదాం. వృథాగా చంపితే చంపనియ్యండి. మనం యెవ్వరమూ దౌర్జన్యానికి దిగవద్దు.

దా-కే—బాగానే వుంది. మొండివాడు రాజుకంటే బలవంతుడు.

రా-దా—ఇక అందరినీ ఖైదుకు పొమ్మంటే అందువల మనకు నామోషీ లేదు. అన్నవస్త్రాలిచ్చేదాత లుంటే చేత నైనంతవరకు వొక అతుకు అతుకుతూ లక్షణంగా అందరం అక్కడనే వుందాం. అక్కడిసంగతులు యావత్తూ యిందాకా మనపులప్ప వర్ణించాడు. దొంగది, సగం ప్రభువంశ అనేది వాస్తవంగానే వున్నది. 'హరిఃఓం' అని రేపుపొద్దున ప్రార్థనకు పోవడం మానివేతాం. మీఅందరికీ అంగీకారమేనా?

కే—ఇంకా రెండోమాటా?

రా-దా—యింకొకసంగతి! మనకు యావత్తుసంగతులూ బోధపడ్డవి. నన్నుగాని మీగుంపునాయకులనుగాని ఖైదులోకి పంపితే వెంటనే కొత్తవాళ్లను నాయకులుగా యేర్పరుచుకుండేదీ, రంగం సాగిస్తుండేదీని. తెంపులేకుండా యీపని జరగాలె.

క్రి—మంచిమాటే!

రా-దా—మనలోనుంచి యెవరైనా చీలిపోయి లోబడ్డా తక్కినవాళ్లు లెక్క చేయగూడదు.

రాఘ—కోసకోళ్ళు లేకుండా వుంటవీ? నిల్చినవే లెక్క!

రా-దా—సరి.

గస్తీ ప్రారంభించేసమయ మైంది. పోలీసులు తిర్గాడుతున్నారు. కులపెద్ద లంతా లేచి తమగూడేలకు బోయినారు. పౌలు యేదో ఆలోచన జరుగుతున్న దని పసికట్టాడు సంగతి ఫలనా అని తెలియలేదు దొరగారితో యోచించి ప్రార్థనకు రాకుండా సమ్మెకట్టుతున్నా రని అనుకున్నాడు. పౌలు "మతవిషయం యీజనానికి పట్టవచ్చిందా! చివరకు యేమీ జరగ"దన్నాడు "మాలలు కొందరు చేరినా మనము మెదలకుండా వూరుకుంటే అదే సమిసిపోతుం" దని పాదిరీగా రన్నారు. అంత వుభయులూ వెళ్లిపోయినారు రాముదాసు భోజనానికి లేచాడు. అందరూ అన్నం ముందు కూర్చున్నారు.

జో—అయ్యో! నీ కెక్కడివోపికే? రెండుగంటలనుంచీ వాండ్లతో సతమతమవుతున్నావు.

మా—యెక్కడికి పోయినా వూరుకునేఘటం కాదు. యిదో వాతరచ్ఛ జరుగుతుండాలె.

రా-దా—వూరకోదలుచుకుంటే యిందాకా రావడ మెందుకు? దేనితోనూ సంబంధం లేదనుకుంటే యింటిదగ్గిరనే వుండుం. సంగతులన్నీ విన్నారుకదా! మీ కేమితోస్తున్నది?

జో—లోక మంతా ఆనందమయం అనుకున్నాను. యిప్పుడు దుఃఖమయమని తోస్తున్నది.

రా-దా—అయితే రెండో మెట్టుకు వొచ్చావు. రెంటికి సమన్వయం కుదిరితే సత్యంలో నిలుస్తావు.

మా—మొదటి మెట్టు సుఖమా దుఃఖమా?

రా-దా—యెటు ప్రారంభమైనా వొకటే. మూడవ మెట్టు యెక్కినవాండ్లు ధన్యులు.

మా—నేను సుఖం దాటి దుఃఖములో వున్నా.

రా-దా—కన్నీళ్లలో కాలు జారేను, జాగ్రత్త!

—

## పదునాలవ అధ్యాయం

# రెండు బృందావనాలు

తెల్లవారంగనే మామూలు ప్రకారం జనమంతా లేచారు గాని అలబల మంతగా లేదు. వున్నవాండ్లు మధ్యాహ్నం కట్టుకపోయేటందుకు అన్నం వండుకుంటున్నారు. ప్రార్థనకు మొదటిగంట కొట్టంగనే ఫుల్లప్ప రామదాసుదగ్గెరకు వచ్చి,

ఫు—నలుగురినీ పోగుచేసి మంచిమాటలు యేమైనా చెప్పుతారా? యేదో కాలక్షేపం జరుపుతుంటే జనం అంతా యిక్కడనే పోగుపడివుంటారు.

రా-దా—వాండ్లు యేమెత్తుకు వచ్చేదీ చూచి అవసరమైతే మనం సాయంత్రం పెట్టుకుందాం. యీసమయంలో ప్రతిరోజూ కృష్ణకు బోయి స్నానం చేసేటందుకు వుపయోగింతాం. ప్రతిరోజూ స్నానంచేసే అలవాటు మనం నేర్చుకోవాలె. కొల్లలుగా దగ్గెర నీళ్లు వున్నప్పుడు మనం తప్పకుండా స్నానం చెయ్యాలిసిందే.

ఫు—అట్లయితే జనం చద్దెన్నం దినకముందే స్నానం చేతాం. రేపటినుంచీ ప్రారంభించవచ్చు.

రా-దా—రెండోగంట కొడుతున్నారు. మనం పోకపోతే పెద్దవాండ్లను పిలిపిస్తారేమో?

ఫు—అక్కడికి మన కేమిపని? యిక్కడికే రమ్మనమందాం.

రా-దా—యెట్లైనా సరేకాని మనం వొక్కొకండ్లం యేవిధమైనమాటా యియ్యవద్దు నలుగురితోనూ మాట్లాడందే జవాబు చెప్పడానికి వీలులే దందాం మనంనలుగురం సంప్రతించుకొనే యేసంగతీ చెప్పవచ్చు. ఈసంగతి నాయకు లందరితోను చెప్పు.

పు—వోటరిగా పిలిపిస్తే పోయి యీమాట చెప్పమంటారు.

రా-దా—పోతే తప్పేమున్నది? సమ్మె 'ప్రస్తుతం బోధపరా' మనేగా! నీవు మీయింటికి పో.

సాధారణంగా రెండోగంట కొడుతుండగానే జనంచేరబారతుండేవాండు పాదిరీగారు దుస్తులు వేసుకొని కిందికివచ్చి భోజనం చేస్తున్నారు జనం రాకపోవడంచేత దొరగారితో చెపుదామని పాలు వచ్చి తొంగిచూచి అన్నం తింటున్నారని వెనుకకుపోయి పంచాగిలో నిలువబడ్డాడు దొరగారు కాఫీ తాగి వచ్చి,

బ్రౌన్—పాలూ! యెవరూ రాలేదా?

పా—వొకపురుగుగూడా రాలేదు. కుట్ర జరుగుతున్న దని తమ కప్పుడే మనవిచేశానుగా!

బ్రౌన్—వారికి దేవునిమతం అక్కరలేకపోతే ఈసెటిల్మెంటు తీసివేయింతాం.

పా—అయ్యా! తొందరపడగూడదు రామదాసూ, పులప్పా చేసేపనికి అందరినీ శిక్షించడం బాగుండదు. వొకరిద్దరిదుర్మార్గంవల్ల అందరినీ సత్యమతానికి దూరంచేయడం న్యాయమా!

బ్రౌన్—నాయకులను నలుగురినీ పిలిచి మాట్లాడుదామా?

పా—వెట్ట తక్క వని నాఅభిప్రాయం యిప్పటిబిగువుమీద పిలిస్తే రామంటారేమో! యిన్స్పెక్టరుగారు కేసుపెటడానికి వొప్పవున్నారు. ఆరెండుకుటుంబాలనూ పనికి పంపకుండా వుంచివేసి తక్కినవాండ్లనందరినీ కొలనకొండ పంపివేస్తా. యింతమందిలో అరెస్టు చేయడం కూడా కష్టం. ఆడివిజనం తిరగబడితే అపాయం. మధ్యాహ్నం రైలుమీద యెక్కించి గుంటూరుకు తీసుకొనిపోవచ్చు.

బ్రౌన్—సాక్షు లున్నారా?

పా—వొప్పుకొన్న నలుగురిపోలీసులనూ యిక్కడ ఫారా వుంచుతా. జనులలో నాకు ముఖ్యులయినవాండ్లను హెచ్చరించి చూస్తే తమవల్ల కాదన్నారు. తమరు సాక్ష్యంగా వుంటే పకడుగా వుంటుంది.

బ్రౌన్—ఎబ్బే! నే రావడం వెలితిపని తాడేపల్లిపోయి రెడ్డిని తీసుకొనిరా. నీతో కలిపి అర్గురు సరిపోతారు. తక్కినజనాన్ని యిక్కడ వుండకుండా చూడు.

పా—వొకరిద్దరు జబ్బువాండ్లు మిగిలివున్నా కొండదగ్గిర మస్తరు వేయిస్తా. రెడ్డిని యిక్కడికి తీసుకొనిరానా?

బ్రౌన్—నాదగ్గిర కెందుకు? తప్పకుండా రైలుకు రమ్మను. సాక్షు లంతా హాజరులో వుంటే విచారణ వెంటనే ప్రారంభం అవుతుంది. మంగళాపురం తెలియకుండా చూడు. వాండ్లు వచ్చి విడిపించుకొనిపోతారేమో?

పా—యిక అది వట్టిమాట. కేసు పెట్టినతర్వాత కలెక్టరుగారు విడిపించరు. డిప్టీకలెక్టరుగారు కేసువిచారణలో యేమిచేస్తారో? తమ రెరుగుదురుగావాలెనే!

బ్రౌన్—యిప్పుడు శివయ్యగారు వచ్చారుగదా! నాకు ముఖ్యుడే! సాక్ష్యం కనీసం రేపైనా విచారణ జరిగేటట్లు చూడండి. మనయిన్స్పెక్టరుతో నే మాట్లాడవలసివుంటుందా?

పా—కేసు పెట్టడానికి వొప్పుకున్నాడు గాని తఫ్సీళ్లల్లో మెలికెలు పెడు తున్నాడు. తమరు పిలిపించి కేసులో పోలుసలహాప్రకారం పోతే బాగుంటుం దని మాత్రం అనండి లోతుకు బోవద్దు

బ్రా—నీపనిమీద నీవుండు నేపిలిపించి చెప్తతా. ఈవుత్తరం సాయంత్రం యింటికి బోయి డిప్యూటీకలెక్టరుగారికి యియ్యి. తప్పక పని చక్కపడుతుంది. నీవు నోటిమాటలతోకూడా కేసుసంగతి చెప్పు.

పా—తమదర్శనం మళ్లీ గుంటూరునుంచి వచ్చే! వీళను ఆరెష్టు చేశా రని వినంగనే జనం అంతా దంగిపోతారు. రేపు మామూలుప్రాకారం ప్రార్థనకు వస్తా రనుకుంటాను.

బ్రా—రేపు నీవు పని పూర్తిచేసుకొని వస్తే మర్నాడు ప్రార్థనకు రమ్మందాం. శిక్ష లేశా రని తెలిసేనేకాని బెదురుపుట్టదు దానిమీద క్రమంగా మెత్తబడి లోబడతారు, పని నెమ్మదిగా సాధించాలె.

పోలు పాదిరీయింటిదగ్గరనుంచి అతివేగంగా తాడేపలి పోతున్నాడు. ఆసందంసబుయినస్పెక్టరుయింటికి వచ్చి ఆయనను పాదిరీయింటికి తీసుకొనిపోయినాడు. పుల్లప్ప యావమనిషి యావలు తీసూ శత్రుసంచారం కనిపెట్టివున్నాడు. యినస్పెక్టరుగారు తిరిగిరావడం చూచి యెదురుగా బోయి దండంపెట్టి "యేమి స్వామి! మీరు దయగలప్రభువులు. వాండ్ల అక్రమాలకు లోబడి మాబోటి వాండ్లకు అన్యాయం చెయ్యకండి"

యి—యేమిరా! నే నేమిచేసేది? పొట్టకూటికోసం మీవాండ్లు కన్నాలు వేస్తుంటే మేమూ అందుకే మీకంటే యెక్కువదుర్మార్గాలు చెయ్యవలసివస్తున్నది.

పు—అయ్యా! మీమాటలనుపట్టి చూస్తే మా కేదో అక్రమం జరిగేటట్టుగా వుందే!

యి—తినబోతూ రుచి అడగటం యెందుకు? నొకగంటలో అంతా తెలుస్తుంది.

పు—అక్రమకేసు పెడతారుగావాలె?

యి—అటువంటిదే చేస్తారు

పు—నావొక్కడి మీద నేనా?

పు—పాపం! రామదా సుండక తప్పదు. దొర బైటికి వస్తాడేమో, నీవు వెళ్ళు. మనం మాట్లాడుతుండగా చూస్తే లాలూచీ అయినా మంటాడు.

పుల్లప్ప—(రామదాసింటికి పోయి) అయ్యా! వ్యవహారం బెడిసిందే!

రా-దా—నాకుఅరికాళ్ళుదురదగా వున్నవి. ప్రయాణం తగిలేటట్టుగా వున్నది.

పు—మనమీద కేసు పెట్టబోతున్నా మని యినెస్పెక్టరుగారు చెప్పారు. పోలు తాడేపల్లి పోతున్నాడు. వొకగంటలో యావత్తు సంగతీ తెలుస్తుందట. యేమి ఆలోచన?

రా-దా—మన కేమి ఆలోచన వున్నది? వాండ్లపనిగనుక ఆలోచించుకుంటారు. మనం నిర్విచారంగా వుదాం.

మా—మనం యేమితప్పు చేశా మని కేసు పెడతారు?

రా—ఓసి పిచ్చిదానా! యిప్పుడు చెయ్యాలెనా? యెప్పుడు చేసిందో? యేమీ లేకుండా యింతమంది పెద్దలకు బుద్ధిపుట్టి యీపనికి పూనుకుంటారు? వాండ్లు వూరికే నిమిత్తకారణం!

పు—వాండు చేసేది కేవలకల్పనకదా! మనపుసుపు తగలదా?

రా—తగల కేమి? వాండ్ల పూర్వజన్మదుష్కర్మ యీరూపంగా పండి ఫలం యింకొకప్పుడు అనుభవిసారు అనుభవానికి యీజన్మలోనే రావచ్చు.

పు—కేసు యేమని పెడతారో?

రా-దా—కేసా? మనం తప్పించుకొని పోతున్నట్టూ పట్టుకొన్నట్టూ బనాయింపు చేసారు. పొరుగూరి మోతుబరిఆసామీ రెడ్డిగూడా సాక్ష్యమువుతాడు. నలుగురు పోలీసులుకూడా వున్నారుకదా! మనవాండంతా పనికి పోవడంచేత మనకు సాక్ష్యంగూడా వుండదు. నడకియీావత్తూ యింతే

పు—పోతేమటుకు సాక్షులు యెట్లా చెప్పమంటే అట్లా చెపుతారు.

రా-దా—పైగా అదొకటెందుకు? వాండ్ల పేర్లన్నీ మస్తరులో కెక్కుతవి. వాండసాక్ష్యంవల్ల మనకు ప్రయోజనం లేకపోగా వాండ్లుకూడా తప్పసాక్ష్యం కింద యిరుక్కుంటారు.

పు—అయితే మనకు తప్పనట్టేనా?

రా-దా—ఆహా, ఆరునెలలు శిసలే! నాకు చెక్కబిళ్లేగతి. నీకు సత్తుబిళ్ళిస్తారు.

పు—మీ కేమో ఆటగా వుందేనయ్యా!

రా-దా—దిగులుపడితే తప్పుతుందా? మన మంతా ఖైదుకు పోవడానికి తయారైందేకా? నీవుకర్ణిస్తివికూడాను మాలక్ష్మీ! మనకు యీ సాయంత్రంనుంచీ రాజుగారిభోజనమే.

పు—మన ఆడవాండనుకూడా చేర్చేరా?

మా—చేరిస్తే యేచిక్కూ లేకుండాపోను. చేర్చకపోతే (అనిపడిపోయింది)

జోతి వచ్చి పట్టుకొని విసిరింది. రామదాసు చన్నీళ్లు దెచ్చి ముఖాన చిలకరించాడు. కాస్త తెప్పిరిల్లి కండ్లుదెరిచి చూచి మళ్లీ దుఃఖం తెరగా వచ్చి జోతిచేతిలోకి వొరిగింది.

జో—(కొంగుతో విసురుతూ) అయ్యా! అమ్మ బతికేనా?

రా-దా—యేమీ పరవాలేదమ్మా! వూరికే భ్రమ వచ్చింది వట్టిజాలిపేగులది!

మాలక్ష్మి—(కాస్త తిప్పుకొని) నీవు ఖైదులోకి పోయి మళ్లీ నాకు దక్కా!

రా-దా—ఆభయం నీకేమీవద్దు యింకా పదేండ్లదాకా రాళ్లబొడిచినానాకు చావు లేదు. నాకు జాతకం నామేనమామ వ్రాశాడు. అక్షరం తప్పకుండా జరుగుతున్నది.

మా—నీకండ్లయెదుట పోయేభాగ్యం నాకు వున్నదా?

రా-దా—నీవు అదృష్టవంతురాలవు. ముత్తైదువుగా వెళ్లిపోతావు.

మా—యిక నాకు కావలసిన దేమున్నది? పెద్దపిల్లవాణ్ణి చూచేనా?

రా-దా—పెద్దపిల్లవాడిచేతిలో పోయేప్రాప్తం నాకు లేదు. రంగడికి ముందు మంచిరోజులు వస్తవి.

మా—యెంతవరకు ప్రాప్తమో అంత!

రా-దా—నీవుకూడా ప్రయాణం కట్టు. పుల్లయ్యా! మీవాళ్లను చేర్చకపోతే యెవరిద్వారానైనా మావూరికి కబురంపేవీలు చూడు. రేపెల్లైనా గుంటూరులో గుప్పుమనకమానదు. నాయుడుగారు వినంగానే పరుగెత్తుకొని రానేవస్తారు. అన్నిటికీ ఆయనదే భారం. నాకు చింత వొక్కటే; అప్పుడీసంగతి వింటే చేతికి వచ్చేది అబద్ధం.

మా—నీవు లేచి కాస్త యెంగిలిపడు. యీయోచన బాగానేవున్నది, అంతా భోజనానికి లెండి పుల్లయ్యా! నీవుకూడా లేవరాదూ? మీయింట్లో హాజరుగా వున్నదో లేదో!

పు—వున్నది. పనికి పోదామని మధ్యాహ్నానికికూడా వండారు. మావాళ్లకు కబురుచెప్పి నేనూ తయారవుతాను.

రా-దా—అమ్మా! జోతీ! నీవు నాదగ్గిర అన్నానికి కూర్చుందువుగాని రా. వాండ్లు యేమిక్రొంతెరువం చేస్తారో? మనను విడదీస్తారేమో? కలిపివుంచారా అదృష్టవంతులమే. రంగడూ అమ్మదగ్గిర కూర్చో జోతీ! నావంక చూడు. యెందు కేడుస్తావు? హృదయదౌర్బల్యం పనికిరాదు ధైర్యంగా వుండు తిను నేకలిపేనముద్ద తిను. నాకు సంతానంవల్ల దుఃఖం సంభవించినా అగౌరవంమాత్రం కలుగలేదు. యెక్కడవున్నా హృదయానందం అనుభవించగలవు. యెబ్బే! యేడుస్తారూ, అట్లా (అంటూ పమిటె పైకి లాగాడు.)

జో—మీరు నాకు మళ్లీ కనబడతారా?

రా-దా—అమ్మా! అది పెద్దప్రశ్న ప్రస్తుతం మనకంతవిషయమీవిచారంలో పనిలేకపోయినా యిదివరకు మనకు యెన్నిలక్షలు జన్మలు అయినవో తెలియదుగదా! యికముందు యెన్ని కావలసివున్నవో! యెందరు తలిదండ్రులో, యెందరు భార్యాభర్తలో యెందరు పిల్లలో లెక్కించడం సాధ్యమవుతుందా?

జో—యీవిషయం నాకు చాలా కాలంనుంచి సందేహంగా వున్నది. నిన్నటిదాకా దానికి ప్రమేయము దొరకలేదు. 'యిదివరకు యెందరు తలిదండ్రులు, యెందరు భార్యాభర్తలు, యెందరు బిడ్డలు, యెందరు స్నేహితులు అయినారో' ననే చింతతో నా శేముషి అనేసిద్ధాంతం ఆముష్మిక ప్రేమను మూలమైన కుటుంబప్రేమను పూర్తిగా ఛేదిస్తున్నది.

రా-దా—కుటుంబప్రేమ ఆముష్మిక ప్రేమకు మూలమా?

జో—కానియ్యి. ఆముష్మిక ప్రేమే మూలం. ఆ అశ్వత్థం, అవ్యఘోషం అతి పరివ్యక్తమై కుటుంబప్రేమగా వికసించింది. వికసించిన ప్రేమకు వినాశ మెట్లా గలుగుతుంది? గుణపరిణామసిద్ధాంతంయొక్క ప్రయోజనమే పోయిందే! తరులతాగుల్మములు వికసించినట్లు ప్రేమ వికసించి పోతుందా?

రా-దా—చరాచరములైన సకలభూతాలకూ ఆయాజన్మలలో సమకూరినకర్మఫలం జన్మాంతరమందు సంచితములో చేరుతుంది.

జో—లేక, జీవునియందు జిలించి సంస్కారరూపంగా వుంటుంది.

రా-దా—అది వొక అభిప్రాయం.

జో—అట్లయితే కర్మసన్న్యాసంవలన మోక్షమనేసిద్ధాంతం నాకు పనికిరాదు కర్మరాహిత్య మనగా దుష్కర్మరాహిత్య మనే అర్థం. బహుజన్మాలవలన దుష్కర్మరహితమై సుగుణరాశి కావడమే పరమావధి ఈవూహప్రకారం సృష్టి మాయగాని భ్రాంతిగాని కాదు. సుగుణముల పెంచడాని కేర్పడ్డకర్మక్షేత్రం ఆనందమే ఫలం కష్టసుఖాలరెంటికీ ఆనందం పెంచడమే గమ్యస్థానం. యిహపరలోకాలు రెండూ బృందావనాలే. రెంటియందూ ప్రేమేరాజ్యం చేస్తుంటుంది. వింటున్నావా?

రా-దా—కానియ్యవే అమ్మా! వినడానికి ఆనందంగా వున్నది.

జో—అవును పిల్లలమాటలు తల్లిదండ్రులకు ఆనందంగా వుంటవి. ఆనందంగా వుండకపోతేమట్టుకు పిల్లలు చెప్పకుండా వూరుకుంటారా? విను.

రా-దా—వింటూనేవున్నానే. నీవు చేప్పేసంగతులు వినడమేకాకుండా ఆలోచించవలసివస్తున్నవి అందువల్ల పరధ్యానంగా వున్నట్టు కనబడుతున్నా.

జో—యథార్థం యెట్లా వున్నా కోట్లకొలది తల్లిదండ్రులూ, భర్తలూ, భార్యలూ వుండడం నాకు అసహ్యంగా వున్నది. నేనొకమాట చెప్పనా? నీవూ ఆకూర్చున్న అమ్మీ యెన్నిజన్మాలకైనా అయ్యా అమ్మలు కావడమే నాకిష్టం. నేను బిడ్డను కావడం మీకిష్ట మవునా? కాదా?

రా-దా—నాకు ముద్దుపెట్టవే అమ్మా!

జో—నేనంటే ఆ అమ్మికి యిష్టం కాదుకాంవాలె. బుద్ధిమంతురాలుగా కూర్చున్నది.

మా—అమ్మా! నాకు నోరు రావడంలేదే (అని పెద్దపెట్టున యేడ్చింది)

జోతి తల్లిని కావలించుకొన్నది. యెందు కని వొకరి నొకరు అడగలేదు.

రా-దా— అమ్మా! యింకా చెప్పు మీవంటిపండితులు జన్మజన్మాలా మాబోటి దరిద్రులకు పుట్టకపోతే భాగ్యవంతులకు బుట్టవలె నని కోరుకోరాదూ?

జో—నేను మంచికర్మ చేస్తేకదా భాగ్యవంతులకు బిడ్డగా యింకొకజన్మలో పుట్టడం అట్లయితే నామంచికర్మవల్ల నీవే కోటీశ్వరుడవై నీకే బిడ్డను కావలె నని కోరుకోవడం నాకు యెక్కువయిష్టం.

రా-దా—వొప్పుకున్నా.

జో—తల్లి సగంవియ్యవురా లన్నారు. నీకు యింకొకరిని చేసుకోవలె నని వున్న దేమో చెప్పవే!

మా—అయ్యో! పిల్లా! యేమిపోకిళ్ళు పోతావే! వొకపంట నవ్వూ, వొకపంట ఏడుపూగా వున్నది నాపని. మీఅయ్యకు యింకొకరిని చేసుకోవలె నని వున్న దేమో అడుగు.

రా—ముందు తన నడిగితే నన్ను చెప్పమనడం యెందుకు? అదంతా యెందుకు గాని యెప్పుడూ నీవు మాఅమ్మవుగా వుండవలసిందే.

జో—అయితే జన్మ కొకరిని ప్రేమించడమంటే బంధుజాలం యావత్తూ మారకుండా వుండి ప్రతివాడికీ పూర్వజ్ఞానం మంటూవుంటే బాగుండదా?

రా-దా—యీజన్మలో వొకరికి బిడ్డగా పుట్టినవాడు మళ్లీ అతనికే బిడ్డగా పుట్టిన ప్రయోజన మేమిటి?

జో—యింకొకడికి పుట్టినందువల్ల యెంత ప్రయోజనమో మళ్లీ ఆతల్లిదండ్రులకు బుట్టినా అంతే ప్రయోజనం. సుగుణాలు వృద్ధిపరుచుకొని దుర్గుణాలు పోగొట్టుకోవడమే జన్మయొక్క పరమార్థం. కాబట్టి యిప్పటిబాంధవ్యాలు ప్రేమవృక్షం పెంపుచెందడానికి కారణ మవుతూ దుర్గుణాలు నశించి సుగుణపుంజములకు స్థానాలై నిత్యలీలావిభూతిలో పాల్గొంటూ బృందావనంలో వుండడం నీకిష్టమేనా?

పోలీసులూ, పాలు పుల్లప్పను బేడీలతో తీసుకొనివచ్చి మాలక్ష్మినీ, రామదాసునూ "లేచి వాకిట్లోకి ర"మ్మన్నారు. వాండ్లు మెదలకుండా బయటికి రాంగానే "మీమీద క్రిమినల్ కేసు వచ్చింది మిమ్మలను అరెస్టు చేసి గుంటూరు తీసుకొనిపోవడానికి వచ్చాం" అన్నారు.

రా-దా—మామీద కేసు యేమని?

పో—అదంతా విచారణలో తెలుస్తుంది.

పు—అక్షరాలా మీరు చెప్పినట్లే బనాయించారు.

రా-దా—పిల్లలు మావెంట రావచ్చునా?

పో—నీకూతురు సెటిల్మెంటులెక్క దాఖలా యిక్కడ నివాసురాలు. కనుక ఆది రావడానికి వీలులేదు. కాబట్టితే పిల్లవాడిని జైలులో మీతో వుంచుకోవచ్చు.

రా-దా—మాతోపాటు వాడికి కారాగృహవాస మెందుకు? ఆయువ్యముంటే స్వతంత్రుడై బతుకుతాడు. మాలక్ష్మీ! చిక్కాం మనమిద్దరం చివరకు. సద్గురూ! నడువు!

పో—నీకు బేడీలు వెయ్యనియ్యి.

రా-దా—వెయ్యండి.

పో—యిక పదండి.

జోతి యేడుస్తూ కావలించుకోవచ్చింది. పోలీసులు నెట్టారు.

జో—నన్నీ అడవిలో వదిలిపెట్టి పోతున్నావటే!

మా—భగవంతుడే రక్షకుడు.

రా-దా—శ్రీకృష్ణుడు నిన్ను రక్షిస్తాడు. అతడే శరణాగతి.

మా—మా అమ్మా! జోతీ! రంగణ్ణి కాపాడు.

రం—అమ్మా! నే వుండను.

మా—పట్టుకో వాణ్ణి.

రా-దా—అమ్మా! గారవం కాపాడు మని నీకు చెప్పనవసరం లేదు.

జో—చెప్పనవసరం లేదు. లేదు. లేనేలేదు.

పుల్లప్పభార్యా, తల్లీ రామదాసుగుడిసెదగ్గర ఆగారు. గోలపెట్టి యేడ్చే రంగణ్ణి జోతి పట్టుకొని నిలువబడ్డది.

పోలీసులూ, పాలూ, ముద్దాయిలూ రైలుస్టేషనుకు పోయినారు. మూడుగంటలకు గుంటూరులో దిగి డిప్యూటీమేజస్ట్రేటుకోర్టుకు పోయినారు. సబుయిన్స్పెక్టరూ, ముద్దాయిలూ ఆరోజుమధ్యాహ్నం సెటిల్మెంటు విడిచి పారిపోయినారని

పోలీసువారికి తెలిసి పోలుతో సహాముద్దాయీల వెంటబడి తాడేపల్లి కాపురస్థుడు రామిరెడ్డి చేనిదగ్గిర పట్టుకున్నామని సి. టి. ఆక్టుక్రింద చార్జిషీటు దాఖలుచేసి ముద్దాయీలను హాజరుపెట్టారు.

మే—యెన్నిరోజులు రిమాండు కావాలె?

పు—మాకు జామీను యిప్పించండి.

మే—మీకు జామీ నేమున్నది? యిదివరకే సెటిల్మెంటులో నిర్బంధంలో నే వుంటిరి.

యి—సాక్షులు యిప్పుడే హాజరుగా వున్నారు. ఈరోజే విచారించవచ్చు.

మే—ముద్దాయీలకు కష్టం లేకుండా సాక్షుల నందరినీ యినస్పెక్టరుగారు యిప్పుడే హాజరుపెట్టారు. కేసు తొందరగా ఫయిసలు అయితే మీకే మంచిది.

పు—ప్లీడరును పెట్టుకుంటాం. వాయిదా యిప్పించండి.

మే—మీ సెటిల్మెంటువాండ్లు పీడరును పెట్టుకోగల భాగ్యవంతులా?

కోర్టులో హాజరుగావున్న వొకప్లీడరు-సెటిల్మెంటుచుట్టూ చోరీలు బలమైనవి. ఆస్తికొసేవాండ్లు వీళ్ళ వెంట వచ్చివుండాలే. వాండ్లే అన్నీ యేర్పాట్లుచేస్తారు.

పు—ఆ ఆస్తి మీప్లీడర్లకుకూడా కొంత చెందుతున్నదిగా!

మే—వీ డెవడో గడుసువాడండీ!

ప్లీ—యిదివర కెన్నిశిక్షలుపడ్డవో?

మే—వీరు కోర్టులో హాజరుగా వున్నారుగా! వీరిని పెట్టుకోరాదా? కేసు యివ్వాళనే పరిష్కార మవుతుంది.

పు—అయ్యా! వారు మాకు వద్దు. కొని తెచ్చుకోవడ మవుతుంది.

రా-దా—వా రెవరో మే మెరగమండి.

మే—రేపటికి తెచ్చుకోండి. వాయిదా వేస్తా.

ముద్దాయీలు—చిత్తం.

---

పదునేడవ అధ్యాయం

# వానప్రస్థం

డిప్యూటీకలెక్టరాఫీసునుంచి ముగ్గురుముద్దాయీలనూ సబుజయిలుకు తీసుకొని పోతున్నారు. దారిలో యెవరైనా మంగళాపురపువాండ్లు కనబడతారేమో నని చూచాడు. యేవరూ కనబడలేదు. లాయరు మేడదగ్గిర నారాయణరావుగారిగుమాస్తా యెదురుపడితే పంతులుగా రున్నారా అని అడిగాడు. అందుకు వారు "సత్తెనపల్లి క్రిమినల్ కేసునిమిత్తం వెళ్ళారు. యెనిమిదిఘంటలరైలుకు రావలె. వస్తే వుదయం తప్పకుండా పదిగంటలలోగా సబుజయిలుకు వచ్చేటట్టు చేస్తా"నని చెప్పేరు. ఆయన గారు రాకపోతే యింకొకరిని యేర్పాటు చేయమని చెప్పబోయినాడు గాని "అయిదు గంటలైనది. క్రిమినలు కేసును కాగితాలు దాఖలుచేయవలె" నని వెళ్ళిపోయినాడు,

రామదాను జయిలులో అడుగుపెట్టేవరకు రాం రాం అని అయిదుగంటలు కొట్టారు. అందుకు సంతోషించి వార్డరును బతిమాలుకొని ఒకరూపాయి యిచ్చి కూలిమనిషిని యేర్పాటుచేసి మంగళాపురం కబురుపంపాడు. వార్డరుతో మాట్లాడవలెనని అప్పుడే సబుజయిలుకు వచ్చినపోలు అనుమానపడి కూలిమనిషి వెంబడే అతనియింటికి వెళ్ళాడు.

పో—బెజవాడ పోవడానికి యెవరైనా మనిషి దొరుకుతాడా?

కూ—మంగళాపురం పోవడానికి యిప్పుడే కూలికి వొప్పుకొన్నా. యెనిమిది గంటల రైలుకు పోతున్నా.

పో—యే మాత్రం కూలి తీసుకుంటూరు బెజవాడకు?

కూ—మంగళాపురానికి ఖర్చులతో సహా రూపాయికి వొప్పుకొన్నా.

పో—నాకు బెజవాడకు పొయ్యే మనిషి నేర్పరుచు, రెండురూపాయి లిస్తా పొద్దున యెనిమిదిగంటలకు రావచ్చు. ఖర్చులుపోను రూపాయున్నర మిగులుతుంది.

కూ—అయ్యో! మిగలా వొప్పుకొంటినే ఆం—యేమంటారు?

పో—పొద్దున యెనిమిదిగంటలకు సరాసరి రైలుమీదనే మంగళాపురం పోదువుగాని రెండుకూలిభత్యాలూ నీకే దక్కుతవి. నావుత్తరం తీసికొనిపోవలసిన మనిషి స్టేషన్‌దగ్గర మార్వాడీసత్రంలోనే వుంటాడు. పోయి అక్కడ పడుకో. తెల్లవారేవరకు అక్కడికి వస్తాడు. రాంగనే అయన కిచ్చి రైలుపరా.

కూ—నాకు రైలు అందుతుందా?

పో—అందకేమి? నాలుగుగళ్లపొద్దెక్కిగాని బండి బయలుదేరదు. తిరుగు జవాబు తెచ్చావా అంటే రూపాయి బహుమతి యిస్తా. నాది చాలా అవసరమైన పని అన్నం దిని రైలుకు బయలుదేరు. నేను రైలుదాకా వచ్చి యెక్కిస్తా.

కూ—సరే.

కూలిమనిషిని యేర్పాటు చేసుకొన్నతరువాత రామదానుకు ధైర్యం వచ్చింది. అతనినీ; పుల్లప్పనూ, మరి నలుగురు యెరుకలవాండ్లనూ కలిపి వొకగదిలో వేశారు. మాలక్ష్మి నొక్కదానినీ వేరేగదిలో వేశారు. అందరికీ ముంతలూ, అన్నపుమల్లలూ యిచ్చారు జొన్నన్నపుముద్దా, చప్పని పులుసుకూరా భోజనం పెట్టారు. పుల్లప్ప తినడం చూచి తన కిచ్చినపడి యావత్తూ తిన్నాడు. మాలక్ష్మి వొంటరిది గావడంచేత తినలేకపోయింది లఘుగురుసంకిల నివర్తికోసం రెండుమల్లలూ, పడుకోవడానికి కొబ్బరినారచాపా, గొంగడీ ప్రతివాళ్లకూయిచ్చారు. భోజనం కావడంతోటే కొట్లో పెట్టి తాళంవేశారు. ఖైదీ లందరూ కాసేపు లోకాభిరామాయణాలు చెప్పుకొని చీకటిపడంగానే చుట్టలు ముట్టించారు. కొందరికి పొగాకు వార్డరే తెచ్చియిచ్చాడు. పుల్లప్పబొడ్డులో దాచుకున్న కానీపెట్టి వొక పొగాకుతుంపు కొనుక్కొని నోట్లో వేసుకున్నాడు. గది పొగతో నిండి రామదానుకు కొరపోయింది. చుట్టలు గాల్చినతర్వాత కొందరు సంగీతాలు మొదలుపెట్టి బూతుపాటలు సాగించారు. వొకడు తాను జేసినదొంగతనా లన్నీ వర్ణిస్తున్నాడు. రామదానుగదిలో వున్న యెరుకలవాండ్లు వొకరిపొగా కొకరు దొంగలించుకొని కొట్టుకున్నారు. సంగీతాలు పూర్తి అయ్యేవరకు పదిగంట లయింది. మధ్యమధ్య పోలీసులు వచ్చి అదమాయించారు గాని వాళ్లమాట లెవ్వరూ లక్ష్యపెట్లలేదు.

అందరూ పుచ్చుమల్లలు నింపి క్రమక్రమంగా నిద్రపోయినారు. గది యెరుకలవాండ్ల వొంటికంపూ, మూత్రపుకంపూ, పొగకంపూ గలిసి రామదాసుకు దుస్సహమైంది. పుల్లప్పమాత్రం తొమ్మిదిగంటలకల్లా నిద్రపోయినాడు. "వుత్తరం మంగళాపురం చేరివుంటుందేమో? అప్పాదాసుకు యెట్లా వున్నదో? జోతీ పిల్లవాడూ పస్తుపడు కున్నారేమో? యింకా యేమిఅల్లరులు జరుగుతున్నవో? సెటిల్మెంటులో జనం అంతా భయపడ్డారేమో!" అని కలగలుపులుగా ఆలోచనలు వస్తూవుంటే యోచించు కుంటూ ౧౨ గంటలవరకూ నిద్రపోలేదు. వొంటిగంట వినబడ్డది. దోమలు కుట్టు తుంటే గొంగడీ కప్పుకున్నాడు. మఖాన కుట్టడం ప్రారంభించినవి. గొంగడీ ముఖాన తప్పుకోవడానికి చాలలేదు. వత్తిగిలి ముడుచుకొని పడుకుంటే చెమట ప్రారంభిం చింది. గొంగడీ యెన్నాళ్లనుంచూ యెంతమందో కప్పుకున్నారు. యెన్నడూ వుతికినపాపాన పోలేదు. గిళలో ముంచితే వున్ని అంతా వూడిపోతుంది. రాలిపోతున్న బొచ్చు ఘాటుకంపుతో నోట్లో ముక్కులో జొరబడుతున్నది. గది కొక్కూడా గాలివచ్చేవైపు కిటికీలు లేవు. చేతుల కందకుండా కప్పుకు ఆనుకొనివున్న చిన్న కిటికీని జల్లెడరేకుతో మూశారు. వాకిటిదగ్గరకు జవాను వచ్చి లోప శపరో మేలు కొన్నసడి విని గోడకు రంధ్రం చేస్తున్నారేమో అని చేలాంతరువెలుతురున పరీ క్షించి అందరినీ లెక్కపెట్టుకున్నాడు. సర్కారుపడిప్రకారం కూరలో నువ్వులనూనె పోయడంచేత రామదాసుకు కడుపులో కళపెళ్లాడడం మొదలుపెట్టింది. నూనె తిరుగు మోతలో వెయ్యవలసినా పచ్చినూనే పోశారు. బహిర్భూమికి పోవలసివచ్చి తన మల్లలు దేవులాడుకున్నాడు. మూత్రపుమల్లలో చెయి పడ్డది. దానిధర్మాన నీళ్ల ముంత బోరపడలేదు. ప్రక్షాళన పైనతర్వాత మిగిలినసీళ్లు తాగడం యింకా అల వాటు కాలేదు. వుక్కకు దప్పికై నిలవలేక ఆనీళ్లే తాగాడు. కక్కనుమల్ల యెత్తుగా వుండటంవల్ల కూర్చోవటం కష్టమై నేలకు చేతు లానించి వొంగున్నాడు. ప్రక్షా ళనం చేసుకోబేతే మడుగుపడ్డది. అందరూ కడుక్కుంటే గది వరదగటుతుందేమో అనుకుంటే తక్కినవాళు వట్టిముంతలే తెచ్చి లోపల బెట్టుకున్నట్టు జ్ఞాపకంవచ్చింది. యెవరినీ నీళ్లు తెచ్చుకోనియ్యలేదు. నీళ్లగంగాళం వొట్టిదికూడా అయింది. గదిలో వాసన వ్యాపించకుండా వొకమల్లమీద రెండవది మూతపెడదాం అనుకుంటే వొకటి చిన్నదై దూరిపోయింది. పెద్దది మూతపెడితే డొర్లి గది కళ్మలం అవుతుందేమో అని తెరిచేవుంచాడు. తెలవారుజాముకు దోమలపోడు కొంచె మణిగి కూరుకుపట్టింది. ౪ గంటలైంది. వొకరితర్వాత వొకరు అందరూ అనుమానం తీర్చుకోవడం ప్రారం భించారు. యేవరూ నీళ్లుపయోగించినట్టు కనబడలేదు. ౧౫ చిప్పలలోనుంచీ దుర్గంధం రేగింది. సార్జంటు వుదయం అందరినీ లెక్కపెట్టుకోవడంకోసం వచ్చి ముక్కుకు గుడ్డ అడ్డం పెట్టుకొని చేలాంతరుపెట్టి అందరినీ వుండచూచుకున్నాడు. లాంతరువెలు తురున ౬౦ మళ్ల బరువుగల యినపతలుపు పుల్లప్పచేసిన జైలువర్ణనను జ్ఞాపకానికి తెచ్చింది. గది పరజూశాడు. కడపరాళ్ళు, సున్నంతో బిగించిన రాతిగోడలమీద రేకుతనాబీలు, గుంటూరులో యేభాగ్యవంతునిభవనానికీ అంతచక్కగా అమర్చ లేదు. అవి చూచి రామదాసుకు సంతోషం కలుగలేదు. ఆరుగంటలు కొట్టంగనే తలుపులు దీసి అందరినీ బయటికి రమ్మన్నారు. అందరూ మూత్రపురీషపాత్రలు

తీసుకొని బయలుదేరుతుంటే పిచ్చుకత్తులు, తుపాకులూ తీసుకొని జవానులు కాపలాకు వెంటవస్తున్నారు. రామదాసుకు నవ్వువచ్చింది.

రా—అయ్యా! ఖజానాపెట్టెలకుకూడా యింద బందోబస్తుగా కాపలా చెయ్యరే! ఈమల్లలకు పిచ్చుకత్తులపారా లెందుకండి?

పు—వాటికోసం కాదు. మనం పరుగెత్తిపోతా మని భయం.

అందరూ పాకీదొడ్డిదగ్గర దింపారు. అందరినీ పాకీదొడ్డోకి పొమ్మన్నారు. రామదాసు "నేను ముంత తెచ్చుకోలేదు బహిర్భూమి కెట్లా పోవడం?" అన్నాడు. "మాలపోతుకు నీళ్ళు కావలసివచ్చిందా?" అనిపోలీసువాడు తుపాకీమడి మెతో పొడవ వచ్చాడు. వొకరెరుకలవాడు "యీమాలనాయుడికీ కొట్లోపడ్డా నీళ్లు కావలసి వచ్చిం" దని యెగతాళి చేశాడు. అందరూ వొకఆవరణంలోకి పోయినారు. లజ్జా రహితులై వొకరిబుజాల కొకరు ఆనుకొని కూర్చున్నారు. రామదాసుకు మనసొప్పలేదు పూరిక నిలువబడ్డాడు. నీళ్లుకూడా లేకపోవడంచేత పూరకుందా మనుకున్నాడు. అందరూ "నాయుడుగారు నిలుచున్నారే!" అని యగతాళిచేశారు.

నాలుగైదునిమిషా లయింది. బయటనుంచి పోలీసులు "లెండి" అని వుత్తరు చేశారు. అందరూ లేచి బయటికి వచ్చారు "లోపలికి బోయి ముంతలూ, బువ్వ మల్లలు తెచ్చుకోను పదండి" అని వుత్తరు వయింది. అందరూ తెచ్చుకొని బొగ్గుపొడి పెట్టి కొందరు పండ్లు తోముకున్నారు తలా ముంతెడునీ ళ్ళిచ్చారు. రామదాసు బొగ్గునూరుకుండేవరకు గంజికి రమ్మన్నారు. మొగం కడుక్కుంటూ ఆలస్యం చేశాడని పోలీసువాడు తుపాకిమడి మెత్తాడు. నిన్నటిపోటుకు గూడమీదకట్టిన కదుం యింకా పోలేదు. లేచి నలుగురితో పరుగెత్తాడు అందరూ గంజి పోయించుకొని తాగడానికి కూర్చున్నారు. రామదాసు నోటిలో వేసుకున్న బొగ్గు పోవడంకోసం నోట్లో నీళ్ళు పోసుకొని "దూరంగా బోయి వుమ్మివేచి రావచ్చునా?" అని పక్కన కూర్చున్న పుల్లప్ప నడిగాడు. లైను వదలగూడ దని అత దన్నాడు. అందువల్ల మెల్లగా కింద వుమ్మివేసేవరకు పక్కనుంచి వార్డరు చూచి అన్నం దినేచోట గలీజా చేస్తున్నా వని ప్రహరించాడు. అందరితోపాటు గంజితాగడం ముగించడానికి తొరగా తాగేవరకు కొరమారింది. అంతా మలలు కడుక్కొని మిగుల్చుకున్న నీళ్ళు దీసికొని కొట్లల్లోకి నడిచారు. తాళాలువేసి పోలీసులు విశ్రాంతి తీసుకుంటున్నారు. పోలీసుహడావిడి అణిగినతరువాత రామదాసుకు స్వస్థచిత్తం గలిగింది! పుల్లప్ప ఖైదులో అనుభవం గలిగినవాడుగనుక వార్డరును పనివున్నవాడివలె పిలిచి "నారాయణరావుగారు అనేప్లీడరుగారు వచ్చారా?" అని అడిగాడు.

వార్డరు—వారు యిప్పు డెందుకు వస్తారు? కేసు లుంటే మేజస్ట్రీటుగారు వచ్చినతరువాతగాని రారు.

రా—వారిని ప్లీడరుగా కుదుర్చుకోవలెనంటే యేమిచెయ్యాలె?

వా—పందరూపాయి లిట్టియ్యి, నేగుదిర్చిపెడతా.

రా—మీరు పంపినమన్షి వస్తేగా?

వా—మరి ప్లీడరు మాటలతో వస్తాడా?

రా—నారాయణరావుపంతులుగారు నన్నెరుగు. నే నీఅవస్థలో వున్నానంటే తప్పకుండా వస్తారు. అన్నిటికీ నేను సమర్పకం చెప్పుకుంటా

పు—నేను బయటికి పోతే మీ రంతా పస్తుపడుకోవాలె, మీవాండ్లకు మనిషిని పంపించావుగదా. వాండ్లు వస్తే వాండ్లే మాటాడుతారు. లేకపోతే పెద్దమనుష్యుల నెందుకు శమపెట్టడం? ఒకగంటలో రైలుకూడా వసుంది.

రామదాసు తనచాపమీద యేదో ఆలాపనగా కూర్చుని యేమితోచక పడుకొని నిద్రపోయినాడు రాత్రి నిద్రలేకపోవడంచేత బాగా నిద్రపట్టింది. కొంతసేపటికి లేచి "పులప్పా! రైలు వచ్చిందా? అని అడిగాడు.

పు—యే రైలు?

రా—పడమటినుంచి యెనిమిదిగంటలకు వచ్చేరైలు.

పు—యీపాటికి బెజవాడ పోయివుటుంది.

రా—నాకోసం యేవరూ రాలేదా?

యెరుకలవాండ్లు—గొప్పవుద్యోగస్థు లంతా "మాలనాయుడుగా రున్నారా?" అని అడిగితే వారు నిద్రపోతున్నా రనీ, లేపడానికి వీలు లేదనీ చెప్పాం. మళ్లీవస్తామని వెళ్లారు.

రా—యెందుకయ్యా అయినదానికీ, కానిదానికీ నన్ను మీరు యెద్దేవచేస్తారు?

యెరు—కాకపోతే మాలపోతుకు నీ కీపోకి ళ్లేమిటి? యెవరో మహా నీకోసం వచ్చేటట్టు వారు వచ్చారా వీరు వచ్చారా అని పస్తెలు వేస్తుంటావు. అంతా నిన్ను జూచి బెమిసిపడుతున్నా రనుకున్నావా?

రామదాసుకు నాయుడుగారు రావడంవిషయమై అదుర్దా పోయి మనస్సుఆత్మ పరీక్షలో మగ్నమైంది "యీ యెలుకలవాండ్లు నే నిక్కడికి వచ్చినప్పటినుంచీఅకారణంగా నామీద కంటుగా వున్నారు. నన్ను జూచి హేళనగా మాట్లాడుతారు. నిందాస్పదమైనవిషయం నాలో యేదో వాండ్లకు కనబడుతున్నది, మహోద్యమాలతో నాకు సంబంధం వుండడంవల్ల తద్వారా పెద్దవాండ్లతో నాకు పరిచయం గలుగుతున్నది. నేను నాస్థితిగతులనుబట్టి వారిస్నేహానికి అనర్హుడనైనా, నాకులభించిన వుత్తమపురుష సాహచర్యంవల్ల నేను గర్వించి ఆగర్వాన్ని నామాటలలోనూ, చర్యలలోనూ నిశ్చయంగా కనబరుస్తుండబట్టే భగవంతుడు నన్ను బాగుచేయడంకోసం యెరుకల ద్వారా యెరుక గలిగించాడు. ఇక నాయుడుగారు వచ్చేవిషయం నేను యోచించను. వా రెందుకు రావాలె? లేనిస్తానిశ్రమ వారి కెందుకు? యింతవరకూ నా కాత్మపారిశుధ్యం రాలేదు. నేను కర్మ సాపేక్షకంగా చేస్తున్నా గాని సంగరహితుణ్ణి గాలేదు. నాతో జోతినీ, రంగణ్ణీ దేవుడు విడదీశాడు నిస్సంగత్వం యింకా నాకు కుదరదా? ప్రపంచంతో నా కింకా యేమి సంబంధం వున్నది? అయితే సన్న్యాసానికి నే నర్హుడనా? మాలక్ష్మి సెటిలుమెంటులో వుండక యిక్కడికెందుకు వచ్చింది? యింకా కొంతకాలం వానప్రస్థుణ్ణిగా వుండవలసివున్నదేమో! గార్హస్థ్యానికీ, సన్న్యాసానికీ మధ్యవొక మెట్టు వున్నది. యీ మెట్టుదాటేరోజులు నా కింకా రాలేదు. కాని యీరోజునుంచీ వానప్రస్థుడనే కాకాగృహవాసం వనవాసానికి బదులుగా వచ్చింది, ఆహా! భగవానుడా! యేమి నీ అద్భుతచర్య! నీబిడ్డల

వర్తన యెంత చక్కటిమార్గాల దిద్దుతావు! పైకి ఆపదలమోస్తరుగా తెచ్చి పెట్టివాటిని మహావరములుగా మారుస్తావు."

రామదాసు యీఅవస్థలో వుండగా పులప్ప యెరుకలతో రామదాసుచరిత్ర చెప్పాడు. యెరుకలవాండ్లు స్టూవర్టుపురం సెటిల్ మెంటులో వుండేవాండ్లు తప్పించుకొనిపోయిన ఆరునెలలకు కర్నూలుజిలా నల్లమలలో తక్కెళ్లజగ్గడిగుంపుతో జేరి చోరీలు చేస్తూ పట్టుపడ్డారు. నేరాలు చేసినట్టు సాక్ష్యం గుదరక సెటిల్మెంటులోనుంచి తప్పించుకుని పోయినందుకు విచారణ జరుగుతున్నది. వాండ్లు రెండునెలలనుంచీ రిమాండులో వున్నారు. యిప్పటికి విచారణ పూరికాలేదు. యీయేడుగురిలోనాయకుడు జగ్గడిని స్వయంగా యెరిగినవాడు వాడిచర్యలన్నీ రెండునెలలనుంచీ ఖైదీలకూ, పోలీసులకూ వర్ణించిచెప్పుతున్నాడు వాడికి తోచినసంగతులు చెప్పడంతప్ప జగ్గడిని గురించి యితరు లడిగినప్రశ్నలకు జవాబు చెప్పడు. యెంతసేపూ అతణ్ణిపొగడడంతప్ప జాడాలు తనకు తెలియవంటాడు. రామదాసు దిగువతరగతులకోసం పని చేసేవాడనీ సెటిల్ మెంటు వాస్తవ్యుల కష్టాలు నివారించడంకోసం పని చేస్తూ ఖైదుపాలైనాడనీ తెలిసి యెరుకులు తమ రాయనను వ్యాఖ్యానం చేసినందుకు చింతపడ్డారు. పదిగంట లయింది. భోజనంకోసం గంట కొట్టారు రామదాసు యింకా తనధోరణిలోనే వున్నాడు.

పు—రామదాసుగారూ! భోజనానికి వేళయింది.

రా—అట్లాగా, లేతాం యేదో పరధ్యానంగా వున్నా

ఎరు—(సాగిలపడి)—సామీ! తెలియక తప్పుచేశాం. యీతప్పు గాయి సామీ! (అని చెంపలు వేసుకుంటున్నారు.)

రా—నాయనా! మీ రేమీ తప్పు చేయలేదే? మీరు నాకు గురువులు. మీరు నమస్కారం చేయగూడదు.

ఎ—సామీ! యీతప్పు కాచానంటేనే లేస్తాం. లేకపోతే బువ్వలేకుండా యెన్నాళ్లయినా యిట్లాగే వటిస్తాం

వార్డరూ పోలీసులూ వచ్చి తలుపులు తీశారు. యీదృశ్యం చూచి విభ్రాంతి పడిపోయినారు. రామదాసు తెల్లపోయి గాబరాపడుతున్నాడు.

వార్డరు—ఏమి టిది?

పు—అమహానుభావుణ్ణి హేళనచేసి తప్పు తెలుసుకొని పశ్చాత్తాపపడి తప్పు గాచ మని వేడుకొంటున్నారు.

వార్డరు—చూడూ వాండ్ల మోటుభక్తి? యీయన యెవరు?

పు—మంగళాపురం. రామదాసుగా రని, మహాజ్ఞాని,

వార్డరు—సంగదాసతండ్రా యేమి?

పు—అదేమో నాకు తెలియదు.

వార్డరు—అడుగు. ఆయనా దుఃఖపడుతున్నారే!

పు—వాండపశ్చాత్తాపం చూసి ఆయనకూ ఆశ్చర్యంవేసింది. ఆ నీళ్లు ఆనందంచేత. అయ్యా రామదాసుగారూ! సంగదాసుగారుట మీకు బంధువుడా?

రా—ఏదో! మాగర్భవాసాన జన్మించాడు దానికి మా యోగ్యతేమీ కారణంగాదు.

వార్డరు—అయ్యా! మా జైలు పవిత్రమైంది. మళ్లీ రామదాసుగారే ఖైదులో బడ్డారు. మాతప్పులు క్షమించండి. మాకుగూడా తమరాకవలన తరుణోపాయం గలిగింది.

రా—అయ్యా! తమనుంచితనం చేత ఆమాట లంటున్నారు నాయం దంత యోగ్యత లేదు మీరు లేవండమ్మా, మీవల్ల నాకు మహోపకారం గలిగింది.

వార్డరు—వాండ్లపట్టే పట్టూ. మోటుభక్తిలో అంతబల మున్నది. క్షమించానన౦డి.

రా—లెండమ్మా! మీరు చేసినతప్పే లేదు.

ఎ—(చెంపలు వేసుకుంటూ యేడుస్తూ) చేశాం సామి! అపచారం చేశాం సామి!

రా—ఆహా! ఏమి వాండ్ల పశ్చాత్తాపం! అటువంటి నిష్కల్మషబుద్ధి నాకుండరాదూ? మీ రంతా రామా అనుకోండి. మీతప్పు లన్నీ పోతవి.

ఎ—రామ! రామ! చాలు సామి! మంత్రం దయచేశారు.

రా—(పరవశుడై)

కీర్తన

అంతా రామమయం యీజగ - మంతా రామమయం

అంతరంగమున ఆత్మారాముడ - నంతరూపముల వింతలు సలుపగ. అం.

(అంటూ నృత్యం చేశాడు)

పోలీసులూ. వార్డరూ, పుల్లప్పా, యెరుకలూ పరవశులై అంతా నృత్యం చేశారు. జైలు రామనామంతో ప్రతిధ్వనించింది.

రా—అయ్యా! మనకు వేళవుతున్నది. యెవరిపని వారు చూసుకోండి. ఒక్కక్షణం ఆలస్యం చేయవద్దు.

వా—అయ్యా! నాయుడుగారు వచ్చినట్టు లేదే! రైలు వచ్చి చాలాసేపయింది. కనుక్కొని మళ్లీ మనిషిని పంపనా?

రా—అవసర లేదు వారితో యిప్పు డేమీ పనిలేదు.

వా—ప్లీడరును యేర్పాటు చేస్తాం.

రా—అవన్నీ డబ్బుతో జరగవలసిన వ్యవహారాలు. అవసరం లేదు.

నా—యేదో వొకవిధంగా యేర్పాటు చేస్తే సరిగా! నారాయణరావు పంతులుగారు తమసంగతి వింటే యేమీ అవసరం లేకుండా వస్తారు.

రా—వద్దు వారితో యీవిషయంకూడా చెప్పవద్దు కారాగృహవాసముంటే యెవరూ తప్పించలేరు. లేకపోతే యెవరూ అవసరం లేదు.

ముగ్గురుముద్దాయిలనూ వెంటనే వార్డరు స్నానంచేయించి పూటకూలింటినుంచి భోజనం తెప్పించి పెట్టాడు. రామదాసు అక్కరలేదన్నా వార్డరు వినలేదు. భోజనం కాంగనే పదకొండుగంట లయ్యేసరికి ముగ్గురినీ కోర్టులో హాజరు పెట్టారు. పోలు

సాక్షులను తయారుచేసుకుని కోర్టుకు హాజరైనాడు. క్రిందటిరాత్రి పోలువుత్తరం దీసికొనిపోయి మేజస్ట్రేటుగారికి చూపించినందువల్ల ఆయన కోర్టుకు వచ్చినవెంటనే మొదట యీ కేసే యెత్తుకున్నాడు.

మే॥—ప్లీడరుగారు యేరీ?

పు—లేరండి. కుదిర్చేవాం డ్లెవరూ లేకపోయినారు.

పోలు—లేకేమండి! చోరీసొత్తులు కొనేవాండ్లు వచ్చారు. కొందరికి కబురు కూడా పంపించుకున్నాడు కోర్టువారికి అనుమానంగా వుంటుం దని యెవరూ లేనట్టు నటిస్తున్నాడు.

కోర్టు—అంతమాత్రానికే మేము మోసపోతామా?

రా—కోర్టువారిని మోసంచేయడానికి నే ప్రయత్నించను. న్యాయం చేయవలసిం దని మిమ్ము్మను తక్తుమీద కూర్చోబెట్టారు న్యాయం చెయ్యండి.

కోర్టు—చాలా అతిశయంగా మాట్లాడుతున్నావే. నీ కింకా ప్లీడ ర్లెందుకు? ఆరి తేరినట్లే కనబడుతుంది.

పు—తమ చిత్తం వచ్చినట్టు కానియ్యండి. అవతల దొరగారు అన్యాయానికి తలపడి కూర్చున్నాడు దానిమీద మామాట లేమి అనుతవి?

కోర్టు—నోరు ముయ్యి! నిన్ను ప్రాసిక్యూషన్ చేయిస్తా. మళ్ళీ మాట్లాడితే. సెటిల్మెంటొకటి అడ్డంపెట్టుకొని లూటీలు కొట్టడం అనుకున్నావా? యిన్స్పెక్టరుగారూ! సాక్ష్యంపెట్టండి

పోలును మొదటిసాక్షిగా విచారించారు. ముద్దాయీలు తప్పించుకొని పోతున్నారని తెలిసి పోయి పట్టుకున్నా మని చెప్పాడు.

కో—సవాళ్ళు వేసుకోండి.

పు—మేము యెంతదూరం పోయినతరువాత మీకు తెలిసింది?

వొకఫర్లాంగు పోయినారు.

పు—అంతదూరం యెట్లా వచ్చి మమ్ము్మను కలునుకోగలిగారు?

పో—ముసలివాడు పరుగెత్తలేకపోయినాడు. వాణ్ణి ముందు పట్టుకున్నాం. తరువాత పగ్గంమేగదూరంలో మట్టిమేరువ పోసివుంటే యెక్కి జారిపడ్డావు. మాకేకలు విని రెడ్డి వచ్చి కిందపడ్డనిన్ను పట్టుకున్నాడు.

పు—యిదంతా వట్టికల్పనండి!

కో—అవునులే కానియ్యి.

పు—నాభార్యా. తల్లీ మీసెటిలుమెంటులో యిప్పటికీ వున్నారా?

పో—వున్నారు.

పు—నేను వాండ్లను వదిలిపెట్టి యెట్లా పోతున్నాను?

కోర్టు—ఆసంగతి అతని కెట్లా తెలుసు?

పు—అసలు నేను యెందుకు వదిలిపెట్టి పోతానండి?

పో—అయ్యా! వీడు సోదారకం. వీడు వదలితే, కూలిచేసుకొని నిమ్మళంగా బతుకుదా మని వాండ్లవుద్దేశం. వీడు పోయినా డని వాండ్లెవరూ విచారపడడంలేదు.

పు—రామదాసుగారు తనకూతురిని నీకియ్యమంటే వల్లగాదాన్నాడుగాదూ?

కోర్టు—ఆ సంగతి అత నడుగుతాడులే! యింకా యేమైనా వున్నవా?

పు—లేవు.

కోర్టు—రెండవముద్దాయీ! నీవేమైనా అడుగుతావా?

రా—అడిగి యేమిప్రయోజనం? నాకేమీ ప్రశ్నలు లేవు.

కోర్టు—పైప్రశ్నకు జవాబు చెప్పు.

పౌ—నేనడగనూ లేదు ఆయన యివ్వననూ లేదు.

కోర్టు—మూడోముద్దాయీ? నీవేమైనా అడుగుతావా?

మాలక్ష్మి—నాకు తెలియదు.

కోర్టు—రెండోముద్దాయీ! పౌలు నిన్ను నీకూతురు నియ్యమని అడిగాడా?

రా—నన్ను ప్రత్యక్షంగా అడగలేదు

తక్కినసాక్షులు చాలాభాగం యింతే చెప్పారు. వొక కానిస్టేబిలు సవాళ్ళకు మొదటిసాక్షి చెప్పిన జవాబులు ముందుగా పరుగెత్తిపోయి తక్కినవాండ్లకు నేర్పి వచ్చాడు. పరస్పరభేదాలు అంతగా కనబడలేదు.

కోర్టు—సాక్ష్యం విన్నారుగదా, యేమి చెప్పుకుంటారు?

ము—కేసు కల్పించారండి.

కోర్టు—యెందువల్ల?

ము—విరోధం.

కో—యేమివిరోధం?

ము—పౌలు చెప్పినమాటకు యెగ ర్రిస్తామని.

కోర్టు—మీమీద నేరం చేసినట్టు మోపుదల చేశాను. యేమి చెపుతారు.

ము—యిందాకా చెప్పినవే.

కో—సాక్షులున్నారా?

ము—దేనికి?

కో—మీవాదం రుజువుచేసుకోవడానికి.

ము—లేరు.

కో—(తీర్పు వెంటనే వ్రాసి) వొకటోముద్దాయి పుల్లప్పకు వొకసంవత్సరం, రెండు మూడుముద్దాయీలకు చెరీ ఆరునెలలూ కఠినశిక్ష విధించాను తీసికొనిపొండి.

ముగ్గురుముద్దాయీలనూ సబుజైలుకు తీసుకొనిపోయినారు. మరురోజు వుదయమే నిడదలోలు జిల్లాజైలుకు తీసుకొనిపోవడానికి ముగ్గురినీ యెనిమిదిగంటలకు బయలుదేరే బెజవాడబండికి తీసుకొనివచ్చారు.

---

## పదునెనిమిదవ అధ్యాయం

# రాగమా - రోగమా?

తాలూకాజయిలువార్డరు రామదాసుకు శిక్షపడ్డ దని తెలియడంతోటే దుంఖించి రామానాయుడు రాకపోవడానికి కారణం కనుక్కోవలెనని కూలివాడి యింటిదగ్గిర విచారిస్తే వాడా రాత్రి జబ్బుచేసి మంగళాపురం పోలేదనీ పగలు పన్నెండుగంటలకు పోయినా డనీ తెలిసింది. సంగతి తెలియంగనే రామానాయుడూ, వెంకటయ్యా, అప్పాదాసూ, యితర కూలీనాయకులూ రాత్రి యెనిమిదిగంటలబండికి గుంటూరు పోవడానికి బయలుదేరారు కోటమ్మ మొదలైనవాళ్లు "మహానుభావుడు దూరంగా పోతున్నాడు దర్శనం అయినా చేసుకొనివత్తాం" మని బయలుదేరారు. గుంటూరు వచ్చి వార్డరును కనుక్కుంటే వుదయం బెజవాడబండికి తీసుకొనిపోతా రని చెప్పాడు. జనం అంతా రాత్రి తాలూకా ఆఫీసుకు యెదురుగా రోడ్డుమీద "మహాత్మా గాంధీకీ జయ్! రామదాసుకూ జయ్!" అంటూ పడుకొని ముద్దాయీలను రైలుకు తీసుకొనిపోయేటందుకు బయటికి దీయంగనే గుమిగూడి వాళ్ల వెంబడే రైలు స్టేషనుకు పోయినారు. రామదాసుతో అప్పాదాసునూ రామానాయుడూ వెంకటయ్య లనూమాత్రం మాట్లాడనిచ్చారు రామదాసు తాను సెటిల్మెంటులో ప్రవేశించినప్పటి నుంచి అప్పటివరకూ జరిగినసంగతులు యావత్తూ తెలియబరచాడు.

వెంకటయ్య—మీరు చేసినప్రయత్నాలూ, యీపర్యవసానం మీ జీవితానికి కిరీట మని భావిస్తాను.

రా-నా—యీకష్టాలు మీ ఆత్మోపలబ్ధికి తోడ్పడుత వనుకుంటాను.

వెం—అప్పీలువల్ల యేమైనా ప్రయోజనం వుంటుందా?

రా-దా—యేమీ వుండదు. మాతరఫు సాక్ష్యం లేదు. వాండ్లతరఫున వచ్చిన వాండ్లు బాగా తయారై చెప్పారు. సవాలుకూడా విశేషం అడగలేదు.

వెం—యిప్పుడు మేము చేయవలసిన దేమి?

రా-దా—జోతికపాయం జరగడం నిశ్చయం. వెంటనే పిల్లల నిద్దరినీ అక్కడ నుంచి తొలిగించేసదుపాయం చూడండి. అప్పడి ఆరోగ్యం యెట్లా వున్నది?

వెం—(నవ్వుతూ) అప్పడికి రోగమైందీ, రాగమైందీ తెలియలేదు.

అప్పడు—('హా,హా' అని నవ్వి) తత్సంబంధమే!

రా-దా—నాయుడుగారూ! పిల్లలను ముగ్గురినీ కాపాడేభారం మీదే.

అ—యిక్కడ నే వుండను యేటివొడ్డున యిల్లు కట్టుకుంటా.

"నీవు నీవారు లేరు, నాకు నావారు లేరు
యేటివొడ్డున యిల్లు కడదం పదరా."
మామా! పదం బాగుందా?

రా-దా—సద్గురూ! నీదయ యెట్లా వున్నదో?

రా-నా—పిల్లలు స్వాధీనపడడానికి కలెక్టరుదగ్గిర పిటీషన్ పెట్టించుతా. అది ఫయిసలు అయ్యేవరకు కొన్నాళ్లు పట్టవచ్చు. వీలైతే తీర్పు చెప్పేవరకూ

మైనర్లను కోర్టువారిస్వాధీనంలో వుంచుకొనేటట్టు కోరుతాం. అందాకా యెవరినైనా జతచేసి దానును తాడేపల్లిలో వుంచుదా మని చూస్తున్నా.

అ—యేటివొడ్డున యిల్లు కట్టుకుంటూ. యేమి మామయ్యా?

రా-దా—యేదో చూడండి. నావల్ల అయ్యే దేమున్నది?

వెం—నీవు అసీర్వాదిస్తే అన్నీ నెరవేరుతవి.

అంతా రైలుస్టేషన్ దగ్గరకు వచ్చారు, జనాన్ని లోపలికి రానియ్యలేదు. జనం పెండెం నెట్టుకొని లోపలికి రావలెనని చూశారు. రామదాసు నిలిపి అందరిదగ్గరా సెలవుపుచ్చుకున్నాడు. కోటమ్మ మేరువమీద నిలవబడి "రామదానూ! నేను నిలుస్తా"నన్నది.

రా-దా—కోటమ్మగారా? నమస్కారం. యీయేడు అయ్యగారి ఆరాధనకు నే నుండనుగదా! (అని కేక వేసి చెప్పాడు)

జనం అంతా ఆగిపోయింది. రైలు కదిలేవేళ అవుతువ్న దని పోలీసులు తొందరించి బండిలో యెక్కించారు. నాయుడూ, దానూ, వెంకటయ్యా ఆలవాలు తిరిగి లోపలికి వచ్చారు. రైలు కదిలేసమయం అయింది.

రా-నా—యేమమ్మా మహాలక్ష్మీ! యేమి చెప్పతావు?

మ—ఆపిల్లవాణ్ణి చూస్తే గుండె దరించుకొనిపోతున్నది. మళ్లీ మనలోకంలో పడేనా?

అ—ఊఁహు. నా కీలోకంతో పని లేదు. వెళ్లుతా, యిదే సెలవు.

వెం—పరవా లేదు. మహాలక్ష్మీ! పిల్లల నిద్దరినీ తీసుకొనివచ్చి అందరినీ వొకచోట వుంచుతాం.

అ—పిల్లలను తెస్తారు నే చూస్తా.

మ—యేమిపరవో! మహాలోకంలో వున్నాడు.

వెం—నే మం దిప్పిసాగ!

అ—రాగానికా? రోగానికా? ('అహహ' అని నవ్వాడు).

వెం—పైక మేమైనా అవసర ముంటుందా?

పు—లోపలికి పైకం తీసుకొనిపోనియ్యరు. నేను వ్రాసినచిరునామాకు పది రూపాయలు పంపండి ఆయనకు అన్నివసతులూ నే కుదురుస్తా.

రా-దా—అవన్నీ మీ రేమీ పెట్టుకోవద్దు.

రైలు కదులుతున్నది. రామానాయుడు నమస్కరించాడు.

రా-మా—అమ్మా! యెంతపని చేశారు!

రామానాయుడు తల వంచుకున్నాడు. కన్నీళ్ళు ధారలై నేలమీద పడ్డవి. వెంకటయ్య మొఖంమీద గుడ్డపెట్టుకొని "ముసలివాడిని ఖైదులోకి పంపి మే మంతా హాయిగా వున్నా"మని పిల్లవాడివలె యేడ్చాడు. రైలు వంతెన దాటింది. వెంకటయ్య యింకా రైలువంక చూస్తూనేవున్నాడు. కనుచూ పందేవరకూ చూచాడు.

వెం—తమ్ముడూ! మొన్న మనం చూచినప్పటికంటె రామదాసుమొఖంలో కళ యెక్కువ కాలేదా?

రా-నా—చాల తేడా వున్నది. యిందాకా కోటమ్మగారుకూడా ఆమాటే అన్నారు. మనిషికి వైరాగ్యంకూడా యేర్పడ్డది.

వెం—యికముందు జరగవలసినపని యేమి?

రా-నా—నేను కోర్టుపని చూస్తా. నీవు పుండవల్లి దాసును తీసుకొనివెళ్ళు తొందరపడవద్దు. నీవూ, దాసూ వచ్చినట్లు జోతికి వెంటనే తెలియపర్చు.

వెం—వీరదాసుకొడుకును దాసుతో పుంచివస్తా, అన్నమైనా వండిపెడతాడు.

రా-నా—యెరికలపూడి పంపుదామా?

వెం—జోతిని చూస్తూవుంటే కొంతధోరణి తగ్గుతుం దనుకుంటాను వొంటరిగా వుండడంచేత మరీ మనస్సు చలిస్తుంది. అయినా కోర్టు వ్యవహార మేమిటో తేలితేగదా!

రా-నా—మీరు అన్నం దినివచ్చి రైలెక్కండి. నే పూళ్ళోకి పోతా!

రామానాయుడు యెకాయెకీనా నారాయణరావుగారియింటికి వెళ్ళాడు. వారు లోపల ఫలహారంచేస్తూ పంచాదిలో ఆకుచెప్పుల చప్పుడు విని యెవరో కనుక్కొని రమ్మనమని వంటవాడిని పంపించారు. వారు ఫలానా అని తెలసి,

నా—నాయుడుగారూ! ముఖమార్జన మైందా? లోపలికి రండి.

రా-నా—(చెప్పులు బైట విడిచి హాలులోకి వచ్చి) నమస్కారమండి.

నా—వారికి ఫలహారం తీసుకరావయ్యా! యేమి పొద్దున్నే వచ్చారు?

రా-నా—రామదాసు కథంతా యిట్లా యిట్లా జరిగింది. మాకూ రాత్రివరకూ తెలియలేదు. తమరుకూడా వూళ్ళో లేరట. యిప్పుడే యేలూరురైలుకు యెక్కించి వచ్చాం.

నా—అయ్యో! నాకు తెలియనేలేదే! దర్శనం అయినా చేసేవాణ్ణి. అప్పీలు దాఖలుచేతామా?

రా-నా—కేసంతా అపస్మారకం అయిపోయింది. అప్పీలు దాఖలు చేసికూడా ప్రయోజనం లేదని యిప్పుడే బేచిగుమాస్తాగారు చెప్పారు. అయినా నకళ్ళకు దరఖాస్తు చేయించండి. యిప్పు డాయిద్దరుపిల్లలను స్వాధీలపర్చుకునేమార్గం చూడాలె. లేకపోతే జోతి ప్రాణత్యాగం చేసుకుంటుంది. పాలు చాలా దుర్మార్గులు? పాదిరీకీ వాడు చెప్పినంత.

నా—మనం యిక్కడ పని చేస్తుందాం అక్కడికి వొకరిని పంపితే పిల్లలకూ ధైర్యంగా వుంటుంది. వాడూ పెచ్చరిల్లడు దాపున మనుష్య లున్నారంటే కాస్త బెరు కుంటుంది.

రా-నా—మా అన్న, దాసూ యిప్పుడు రైలుకు వెళ్ళుతున్నారు మనిషిని తోడిచ్చి వుండవల్లిలో దాసును వుంచి వస్తాడు. అదిగాక ఆరోగ్యం సరీగా లేదు. మనసు కొంచెం యీచిక్కులమూలంగనే చలించింది.

నా—అయ్యో పాపం! చూడండి. మీ వెంకటయ్యగారు పంచమోద్యమంలో పూర్తిగా ప్రవేశించారటే? వారు మీఅంత పుత్సాహంగా వున్నారట. నాకు ఆశ్చర్యం వేసింది.

రా-నా—అతడిది మొదటినుంచీ సాఫైనమనసు. మంచి వుత్సాహం, కార్యనిర్వహణశక్తీ, రెండూ వున్నవి. కూలీవుద్యమంతప్ప పంచమోద్యమాన్ని గురించి నేనేమీ అంటించుకోవడం లేదు. ఆపని యీవత్తూ వెంకటయ్యే యీషుతున్నాడు. సంగమందిరానికి సంబంధంగా దిగువజాతులకు కర్మవిద్యాలయం పెట్టించవలె నని విశ్వప్రయత్నం చేస్తున్నాడు

నా—రెండులక్ష లుంటే మంచి విశ్వవిద్యాలయం పెట్టించవచ్చు

రా-నా—చాలదు నాలుగువందలమంది విద్యార్థులకు వసతిగృహం పెడితే అయిదు లక్షలు కావలసివుంటుంది. ఆ మొత్తం మా ఆస్తివల్లనే వస్తుంది. యింకా మూడులక్ష లయితే నే వేసుకున్న అంచనాకు సరిపోతుంది. ఆవిద్యాలయ మేర్పడితే పంచములలో మంచిమార్పు గలిగించవచ్చు. చాలామంది మర్యాదగా జీవించడానికి వృత్తివిద్యల నేర్పించవచ్చు.

నారాయణరావుగారు యోచిస్తూ వూరుకున్నారు.

రా-నా—తమ రేదో యోచిస్తూన్నారే!

నా—యేమీ లేదు. నాకు దిగ్భ్రమ గలిగింది 'నే వినేది కలా? వాస్తవమా?' అన్నట్టుగా వున్నది.

రా-నా—యేడులక్షలతో పని పూర్తి అవుతుం దని నా నమ్మకం. వొకలక్ష వృతులు అభివృద్ధిచేయడానికి మూలధనంక్రింద వుంచితే లోపంలేకుండా చాలాపని సాగవచ్చు పైకం రాద నేభయం నాకు లేదు తగినవాండ్లు పూనుకుంటే యెంత ద్రవ్య మయినా పోగవుతుంది కార్మికోద్యమం ముందు యేస్థితిలోకి వస్తుందో నాకు తెలియదు. గోదావరీకృష్ణాజిల్లాలలోగూడా ముఖ్యమయిన అన్నిగ్రామాలలో సంఘాలేర్పడ్డవి. తక్కళ్ళ జగ్గడివుద్యమాన్ని వంకపెట్టుకొని ప్రభుత్వ వారు కార్మిక సంఘాలను నిర్మూలం చేయవలె నని చూస్తున్నారు.

నా—స్వరాజ్యం రానిదీ ఏవుద్యమాలూ సాగవు. యీమోస్తరుగా ప్రభుత్వము సాగితే మనదేశములో బోల్‌షెవిజం వ్యాపిస్తుం దని నా అనుమానం.

రా-నా—సంతానోద్యమం బోల్‌షెవిజానికి వామశాఖని నా అభిప్రాయం. తమ రన్నట్లు స్వరాజ్యం మనచేతులోకి వ సే బీదల అర్థస్థితి బాగుచేస్తే సంతానోద్యమాన్ని ఆపవచ్చు. శిక్షలువేసీ సెటిల్‌మెంట్లుపెట్టీ దీన్ని అణచడం వట్టిమాట.

నా—తమరు వాస్తవం గ్రహించారు స్వరాజ్యం వచ్చేప్రయత్నం అంతా చేదాం. గాంధిగారివుద్యమంలో నాకు బాగా నమ్మకం కుదరక అజ్ఞాయిష్తన్నా యింతవరకూ "యీతోట్టిస్నానపు చికిత్సవల్ల యీదీర్ఘరోగం కుదరవచ్చిందా?" అనుకున్నాను గాని మన తత్త్వానికి యీమందు బాగా పట్టింది. యీ రామదాసుపిటీషనే ఆఖరుది. యిక కొత్తకేసులు పట్టను పాతవికూడా సాధ్యంమయినంతవరకు వదులుకొంటా. నాతో యింకా కొంతమందికూడా వదులుతారు.

రా-నా—కానియ్యండి. మా కార్మికసంఘా లన్నీ మీఖద్దరుపని చేస్తున్నవి. కలెక్టరుకు నామీద సగంకంటు అదే! వెంకట్రావుగారు మాతాలూకాబోర్డు ప్రెసిడెంటుపని వదులుకుంటే నన్ను తీసుకోవలసిం దని సిరస్తాదారుగారిద్వారా అడిగించారు. అంగీకరించి, 'అన్నిస్కూళ్ళల్లో ఖద్దరు పెట్టింతామా' అని ఆలోచించానుగాని

కాంగ్రెసుకు వ్యతిరేకంగా బోవడం మంచిది గాదని మా వెంకటయ్య వద్దన్నాడు. అంతటితో సంక్షేపించుకున్నాం. తమ కీరోజు యేకోర్టులో పని వున్నది?

నా—నా కేసులు వాయిదా పడేవే. మీ వ్యవహారంలోనే యీరోజంతా వుంటా.

రా-నా—మనవ్యవహార మనండి. తమరు యితరులు రాకపూర్వమే సావకాశంగా పిటీషను తయారుచేస్తే తరువాత యితరపనులు చూసుకోవచ్చు.

నా—యిక్కడనే కూర్చుందాం. ఆఫీసింకా తీసినట్టు లేదు. చెప్పండి, పిటిషను యెవరిచేత దాఖలుచేయింతాం?

రా-నా—అప్పాదాసుచేత చేయింతాం యింట్లో వుండేవాడు. మేనత్త కొడుకూను.

నా—అతని కిప్పుడు మనసు బాగా లేదంటిరే? కుర్రవాణ్ణి గార్డియన్‌గా బెడితే, కలెక్టరుగా రాక్షేపిస్తారు. [వుంటా.

రా-నా—మా వూళ్లో వాండ్లకు బంధువు లేవరూ లేరు. నే వుండమంటే

నా—మీకంటే వాండ్లకు ఆపులు లేకపోయినా కులభేధంవల్ల పనికిరారంటారు. అప్పాదాసుకు పిల్లవాడిని స్వాధీనపరుస్తారుగాని అతడెంత మంచివాడైనా ఆ అమ్మాయిని స్వాధీనపరచ మని చెప్పడం నాకే భావ్యంగా లేదు.

రా-నా—అయితే గడబిడకపు వ్యవహారమైందే! యెవరూ దొరకపోతే కలెక్టరు యేమిచేస్తాడు?

నా—యేమి చేయగలడు? యిదివరకు పాదిరే చూస్తూన్నాడు. కనుక తనవల్లకాదంటేదప్ప ఆయనస్వాధీనంలోనే వుంచుతారు. పిల్లవాణ్ణిగూడా అప్పదగ్గరనే వుండనియ్యమంటారు.

రా-నా—యిదేదో ప్రాణాంతకానికికే వచ్చింది.

నా—యేమి అలా అంటారు? సంగతి పూర్తిగా చెప్పండి.

రా-నా—యింకొకరహస్య మున్నది. అప్పాదాసూ, జ్యోతీ వొకరి నొకరు ప్రేమిస్తారు.

నా—సరే పెండ్లి చేసుకూంటా మనమనండి. తక్షణం వదిలిపెట్టిస్తా.

రా-నా—అది సాధ్యం గాదు. పెండ్లి చేసుకోరు చేసుకుంటా మని పైని కూడా అనరు. ఆ ప్రేమను భావనారూపంగానే వుంచదలచుకొన్నారు.

నా—చిత్రంగానే వున్నది. మీమాలపల్లి చిత్రకూటంగా వున్నదే! వొకసంగతి చెప్పండి. ప్రేమ కేవలభావనారూపంగా వుండడం సాధ్యమా?

రా-నా—సాకారునిగా ప్రేమించినా, నిరాకారునిగా ప్రేమించినా భావనారూపంగానేకదా దేవుణ్ణి ప్రేమించడం. భావనారూపంగా మానవుల నేల ప్రేమించరాదు?

నా—ప్రేమించవచ్చు, సందేహం లేదు.

రా-నా—అయితే వొకసంగతి యోచించి చెప్పండి. భార్యాభర్తలన్యోన్యం ప్రేమించారు. కొన్ని కారణాలచేత భార్య ప్రేమ సంచలిస్తుంది. కాని అత్యంతంగా పశ్చాత్తప్తురా లవుతుంది. వారిద్దరికీ భావనారూపంగా ప్రేమ సాధ్య మవుతుందా? లేక భర్తయొక్క ప్రేమే సంచలించి తరువాత నతనికి పశ్చాత్తాపం కలిగితే వారిద్దరికీ

నిష్కల్మషమైన ప్రేమ కుదురుతుందా? భార్యాభర్తలలో వొకరు తమ ప్రేమను విభజించడానికి సాధ్యమా?

నా—మీ రడిగిన అన్ని ప్రశ్నలకూ నాకు తోచినంతవరకు వొక్కటే జవాబు అసాధ్య మేమీ లేదు. భావనారూపంగా సాధ్యమైతే దైహికంగాకూడా సాధ్యమే అవుతుంది. నాస్నేహితులు కొందరు భార్యాభర్తలు జాయింటుగా ప్రేమిస్తూవుండేవారట!

రా-నా—నేనేదో పెద్దప్రశ్న అనుకొని అడిగితే నిమిషములో తేల్చివేశారే! ఫీజు యియ్యకుండా లాయరుగారిని సలహా లడిగితే యిటువంటిజవాబులే వస్తవి.

నా—మరెందుకువచ్చిన ప్రశ్న లివి?

రా-నా—జోతి అప్పాదాసులు తమప్రేమను భావనారూపంగానే వుంచ దలచుకొన్నారు. ఆమెను సెటిల్‌మెంటు వాదికీదగ్గిర బోధకుడు పెండ్లి చేసుకోమని బోధిస్తున్నాడు యీకేసు యావత్తూ రామదాసుగాని జోతిగాని ఆసంబంధానికి వొప్పుకోకపోవడంవల్లనే ఒనాయింపు చేయబడ్డది. యీసందర్భాలలో అపిల్ల సెటిల్‌మెంటులో వుంటే యేమవుతుందో ఆలోచించండి.

నా— ఆత్మహత్య జరుగుతుంది.

రా-నా—యీ సంగతు లన్నీ పిటిషనులో వ్రాయడం వీలుగాదు.

నా—వ్రాయకతీరదు. కొంచెంసేపు తమరు నిదానించండి పిటీషను తయారుచేస్తా.

రా-నా—అప్పాదాసునే గార్డియనుగా పెట్టుతున్నా, జోతీ అప్పారావుల కున్న ప్రేమనుగూర్చి వుదాహరించవద్దు.

నా—సగంబలం పోతుంది.

రా-నా—దైవగతి యెటావున్నదో! మనము చేయగలది లేదు. పయిగా అత డిక్కడ లేడు.

నా—అత డంగీకరించకపోడం నిశ్చయమేనా?

రా-నా—సందేహంలేదు.

నా—అయితే మిమ్మనే గార్డియనుగా పెడతా.

రా-నా—కానీయండి.

అని బల్లమీది పుస్తకం తీసి చదువుకుంటూ కూర్చున్నాడు. యేదో ఆలోచన పోయింది. తా నడిగిన ప్రశ్నలు అసమంజసంగా వున్న వనుకున్నాడు. సంగతులు వీరికి తెలిసివుండునా? ఆమె కడపటి చరిత్ర లోకాని కేమి తెలుసు? మొదటిప్రశ్నా తనకు వర్తిస్తుందని అనుకోవడానికి అవకాశం లేదు. ఆకథెవరూ వినివుండకపోవచ్చు. "అయినా నేనడిగింది అవకతవక ప్రశ్నే. నాలుక జారింది"

నా—అబ్బాయ్! యేమిటిరా ఆ అల్లరి!

రా-నా—తమకు పిల్ల లెందరండి?

నా—నలుగురు. తమకు పిల్ల లెందరండి?

రా-నా—నాకు లేరండి!—(నాకుటుంబచరిత్ర వీరికి తెలియదు.)

నా—అన్నట్టు తమ ఆ స్వెంతా వుద్యమాని కిస్తున్నారుగాదూ? వెంకటయ్య గారికికూడా లేరా?

రా-నా—ఆయనకూ మగపిల్లలు లేరు. వుభయులం పెంపుకు చేసుకోదలచ లేదు. లాయర్లకు ఫీజు తగ్గించదలచుకున్నాం. యే దత్తయినా ఆగవుకు కోర్టుకు రాకుండా వున్నదా?

నా—సాధారణంగా దత్తమంటే తగాదాదత్తమే.

రా-నా—తగాదా లేని పెంపకమే లేదు.

నా—వ్రాశాను. తమరు భోజనం చేసివస్తే యీలోపుగా సాఫు వ్రాయిస్తాను. తరువాత దస్కతు చేతురుగాని. వుభయులం కలిసే కలెక్టరాఫీసుకు వెళ్ళుదాం.

పదకొండుగంటలకు వుభయులూ కలిసి కోర్టుకు వెళ్ళారు. నారాయణరావు పిటిషను చేతి కియ్యంగానే కలెక్టరుగారు చదువుకొని,

క—నారాయణరావుగారు! గార్డియను యీసుందరుడేనా? యీ పిల్లను ఆయనకు వొప్పజెప్పడం క్షేమ మని మీ రంటారా?

నా—వీరిని చాలా కాలంనుంచి నే నెరుగుదును. అదిగాక ఆపిల్లకు మేనత్త కుమారు డున్నాడు.

క—హిందువులలో మంచివరసే! సమవయస్కుడేనా? అతడికివివాహమైందా?

నా—లేదు.

క—యింకెవరయినా వున్నారా?

నా—దగ్గిరబంధువులు లేరు.

క—బాప్టిస్టును గారిని నే నెరుగుదును. వారిదగ్గరనే ప్రస్తుతం వున్నారుగదా? యీ అమ్మాయిని అక్కడ వుంచడానికి మీ అభ్యంతర మేమి?

నా—ఆయన మతాంతరుడు కావడం మొదటిఆక్షేపణ.

క—యింతవరకు ఆ మతాంతరుడేకదా వాండ్ల తలిదండ్రులకుగూడా శరణ్య మయినాడు

నా—ఆయనశరణ్యమే యీస్థితికి తెచ్చింది.

క—ఆవిషయమే డిప్యూటీమేజస్ట్రేటుగారు నిర్ధారణచేశారు. విచారించింది శివయ్యగా రని మీకు తెలుసునా? బ్రాహ్మణులు, న్యాయస్థులు,

నా—సాదికీకంటె.యీపిటీషనరు దూరస్థుడా. ఆపిల్లకు?

క—యింతవరకు దూరస్థుడే ఈ యౌవనుడికి ఆపిల్లను స్వాధీనపరచడం నా కిష్టంలేదు.

రా-నా—బ్రౌన్సనుగారు నాకంటే పెద్దవారా?

క—వారిని స్వయంగా యెరుగుదును.

రా-నా—వారు తెల్లవారుగావడంవల్ల, క్రైస్తవులు గావడంవల్ల నాకంటే అధికులే!

క—నారాయణరావుగారూ! నీక్ల యాటు యిక యిటువంటిమాటలు మాట్లాడితే కోర్టు నవమానించినందుకు శిక్షిస్తా.

రా-నా—కానియ్యండి.

క—నారాయణరావుగారూ! బ్రాన్సనుగారు గార్డియనుగా వుండడానికి మీ ఆక్షేప ణేమి?

నా—ఆయనదగ్గిరబోధకుడు మంచివాడు గాడుట.

క—ఆయనకింద అనేకమంది బోధకు లుంటారు వాండ్లు మంచివాండ్లు కాకపోతే ఆయన అనర్హు డెట్లా అవుతాడు?

నా—యీబోధకుడు వాండ్లమీద అధికారం చెలాయించేవాడు. ఆపిల్లను పెండ్లిచేసుకోవలె నని కోరుతున్నాడు.

క—పిల్ల కిష్టంలేనివివాహానికి బ్రాన్సనుగా రంగీకరిస్తారా?

నా—పోలు బలవంతపెట్టి యిష్టం సంపాదించవచ్చు.

క—కేవలం సెటిల్మెంటుకు సూపరింటెండెంటుగా వుండడమే కాకుండా కోర్డుతరఫున మయినర్లకు గార్డియనుగా యేర్పరిస్తే తనధర్మం నెరవేర్చి పిల్లలను కాపాడడా?

నా—యీపిల్లవిషయంలో కాపాడలే డని నా అభిప్రాయం.

క—మీరు కారణాలు కనబరచలేదు.

రా-నా—పంతులుగారూ? తమరు వృథాగా యెందుకు వాదించడం?

నా—నే మాట్లాడుతున్నా గా, మీరు వూరుకోండి.

క—(బెంచిగుమస్తాతో)—బ్రాన్సనుగారు యీపిటిషనులో వుదాహరించిన పిల్లలకు గార్డియనుగా వుండడానికి వొప్పుకొంటారేమో స్వయంగా వచ్చి తెలియజెయ్యమను సతెనపల్లి సబుయిన్స్పెక్టరు కింద వున్నాడేమో పిలువు. ఆయన మంగళాపురపు కార్మికసంఘాన్నిగురించి పంపినరిపోర్టు యిటు దే.

ఇన్స్పెక్టరుగారు వచ్చారు.

క—కార్మికోద్యమానికి నాయకు డనీ ఆచుట్టుపట్లసంఘాలు సంతానులకు ఆశ్రయ మిసున్న వనీ మీరు తెలియబరిచారు. యితనినిగురించేనా?

ఇ—చిత్తం.

క—ఈసంగతులనుగురించి సాక్ష్యం యెన్నిరోజులలో తేగలరు?

ఇ—వొకక్రిమినల్ కేసులో ఆవూరిమునసబూ, వొకషావుకారి ఆసామీ యీరోజువాయిదాకు హాజరుగా వున్నారు. వారిద్దరూ యిందులో సాక్షులే. ఇప్పుడే విచారించవచ్చు. లేకపోతే తమరు వేసేవాయిదాకు పూచీకత్తులు పుచ్చుకున్నా సరే యీయన బలవంతుడు గనుక తిరగదీస్తారనికూడా అనుమానం.

క—ముద్దాయికి ఆక్షేపణ లేకపోతే యీరోజే విచారిస్తాను—(గుమాస్తాతో)—రిపోర్టును వుదాహరిస్తూ రు ౧౦౦౦ లకు ఆరునెలలకు స్వంతజామీ నియ్యమని అతనికి యిప్పుడే నోటీసియ్యి.

నా—అంతతొందర లేమి.

క—నోటీసు జారీచేసేపని క్షపం గావడానికి.

రా-నా—నోటీసు చూచుకున్నట్టే! తమరు చెప్పేసంగతులు వింటూనే వున్నా.

క—నోటీసిచ్చి దస్కతు తీసుకో. ఆగంటలో పిటిషనులు కాంగనే పిలుస్తా. ఇన్స్పెక్టరుగారూ! నోటీసిచ్చి ముద్దాయిని మీస్వాధీనంలో వుంచుకోండి.

ఇ—చిత్తం.

నా—ముద్దాయితో నేను మాట్లాడవచ్చునా?

క—మాట్లాడండి. హాజరులో వున్నారుగనుక వకాలు పుచ్చుకోండి.

నా—నే నిందాకటి పిటీషనే ఆఖరుదిగా పుచ్చుకొన్నాను. నాప్లీడరుపని ప్రస్తుతం ఆపివేశాను

క—సహాయనిరాకరణం చేశారా? అయినా మీరు మాట్లాడడానికి వుత్తరు విచ్చాను. అరగంటలో పిలుస్తా అవతలకు వెళ్ళి మాట్లాడవచ్చు.

నా—చిత్తం. (అవతలకు బోయి)—వ్యవహారం పెడదిరిగింది.

రా-నా—సజావుగానే వున్నది. కానియ్యండి.

నా—యింకొకరిని ప్లీడరుగా యేర్పాటు చుకోండి నే నిక వకాల్తు పట్టదలచలేదు.

రా-నా—నాకు ప్లీడరే వద్దు. వాదించుకో నని చెప్పివేస్తాను.

నా—ఖయిదుకు పోతారా?

రా-నా—కార్మికోద్యమంలో పని చెయ్య నని జామీ నియ్యమంటారా? నాజీవితమే దాని కర్పిస్తినిగదా!

నా—మిమ్మలను పట్టుకుంటే మీప్రాంతాలలో వుద్యమం ఆగిపోతుందేమో?

రా-నా—నూరురె ట్టెక్కువవుతుంది. కేసు పిలుస్తున్నారు.

క—నారాయణరావుగారూ! మీరు వకాల్తు పుచ్చుకోనట్టేనా?

నా—అంతే! మానుకున్నాను.

క—అతనిపే రేమిటి?

గు—రామానాయుడు.

క—నోటీసు చూచుకున్నావా?

రా-నా—చూచుకున్నా.

క—ప్లీడరును తెచ్చుకుంటావా?

రా-నా—తెచ్చుకోను.

క—కార్మికోద్యమానికి నాయకుడవా?

రా-నా—ఆ తగౌరవం నాకు లేదు పనిమాత్రం చేస్తున్నా.

క—మీ సంఘాలు దొంగలకు సహాయం చేస్తున్నవా?

రా-నా—నాకు తెలిసినంతవరకు చేయడంలే దని నానమ్మకం.

క—యేమని నీవాదం?

రా—నే వాదించుకోను.

క—సాక్ష్యం పిలువు!

ఇ—నేనే మొదటిసాక్షిని.

ప్రమాణం చేసి సాక్ష్యం చెప్పాడు. అన్నీ అబద్ధాలే.

క—సవాళ్ళు అడుగుతావా?

రా-నా—అడగను.

యీ ప్రకారంగాచే యితరసాక్షులవిచారణా అయింది.

క—యింకా యేమయినా చెప్పుకుంటావా?

రా-నా—యేమీ లేదు.

క—సాక్షు లున్నారా?

రా-నా—విచారించుకోను.

క—ప్రథమవుత్తరువు ఖాయపరిచాను. జామీ నియ్యి.

రా-నా—జామీ నియ్యను

క—జామీ నిచ్చేవరకూ ఆరునెలలు విడిఖయిదులో వుంచేటట్టు వుత్తరువు చేశాను. నిడదవోలు సెంట్రలుజయిలుకు పంపిస్తున్నా. ముద్దాయిని తీసుకొనిపొండి.

పోలీసులు రామానాయుడిని తాలూకా జెయిలుకు తీసుకొనిపోయినారు.

---

## పందొమ్మిదవ అధ్యాయం

## సహగమనం

వెంకటయ్యా, అప్పాదాసూ, కమలదాసూ, యెనిమిదిగంటలబండికి బయలుదేరి నాడేపల్లిలో దిగి జరిగినవృత్తాంతం యావత్తూ జోతికి తెలియజేశారు. సెటిల్ మెంటుకు కూతవేటుదూరంలో వుండవల్లి పాలెంలికి అనుకొనివున్న చిన్నబంగాళా అద్దెకు తీసుకొని దానిలో ప్రవేశించి అక్కడ వంటచేసి రోజూ జోతికీ పిల్లవాడికి పంపేటట్టు సూపరింటెండెంటువుత్తరువు పొందారు తల్లిదండ్రులను పట్టుకొని పోయినతరువాత జోతి ధైర్యం తెచ్చుకొని పిల్లవాణ్ణి వోదార్చి మధ్యాహ్నం తినగా మిగిలిన అన్నం యిద్దరూ తిని ఫల్లప్పయింట్లో పడుకున్నారు సూపరింటెండెంటు భయంగా వుంటే తన బంగళాదగ్గిర పడుకోమన్నాడు గాని జోతి వొప్పుకోలేదు. చీకటితో లేచి ఫల్లప్పయొక్క తల్లితో గలిసి స్నానాదికంనిమిత్తం కృష్ణవెపుకు బోయి తెల్లవారేవరకు యింటికి వచ్చారు. కులపెద్దలు సభ చేసి కేసుపర్యవసానం తెలిసేవరకూ యేచర్య తీసుకోకుండా నిలిపి వుద్రేకులైనకుర్రవాండ్లను సమాధానపరచి ప్రార్థనకు పోకుండా నిలిచిపోయినారు. పాదిరీ మామూలుగా గంటలు కొట్టించి యెవరూ రాకపోవడం చూచి సర్దుకొని వూరుకున్నాడు. కేసుపర్యవసానం తెలుసుకోవడంకోసం మరనాడు యెవరూ పనికిపోలేదు. పౌలు మరునాడుకూడా రాలేదు సాయంత్రంబండికి పోలీసులు వచ్చి కేసుఫలితం చెప్పారు. పౌలు వచ్చినతరువాత ప్రార్థనకు రమ్మంటారేమో చూచి బలవంతపెడితే సమ్మె విస్తరింపజేతామని కులపెద్దలు యోచించుకున్నారు మరునాడు రామానాయుడికేసు సంపూర్తి కాంగానే అతిసంతోషంతో జోతి తనకు దక్కినట్టుగానే భావించుకొని పిలలతరఫున గార్డియనుగా వుంటానని పాదరీచేత వొప్పించి ఆయన అంగీకారం వెంటనే కలక్టరుకు తెలియపరతామని పౌలు వెంటనే బయలుదేరాడు. సెటిల్ మెంటుకు రాంగనే రామదాసుయొక్కయు రామానాయుడుయొక్కయు కేసులపర్యవసానం అందరికీ శ్రుతపరిచి పాదిరీదగ్గిరకు బోయి సవిస్తరంగా సంగతులు చెప్పంగనే ఆయన సంతోషించి—

బ్రౌన్సన్—పౌలూ! రామదాసును యెన్నాళకు గెలిచాం!

పౌలు—గెలిచామంటారు అందులో నాప్రయోజకత్వమే మున్నది? అంతా తమచలవే. తమరు తలచుకుంటే యేది నెరవేరదు? తమరు పంపినచీటిముక్కను చూచుకొని డిప్టీకలక్టరు 'ఆల్ రైటు' అన్నారు.

బ్రౌ—యేమైనా ఆడిగారా?

పౌ—యేమైనా అడిగి కాస్త సంది స్తే కేసుసంగతి యావత్తూ చెపుదామను కున్నా. యేమీ అడక్కుండానే దొరగారికి సలాములు చెప్పమన్నారు. అంతట వచ్చా—నా—మనవి—వొక్కటున్నది.

బ్రౌ—చెప్పు.

పౌ—పిల్లలకు మిమ్మల్నే గార్డియనుగా యేర్పరుస్తారు. తమరు సరేననడమే తరువాయి. తరువాత యీబీదపౌలును మరచిపోతారేమో?

బ్రౌన్—నాచేతనైన సహాయం చేస్తా. వ్యతిరేకంగా చెప్పేవాండ్లు యెవరూ వుండరుగనుక నీశక్తి వుపయోగించి పిల్ల వొప్పుకునేటట్టు చేసుకో. మీవుభయులూ సమ్మతిస్తే యితరాటంకాలు యేమీ లేకుండా చేస్తా.

పౌ—పిల్ల వొప్పుకుండేటట్టు కనబడదు

బ్రౌ—దానికి నే నేమిచేసేది? నీసామర్థ్యం కాదని వూరుకో.

పౌ—గార్డియను తమరుగదా, తమయిష్టప్రకారం వివాహం చేయడానికి వీలు లేదా?

బ్రౌ—లేదు. పిల్లచేత తల యెగరవేయిస్తే అన్నీ చక్కబడుతవి. ఫుల్లప్ప యింట్లో యిప్పుడు పడుకుంటున్నది అతనితల్లి యింద్రజాలి దానిద్వారా పనిచేయి.

పౌ—చిత్తం.

పౌలు ఫులప్పయింటివైపుకు బోయినాడు. జోతీ, ఫుల్లప్పభార్యా యెక్కడికో వెళ్ళుతున్నారు. గుడిసె చాటు కాంగనే యింట్లోకి బోయి—

పౌ—అదెమ్మా! యేమిచేస్తున్నావు?

ఆ—యేమయ్యా యిట్లా వచ్చారు? మామీద కచ్చపట్టా రెందుకు నాయనా? బీదవాండ్లం, యెట్లా బతుకుతాం?

పౌ—మీ కేమి యిబ్బంది లేకుండా చేస్తా. యీ అయిదురూపాయిలూ పెట్టి ప్రస్తుతం గడుపుకోండి.

ఆ—(ఆనందంతో)—యేమో పనిమీద వచ్చావు.

పౌ—మనమడు పెండ్లీ పేరంటం లేకుండా దిక్కుమాలినపక్షిలా గున్నాడు. నీమనమరాలిని యిప్పించి నన్ను వొకయింటివాణ్ణి చెయ్యి నీవు శాశ్వతంగా నాదగ్గర వుండి యింట్లో పెత్తనం చేతువుగాని

ఆ—యేదో మాటసామెతగా యీ సంగతెవచ్చి 'పెండ్లి చేసుకోరాదా లచ్చునంగా!' అని అన్నా. యేమీ సందుపెట్టలే.

పౌ—యేవో పాచికలు వెయ్యాలె నీవు. నాకు స్వాధీనపరిచావంటే నీకు మెళ్లో గళ్లాపట్టెడ చేయించిపెడతా. నాకు బ్యాంకులో మూడువేలరూపాయి లున్నవి. యిప్పుడు వెయ్యిరూపాయిలనగలు పెడతా. యెట్లా వొప్పిస్తావో.

ఆ—నే నీపూట మాట్లాడి సాయంత్ర మొకచిట్కా చెప్తా రా. దానితో కుక్కపిల్లై నీవెంట తిరుగుతుంది తరువాత పెండ్లి నీయిష్టం వుంటే చేసుకుందువుగాని.

పౌ—అనేక వ్యవహారాలు చూచినదానివి యేదో వొకదారి చూపు

ఆ—ఆదెంతపని? బాగా మబ్బుపడ్డ తరువాత రా యేమి చెయ్యవలసిందీ చెప్తా.

పౌలు యింటికి పోయినాడు కాని యేమీ తోచలేదు. హిందూదేవతలకు మొక్కుకున్నాడు గదిలో పడుకొని నిద్రపోవాలెనని చూచాడు నిద్రపట్టలేదు. లేచి షికారు పోయినాడు. చిన్నప్పుడు నేర్చుకొన్న లిల్లాయపదాలు పాడాడు. అవైనతరువాత యేసుకీర్తన లెత్తుకున్నాడు. అవి రుచిగా లేవు. వొళ్ళు దెలియక కొంచెంసేపు నిలువబడి జోతిని మననంచేసి నిట్టూర్పు విడిచి వున్మత్తుడై మచ్చరిచిన ఆబోతువలె పొలాలమీద సంచరించాడు తాపం తగ్గలేదు. సాయంత్రం అయింది చల్లగాలి చింతనిప్పులమీద వడగాలి తోలినట్టు తాపజ్వరాన్ని హెచ్చించింది. సంధి ప్రారంభమైంది. వున్మత్తప్రలాపాలు ప్రారంభించాడు “వో చెలియా! వో మగువా! వో లలనా! వో సకియా!—యెంత క్రూరురాలవే! నా ప్రాణాన్ని నిలువునా తీస్తున్నావు! ఓ జోతీ! నీ అందం వెలిగిపోతున్నది. ఆహాహా! నా జోతి యెంత మంచిదయ్యా!

నన్ను పెండ్లాడవే చెంచీతా!

నీకు బహుపుణ్య ముంటాదె చెంచీతా!

నేను నరసింహస్వామిని, వో ముద్దు చెంచీతా, నన్నేలుకోవె!—(అని సుద్దులరాగం తీశాడు)

అంతా మంచివాండ్లే! మాటలు మట్టుకు మంచివి లాటులాటు కొట్టాడు దావీదూ సలోమోనూ మహానుభావులు కాకపోయినారా? థూ!—మధ్యయిదెందుకు?

యెందు బోతివే? యెందు బోతివే,

యెందు బోతివె చెలియా!

ఇదుగో! దొరికావు నాసామి రంగ! (అని పట్టుకోబోయి)—యేదీ—డుబికించి పోయిందే. ఆస్సి నాపలవపిల్లా! లేడిపిల్లాలె యెగిసిపోయింది.

నేను తాళలేను యింక

తాళలేనే భామా నేను తాళలేనే భామా!

(అని నాట్యం చేశాడు) ఎవరైనా వొకచెలికత్తె వుంటే బాగుండు. వో ఆదెమ్మచెలియా! నాకేదో మార్గం చూపించవమ్మా. లేకపోతే నే నీకృష్ణలో పడతా. యేదో త్వరగా తేల్చు ఆలింగనానికి నీకు ఆరుకాసు లిప్పిస్తా చూడుమరి. ఆపతిమొక్కులు గావునుమా. వచ్చేదా? వేళయిందా? నీకు దణ్ణం పెడతా నీ కాలు మొక్కుతా. వాయిదా శానాదూరం వేసిందయ్యా దీనిసిగాగొయ్యా మబ్బుపడవలెట! పగలైతే పనికిరాదుగావాలె. యేమి మబ్బుపడకపోతే కొంపమునిగిందా? యెవడు నా కడ్డం వచ్చేది? యిప్పుడే పోతా” అని లేచి పుల్లప్పయింటికి బోయి—

పౌ—అవ్వా!

ఆ—వచ్చావా మనవఁడా! వొప్పుకొనీ వొప్పుకొనట్టుగా వుంది. వొక్కటే మందు. నేనూ అదీ అయిదుగంటలకు కృష్ణరేవుకు స్నానానికి వస్తాం. కొన్ని గుర్రాలు కళ్ళెంపెట్టనియ్యవు. వొక్కమాటు యేదోవిధంగా స్వాధీనం చేసుకున్నావా

తరువాత అన్నీ చక్కబడతవి. చలి దీరాలె. అర్థం అయిందా? యెవరు యిక్కడ నీకు అడ్డం వచ్చేది?

పౌ—తీసుకొని వస్తావా?

ఆ—నాదీ భారం నామాట మరచిపోయేవు.

పౌ—నాతో యిన్నిమాటలా? మనసు నచ్చిందా అంటే మెడ యిచ్చేదే.

ఆ—చీకటితో రావాలె. తెల్లవారితే వీలు గాదు.

పౌ—తెల్లవారుఝామువుదాకా కానా? గొడుకొయ్యాలు నెత్తిమీదికి రాంగనే లేచి గమిడి కాస్తా

పౌలు వెళ్ళిపోయినాడు. ఆదెమ్మ లోపలికి బోయింది. కోడలూ జోతీ యింకా రాలేదు. అన్నం వుడుకైనా పట్టలేదు మాటలసందట్లో అన్నం పొయిమీద పెట్టినసంగతే మరిచిపోయింది. మంట చల్లారి నిప్పు కరుకుపడ్డది. దీపం ముట్టిద్దామంటే నిప్పుపెట్టె కనబడలేదు కుమ్మరిసేవరకు నిగురుగప్పినగవ్వలుంటే చిదుగులు వేసి వూది మంటచేసి దీపం ముట్టించింది. అన్నం వార్చి దింపేవరకు కోడలూ, జోతీ వచ్చారు.

రంగడు—అవ్వా! నాకన్నం.

ఆ—రాండి అన్నానికి, కమ్మనిపచ్చడి నూరా.

జోతి—రంగడూ మీరు తినండి; నా కాకలి గాలేదవ్వా!

ఆ—నీవు తినకపోతే మేమూ తినం.

కోడలు— మన కేమివొరిగింది? యివ్వాళ వాళ్ల బావతో మట్లాడింది కనుక కడుపు నిండినటుగా వుంది

అ—బావెవరే?

కో—బావంటే యెరగవ్? మేనత్తకొడుకు. పోలిక లిద్దరి వొకటే!

ఆ—మనివి అడిగి మాట్లాడడానికి వచ్చాగా యేమి?

కో—రేపు మనివి అడుగుతారట; యివ్వాళ కటాకటాలదగ్గర మాశాం యింకెవరో అబ్బాయి. పింకబావా వచ్చారు వొక్కరోజేకా అమ్మా! మా యింట్లో నీవు అన్నం తినేం! రేపటినుంచీ వండించి పంపిస్తానునే అనిరి.

ఆ—యేవరే ఆవచ్చినవాండ్లు? నిజమేనా వాండ్లు చెప్పినమాటలు?

కో—నాండ్లబావ మాంవాడివలె వున్నాడా? దానికంటే గూడా నాజూకుగా వున్నాడు జవరమైన మనిషి. యేమి సంబరపడ్డాడే! నిన్ను జూచి. గంతులు వేశాడు. లే అన్నానికి.

జో—మా అమ్మా అయ్యా యెక్కడవున్నారో! అన్నంతిన్నారో! లేదో? కొడుతున్నారేమో అవ్వా! ఖైదులో ప్రతిపూటా అన్నం పెడతారా?

ఆ—ఓ. వేళయ్యేవరకు సంకటిముద్దలు తెచ్చి యిస్తారు. మావాడు మునుపు గుంటూరుజైలులో వుండగా చూచా.

జో—మాఅమ్మ రెబ్బపామువంటిమనిషి. వొకపాళాన దసిలేది కాదు. కాని మాఅయ్య బొత్తిగా లుగచెడ్డాడు. మా అయ్యను నేను మళ్ళీ చూచేనా, అవ్వా?

ఆ—చూడ కేమి? ఆరుసెల్లూ మూడునిమిషాలలో తిరిగివస్తవి. అందరూ అన్నానికి లేవండి నీవు లేవకపోతే నేనూ తినను.

కో—జోతీ! లే. పిల్లవాడు ఆవలిస్తున్నాడు, తిని పడుకుందాం.

అంతా అన్నానికి కూర్చున్నారు. జోతి పట్టివేస్తు నేతిన్నది.

ఆ—కష్టాలు మనుష్యులకురాక మాకులకు వస్తవా? వచ్చినప్పుడు వోపిక పెట్టుకొని భరించాలె. వొక్క పిల్లవాడినీ వదిలిపెట్టుకుని యీ ఆభాపురిలో యెందుకున్నాం? యిట్లాగే రోజులు తోసేది. భత్యం తీరంగనే యే చెట్టు క్రిందనో రాలిపోయేది.

జో—రేపు స్నానానికి పోవద్దా, అవ్వా?

ఆ—అట్లాగే పోదాం యింట్లో వుండి చేసే దేముందీ? ప్రార్థనకు బోవడం లేదుకనుక విడిపను లెన్నైనా చక్కబెట్టుకోవచ్చు. యింతకూ ఆమహారాజు యీ సదుపాయం చేసిపోయినాడు. అదివరకు ప్రార్థనలోగా అన్నీ ముగించుకోవలసి వుండె. ప్రతీదానికీ వురుకులూ పేరాలే.

జో—అక్కడికి స్నానానికి బోతే యెవరూ వద్దనరుకద?

ఆ—నీమోస్తరుగా మంత్రాలు చదువుతూ స్నానం చేస్తే వద్దంటారేమో! అంతవరకెందుకు? అన్నీ చీకటితోనే ముగించుకుందాం. వొక గడియ ముందుగాబోతే సరీ.

జో—పెందరాళే లేపు. యిక పడుకుందాం లెండి!

అంతా లేచి పహరావచ్చి పోగానే పడుకున్నారు పోలీసులు గస్తీ దిరుగుతున్నారు పాలు వున్మత్తభూతంవలె పుల్లప్పవీధిన తెల్లవారూ తిరుగుతున్నాడు రెండుగంటల కొకరిచొప్పున అయిదు పహరా లైనవి ఆరవ పహరా ప్రారంభించంగానే యింటికి పోయి చక్కగా దుస్తులు వేసుకొని కృష్ణవైపుకు బయలుదేరి దారిపక్క వున్న కయ్యలో నక్కాడు. ఆదెమ్మ నాలుగుగంటలకే లేచి పాలు వెళ్ళాడో లేదో చూతామని వాకిట్లోకి వచ్చింది పాలుజాడా కనబడలేదు. కాసేపు తారట్లాడి లోపలికి బోయి జోతీని లేపింది. జోతికి రాత్రి సరిగా నిద్రపట్టలేదు. తల్లిదండ్రులు జ్ఞాపకంవచ్చి చాలాసేపు అదే ఆలాపనగా, వున్నది. అప్పాదాసు జ్ఞాపకం వచ్చాడు తనమనస్సులో అచ్చుపడ్డరూపాలను సాయంత్రం గనపడ్డ ముఖవైఖరితో తాబెళ్ళు వేసి చూసింది. రెండూ బింబప్రతిబింబంగా సరిపోయినవి. తెల్లవార్లూ ఆరూపాన్ని మనసులో చిక్కబట్టుకొని ఆనందకెరటములలో హంసవలె వుయ్యాల లూగుతూ పడుకున్నది. ఆదెమ్మ లేపేవరకు, నిర్మలసరస్సులో ప్రతిబింబించే చంద్రమండలం నీళ్ళు గదలంగనే చెదిరిపోయిన మోస్తరుగా జోతిహృదయసరస్సులో విహరిస్తున్న మనోహరరూపం చలించింది.

జో—అవ్వా! నన్నిప్పుడు కదిలించబోకు! వొక్క అరగడియలో లేస్తాను.

ఆ—రోజూ వేళకు స్నానంచేయడం మంచిది. అలవాటు తప్పించగూడదు. దబ్బున పోయివతాం లే.

జో—కాసేపు వుండు అవ్వా! యింకా చాలాపొద్దు వున్నది.

కో—మీబావను కలగంటున్నావా? లేపినా ముసుగుదన్ని పడుకుంటున్నావు.

జో—అబ్బా! నన్ను నిద్దరపోనియ్యరర్రా మీరు. అవ్వా! నీకెంతపాపమనుకుంటున్నావు. పొద్దున్నే లేపావుగదా! పద వస్తా.

జో—పోనియ్యి, యింకా కాసేపు పడుకో.

జో—అవ్వ రాకాసిలాగు వెంటబడ్డది. వోరే అబ్బాయి! లే పోదాం, స్నానానికి.

ఆ—వాడి నెందుకు లేపుతావు చీకటో? యెండలు బాగా ముదరనీయి.

జో—నీవుగూడా రారాదుటమ్మా, పొద్దెక్కినదాకా పడుకోకపోతే!

ఆ—దానికి చన్నీళ్ళు పోసుకుంటే జబ్బు చేస్తుంది, పద.

వుభయులూ బయలుదేరారు. గుడిసెలు దాటారు. ఆదెమ్మ దారిపక్కలచూస్తూ పోతున్నది యెందుకో భయపడుతున్నది. ముందు నడిచేదల్లా వెనుకకుదిగబడ్డది.

జో—యేమవ్వా! వెనుకబడ్డావు?

ఆ—ఆఁ. ఏమున్నది? నే ముసలదాన్ని. నీవు పడుచుదానవు. పద, నీతో రాలేకపోతానుటలే. యిప్పుడు దొంగలు వస్తే యేమిచేస్తావే?

జో—యిక్కడికి దొంగ లెవరు వస్తారు.

ఆ—దొంగ లెవరు వస్తారా? యెక్కడనుంచి రావాలె. వున్నవాం డ్లదరూ దొంగలైతే!

కయ్యదగ్గరకు వచ్చారు. మనిషి లేచి నిలబడ్డట్టుగా వున్నది. తెల్లంగా దుస్తులున్నవి దారివైపుకు వస్తున్నట్లున్నది మగవాడివలె వున్నాడు. బాగా సమీపించాడు దారిలోకి వచ్చి అడ్డంగా నిలువబడ్డాడు. జోతి తొలిగిపోయింది. యెటు తిరిగితే అటు వచ్చాడు.

జో—యెవరబ్బే నీవు, అల్లానికి తలపడ్డట్టున్నావు?

పౌలు—నీ గులాపువాడిని. నీ వనుగ్రహించకపోతే నే జీవించను. యెందుకు నన్నిట్లా బాధింపడం? నాకేమిలోపమున్నది? నిన్ను లక్షణంగా జరుపుతా. యీ సెటిలుమెంటువాండ్లంతా నీకు నౌకర్లై పనిచేస్తారు. నీకు ఆడుగులకు మడుగులొత్తుతారు.

జో—తొలుగు దారి! నేను వొంటరిగా వున్నా ననుకొన్నావేమో? జాగ్రత్త! పిచ్చిమాటలు మాట్లాడవద్దు.

పౌ—నాకు జవాబు చెప్పి పో. నేను భరించలే—లే—ను. (నని చెయి పట్టుకున్నాడు)

జో—ఛీ. నన్నంటుకోవద్దు (అని చెయ్యి విదిలించికొట్టి దారిప్రక్కన నిలవబడ్డది).

ఆ—యేమే! అట్లా మాట్లాడుతావు? నీదర్జాకు తగడా? నీ వేమి బంగారు బొమ్మవా?

జో—యివా నీవు చెప్పేమాటలు! చాలులే!

ఆ—యేమిటి చాలేది? అత డంత భంగపడుతుంటే! యింకా నీ అదృష్టమనుకో. పట్టుకోవయ్యా! మహాశాణాతనం పోతుంది.

పౌలు వాటువేసి పట్టుకోబోయినాడు. జోతి 'కృష్ణా!' అంటూ కృష్ణవైపుకు పరుగెత్తింది! యిద్దరూ వెంటబడ్డారు చెరొకవైపునా కమ్మారు. నీళ్ళలోకి దిగింది. వాండ్లూ దిగారు. మోకాళ్ళలోతు నీళ్లలోకి బోయింది. వాండ్లిద్దరూ ఆగలేదు. 'ఓదానూ! యెక్కడున్నావు? దబ్బున రా' అని కేక వేసింది. 'వాగ

రూపకమైన జవాబేమీ లేదు. అంతా దానుమయమైంది. యిద్దరూ యింకా దగ్గరకు వస్తున్నారు పాలు రెండు చేతులతోనూ వొడిసి పట్టుకోబోయినాడు. రాహువు పట్టు తప్పించుకొన్న చంద్రబింబంవలె చేతులనుంచి దూసుకొని పరుగెత్తింది. మళ్లీ కేక వేసింది. యితరులకు వినబడలేదు. కృష్ణ వడిగా వచ్చి లోపలికి లాక్కున్నది. కనబడకుండా కెరటములలో దాచుకున్నది. బుడబుడ శబ్దం వినబడ్డది. పాలూ, ఆదెమ్మా ఆగి చూచారు. తప్పించవలెనని ప్రయత్నించారు. గాని తేలలేదు. ప్రవాహం వడికి నిలవలేక గట్టుకు వచ్చారు. పదడుగులలో సుడిగుండ మున్నది. జోతి గిర్రున తిరిగింది. ప్రవాహం గట్టుకు తోసింది. యిసుకలో మేట వేసింది జోతి సగానికి పూడి కూర్చున్నది పాలు చూడలేదు. పరుగెత్తి యింట్లో దాక్కున్నాడు. పోలీసులకు తెలిస్తే పట్టుకొని కొట్లో పెడతారని భయపడ్డాడు. ఆదెమ్మ కోడలితో చెప్పింది. అమాలు పిల్లవాడు విని కేకలు వెయ్యడం మొదలుపెట్టాడు. ఆదెమ్మ తానూ జోతీ స్నానాకి పోతే యెవరో వచ్చి జోతిని లాక్కొనిపోయినారని గోల పెట్టింది. సబుయిన్‌స్పెక్టరు వచ్చి దానిని ముందు అరెస్టుచేయించి నిజము చెప్పమని బలవంతపెడుతున్నాడు. కోడలు మనిషెవరో చెప్పవలసిందని అతను బలవంతపెడుతున్నది. సెటిల్‌మెంటంతా గోలయింది. పాలునుగూడా అరెస్టుచేయిస్తే నిజం బయటపడుతుందని కులపెద్దలంటున్నారు. అతడు వుడాయించాడు. కృష్ణవైపుకు పరుగెత్తాడు. యెటు పోయిందీ కనబడలేదు. పరారీ అయినాడని పోలీసులు రకార్డు చేశారు. ఆదెమ్మను వెంటబెట్టుకొని రేవువైపుకు బోయినారు. జవానులను నీళ్లలోకి దింపి కొంతవరకు వెతుకులాడించారు. కొందరు పరవగా బయలుదేరి కృష్ణగట్టున వెదుకుతున్నారు. తూర్పురేఖలు తెల్లబారినవి. యిసుకలో యేదో కూర్చునట్టు కనబడ్డది జోతేనని కేకలు వేస్తూ పరుగెత్తారు. చుట్టూ యిసుక దీసి మెల్లగా బయటికి లాగి పడుకోబెట్టారు. పరీక్షించి చూచారు. శ్వాసాడించడానికి చేతులు లాగారు. నాడి పరీక్షించారు ముక్కు దగ్గర వేలుపెట్టి చూచారు. పొట్టమీద చెయిపెట్టి మెల్లెగా అదుముతుంటే నీళ్లు బయటికి వస్తున్నవి. చాలానీళ్లు పోయినవి. పొట్ట తీసింది. జోతిమాత్రం లేదు. అదివరకే పోయింది, గుడ్డగప్పి పడుకోబెట్టారు.

దొర వచ్చి చూచాడు. యిన్స్పెక్టరూ, ఆయనా కలిసి ఆదెమ్మను బంగాళాకు తీసుకొనిపోయినారు. వెంకటయ్యా, అప్పాదాసూకూడా వచ్చారు. దాసు శవందగ్గర పడుకున్నాడు. యెవరు లెమ్మన్నా లేవలేదు. సూపరింటెండెంటు వాండ్లిద్దరినీ పిలిపించాడు. దాసు రాను పొమ్మని పూవులు గోసి తెచ్చి జోతిని అలంకరిస్తున్నాడు. వెంకటయ్య దొరదగ్గరకు బోయినాడు. జనమంతా దూరంగా కూర్చున్నారు. అప్పదాసు పూవులతో అలంకరించి పకపక నవ్వాడు.

"నీకూ నీవారు లేరు నాకూ నావారు లేరు
యేటివొడ్డున యిల్లు గడదాం పదరా."

అని పాడుతూ గబామని యెత్తి బుజంమీద వేసుకున్నాడు. నీళ్లలోకి పరుగెత్తాడు. జనం వెంటబడ్డారు. చిక్కలేదు. ప్రవాహంలోకి పోయినాడు. వడిచేత కాలానలేదు. యీదగలవాండ్లెవరూ లేకపోయినారు. యింకా పోతున్నాడు. కాళ్లకు పూనిక చిక్కలేదు. ఉభయులూ ప్రవాహానికి అడ్డం

పడ్డారు. మణిగారు, తేలారు, కొట్టుకొనిపోతున్నారు. జనం కేకలువేసేవరకు వెంకటయ్యా, పోలీసులూ వచ్చారు. వుభయులూ ఆలింగనంలోనే వున్నారు. పూవులు వాండ్లవెంబడే కొట్టుకొనిపోతున్నవి. ప్రవాహం వాండ్లను వొడ్డుకు నెడుతుందేమో నని జనం కట్టవెంబడి పరుగెత్తుతున్నారు. యీదకలవాండ్లు దిగి సత్తువకొద్దీ యీదుతున్నారు. ప్రవాహం వాండ్లకంటే వేగంగా పోతున్నది. జంట తేలిపోతూనే వున్నది. కొంతసేపటికి చూపమేరను దాటింది. చూపుల కందకపోయినతరువాత అంతా ఆగారు. దిగాలపడి శూన్యాన్ని చూస్తున్నారు.

కృష్ణ గునగునలాడుతూ సంగీతం పాడింది. యింకా పాడుతూనేవున్నది.

"మనిద్దరిమన సొక్కైతే మల్లెపూలా తెప్పగట్టి తెప్పమీదనే తేలిపోదం పదరా." అని శబ్దిస్తున్నది.

---

ఇరువదవ అధ్యాయం

# కొరడాదెబ్బ

జోతీ అప్పాదాసులమరణం ఆంధ్రదేశంలో కల్లోలం కలిగించింది. పెద్ద శీర్షికలతో పత్రికలు రామదాసుకుంటుంబంయొక్క చరిత్ర, రామానాయుడుకేసు యొక్కవివరాలు, రామదాసు కేసుయొక్క కల్పనాకథలు, సెటిల్మెంటులో వుండే కష్టాలు విపులంగా ప్రకటించినవి. జోతీ అప్పాదాసులప్రేమయొక్క చిత్రచరిత్ర జనులలో విస్మయం కలిగించింది పాలు పరారీకావడంవల్ల అనుమానం యెక్కువ అయింది. పాదిరీ రామదాసుకేసుకు, పాలుదుర్వర్తనానికీ సంబధం లేదని జనులను మభ్యపెట్టడానికి ప్రయత్నించాడు. గాని సత్యం దాగలేదు. మతబోధవిషయమై రామదాసు సమ్మెకట్టించడంవల్ల పాదిరీప్రోత్సాహంచేత రామదాసుకు జైలుప్రాప్తి అయిందని జనులు నమ్మారు. పాలుయొక్కదుష్ప్రవర్తనం, జోతీ అప్పాదాసుల ఘోరమరణం, సెటిల్మెంటువాసులలో కల్లోలం పుట్టించినవి. జనమంతా సెటిల్మెంటునిబంధనలను యెగత్రించి గుడిసెలు విడిచి ఆవరణంవెలుపల కృష్ణకట్టపొడుగునా నివాస మేర్పరుచుకున్నారు; మరణాలసంగతీ సమ్మెలసంగతీ కలెక్టరుకు తీగ యివ్వంగనే ఆయన మూలబలంతో తాడేపల్లిస్టేషన్‌లో దిగాడు. కేసులను పూర్తిగా విచారించవలసిం దని పోలీసువారికి తాఖీదిచ్చి సెటిల్మెంటువాసులను వెంటనే గుడిసెలలో కాపురం వుండకపోతే తుపాకులతో కాల్పిస్తా మని కలెక్టరుగారు బెదిరించారు. తాము పరుగెత్తిపోదలచుకోలే దనీ, తుపాకులతో కాల్చి చంపవచ్చు ననీ, మూడురోజులలో తమకు తగినజీవనవసతి చూపించకపోతే లేచిపోతా మనీ లిఖిత పూర్వకంగా తెలియపరచారు. యీసంగతులు యితరసెటిల్మెంట్లలోకూడా కదలిక పుట్టించినవి. రాఘవేంద్రరావుపంతులుగారిచేత గవర్నమెంటువారు చట్టనిర్మాణ సభలో సెటిల్మెంట్లు యెట్లా పనిచేస్తున్నవో విచారించి తెలియపర్చడానికి వొక సంఘం యేర్పరచవలసిం దని తీర్మానం పెట్టించారు. ప్రతినిధిసభ్యులలో చాలా మంది "సంఘా లేర్పరచడ మంటే మాకర్థం తెలుసు. యీవ్యాదేకసమయంలో

ప్రస్తుతపు ఆడావడి ఆవేశాలకే సంఘా లేర్పాటుచేసి అది అణిగిపోయినతర్వాత మెదలకుండా వూరుకోవడం అంతా యెరిగినసంగతే. వెంటనే సెటిల్మెంటుకష్టాలకు తగినచికిత్స చేయవలసిం” దని పట్టుపట్టారు. గవర్నరుగారిసలహాతో పంతులుగారు మామూలుప్రకారం తమతీర్మానాన్ని వుపసంహరించుకోబోయినారు. ప్రతినిధి సభ్యులు సెటిల్మెంటుసమస్య సక్రమంగా పరిష్కరించకపోతే తాము సభవిడిచి లేచిపోతా మని బెదిరించారు, తర్వాత వుభయులూ రాజీపడి ప్రస్తుతం వుండవల్లి సెటిల్మెంటు తీసివేసి అక్కడివాండ్లందరికీ పల్నాటితాలూకాలో పూర్వం బేచిరాకుగా వుండి తర్వాత ఫారెస్టులో కలపబడ్డభూములను దరఖాస్తులకిచ్చి వూరుకట్టించడానికి వెంటనే యేర్పాటు చేయవలసిం దనీ తక్కిన సెటిల్మెంటుసంగతులు విచారించడానికి చట్టనిర్మాణసభవారు తమలో కొందరిని సంఘంగా యేర్పరచి వారు నివేదిక పంపేవరకూ కొత్తవారి నెవ్వరినీ సెటిల్మెంటులో చేర్చగూడ దని రాజీ యేర్పరచుకున్నారు. కొందరు ధనికులైనప్రతినిధిసభ్యులు కొత్తవాళ్లను సెటిల్మెంటల్లో చేర్చకపోతే సంతానులపోడు అధిక మవుతుం దని రాజీకి వొప్పుకోకపోయినా యెక్కువమంది అంగీకరించారు. కొత్తవూరికి రామదాసుపురంఅని జనులు పేరుపెట్టారు.

వెంకటయ్య జోతీ అప్పాదాసులమరణంవల్ల కమిలిపోయినాడు. రామానాయుడికేసుసంగతి ఆయన కింకా తెలియలేదు. పాదిరి పిల్లవాడిని వెంకటయ్యతో పంపాడు. యేమి చెయ్యడానికీ తోచక గుంటూరు వచ్చి రామానాయుడిప్రయత్నాలు శృంగభంగ మైన వని తెలుసుకున్నాడు. రామానాయుడు జైలులో బడ్డసంగతి తెలియంగనే వెంకటయ్యకు యెక్కడలేనిధైర్యమూ వచ్చింది. మనస్సుకు యేవిధమైన ఖేదం కలుగలేదు సరాసరి రామానాయుడుతో మాట్లాడడానికి జైలుకు వెళ్ళాడు. సూపరింటెండెంటువుత్తర్వు పొంది లోపలికి పోయి—

వెం—తమ్ముడూ! చింతపడ్డావా?

రా-నా—నా కేవిధమైనచింతా లేదు. జోతీ అప్పాదాసులమరణంతప్ప మరియొకవిచారం లేదు. రామదాసూ. మాలక్ష్మి యీదుఃఖ మెట్లా భరిస్తారో చెప్పలేను. రామదాసు లోకాతీతు డైనాడు సుఖదుఃఖా లాయన కంటుకోవు యింతవరకు జోతివిషయం ప్రతిబంధకంగా వుండె. అదీ తీరిపోయింది. నన్నూ అజైలుకేపంపిస్తా రనకొంటాను.

వెం—అయితే మాట్లాడి ధైర్యం చెప్పు. పిల్లవాడివిషయంలో నా ఆడపిల్లలతోపాటు యేర్పాటు చేయవలసిందని నా అభిప్రాయం నీవుద్దేశ్య మేమి.

రా-నా—సరళమైన నీవుద్దేశ్యాలతో నాకభిప్రాయభేదం యెట్లాకలుగుతుంది?

వెం—ఆసంగతి మాలక్ష్మితో చెప్పు. పిలవాణ్ణిప్పుడు మనయింటికి తీసుకొనిపోతున్నా. జతపడివస్తే నాలుగోపిల్లకి పెండ్లిచేసి అత్తవారింటికి పంపిస్తా. నా భారం తీరిపోతుంది. అదట్లా వుండనియ్యి. నీవు వచ్చేవరకు నే జేయవలసిం దేమి? నా కేమిసందేశం?

రా-నా—నే బయటికి వచ్చే ఆరునెలలలోగా స్వరాజ్యం వచ్చితీరుతుంది. నారాయణరావుపంతులుగారిసలహా పుచ్చుకుంటూ తగినప్లాను వేయించి కార్మిక కళాశాలాభవనాలు తయారుచేయించు. వసూళ్లు కురదలా లుంటే పూర్తిచేయించు

నేను జైలులో మరణించడం తటస్థిస్తే వుద్యమానికి లోటు వస్తుందనే సందేహంలేదు. నాకంటె వుత్సాహపరుడవు సమర్థుడవు ఆయిననీచేతులలో పడ్డది. నిన్ను పొగిడాననుకోవద్దు. మనం అనుకున్న ప్రకారం జరిగించు.

వెం—నీవు చెప్పింది యావత్తు శిరసావహించి నెరవేరుస్తాను. ప్రతి నెలాఖరున యెంతపని జరిగించిది తెలియపరుస్తుంటా. యిక్కడనుంచి ప్రయాణమెప్పుడు?

రా-నా—యింకా రెండుమూడురోజులదాకా తీసుకొనిపోరు.

వెం—అక్కడ నీచే తేమైనా పని చేయిస్తారా?

రా-నా—విడిఖైదే నాదుస్తులుంచుకోవచ్చు, యిక్కడికి నేను తెచ్చుకొన్న పడకగుడ్డలు మేజస్ట్రేటుగారికి చూపి వారంగీకరించినవి నాకు పంపు. రెండు పాత్రలుగూడా అవసరం ఆయన అంగీకరించినివి సెంట్రలు జైలుసూపరింటెండెంటు గారు చూచుకొని నాకిచ్చేటట్టు పంపితే ఆయన అంగీకరించవచ్చు.

వెం—ఫరవావేదు ఈయన అన్నీ అంగీకరిస్తాడనుకుంటా

రా-నా—నాకు నమ్మకం లేదు. యితనికి భయం. దాస్యంలో వున్నవాడెప్పుడూ దేనికీ సాహసించలేదు. అయినా ప్రయత్నించి చూడు.

పోలీసు—అయ్యా! యిక పదండి. మేజస్ట్రేటుగారింతసేపెందుకు నుంచారంటారు కావలసివుంటే సాయంత్రం వచ్చి మాట్లాడండి. యేర్పాటు చేస్తా.

వెం—తమ్ముడూ! నిన్ను ఖైదులో వుంచి నేను హాయిగా యింటికి వెళ్లుతున్నా. నేను నీతో యెందుకు రా గూడదు?

రా-నా—అన్నా! మనం రణరంగంలో వున్నాం నేను గాయపడ్డాను. హాయిగా వుంటాను బయటవుండి నీవే యెక్కువ మనస్సులో బాధపడుతావు. నీవుకూడా వస్తే పని యెట్లా సాగాలె? నీవు పూరిచేయించకపోతే అంతా అరూమూ దవుతుంది. నే నిప్పుడు ఖైదులో పడకపోతే మనయేర్పాట్లు యీడికకింద పడేవి. యిది మన కొకకొరడాదెబ్బ. సమర్థుడవు నీవు బయటవుండి నేను యిక్కడ వుండడమే మేలు.

వెం—తమ్ముడూ! నీతో పోలిస్తే నే నెంతవాణ్ణి!

రా-నా—ఆవిషయమై నీవు జబాబు చెప్పవద్దు. నిన్ను పొగడలేదు. నన్ను క్షమించి మరియొక విషయ మెత్తుకో.

వెం—పంతులుగారిని మనవూ రొకమారు తీసికొనిపోతే బాగుండు. యిప్పుడు రమ్మంటే వస్తారా?

రా-నా—వారు పనికూడా ఆపుదల చేశారు. మన ఆలోచనలన్నీ చెప్పాను. వుదయం చాలాసేపు మాట్లాడిపోయినారు స్పష్టంగా చెప్పలేదు. గాని ఆయనవల్ల మనకు యెక్కువసహాయం అవుతుం దనుకుండాను. ప్లాను ఆయన అంగీకరించందీ మొదలుపెట్టవద్దు.

వెం—అయితే యీరోజు ఆయనను తీసుకొనిపోతా. నీవు నిడదవోలు వెళ్లేలోగా మళ్లీవస్తా.

రా-నా—ఆ దంతా పెట్టుకోవద్దు. పోయి పని వెంటనే ప్రారంభించు.

వెం.—యిప్పటి కింతే చూపు. పని సాగించి పదిహేనురోజులలో వచ్చి అన్నిసంగతులూ మాటాడుతా. కేవలం వుత్తరాలవల్ల తేలదు. అక్కడనుంచే రాజమహేంద్రవరం పోయి కలప తెస్తా

రా-నా.—సరే కానియ్యి. ఇంతే నమస్కారములు.

పోలీసులు—అయ్యా! మేజస్ట్రేటు గారు వచ్చేవేళ యింది. దయచేసి పదండి!

అంతట వెంకటయ్య వెళ్లిపోయినాడు.

---

## ఇరువదియొకటవ అధ్యాయం

# దాస్యం రుచిస్తే ముక్తిలేదు.

వెంకటయ్య వెళ్లిపోయినతర్వాత రామానాయుడు భోజనంచేసి నిశ్చింతగా పడుకున్నాడు. సంగదాసుహత్యా, కమలయొక్క చిత్రచర్యా, సాహూ వాదరయ్యల మరణం, జగ్గడిబందిపోటు, వెంకటయ్య ఉద్యమంలో కలియడం, రామదాసు వగైరాల కారాగృహ ప్రవేశం, జోతి అప్పాదాసుల విచిత్రప్రయాణం, శ్రీకృష్ణజన్మస్థానానికి తనయాత్రా, మొదలైన వన్నీ యేదో సర్వజ్ఞత్వంగల శక్తి మహోద్దేశంతో నడుపుతున్నట్లు కనబడ్డవి. ధర్మాధర్మాలు వొకదాని నొకటి జయించడానికి చేస్తున్న మహారణరంగంలో యివన్నీ అంతర్భాగాలైన స్వల్పకథలుగా తోచినవి. లోకచరిత్ర పారజూస్తే సత్పథం పొడుగూనా సత్పురుషుల రక్తసిక్తమయ్యే కనబడ్డది. యిది మహాయాగం. యజ్ఞపురుషుడు యీ మహాహోమంలో తన్నొక యిధ్మంగా స్వీకరించినందుకు ఆనందపడ్డాడు. పావకుడు తనను అగ్నిపరీక్షకు లోబరచినందుకు ధన్యవాదం చేశాడు. తనయందు అజ్ఞానజన్యమైన అహంకారము నశించడానికి సాధనం చూపించినందుకు భగవంతుడికి కృతజ్ఞతాపూర్వకవందనాలు చేశాడు. వొళ్లు జలదరించింది. లేచి కొబ్బరినారచాపమీదను కూర్చున్నాడు. "అశ్రాంత హరిభావనారూఢచిత్తుడై యుతుడై పాడు నొక్కచోట" అన్నమోస్తరుగా నరసింహారావుగారిదగ్గర నేర్చుకున్న:

"భజో మధుర హరినామ నిరంతర్
భజో మధుర హరినామ్
హరిహి సుఖహై-హరిహి శాంతి-హరిహి
ప్రాణారామ్"

అనే కీర్తనను గొంతెత్తి అవ్యక్తమధురధ్వనితో పాడుకున్నాడు.

పీడను నారాయణరావు మళ్లీ రామానాయుణ్ణి చూడడానికి వచ్చాడు. జైలులోకి అడుగు పెట్టగనే భక్తిప్రవాహంయొక్క కెరటాలు యీడ్చికొడుతున్నవి. కొండలుకూడా ఆగేటట్లు లేవు. బాధలు చెదురినవి. చెట్లు మోసు లెత్తినవి. గాలి మందగమనంతో తూలుతున్నది. క్రిమికీటకాదులు సొమ్మసిల్లినవి. నారాయణరావు మునివేళ్లమీద నడిచివచ్చి కమ్ములు పట్టుకొని నిలువబడి అద్భుత దృశ్యంలో ఐక్యమైపోయినాడు. గానం పూర్తి అయిపోయింది. రామానాయుడు

కన్నీటికాల్వలలో దొప్పదోగుతున్నాడు. నిశ్శబ్దమహారంలోనుండి వొక్కవాక్కు వినబడ్డది.

"శ్లో. సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః." అని

నారాయణరావు శిరస్సు వంచాడు. రామానాయుడికి సర్వం నారాయణ మయం అయిపోయింది యిండ్లూ, వాకిండ్లూ, రాళ్లూ, పోలీసులూ, వుద్యోగులూ, ఖైదీలూ నారాయణునియొక్క ప్రకారాంతరాలుగా కనబడ్డారు. "సహ నౌ భునక్తు" అనుమహావాక్యప్రకారం అన్యోన్యభోగ్యభోక్తృత్వసంబాధం నిరూపణ మైంది. "వీమ సర్వస్వభూతో మే పరిష్వంగో హనూమతః" అనుప్రమాణప్రకారం సహ భోజనం ప్రాప్తించింది. అన్నిలోకములకూ వ్యాపించిన యీసత్రయాగం కొంత సేపటి కంతర్ధానం అయింది రామానాయుడూ, నారాయణరావు ముఖాముఖీగా నిలువబడ్డారు.

రా-నా—అయ్యా! నమస్కారం.

నా—తమరు నమస్కారం చేస్తున్నారా?

రా-నా—పెద్దలకు నిమస్కారం చెయ్యడం ధర్మంగదా!

నా—తమకు వ్యతిరేకంగా జెప్పడంలేదు. ఆశీర్వాదంగా స్వీకరిస్తాను. యిక్కడికి నేను పనివుండి వచ్చినా మీతోడిసాంగత్యంవల్ల నాజన్మసాఫల్య కారైన చూపు లభ్యం అయింది సహభోజనం ప్రాప్తించింది నాకంతే చాలు. ఈదినం వెంకటయ్యతో మాట్లాడాను. మహాత్మాజీ చెప్పినప్రకారం స్వరాజ్యం రాకతప్పదు. నేను తిరిగీ ప్లీడరువృత్తిలో ప్రవేశించవలెననే వుద్దేశ్యం లేదు. స్వరాజ్యం వచ్చే వరకూ దేశస్వాతంత్ర్యానికై పనిచేయడానికి నిశ్చయించుకున్నాను. అటుపైని మీమంగళాపురంలో ప్రవేశించి పంచవు కార్మికోద్యమాలలో దేనిలోనైనా మీరు చూపినపని చేయడానికి సిద్ధంగా వున్నాను. తమతో మరివొకవిషయంగూడా మాట్లాడవలసివున్నది.

రా-నా—నేను యితర వుద్యమాలలో కొంత జోక్యం కలిగించుకొని తిరుగు తుండడంచేత ప్రత్యక్షంగా రాజకీయవ్యవహారాలలో ప్రవేశం కలిగించుకోలేదు. కార్మికసంఘాల నన్నిటినీ దేశస్వాతంత్ర్యానికి పూర్తిగా పనిచేయవలసిం దని ఖండి తంగా చెప్పివచ్చాను. సభికు లందరూ త్రాగుడు మానివేశారు. సంఘాలున్న అన్ని గ్రామాలల్లో సారాయిదుకాణాలు మూశారు మూలమూలలవున్న రాటాలబూజంతా దులుపబడినది గ్రామాలల్లో యెక్కడ చూచినా దూదేకులవాండ్ల కమానుల గుబ డెబలూ—రాటాలయొక్క సంగీతం, విరివిగా వినబడుతున్నవి. యెక్కడ జూచినా ముతకనూలుగుడ్డలే. కార్మికసంఘాలన్నీ తమసభ్యులకుటుంబాలు ఖద్దరుబట్టలే వుప యోగించాలెనని తీర్మానాలు చేసినవి. పట్టణాలకుకూడా యెగబ్రాకింది పన్నుల విషయంలోకూడా పూర్తిగా తగు అవసరం వచ్చినప్పుడు పని జరుగుతుంది. అవసరం వస్తే ఖైదుకు పోవడానికి యెవరూ వెనుదీయరు. నేను ఖైదుకు రావడం కూడా వారిని వురికొల్పుతుంది. స్వయంగా మీతో కలిసి పనిచేసేభాగ్యం నాకు లభించ వలెనని చింతించుతున్నాను.

నా—అయ్యా! మీ రిదివరకు చేసినపనంతా యిప్పుడు రాజకీయోద్యమానికి పునాది. కార్మికపంచమోద్యమాలు రెండూ వృద్ధిపొందినప్పుడే మనదేశంలో నిజమైన ప్రజాప్రభుత్వం యేర్పడుతుంది. దిగువజాతులలో ప్రబోధంకలుగందే ధనికప్రభుత్వం వుంటుంది గాని ప్రజాప్రభుత్వం వుండదు. యిప్పటిరాజకీయాందోళనానికీ విదేశ ప్రభువులు ముందుగా ఖైదులోకి పంపించడానికీ తప్పకుండా మీరు అర్హత సంపాదించారు. మీరు చెమటవోడ్చి సంపాదించినగౌరవమే కాని పుట్రవుడియంగావచ్చింది గాదు. నేను మీతో మాట్లాడదలచిన యింకొకవిషయంలో ధర్మవిరుద్ధంగా ఆపనికి పూనుకున్నానేమో అని సందేహంగా వున్నది. కలక్టరుగారు మీతో కొన్ని సంగతులు ముచ్చటించమన్నారు. మిగలా వచ్చానుగనుక చెప్పేపోదా మని నిశ్చయించుకున్నాను.

రా-నా—దాని కేమి! వినదగు నెవ్వరు చెప్పిన. వినుకోవడంసంగతి వేరు. సెలవియ్యండి.

నా—పొద్దున్న మీతో మాట్లాడి వెళ్లినతర్వాత కలెక్టరు నాకు కబురంపించి మీవిషయమై మాట్లాడాడు. వారునాతో చెప్పిన సంగతులు వారికిగాను మీతో చెప్పుతున్నాను. అది నాఅభిప్రాయంగా యెంచవద్దు. మీరు జిల్లాలో చాలా పలుకుబడిగలవారని తెలిసిగాదా లె, మిమ్మును శిక్షించినందుకు పస్తాయిస్తున్నాడు.

రా-నా—తప్పని తోస్తే సవరించుకోవచ్చుగదా. మిగిలిందేమున్నది?

నా—అట్లా చేస్తాడా? లొంగితే గౌరవానికి లోపమనుకుంటాడు. మీరేదో యెదిరించి మాట్లాడారని చర్యజరిగించాడు. ప్రస్తుతం కార్మికోద్యమాన్ని గురించి పని చేయనని వాగ్దాన మిస్తే ఆర్డరు రద్దుచేయిస్తాడట.

రా-నా—గౌరవహానికోసం చూస్తున్నాడని నేనునమ్మను. కంపెనీ ప్రభుత్వం మారిపోయినా వర్తకసరళి మారలేదు. బేరానికి దిగాడు. పోనియ్యి గౌరవహానే అనుకుందాం. తనను యెదిరించా ననుకుంటే క్షమాపణ కోరుతాను. కార్మికోద్యమంలో పని చేయనని వాగ్దాన మెందుకు? అది నిర్ధారణ చేసుకోవడం నాపని గాని తనది గాదు. యెదిరించి మాట్లాడా ననేది వొకసాకు. అయినావొకసంగతిచెపుతాను. తమ అభిప్రాయానికి భిన్నంగా చెప్పగూడదని పాలకజాతులకుండే అహంకారం. దానిని గర్హించడం మనవిధి.

నా—స్వరాజ్యంకోసం పని చేస్తున్నాంగా. దానితో అన్నీ తేలుతవి. యిప్పుడు మనం ప్రతిఘటించి చేసే దేమున్నది.

రా-నా—అది పొరపాటు. ధర్మ మెప్పుడూ అధర్మాన్ని ప్రతిఘటిస్తుండవలసిందే. అధర్మంవొకప్పుడు గెలిచినట్టు కనపడ్డాఆగెలుపేధర్మోద్యమానికి పూపుయిస్తుంది. ధర్మం గెలవకతప్పదు. ధర్మపక్షాన పోరాటమేలేకపోతే యెప్పటికీ జయంలేదు. పురుషప్రయత్నం లేకుండా ధర్మంగెలుస్తుందని నే పూరుకోను. స్వాతంత్ర్యాభిలాష చచ్చి దాస్యం రుచిస్తే జాతికిగాని, వ్యక్తికిగాని యిక మోక్షంలేదు. బానిస యెప్పుడూ తన మోక్షానికై కలహిస్తూవుండవలసిందే. యెవడైనా భావ దాస్యానికి వశుడైనతర్వాత జాతీయదాస్యం అసహ్యించుకొని జాతీయమోక్షానికి పోరాడగలడని నేనమ్మను. కాబట్టి ప్రతివాడూ దాస్యానికి వశపడకూడదు. వ్యక్తిమోక్షానికి పోరాడడం జాతీయదాస్యానికై చేసేపోరాటానికి అడ్డం వస్తే స్వార్థత్యాగం చెయ్యవచ్చు. అంతకుతప్ప దాస్య

విమోచనానికై పాటుపడకుండా వుండడం మానవధర్మంకాదు. తాత్కాలికాపజయాలు ధర్మవిజయానికి మెట్లే అవుతవి. విఘ్నాలు వస్తవని సత్పురుషు లెవరూ ప్రయత్నాలు మానరు. "యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః"—

యింతలో కలెక్టరాఫీసు గుమాస్తా బైసికిలు వేసుకొని పరుగెత్తుకుంటూ వచ్చి "పంతులుగారూ! తమతో మాట" అన్నాడు.

నా—యేమంత తొందర?

గు—కలెక్టరుగారు తమతో మాట్లాడమని పంపారు. కాస్త యిటు దయచేయండి.

నా—యిక చెప్పండి, ఫరవాలేదు.

గు—నాయుడుగారితో కలెక్టరుగారు చెప్పమన్నమాటలు చెప్పవద్దన్నాడు. ఆప్రకారం జరపడానికి వీలు లేదట.

నా—యేమి! యింతలోనే యింతమార్పు!

గు—అదంతా రహస్యం లెండి.

నా—చెప్పనయ్యా! అన్నీ రహస్యాలే

గు—వాళ్ల వుప్పూ పులుసూ తింటున్నాంగా యింకా.

నా—యెక్కడిది? మీ కలెక్టరుగారు వాళ్ల దేశాన్నించి వుప్పు తెచ్చి మీకు పెట్టుతున్నారా?

గు—లేకపోతే, లేదనుకోండి. చివరకు వాండ్లచేతిమీదుగా మాకు వొస్తున్నది.

నా—అదీనాదాలిస్తే. జవాను యెంచి నీచేతిలో పెడుతున్నాడు. కలెక్టరుకూ వాడే యిస్తాడు. కాబట్టి వాడు మీకు వుప్పూ, పులుసూ పెడుతూవున్నట్టా? ప్రభుత్వం వారు ప్రజల తరఫున ధర్మకర్తలు. వారిస్తున్నా ప్రజలిస్తున్నట్టే. యిది ధర్మం.

గు—అధర్మ మేది?

నా—ధర్మకర్తసొమ్ము నాదనడం. మీ రంతా ప్రజల నౌకర్లంగాము, ధర్మకర్త నౌకర్లమనడం.

గు—మీకు నేను జవాబు చెప్పలేనండి. సంగతి యిది. నే చెప్పానని యెవరితోను అనవద్దు. యి[illegible]స్నాలునుంచి టెలిగ్రాం వచ్చింది. తక్కాళ్ల జగ్గడు యీ మంగళాపురపు వాడట [illegible]ఇవాళ్లుకూడా కొందరు వాడితో మరీకైనట్టు తెలుస్తున్నదట. అందువల్ల యీ మార్పు.

నా—సరే వెళ్లండి. రోగీ పాలే కోరాడు, వైద్యుడూ పాలే చెప్పాడు. నాయుడుగారూ! వింటున్నారా, సరాగం?

రా-నా—విన్నా. నాకూ చిత్రంగానే వున్నది. మా వూరుంబాలేలలో తక్కాళ్ల వాళ్లెవరూ లేరు. జగ్గడని పేరుగలవాడుకూడా వున్నట్టు కనపడదు.

నా—అది మారు పేరేమో?

రా-నా—కావచ్చు. యీ విషయమై విశేషాలు తెలిస్తే నాకు కబురంపండి. మరిచిపోవద్దు

నా—అట్లాగే. నే సెలవు పుచ్చుకుంటా.

రా-నా—చిత్తం.

## ఇరువది రెండవ అధ్యాయం

# వీరహనుమాన్

జగ్గడి చరిత్ర కొంతవరకు చెప్పి దిగవిడచాం. తొందర పనులవల్ల వెంటనే యెత్తుకొన వీలుగలుగనందుకు చదువరులు మన్నింతురుగాక! యింతవరకు బందిపోట్లు అనర్గళంగా సాగుతూనే వున్నవి. నల్లమల కీకారణ్యంలో నావర మేర్పరచి పర్ణశాలలు కట్టి సంతానుల భార్యలనూ, బొక్కసమునూ అక్కడ వుంచారు. సైనిక సంతానులు అక్కడే నివాసం. వుత్తరాన పాపికొండలలోనూ, నెల్లూరు జిల్లాలో రాపూరి కొండల లోనూ వుపనాయకులు కొందరు నిలవరం యేర్పరుచుకొని దాని చుట్టు ప్రదేశములలో బందిపోట్లు జరిపిస్తున్నారు. ప్రతిజిల్లాలోకూడా జిల్లానాయకుండొకడు వ్యవహారాలు నడిపిస్తారు. సంతానులను నాయకులుగా నియమించక పూర్వం వొక మాసంరోజులు నల్లమల అడవులలోవున్న సంతానపురంలో జగ్గడివల్ల ధర్మశిక్షను గ్రహించవలసి వుంటారు. జగ్గడి యోచనాబలం, నిర్మాణశక్తీ, కార్యదక్షతా [illegible]ం అతని వుద్యమానికి తోడై మద్రాసు, హైదరాబాదు, మైసూరు రాజ్యములలోని అన్వేషకశాఖ వారి తెలివితేటలను వెలుపుచ్చి నిరాఘాటంగా బందిపోట్లను సాగిస్తున్నవి. దేహంలో ప్రాణం యెక్కడ వున్నది, యెక్కడ లేదనీ నిర్ణయించడానికి వీలులేని [illegible]స్తరుగా జగ్గడు యెక్కడవున్నా అంతటా అతడున్నట్టే పనిజరుగుతుండంచేత, అతని స్థిరవాసంయేదో నిర్ణయించడానికి మూడు ప్రభుత్వాలకూ సాధ్యంకాలేదు. ఉత్తర హిందూస్తానంలో సుప్రసిద్ధ అన్వేషకశాఖాధికారి దివాన్ బహదూర్ రామసింగు సి. ఐ. యి గారిని మూడు ప్రభుత్వాలవారూ అధిపతినిగా నియమించి కర్నూలు సూపరింటెండెంటును సహాయంగా యిచ్చారు. రామసింగు తాంతియా భిల్లును పట్టి వాళ్లలో మొనగాడు. చంద్రయ్య పితూరీలో పనిచేయవలసిందని మద్రాసు ప్రభుత్వంవారు కోరితే తాను రానవసరం లేదని కొన్ని వుపాయాలు సూచిస్తే వాటిననుసరించి సుప్రసిద్ధుడైన వొక ఆంగ్ల గూఢచారి అతనిగుంపును పట్టుకొన్నాడు. రామసింగు పత్రికలలో జగ్గడి చిత్ర విచిత్ర చర్యలు చదివాడు. మద్రాసుప్రభుత్వంవారతని సలహా కోరారు. జగ్గడిబుద్ధి తన కందలేదనీ స్వయంగా సంచారంచేసి స్థలవిమర్శ చేయందీ సలహాచెప్పలేనని తన్ను నియమిస్తే సంతోషంగా పని చేస్తాననీ తెలియపరచాడు. ఇండియా ప్రభుత్వంవారు ఆయనను వెంటనే సర్వాధికారంతో నియమించారు. కర్నూలుజిల్లా సూపరింటెండెంటు స్పెన్సరుగారు బర్హాంపురంలో వచ్చి కలుసుకున్నారు.

స్పె—సింగ్జీ! సలాం.

రామ—సలాం, మిష్టర్ స్పెన్సర్!

స్పె—యిక మనం చేయవలసిన పనేమి?

రామ—జగ్గడికి నివాస మేదని మీ రనుకుంటారు?

స్పె—పాపికొండలలో నివాస మేర్పరచుకొని వాడు విశేషంగా రైలు ప్రయాణం చేస్తుంటాడని నమ్మకం.

రామ—యెవరికన్నా కనబడ్డాడా?

స్పె—లేదు.

రామ—యీ రెండు సిద్ధాంతాలూ సరియైనవి కావు. బందిపోటు నాయకులు సాధారణంగా ప్రయాణం చెయ్యరు. ప్రధానస్థానంలో వుండి యావత్తుచర్యా నడుపు తుంటారు. యింతసమర్థుడైన నాయకుడికి తగిన సహాయకారు లుండుండాలె. పాపి కొండలలో సహాయకుడుమాత్రమే వుంటాడు. రెండవది యీకొండ మూలగావున్నది. అన్ని భాగాలకూ అందికలో లేదు. అయినా వైఖరిచూచి చెపుతాను.

స్పె—కొండ వంద మైళ్లపొడుగున వ్యాపించి వుంది.

రామ—నాకు ఆంధ్రదేశములోని కొండలన్నిటి ప్లానూ వేసి చూపండి. తర్వాత అవసరమైన భాగాలు చూతాం.

స్పె—యిది మాస్తరు.

రామ—పాపికొండలలో యీ భాగంలో అడవు లేమాత్ర ముంటవి? అక్కడ వైశాల్య మేమాత్రం?

స్పె—యీకొండలలో వెడల్పు విశేష ముండదు.

రామ—అయితే ఈ కొండలలో వుండదు.

స్పె—యివి రావూరి కొండలు.

రామ—అక్కడ లేడు. నల్లమల అడవులవైఖరి యెట్లా వుంది?

స్పె—కొండలచుట్టూ పెద్ద కీకారణ్యం వుంటుంది.

రామ—యీభాగంలో కొండ లెన్ని వరుస లున్నవి?

స్పె—నాలుగైదువరుస లున్నవి. అడ్డంగాకూడా కొన్ని కొండ లున్నవి.

రామ—నీటివస తుందా?

స్పె—దొనలూ, చెరువులూ కావలసినన్ని వున్నవి.

రామ—యింకా యేజిల్లాలో పెద్దకొండ లున్నవి?

స్పె—కడపలోవి షుమారైనవి.

రామ—అక్కడ లేడు. బ్రిటిషురాజ్యంలో వుంటే నల్లమలలో వుంటాడు. యీభాగంలో వుండాలె. దానిని ముట్టడింతాం. మన తాబేదారు లెవరికీ యీ సంగతులు తెలియగూడదు. యింకొక సంగతి. వాండ్ల ఆడవాండ్లజాడ లేమైనా కనబడ్డవా? యిండ్లకు వస్తూపోతూవుంటారా?

స్పె—భోగంవాండ్లిండ్లకు రారు. వుంపుడుకత్తె లెవరికీ లేరు. సొంతయిండ్లకు వస్తుండవచ్చు. అదైనా తక్కువే.

రామ—వాండ్లభార్యలు తప్పకుండా నల్లమల అడవులలో వుంటారు. మనకు పదివేల సైన్యం కావాలె. నాలుగు భాగాలుచేసి కమ్ముకొని రావాలె. నేను యిటు పోయే భాగంతో వుంటాను. మద్రాసుకు టెలిగ్రాం పంపించండి. అయిదురోజులలో యావత్తు సైన్యమూ రావాలె. తరువాత వొకవారంలో యావత్తూ ముగించాలె. నల్లమలలో లేకపోతే నైజాంలో వున్నట్టే లెక్క.

స్పె—అతడు వొకవేళ తప్పించుకొన్నా ఆడవాళ్లు చిక్కితే మనం గెల్చినట్టే. అయితే వాండ్లను అతిజాగ్రత్తతో కాపాడుతుంటాడు. ఆడవాండ్లు చిక్కడం కష్టం.

రామ—అయితే నా భాగంలో మూడువేల సైన్యం వుంచండి.

స్పెన్సరుగారు వెంటనే మదరాసుకు టెలిగ్రాం యిచ్చాడు. గవర్నరుగారు

మైసూరుకూ, హైదరాబాదుకూ తంతి పంపారు. మదరాసునుండి ఆరువేల సైన్యం, హైదరాబాదు మైసూరులనుండి చెరివేయి సైన్యం బయలుదేరి కర్నూలులో దిగింది. జగ్గడికి ప్రభుత్వంవారి సైన్యముల నడకలన్నీ తెలిసినవి. చుట్టుప్రక్కలనున్న సైనిక సంతానుల నందరినీ మూడు రోజులలో చేర్చాడు. అవసరం వుంటే సంపాదక సంతాను లందరూ పోరాటకు రావలసి వుంటుం దని జిల్లానాయకులకు వుత్తరాలు వ్రాశాడు. యుద్ధప్రకారం నిశ్చయించడానికి సైన్యాధిపతులసభ చేసి సమూహ యుద్ధం పనికిరాదనీ, కేవల దొమ్మి యుద్ధంచేతనే అడవులలో శత్రునాశనం చేయవలె ననీ నిశ్చయపరుచుకొని ప్రతిశత్రుసైన్యమునకూ అయిదువందల సైన్యంగల సంతాన పటాలాలమర్చి శత్రువులతో యెక్కడా యెదిర్చి పోట్లాడకుండా చుట్టుప్రక్కలకమ్ముకొనివస్తూ మధ్యమధ్య ముచ్చిలిగొని ధనప్రాణముల గొంటూ దీర్ఘకాలం యుద్ధం జరుపుతూవున్నాడు. సంతాను లిదివర కెన్నడూ యుద్ధాలు చేసినవాళ్లు కారు. జగ్గడు వట్టిమూకలను నెలరోజులలో కూటయుద్ధవిశారదులుగా తయారు చేయగలిగాడు. యుద్ధంలో జగ్గడిపక్షంవా ళ్లెవరూ పారిపోలేదు. వొక్కడూ అధర్మయుద్ధం చెయ్యడు. కష్టంలోవున్న శత్రువు తమచేతుల్లో చిక్కినప్పుడు ఔదార్యంతో పంపివేసేవాండ్లు. నాయకులకూ, సంతానులకూ అత్యంతమైన అన్యోన్యం. కొందరు యుద్ధలో పడిపోతున్నారు. మెల్లికొలదిశత్రువుల వెంటవంటివేధిస్తున్నారు. జగ్గడు మెరికెలవంటి అయిదువందల సంతానులను యేరి మారుదారిన బొక్కసమును, స్త్రీలను దాటవేయడానికి దారి దీశాడు. రామసింగు తనమూడువేలసేనలలోను, పదిహేనువందల మందిని సంతానులతో పోట్లాడటానికి వదిలి వాండ్లకు తెలియకుండా తక్కిన పదిహేనువందలూ చీలదీసి జగ్గడివెంటవంటి కూటయుద్ధం ప్రారంభించాడు. స్త్రీలనూ, బొక్కసమునూ కాపాడవలసినభారం జగ్గడిమీదపడ్డది. వొకకోటిరూపాయలను వొకచోట పాతివేసి వట్టిపెట్టెలనుమాత్రం మోసుకొని పోతూవుండవలసిం దనీ తమప్రాణాలున్నంతవరకు స్త్రీలను కాపాడవలసిందనీ వుత్తర్వుచేశాడు. స్త్రీలూ, సైన్యమూ, కాకులుదూరని కారడవిలో ప్రవేశించారు. రామసింగు ప్రాణానికి తెగించి వెంటబడి తుపాకుతో అగ్నివర్షం కురిపిస్తున్నాడు. స్త్రీలు రాత్రింబవళ్లు మూడురోజులు తియ్యకుండా నడిచారు. వొకచోట నిలిచి వంటచేసుకోవడానికి అవకాశంలేక పస్తులున్నారు. పిల్లలు బొత్తిగా వేలబడిపోయినారు. సాధ్యమయినచోట కొద్దిగా వండి పిల్లలనుమాత్రం బ్రతికించుకుంటూ నడుస్తున్నారు. రామసింగు సైన్యానికి ప్రతిరోజూ పక్కవూళ్లనుంచి సప్లయిలు వస్తున్నవి. వొకరోజు జగ్గడిసైన్యం శత్రువులభోజనాన్ని దొమ్మిచేసి పట్టుకోగల్గింది. శత్రువులు వొకపూట భోజనంలేక వెనుకంగవేసిన సమయాలో జగ్గడు రెండు రోజులు తగిన భోజనపదార్థం వండించుకొని ప్రయాణం సాగించాడు. జగ్గడిసైన్యానికి మందుగుండుసామగ్రి తక్కువైంది. అది కనిపెట్టి రామసింగు సమీపించి కాల్చడం ప్రారంభించాడు. కొందరు స్త్రీలూ, పిల్లలూ గుండ్లదెబ్బలు తగిలి మరణించారు. యిక యుద్ధం యెక్కువ కాలంజరిగిస్తే స్త్రీలనురక్షించడం అసాధ్యమనితోచింది తననాయకులను సలహా అడిగాడు. వారు స్త్రీలను వదిలివేసి మనం తప్పిచుకొనిపోతే స్త్రీలకేమీ అపాయంజరగదనీ, యెక్కువసైన్యాన్ని జేర్చుకొని మళ్లీ యుద్ధం ప్రారంభించవచ్చుననీ సలహా యిచ్చారు.

జ—స్త్రీలను అవమానించి బాధించ రని మీ కేమిధైర్యం ?

నాయకులు— సాధారణంగా ఆడవాండ్లను బాధించర నే అనుకుంటాం. మరీ నీచులు ఆపనికి దిగవలెగాని వాండ్లలోనయినా గౌరవంగలవాండ్లు చేయరు

జ—అవమానం జరిగేకాడికి యెవరివల్లనైతే నేమి? ఆడవాండ్లను రక్షింపజాలక పోతిమనే అగౌరవం మనకుతప్పదు. ప్రస్తుతంమనం తప్పించుకొనిపోయినా ఆడవాండ్లను చేతికి చిక్కించుకొని మనం లోబడకపోతే వాండ్లను బాధిస్తామంటారు. అప్పుడైనా లోబడక తప్పదు. అప్పటికి మనకుమిగిలేది అగౌరవం వొక్కటే.

నాయకులు—మీరు చెప్పేది వాస్తవమే. మీసలహా చాయగా వుంది. పోట్లాడడమే ప్రధానం. అవసరమయితే మాలో ఒకడికి నీపేరు పెడతాం. నీవుమాత్రం బయట వుంటే వ్యవహారం కొనసాగించగలవు. అది మాలో వొక్కళ్ళవల్లా అయ్యే పని కాదు.

ఆడవాండ్లు మానరక్షణసందర్భం లేకపోయినట్టయితే నే నాపని చేసివుండే వాడి నే. స్త్రీలనుశత్రువులచేతులలో వదిలి నాప్రాణం రక్షించుకుందేదా? యెంత హైన్య పుత్రతుకు! జగ్గ డెప్పుడూ అటువంటి నీచకార్యం చెయ్యలేదు.

నాయకులు—సరే. మా కొకటి తోస్తున్నది. మనదగ్గిర మందుగుండుసామాను తగ్గింది. చేతులలో సన్నీలు, బాకులు మట్టుకున్నవి. సంకులయుద్ధమే మనకుశరణ్యాం. మనస్త్రీల నెట్లాగూ మనము రక్షించలేము. మనం తప్పించుకొని జీవించి వుంటే. వాండ్లకు బాధ యెక్కువ. శత్రువులిప్పుడు మనకు షుమారు అరమైలు దూరమున వున్నారు. యింతసమీపంలో మనము వున్నామని వాండ్లకు గమనం దగిలినట్లుకనబడదు తెలిస్తే ఫిరంగులు ప్రారంభించేవాండ్లే. ఆడవాండ్లు మనమూ మాడిపోయివుందుము. వాండ్లు గాలిస్తున్నారు ఆడవాండ్లను యిక్కడవదిలి వాండ్లకు యెదురు నడిచి మెల్లగా వాండ్లను సమీపించి మీదపడదాం. వాండ్లకు తుపాకులునిరుపయోగమవుతవి. జగ్గడి సైనికులచేతిబలం చూపి అధమం కాయకు రెండుకాయలైనా బలిదీసుకొని పడిపోదాం. మనము పడిపోయినతర్వాత శత్రువులు స్త్రీలదగ్గర సొమ్ముంటే తీసుకొని వదలిపెట్టి పోతారు. మనము పడిపోయినతర్వాత వాండ్లకు క్రౌర్యముండదు. వుద్యోగస్తులుకూడా గౌరవంసంపాదించుకోవలె నని చక్కగా ప్రవర్తిస్తారు. మనస్త్రీలగౌరవం, మనగౌరవం కూడా కాపాడినవాండ్ల మవుతాం. మనము జీవించివుండగా మనస్త్రీలు శత్రువుల చేతులలోపడకుండా చేసినవాండ్లం అవుతాం. జగ్గడి సైనికులని అనిపించుకోవలె నని మాకు కోర్కె వున్నది.

జ—సరే. ఆడవాండ్లతో చెప్పి వాండ్లను నిలిపి బయలుదేరిరాండి. యింతలో కత్తులు నూరుకుంటాను. మానధనులవలె చావడానికి బయలుదేరుదాం. ఆలశ్యంచేయవద్దు.

అయిదునిమిషములలో సంతాను లంతా బయలుదేరి వచ్చారు. శత్రువులకు యూఖైగబాలదూరంలోకి వచ్చేవరకూ వాండ్లు గ్రహించలేదు. "వీరహనుమాన్" అని జగ్గడు సింహనాదం చేశాడు.

జ—తమ్ములూ ! నా దొక్కకోరిక.

సం—యే మది ?

జ.—సింహాన్ని నాకు వదలండి.

సం.—సరే.

అంతా వొక్కుమ్మడిన దూకారు. సమీపంలో అయిదువందల సైన్యం వున్నదని రామసింగు సైనికులు తలంచలేదు. తుపాకులు నిరుపయోగమైనవి. పేష్కబ్జులు తీసుకొని సన్నద్ధులయ్యేవరకు ముందునిలిచినవాండ్లు రెండుమూడువరుసలు పడిపోయినారు. రామసింగు సైనికులు యుద్ధములలో ఆరితేరిన వాండ్లయినా జగ్గడిసైనికుల వుత్సాహం, నిస్పృహత్వం, స్త్రీల మానభంగం రక్షించవలెననే కాంక్షా ముందర నిలువలేక పోయినారు. జగ్గ డెవడో శత్రువులకు తెలియదు సాధారణ సైనికునికంటె మెరుగైన దుస్తులు లేవు. అందరూ సంతానులే. స్పెన్సరు సైన్యముఖానికి రాక, పక్కగావుండి యుద్ధంచేయిస్తూ జగ్గడి కత్తికి బలి అయినాడు. రామసింగు వెనుకడుగు వేస్తున్న సైనికులను పురికొల్పుతుంటూ చెదిరిన సైన్యాన్ని అర్ధచంద్రవ్యూహంగా అమర్చి సంతానుల చిన్న సైన్యాన్ని కమ్మి పట్టుకోవలెనని త్రిప్పుకొని వస్తున్నాడు. జగ్గణ్ణి ప్రాణంతో పట్టుకోవలెనని అతని కోరిక. వెనుకనుంచి సైన్యాలకు నడుపుతుంటాడని అతని తలంపు. అర్ధచంద్ర వ్యూహానికి నడుమ రామసింగుండి రక్షిస్తున్నాడు. జగ్గడు వెనుక లేడు అతని సైన్యం మట్టసంగా వొక్కచోట వున్నవి. జగ్గడు రామసింగువైపు నడుస్తూ క్రోల్పులివలె వొక్క దాటున పట్టవలెనని చూస్తున్నాడు. రామసింగు అర్ధచంద్రవ్యూహం అతిపొడుగై సన్నగిలింది జగ్గడది కనిపెట్టాడు. “వీరహనుమాన్” అని కేక వినబడ్డది. “వీర్! వీర్! అని కేకలు వేస్తూ పెనువీకతో దాకి అయిదుచోట్ల చంద్రరేఖ తెంపారు. బ్రిటిషు సైన్యం చికాకు పడ్డది. పీనుగులు కుప్పతిప్పలైనవి. రామసింగుకూ, జగ్గడికీ చేతులు కలిసినవి. రామసింగు సాములో మేటి. జగ్గడు మేటిపోటరి. దేహబల మత్యతం. మనిషి చువ్వవలె వంగి వేట్లు తప్పించుకోగలడు. శరీరలాఘవంగలిగి చిరుతపులివలె దూకుతాడు. సింగుకు నడివయస్సు మిగిలింది. యెంత కసరత్తు చేస్తున్నా భోగముల కలవాటు పడ్డాడు. చాలాసేపు దమ్ము పట్టలేడు. సింగు తన ప్రత్యర్థి జగ్గడని గ్రహించాడు. ఆనంద పడ్డాడు. కొంతసేపు సరి సమానంగా పోరి ఛడీలో నైపుణ్యాలు చూపించారు. అనేకమాట్లు తోడిచేశారు. కొంతసేపటికి సింగుకు అలుపు వచ్చింది. జగ్గడు కవ్వించడం, సింగు కాచుకోవడంలోకి మారింది. సింగు ఆజానుబాహువు కాలిచలనంయొక్క లోపాన్ని పొడుగుచేతులు దీర్చినవి. చుట్టూవున్న వుభయ సైనికులూ విచిత్రం చూస్తూ నిలవబడ్డారు. సింగు తా నోడి పోవడం నిశ్చయ మనుకున్నాడు. ప్రాణంతో పట్టేఆశ వదులుకున్నాడు. యితరులను తోడురమ్మనడానికి తన క్షాత్రానికి నామోషీగా తోచింది. పారతంత్ర్యంలో సగం చచ్చినా క్షాత్రం అడ్డం వచ్చింది. చేతికొద్దీ తల్వారు విసిరాడు. అది కనిపెట్టి జగ్గడు చప్పున పక్కకు దాటినా కంఠం దప్పి కుడిచెయ్యికూడా దెగి నేలబడ్డా పడ్డ చేతివేళ్లు కత్తికోసం తడివినవి — జగ్గడు యెడమచేతితో చేతికొద్దీ మెడ కురికిపట్టి వేశాను. రామసింగు కంఠం దెగి తల నేలకు దొర్లింది. వెంటనే తలదీసుకొని చంకలో యిరికించుకొని సింహనాదం చేశాడు. రామసింగు అనుచరులు సింగుతల తీయడంతోనే — తల దీసినట్లయి తల తీసుకొనిపోకుండా చెయ్యవలెనని వొక్కుమ్మడిన చుట్టుముట్టడించారు. జగ్గడు యెడమచేతితో కత్తి తిప్పుతూ సవ్యసాచివలె శత్రువులనుకోసి వోడెలుపెడుతూ గుంపులోనుంచి వెగిలి బయటబడి బ్రిటిష్ జండావంక పరుగెత్తాడు. ఆంగ్లసైనికులు

వెంటబడ్డారు. సంతానులు వెనుదగిలి శత్రువులను నరికి చొప్పకట్టవలె నేల పరచుచు న్నారు. అడుగుపెట్ట సందులేక పోయింది. జగ్గడి వొంటిచేతి పెట్టుకు బ్రిటిషు సిడము తెగి నేలపడ్డది. సింగుతల దక్కించుకోవడం అసాధ్యమని తోచినది చేతికొద్దీ సంతానుల వైపుకు విసిరివేసి "యెత్తుకొనిపో" అని కేక వేశాడు. వొక యౌవన సంతానుడు పైది పైనే పట్టుకొని యెవరికీ అందకుండా పరుగెత్తాడు. "జండా దక్కించుకో" అని మళ్లీ కేక వినబడ్డది. వొక సంతానుడు తన హనుమధ్వజ మెత్తుకొని తోలిగాడు. బ్రిటిషు సైనికులు కపిధ్వజం కోసం పరుగెత్తారు. "వీ ర హ ను మా న్" అనే నాదం అడవులలో ప్రతిధ్వనించింది. ప్రాణాలకు తెగించి సంతానులు వొక్క పెట్టున దగిలి జండా కోసం పరుగెత్తే గుంపును మరలించారు. ఆంగ్లసేనాని తన సైనికుల సంఖ్యను జూచుకొని పోటుకు పురి కొల్పాడు. జగ్గడు వొంటిచేతి పోటుతో సేనాని వక్షం పెకల్చాడు. వెనుక వున్న వొక ఆంగ్లేయకెప్టెను కత్తితో జగ్గడి కాలు నరికాడు. కాలుదెగి నేలబడి తన కంఠం నరుకనుంకించి సమీపించిన కెప్టెనును జగ్గడు పడగొట్టాడు. జగ్గడు పడడంతోనే సంతానులకు వెర్రెత్తింది. ప్రతివాడూ నాయకుడి మోస్తరుగా "వీరహనుమాన్" అని కేకలు వేశారు. భటులవలె "వీర్! వీర్! అని అంటూ శత్రుసైన్యములో జొరబడ్డారు. కత్తులు వొండొంటిం దాకిన ఖణఖణధ్వనులు పెచ్చుపెరిగినవి. మిణుగురులు సైన్యములను ముట్టడించినట్టు వొరిపిడికి నిప్పురవ్వ లెగురుతున్నవి. సంతానులసంఖ్య తీసిపోతున్నది. కాని శౌర్యం తీసిపోలేదు. వారి సంఖ్య నూరై పదై వొకటై సంపూర్ణ మయింది. హతశేషులే లేరు. జగ్గడూ, మరివొక సంతానుడూమాత్రం బలమైన గాయాలతో బ్రతికివున్నారు. యిద్దరినీ పట్టుకున్నారు. సంతానుడు శత్రువుల స్వాధీనం గావడానికి యిష్టంలేక దగ్గరపడివున్న తనకత్తితో ఆత్మహత్య చేసుకున్నాడు. జగ్గడు దూరంలో బడివున్న తన కత్తికోసం నడుములు విరిగిపడ్డ నల్లతాచువలె పాకుతున్నాడు. మేజరు అదికనిపెట్టి పట్టుకొని చేయి కట్టివేయించాడు. రెండువందల ఆంగ్లసైన్యంమాత్రం మిగిలింది. మేజరు ముందు ఆడవాండ్లను స్వాధీనం చేసికొని తరువాత సంతానుల నివాసం స్వాధీన పరుచుకోవలె నన్నాడు. వాసస్థానంలో యింకా సైన్య ముంటుందేమోనని సందేహించి జగ్గడు దొరికాడని సమీపసైన్యాలకు తెలియపరిచాడు. తక్కిన అయిదు భాగముల సైన్యంలో మూటిని కూటయుద్ధంలో సంతానులు పూర్తిగా నశింపు చేశారు. సంతానుల గుంపులలో వొకటి కొండలోయలో జిక్కి విధిలేక సమూహయుద్ధంలో దిగి రెట్టింపు శత్రుసైన్యమును హతంచేసి పూర్తిగా నశించింది. అయిదవదానికి శత్రుసైన్యంతో తాకిడి కలుగనేలేదు. ఆంగ్లనాయకుడు అడవిలో దూరడానికి సాధ్యంగాక తన సైన్యాన్ని వెనుకకు మరల్చుకొని చివరకు జగ్గడితో బోరిన హతశేషులతో కలుసుకున్నాడు. సంతానుల గుంపులలో వొకదానిగతి రెండవదానికి తెలియలేదు. వొకటి తనబాటుకు వేసిన ఆంగ్ల సైన్యాన్ని ధ్వంసంచేసి జగ్గడి గుంపుతో కలపవలెనని వెదకుతూవచ్చి స్త్రీల సమూహమును జూచి జగ్గడిగుంపుయొక్క పరివసానం విని అతనిని విడిపించుకొని రావలెనని ప్రయత్నించింది. కాని అంతకు కింపటి సాయంత్రమే రెండువందల బ్రిటిషు సైనికులు జగ్గడిని అడవిలోనుంచి తొలగదీసికొనిపోయి కర్నూలు జైలుకు పంపినట్టు తెలిసింది.

అంతట సంతానులు యోచించుకొని స్త్రీలను సురక్షితంగా అడవి బయటికి చేర్చి తమ పోలతులవెంబడి సమీపగ్రామాలకు పంపివేశారు. హతశేషుల నందరిని పోగుచేస్తే యుద్ధం చేయగలవాండ్లు అయిదువందలు మిగిలారు. విచారిస్తే జగ్గణ్ణి కర్నూలు జైలులో వుంచి రిజర్వుపోలీసులు కాపలా చేస్తున్నారని కొందరూ, నంద్యాల సబుజైలులో వుంచి రెండువందల సైన్యంతో కాపాడుతున్నారని కొందరూ జాడలు చెప్పారు. సంతానులు రెండుగుంపులై వొకటి కర్నూలు జైలునూ, రెండవది నంద్యాలజైలునూ ముట్టడించడానికి పొద్దుగూకంగనే బయలుదేరి మూడుజాములపొద్దు పోయేవరకు కర్నూలు, నంద్యాల చేరి జైళ్లు ముట్టడించి తాళాలు బద్దలుచేసి ఖయిదీలను విడిపించారు. జగ్గడుమాత్రం లేడు. విచారిస్తే మధ్యాహ్నపు రైలుమీద గుంటూరు విచారణకోసం తీసుకొనిపోయినట్లు ఖయిదీలవల్ల తెలిసింది. నంద్యాలకు పోయినగుంపును యెవరూ యెదిరించలేదుగాని కర్నూలు గుంపుమీదికి రిజర్వు పోలీసులు వచ్చారు. పోలీసులతో యుద్ధంచేసి చావడంకంటే జగ్గడిని విడిపించడం వుత్తమ మని పోలీసులతో పోరుకు మొగ్గకుండానే పరుగెత్తిపోయి సంతానులందరూ జగ్గడిని విడిపించడానికి గుంటూరు పోవలసివుంటుంది గనుక, కొండవీటికొండలకు చేరవలసిందని అక్కడ పటాలంగా యేర్పరచి గుంటూరు పంపుతామనీ తెలియపరచారు. అందరూ చెదిరిగుంటూరుకుబయలుదేరారు. బొక్కసం యావత్తుమూటలుగట్టిచాలాభాగం సంతానులద్వారా కొండవీటి కొండలలోవున్న జిల్లా నాయకుడికి పంపబడ్డది. యావత్తు ధనం పైసాలు వారలేకుండా గుంటూరు చేరింది.

---

## ఇరువదిమూడవ అధ్యాయం

# రవర

నారాయణరావుదగ్గర గుమాస్తాగావున్న వెంకట్రావు అతడు ప్లీడరుపని ఆపివేసినతరువాత కర్నూలు సబుమేజస్ట్రేటు కోర్టులో కాపీస్టుగా వున్నాడు. జగ్గణ్ణి ధడబడలుగా జైలుకు తీసుకొని వచ్చినతరువాత వెంట్రావు అతనిని చూచి యితడు జగ్గడు కాడనీ; మంగళాపురం కాపురస్థుడు వెంకటదాసు అనేమాలవాడు అనీ, మేజస్ట్రేటుగారితో చెప్పాడు. కలక్టరుగారికి వెంటనే సదరుసంగతి రిపోర్టయి ఆయనవచ్చి గుమాస్తాను విచారించి జగ్గడిని "మంగళాపురం కాపురస్థుడవు కావా?" అని అడిగాడు.

జగ్గడు—వాస్తవం చెప్పితే యిదివరకే చిక్కులలోవున్న తల్లిదండ్రులకు తనవల్ల చింతాకంత వుపకారంలేకపోగా, కష్టాలెక్కువవుతవేమోనని కొంచెంసేపు అజ్ఞాయించాడు. తనను బాగా యెరిగిన గుమస్తా చెప్పిన తరువాత యితరులను తీసుకొనివచ్చి గుర్తింపు చేయిస్తారు. యెట్లయినా యిక దాగేది కాదని స్థిరపరుచుకున్నాడు.

జగ్గడు—నేను తక్కెళ్లజగ్గడిని. యెందుకు మీరనుమానించడం?

కలక్టరు—తక్కెళ్ల జగ్గడనే బందిపోటుదొంగ యిప్పటికి పదియేండ్ల కిందటనే హైదరాబాదు జైలులో చనిపోయినట్టు మాకు నిశ్చయమైన సంగతి తెలిసింది. యింకా నీవు దాచడ మెందుకు?

జగ్గడు — నేను జగ్గడిని కానిమాట వాస్తవం. ఫలానా అని తెలియకుండా మీరు కేసు తీర్మానించుకోలేరా ?

క — సాధ్యమయినంతవరకు ప్రయత్నంచేసి గుర్తింపు సాక్ష్యం దొరక్కపోతే పేరులేకుండానే వ్యవహారం జరిగిస్తాం. అయినా నీవు పేరు దాచుకోవలసిన అవసరం కనబడదు. ధర్మబద్ధమైన చోరుడవు. వొక్క రహస్యం. నీ అభిప్రాయాలతో నేను చాలావరకు యేకీభవిస్తా. నీవు యేదో వొక మార్గాన యీ జైలులోనుంచి తప్పించుకొని పోయేమార్గం చేయగలను. కాని నీవు వెళ్ళడం దుర్లభం. కాలూ, చేయీ పూర్తిగా బోయినవి. చికిత్స బాగా చేయించవలసిందని డాక్టరుగారితో చెప్పాను. కాలు కోసి వెయ్యవలసి వస్తుందంటాడు. కోస్తే అసలే జీవించవేమోనని ఆయనకు అనుమానం కూడాను. యిట్టి సందర్భాలలో నీవు తప్పించుకొనిపోయీ ప్రయోజనంలేదు. శిక్షీ కాటువడకుండా పోతుంది. నీవు యథాప్రకారం నీ వుద్యమం సాగించుకోవడానికి అవకాశమన్నా వుంటే అనుకోవచ్చు. అదిగాక సరియైన వైద్యులూ దొరకరు. నిడదవోలులో జిల్లాసర్జను లేకపోయినా సూపరింటెండెంటే మంచి డాక్టరు. కృష్ణాజిల్లా సర్జనుగూడా అప్పుడప్పుడు వచ్చి చూస్తూ వుంటాడు. ఆయన నాకు స్నేహితుడు. గొప్ప శోధకుడుగూడాను. జైలు సూపరెంటుండెంటుతో మాట్లాడి అవసరమయితే వారిద్దరూ కలిసి శస్త్రంచెయ్యమని చెప్పుతాను. నన్ను మీ తాలూకు బందిపోటు కేసులన్నీ విచారించడానికి గుంటూరు పంపుతున్నారు. రేపే నా ప్రయాణం. నీ కేసే మొదట విచారణకు వస్తుంది. వెంటనే శిక్ష వేయవలసిందని గవర్నరుగారి దగ్గరనుంచి రహస్యపు వుత్తరువులు వచ్చినవి.

జగ్గడు — నా కేసు మీ రేమి చేస్తారు ?

కలక్టరు — నీకేది వుత్తమమని నాకుతోస్తుందో అదిచేస్తాను. నీయభిప్రాయమేమి;

వెంకటదాసు — నాకేది వుత్తమమో నాకు తెలియదు. ఆ సంగతి మీకే వదలిపెడతాను. యిదివరకు సైనికునివలె విచారించవలసిందని కోరదలచాగాని యిప్పుడు మానుకుంటాను. సాధారణపు సంతానుని మోస్తరుగా నన్ను విచారించడమే నా కిష్టం. మీరు నన్ను వదలిపెడతారనే ఆశతోగాదు. ధర్మం పాలిస్తారని నా నమ్మకం. అంతే నాకు చాలు.

క — నీవు ధర్మాత్ముడవైన చోరుడవు. మహావీరుడవనిపించుకున్నావు. పదివేల సైన్యాన్ని నుగ్గునూచం చేశావు. నీ సిద్ధాంతాలంగీకరించక పోయినా పత్రికలన్నీ నీకీర్తిని ఘోషిస్తున్నవి. నీ విచిత్ర యుద్ధమంతా పత్రికలలో వ్రాస్తున్నారు. యింకా నీకు కావలసిన దేమున్నది ?

వెం — చావంటె భయం లేదుగాని వురంటే నా కసహ్యం. అందుకనే సైనికుని వలె విచారించి కాల్చమని కోరుదా మనుకున్నా.

క — జ్ఞాపక ముంచుకుంటాను. యీపూట నిన్ను గుంటూరుకు పంపిస్తున్నాను. వొక డాక్టరు నీతో గుంటూరుదాకా వస్తాడు. నీకు బాధగా వున్నదా ?

వెం — నా కే బాధా కనబడడంలేదు.

క — భోజనం వసతిగా జరుగుచున్నదా ?

వెం — డాక్టరు పెట్టించే భోజనం అనుకూలంగానే వుంది. యింకొక్క సంగతి

నారు జీవితాశలేదు. కాలూ, చెయ్యీ కూడా పోయిన తరువాత యీ మనిషి బతుకు నా కెందుకు?

క — బలవన్మరణం చేసుకోవద్దు. నీ వాఙ్మూలములో నీ ధర్మం నీవు చక్కగా వెల్లడించు.

వెం — చిత్తం. అప్పటికి నాకు మనోదారుఢ్యం వుంటుందో వుండదో! త్వరగా విచారణపూర్తి అయితే బాగుండును. నాకు వొక్కటే ఆశవున్నది. నేను చనిపోయే లోగా నా తల్లిదండ్రులను చూడవలెనని వున్నది. అది లభించేలాగు చూడండి.

క — దానికేమి. వారిని ఆవూరిలోనే వుంచినట్లు పత్రికలో వేశారు. వారు నీకు వుపచారంచేస్తూ వుండేటట్టు సూపరింటెండెంటు ద్వారా యేర్పాటు చేయిస్తాను. యిక నే వెళ్లుతా. వొకగంటలోగా నీకు ప్రయాణం. డాక్టరుగారు ప్రయాణమయి వచ్చినట్టున్నది.

వెం — చిత్తం మీరు నాయందు చూపించిన దయకు మీకు నమస్కారం.

క — దయ యేమున్నదీ? నేను మీ సంతానులలో చేరదగిన వాడ నని చెప్పడానికి వచ్చా. నమస్కారం.

వెం — పెద్దలకు నమస్కారం.

క — నీ పేరు వెంకటదాసేనా?

వెం — అవును. దాపరిక మెందుకు? సిగ్గుపడ నవసరం లే దనుకుంటాను.

క — గర్వపడదగిన దనుకుంటాను.

వెం — కావచ్చును. సిద్ధాంత మందరూ అంగీకరిస్తారు. సాధనల విషయంలో మాత్రం అభిప్రాయ భేదమున్నది. నూతన ధర్మం జనామోదం పడసిన తరువాత సవ్యమార్గాలే అవలంబించ వచ్చు.

క — అ దెప్పటికో! మనజీవితంలో ఆచరణలోకి వస్తుందని తోచదు.

వెం — యిప్పటి దుస్సిద్ధాంతాలు మనకు దాపరించి యెన్ని వేలయేం డ్లయిందో. యివి మారటానికి కొన్నితరాలు పట్టినా ప్రపంచచరిత్రలో అవి దీర్ఘకాలం కావు.

క — నీవు చెప్పదలుచుకున్న సంగతులన్నీ నీవాదంలో చెప్పుకో. ప్లీడరును బెట్టి విచారించుకుంటావా?

వెం — ప్లీడరును బెట్టి యేమిప్రయోజనం? కేసులో నే లేద నే దేమున్నది? వాఙ్మూలముమటుకిచ్చి వూరుకుంటాచు.

క — నీయిష్ట మొచ్చినట్లు చెయ్యి. నేను చేయబోయేదాంట్లో ధర్మప్రతిరోధక మేమయినా వుంటుందా?

వెం — స్వవిషయం గనుక చెప్పగూడదు గాని యీ ధర్మాలను పోషించవలసిన బాధ్యత మనకు లేకపోగా వీటి సమలులో బెట్టడం తప్పనినా అభిప్రాయం. ఇవి ధర్మాలుగావు. ధర్మముయొక్క ఆభాస. ప్రారంభంలో యీధర్మాలుకొన్నిఅనుష్ఠేయములుగా వుంచవచ్చు. యిప్పుడు వాటికి ధర్మముయొక్క వాలకమే పోయింది. తమ చిత్తంవచ్చినట్లు చేయండి. తమ సందేహాలు తీర్చేమాత్రపువాడినా?

క — నాసందేహం కొంతదీరింది. యీ కేసులు పూర్తికాంగనే యీ నవుకిరీ వదిలి పెడతాను.

యింతలో డాక్టరుగారువచ్చి:

డా—సలామండి.

క—యేమండీ వెంకట్రావుగారూ! యెట్లా యితనిని తీసుకొనిపోవడం?

డా—కట్టు కదలకుండా యీమంచమే యెత్తుకొనిపోయి వొక కంపార్టుమెంటులో పెడుతే బాగుంటుంది. మాతో కొందరు పోలీసులుగూడా వస్తారుగదా.

క—అవును వొకదాదీ, ౧౦౦ మంది పోలీసులూ వస్తారు. ప్రయాణం చేయగలస్థితిలో వున్నాడేమో మళ్లీ పరీక్షించండి.

డా—యిప్పటి కేమీజబ్బులేదు. చేయి క్రమంగా కుళ్లుతుందేమో? తుంటిమీద శస్త్రం కొట్టమే. అంతవరకు బోకుండానే చేతా మని ప్రయత్నిస్తున్నా.

క—పోలీసులు వస్తున్నారు. వార్డరూ! త్వరగా నలుగురు కూలీలను చూడు,

వా—సూపరెండెంటుగారు యిదివరకే యేర్పాటు చేశారు. హాజరులో వున్నారు.

క—పిలిచి యెత్తించు.

జగ్గణ్ణి పదిగంటలబండికి తీసుకొనిపోతారని వూళ్లోవదంతిపుట్టి వేలజనం స్టేషన్ దగ్గరా తాలూకాఆఫీసుచుట్టూ మూగారు. కూలీలు మంచ మెత్తుకొని బయలుదేరారు. పోలీసులు నాలుగువైపులావిచ్చుకత్తుల పహరాయిస్తున్నారు. పోలీసుసూపరెంటెండెంటు ముందూ కలెక్టరు వెనుకా గుఱ్ఱాలెక్కి వస్తున్నారు. స్టేషనుదగ్గరకు పోయేవరకు చెక్కవంగింది. మూడుపెట్టెలు ఖాళీచేసి యావత్తుమందీ యెక్కారు. డాక్టరూ సూపరెంటెండెంటూ ఇన్స్పెక్టరూ వెంకటదాసు కంపార్టుమెంటులో కూర్చున్నారు. గుంటూరు పోయేవరకు వుదయం యెనిమిదిగంట లయింది. జగ్గడు బండిలో వస్తాడని వూళ్లోను దగ్గరపల్లెలలోనూ తెలిసింది. జగ్గడు మంగళాపురపుమని షని ఉద్యోగులకు మాత్రమే తెలిసిన రహస్యమయినా బయటికి పొక్కింది. జనాన్ని మైదానంమీదికి రానియ్యలేదు. పదివేలజనం చుట్టూ మూగింది. మంచం యెత్తుకొని కూలీలు నడుస్తున్నారు. పోలీసులకు చుట్టూ వున్న జనవత్తిడి బలమయింది. ప్రయాణం అడుగు సాగలేదు. కలెక్టరు అందరినీ దారియ్యవలసిం దని కోరాడు. వొక్కపర్యాయం అతనిని చూపితే వెళ్లిపోతామని జన మన్నారు. దాసు మెల్లిగా లేచి కూర్చొని అందరివంకా చూచాడు. వేలమొడ్పు లతనిమీద వ్యాపించినవి. చప్పట్లు మారుమోగినవి. వెంకటదాసే అనే కేకలు గూడా వినబడ్డవి. అయిదునిమిషాలు దాసు కూర్చుండి తరువాత పడుకున్నాడు. జనం క్రమంగా చిలకబారి దారి యేర్పడ్డది. పోలీసులు సాగారు. తాలూకా జయిలుకు వచ్చేవరకు గంటపట్టింది. కర్నూలు, నందియాల జయిళ్ల సంతానులు బద్దలుగొట్టా రని తెలిసి అయిదువేల సైన్యాన్ని తాలూకాఆఫీసు చుట్టూ రాత్రింబగళ్లు కాపలా పెట్టారు.

విచారణవాయిదా యింకా మూడురోజు లున్నది. మరురోజు రాత్రి రెండు జాములప్పుడు సైన్యంమీద పావుగంటసేపు తుపాకిగుండ్లవర్షం గురిసింది. అంతా గబ్బగీను, వెలుతురు ప్రసరింపజేసి పరీక్షించారు. మనుష్యుల జాడాపొలిమేళ్లు కనుపడలేదు. తుపాకులగుండ్లు వస్తూనేవున్నవి. వొకటీ తప్పిపోవడం లేదు. లాంతర్లవెలుతురు సంతానులకే యెక్కువ సహాయ మయింది. లాంతర్లచుట్టూ సైన్యం కళ్లాలుగా పడిపోయింది.

దీపాలు ఆర్పి సైనికులు కూడా కాల్చడం ప్రారంభించారు. కొంతసేపటికి మందుగుండు పొడూ అయిపోవడంచేత సంతానులు వెళ్ళిపోయినారు. దాక్కొని మళ్లీ కాల్చడానికి యెత్తు యెత్తారేమో అని సైనికులు వెంబడించలేదు. సంతానులు యెవండ్ల యిక్కలకు వాండ్లు చేరినతరువాత సైన్యం కదకడానికిబయలుదేరింది. సంతానులపాళ్లుకువ ఎక్కడా కనుపడలేదు. అందరూ తిరిగివచ్చి తాలూకా ఆఫీసుచుట్టూ అంతా క్షేమమని పహరా యిస్తున్నారు. తెల్లవారి పడిపోయినవాండ్లనందరినీ లెక్కపెడితే అయిదువందల శవాలూ, వేయిమంది వికలాంగులూ తేలారు. చుట్టుగుంటనగ్గర సైనికుల కర్త్వమయిన వీరగౌరవములతో శవాలను ఖననం చేశారు

మరునాడు దుపహరం యేడుగంటలకు కొరిఒపాటినుంచి కూరగంపలు వస్తున్నవి, కొందరు ఆ తల నాడిపోసుకుంటున్నారు వొకముసలిది కాయలగంప మొయ్యలేక పోమారిగోడలమీద వేష్టపడుతున్నది. కొందరు ముసలివాండ్లు గంపలబరువుకింద అణిగి అడుగులు తియ్యలేక మెడలుపడి బాధపడుతూ పోతున్నారు వొకతవర తోటకూర గంప తలమీద పెట్టుకొని తాము మోసే కాయలకావిళ్ల భారంపహితం మరచి యెక సక్కెములాడు జవ్వనంపుకోడెసరసులను చిరునవ్వు వెలుగుతో కలసిన కోరచూపులచే కసరికొట్టుతూ గజ్జలగుఱ్ఱంవలె కదనుపోతున్నది. రంనుముట్టెలూ కడమువేళ్లకు తగరపు చుట్లూ బోలుకడియాలూ కాళ్ల నలంకరించినవి వాటిపై జీరాడుతూ గుమ్మటంసిరుగు గులాబీపూలచీర గూడకట్టు కట్టుకొన్నది. రంగుబిగించిన వొడ్డాణానికి అతికిన వెండి గొలుసుకు దగిల్చిన తాళపుచెవులగుత్తి వేలాడుతున్నది. కేళ్లకు పంచలోహాల వుంగరాలూ, సందిట వెండికడియం. చేతుల బిళ్లారిగాజులూ, చెవులకు బుట్టలూ, మెడలో ముచ్చిబంగారపు గుండ్లపేరూ, కుడికొప్పుమీద చేమంతిపువ్వూ ఆమె సొగసుకత్తెని చాటుతున్నవి. రవిక వొరుసుకుంటున్నది. కనుకొలుకుల దక్కన కాటుకగీరా, ముఖాన పల్లకుంకుమా చామనచాయగల దేహానికి అలంకారంగానే వున్నవి. పమిటె చెరుగు కుడి రొండిన దోపి వెకిలినవ్వుతో నడిరోడ్డుమీద తాలూకా ఆఫీసున కెదురుగా నిలవబడ్డది రోడ్డుపక్కనున్న మేడలోనుండి—

ఒక స్త్రీ—కూరమ్మతా రా?

త—వాండ్లంతా మార్కెట్టుకు పోతారు. నాదగ్గర తోటకూర వున్నది.

స్త్రీ—ఆగు మీద దింపుకో. వస్తున్నా. దేని కమ్ముతావు?

త—డబ్బులకూ, బియ్యానికీ, ఆ సేవాండ్లకుబట్టి పూరికేగూడాను.

స్త్రీ—దిగివచ్చి—పెట్టు—కాసినికూసిరిగావు, అరసోలెడుబియ్యం.

త—ఎన్నియినా మీ చాటలోనె వున్నవిగదా!

స్త్రీ—వూరికే ఆట్లా యెగురుతా వేంసుకు? చేతికి రానేరాదేమి?

త—పట్టవమ్మా! కొంటే రానిది కొసిరితే వస్తుందట!

స్త్రీ—యేమిపట్టు? చేతికి రాదేమి? ముల్లుగుచ్చుకుండేను.

త—రి నేటప్పుడు మీనోట్లో గుచ్చుకోరాదూ! నాచేతిలో యెందుకు గుచ్చుకోవాలె?

స్త్రీ—నీకూర నీవు తీసుకో. బియ్యపుకవ్వంతయినా లేకపోతే!

త—కూర వూరికేనే వస్తుంటటమ్మా! నీళ్లు పొయ్యలేక. అడవలు వెసుకున్నవి.

మహారాజులకు మాకష్టాలు యేమితెలుస్తవి? పట్టండి! పొద్దున్నే బోణీచేశారు. తగాదా యెందుకు?

బియ్యం మూటగట్టుకొని తాలూకా ఆఫీసువంకపోయి గేటుదగ్గర పహారా యిస్తున్న తురకసిపాయితో—

ర—ఏమయ్యా! మీ రెవ్వరూ కూరలు కొనుక్కోరా? (అని కన్నుగీటించి)

ఆ చూపు తూపై తాకింది సాహెబుకు.

సా—పిల్లా! నా కొకకానికూర పెట్టు,

ర—నీకు కానీకూ రెందుకు? లోప లెవరూ కొనేవాండ్లు లేరా? అమ్ముకొని మళ్ళీ వచ్చేటప్పుడు నీకు కావలసిన కూర వుట్టినే తీసుకొందువుగాని.

సా—పిల్లా—ఘోడామోస్తరుగా కదనుపోతావు. పో, లోపలికి బో! అర గంటసేపు అమ్ముకొని బయటికి రా— యెనిమిదింటికి ఆఫీసర్లు వస్తారు.

వొయ్యారం వొలికిస్తూ తవర లోపలికి నడిచింది. సాహెబు వెర్రిచూపులు చూస్తూ వూరుకున్నాడు లోపలవాకిటిదగ్గర వొకనాయుడు పహారాయిస్తున్నాడు.

నా—యెవరు నీవు? జవాబు చెప్పి కదులు.

ర—నీకు నేను జవాబు చెప్పలేకపోతానా?

నా—అసాధ్యురాలవుగా వున్నావే?

ర—సాధ్యం కాకపోను. ఈ పక్కనే మా యిల్లు. నిన్న నీవుషికారువచ్చావే? ఆఫీసరులకు కూరకొనేటందుకు వార్డరు పిలవమన్నాడుట గేటుదగ్గర వున్న సాహెబు రమ్మన్నాడు.

నా—సాహెబు రమ్మంటే వస్తావా?

ర—అంటేమాత్రం. నిన్ను నేనే అడుగుతున్నాగా? వాని చూపించావా లేదా?

నా—వార్డరు లోపల వున్నాడు. మళ్ళీ యిటే రా.

లోపలికి బోయి వార్డరుకు సలాం పెట్టింది.

ర—తమరు మంచివాండ్లని వింటాను. వెంకటదాసుకు నేను భార్యను. ఆయనను చూచి యెన్నాళ్లో అయింది. కండ్లజూచి పోవాలెనని వచ్చాను. యీ పందరూపా యిలూ తమదగ్గర వుంచి ఆతనికేమయినా కావలిస్తే యిప్పించండి.

వా—త్వరగా మాట్లాడు. కూరగంప యిచ్చిపో. యెవరయినా అడిగితే కొన డానికి నే కబురంపానను. అరగంటలో ముగించాలె.

ర—యితరు లెవరూ రాకుండా చూడు.

వా—నేను గేట్లో వుంటా పో.

ర—జై సంతాన్! అహా! జగ్గడా యీ స్థితిలో వున్నాడు!

వెం—రామన్నా! నీవా? గుర్తుపట్టలేకుండా వున్నావు. ఇట్లా రా—ఇట్లా రా. ఈ కమ్ముల మధ్యగుండా నాచేయి తాకు. రాత్రి ముట్టడించింది నీ సైన్యమేనా? నీవు రాత్రి బ్రిటిషుపటాలాన్ని నాశనం చేశావుటే? స్త్రీలను కాపాడిన గౌరవం దక్కింది మనకు.

ర—ఆ గౌరవం నీదే. మా కుత్తరువేమి?

వెం—నాయకు లెందరున్నారు?

త—నేను దప్ప సైనిక నాయకు లంతా రణరంగంలో పడిపోయినారు. జిల్లా నాయకులు మాత్రమున్నారు.

వెం—వాండ్లెవరూ నాకు నచ్చలేదు. యిక జరుగవలసినదేమని నీ అభిప్రాయం?

త—నీ ఆజ్ఞ శిరసా వహిస్తాను. అయిదారు రోజులలో యీ పదివేలసైన్యాన్ని పుటమారుస్తాను. మందుగుండు సామగ్రి యావత్తూ యిక్కడికి చేర్పించా,

వెం—యిక నే నెందుకూ పనికిరాను. యీస్థితిలో జీవించడం నా కిష్టం లేదు. బహుశా నే జీవించనని డాక్టరు లంటున్నారు. మొన్నటి యుద్ధంవరకూ జీవహత్య మన మెక్కడా చెయ్యలేదు. సైనికులంతా మనబోటి బీదవాండ్లే. జీవనంలేక ప్రాణాలమ్ముకున్నారు. యుద్ధం చేయడం మన వుద్దేశం గాదు, చేసి ప్రయోజనమూ కనుపడదు. వృధా జీవహింస మన కెందుకు?

త—నాకూ అట్లాగే తోస్తున్నది.

వెం—యింతవరకు మనం పుట్టించిన ఆందోళనవల్ల ధనికులూ, ప్రభుత్వంవారూ ప్రస్తుతస్థితిగతులను మార్చక తప్పదని అభిప్రాయపడుతున్నారు. ఇకమీద పాతపద్ధతులు ఆపి కొత్తపద్ధతు లవలంబించండి. మన దగ్గర అన్నిచోట్లా అయిదుకోట్ల పదిలక్షల ధనమున్నది. దాంట్లో అయిదుకోట్లు సంతానులంతా సమానంగా పంచుకొని, న్యాయ జీవనం చెయ్యండి. శేషించిన పదిలక్షలలో పెన్సలిట్లెయ్యి. యీ విధంగా ధర్మాన్ని కుపయోగించండి. మీ రందరూ కార్మికసంఘాల సభికులుగా జేరి పని చెయ్యండి. త్వరలో మనకు స్వరాజ్యం వస్తుంది. విద్యా, వృత్తులూ, తప్పక అభివృద్ధి పొంది బీదలస్థితి తప్పక బాగుపడుతుందని నా నమ్మకం. మీరు పార్లమెంటుకు సభికులను పంపి అక్కడి మన సంఘం యొక్క స్థితి బాగుచేయడానికి ప్రయత్నించండి. రాముడూ! యీ చెప్పిన ప్రకారం జరిగించు. యిక వెళ్లుతావా? నా శరీరం వొకమాటు మళ్లీ తాకు. అయ్యో! యెంతమంది సంతానులు హతులైనారు. నాయకులంతా ప్రాణాలర్పించారు. సంతానులందరినీ నే కావలించుకున్నానని చెప్పు. నా తప్పులు క్షమించండి. రాముడూ! నే బోయిన తరువాత జగ్గడు పురపు వెంకటదాసు జ్ఞాపక ముంటాడా?

రా—నీవు వెంకటదాసువా? యీ అద్భుతశక్తి మంగళాపురంలో మొలకెత్తిందేనా? ఆశ్చర్య సంతానుడా! నీ ఆజ్ఞలు శిరసావహించి నెరవేరుస్తాం. యింక సంతానుల కెవ్వరికీ నీ దర్శన భాగ్యం లేదుగదా. నేనే అందరిలోనూ అదృష్టవంతుణ్ణి. నీ పాదాలు వొక్కమారు అంటుకోనియ్యి.

వె—అది మన ధర్మవిరుద్ధం. సంతానులందరూ సమానప్రతిపత్తి గలవారే. మళ్లీ నీ చెయ్యి నా కందియ్యి. సంతానుడి స్పర్శసుఖ మనుభవిస్తాను. యింతకాలం నుంచీ స్వేచ్ఛా చక్రవర్తినై సంతానులలో గలిసి గాలివలె అడవులలో సదా సంచరించాను. యిప్పుడు కాలుచేతులులేని అవిటినై జీవించడంకంటె హైన్యమేమున్నది? యీ జన్మ చాలించి తిరిగీ పంచమ సంతానుడనై పుట్టి మన వుద్యమానికి తోడ్పడుతాను. శ్రీరాముడికి కపులు తోడైనట్టు మీరంతా మళ్లీ సంతానులై పుట్టి మన వుద్యమాన్ని నిర్వహింతురుగాక!

శ—యే జన్మ యెత్తేదీ మన చేతిలో వున్నదా! విధి నిర్ణయ మెట్లా వుంటుందో! అది అలంఘనీయంగదా!

వెం—నే నమ్మను. మన విధిని మనమే నిర్ణయించుకుంటాం. కర్మ బంగారు తీగె వంటిది. కార్యకారణ మార్గాన యెటు మసలితే అటు తిరుగుతుంది. మన చేతిలో వున్న పనికి మరివొకరి ప్రాబాల్య మెందుకు?

శ—నీ రాజ్యంలో దేవుడికి ప్రవాస గతేనా!

వెం—దేవు డనేవా డొక డుంటే అంతే గతి. చేతకానితనాని కది శిక్ష. మళ్లీ నే వచ్చేలోగా పరీక్షలో తేరి వుద్యోగార్హత పొందివుంటే తప్పు అపమరత క్రింద తొలగిస్తాను. ప్రస్తుత మతనిని సస్పెండు చేసి అతని పాతచట్టాలన్నీ మూలదోయించాను. నేను లేనప్పుడు వాటి నతడు మళ్ళీ తీసి తగిన మరమ్మతు చేయిస్తేతప్ప వొక దానినీ వాడని య్యను.

వార్డరు—ఏమమ్మా! ఆఫీసర్లు వచ్చే వేళయింది.

శ—సంతానుడా! నే వెళ్లనా!

వెం—యిక సంతాను లెవరూ నాకండ్లకు గనబడరు గాంధి వాలె మళ్లీ వొక్క మాటు నా చెయ్యి ఆలింగనం చెయ్యి. ఆలింగన మన్యోన్యం కుదురుస్తుంది. అహా! యిక వెళ్లు

తోటకూర వార్డరు కిచ్చి శవర బయలుదేరింది. మొదటిపహరా దగ్గరకు వచ్చింది,

నాయుడు—సామంత్రం నిజమేనా?

శ—యింకా అబద్ధమా! కనిపెట్టుకొని వుండా. మంచి బహుమతి లియ్యాలె,

వాలుగంటి చూపులతో నాయునిని సంహరించి కదనుదొక్కుతూ సాహెబున్న గేటుదగ్గరకు వచ్చి చిరునవ్వు నవ్వింది. మచ్చుచల్లినట్టు సాహెబు వెర్రిచూపులు చూస్తూ వూరుకున్నాడు. తోటకూరసంగతి మరిచిపోయినాడు. శవర గేటుదాటి కొరిటెపాడురోడ్డు పట్టింది. కొంతసేపటికి మత్తుదిగి శవరవైపు చూచాడు. బిగ్గరగా కేకవేశాడు. ఆ కళ్ళాలు తిరిగి చూచిన పాపాన బోలేదు. సాహెబు జాగ్రత్తగా పహరా యిస్తూనే వున్నాడు.

---

## ఇరువది నాల్గవ అధ్యాయం

# కేసు

వెంకటదాసు కేసు విచారణరోజున దూరపు జిల్లాలనుంచికూడా వేలకొలదిజనం గుంటూరులో దిగారు, మంగళాపురంనుంచి పసిబిడ్డబాలాదీ వచ్చి వెంకటదాసుముఖా వలోకనం చేసుకోవలెనని ఆతుర్దా పడుతున్నారు. వెంకటదాసు చేయించినవి బందిపోట్లే అయినా వాటివల్ల స్వల్పసంఖ్యాకులను ధనికులకే నష్టం గలిగిందిగాని జనబాహుళ్యానికి సంబంధంలేదు. బీదలు బహిరంగంగా దాసుయొక్క వుద్యమాన్ని పొగడకపోయినా యిష్టగోష్టిగా మాట్లాడేటప్పుడు ప్రశంసించని వాండ్లు లేరు. నిజం చెప్పితే నిష్ఠూరంగాని దాసు వుద్యమం లోకానికి క్షేమకరమైందనీ, ఆయన ధర్మం అవలంబిస్తే సర్వసోదరభావ మేర్పడుతుందనీ పలువురు వాదిస్తుండేవారు. సాధారణపు కుటుంబాల

వాండ్లు విద్యావంతులు సహితం బందిపోట్లు సరియైనవని వాదించక పోయినా ఆషామాషీగా మాట్లాడేటప్పుడల్లా జగ్గడి ధర్మం అవలంబించడానికి మాకేమీ అభ్యంతరంలేదని అంటూవుంటారు. వుద్యమ మంతవింతగా కనుపడడం లేదు. కొందరు ధనికులు, విద్యావంతుల బుద్ధివికోని పత్రికలు ప్రకటించడానికి వుపయోగించి నూతన ధర్మం వ్యాపించకుండా చేయవలెనని ప్రయత్నిస్తున్నా కాలమహిమ యేమోకాని వాటిని చదివేవాండ్లు కనపడరు. దేశంలోని పరిస్థితులు విషమావస్థను బొందినవనీ కాస్తమిట్టలు చెక్కి పల్లాలు పూడ్చనిది స్థితిగతులు మరింత ఘోరస్థితికి వస్తవనీ చాలామంది అంగీకరించారు. యీ అభిప్రాయ బలంచేత భాగ్యవంతులూ మిట్టలు చెక్కడానికి ఒప్పుకోక పోయినా పల్లాలు పూడ్చే ప్రయత్నం అందరూ కలిసి చేయవలసిందేనని సిద్ధాంతీకరించారు. కూలీలకు సరళమయిన కూలి యివ్వవలసిందనీ వాండ్లస్థితి బాగుచేయవలసిందనీ యంత్రశాలలు స్థాపించి చేతిపనులు వృద్ధిచేసి బీదలకు జీవనం కల్పించవలసిందనీ అందరూ అంగీకరించారు. వృత్తులు వృద్ధిచేసే ప్రయత్నాలు ప్రస్తుత ప్రభుత్వంవారు చేయక పోవడమే కాకుండా కొన్ని విషయములలో బుద్ధిపూర్వకంగా యింగ్లండుయొక్క క్షేమానికై దేశవృత్తులను అణచడంచేత అలగాజనానికి జీవనం చెడిపోయి బందిపోట్లు వృద్ధిగావడానికి ప్రబలహేతువని యోచనగల వాండ్లంతా గ్రహించారు. "కలౌ సంఘే బలీ" అను ప్రమాణం ప్రకారం కలియుగంలో స్వల్పసంఖ్యాకులగు పాలక సంఘాలకూ గురువర్గానికీ ధనిక శ్రేణులకూ రయితు సమాజములకూ హస్తగతమైన అధికార ముండదనీ అగ్రజాతులనుంచి తొలగి జనసామాన్యంయొక్క పరమౌతుందనీ కాలజ్ఞులు నిశ్చయంగా కనిపెట్టడమే కాకుండా కాల పరిపాలనకై వేచియున్నారు. శీఘ్రపరిపాకానికి తోడ్పడుతున్నారు గూడాను. రాజకీయ పరిస్థితులు పూర్తిగామారి పాలనాధికారం దేశీయుల చేతిలోనికి రానిదీ దేశం ఏ విషయమునా అభివృద్ధి చెందడానికి వీలులేదని నిశ్చయించి స్వరాజ్యస్థాపనకై విశ్వప్రయత్నాలు జరుగుతున్నవి. కాలం కర్మం వొనగూడినట్టు ప్రపంచవాతావరణంలో గలిగిన మార్పుల కనుకూలంగా దేశమందడగివున్న శక్తులనన్నిటినీ పొందుపరచి జయమొనగూర్చ దగిన మహాపురుషులు జన్మించి వివిదోద్యమాలను పెంపొందించి ఢీకొలుపుతున్నారు. కొత్తా పాతా యావత్తూ ఒకమూసనబడి కరిగి సమ్మిళితమై వొక నూతనశక్తిగా విజృంభించి జగన్నాథుని రథంవలె పరిభ్రమిస్తున్నది. యిది నిజంగా జగన్నాథుని రథమే. యీ త్వరను యీ మహాశక్తిని యెదిరించడానికి యెవరికి సాధ్య మవుతుంది? యెవ డాప సాహసిస్తాడు? స్వార్థపరులు మూర్ఖించి యెవ్విసా వినాశనానికే కారణమవుతుంది. యీ వినాశం సార్థ్యపరత్వానికే కాని స్వార్థపరులకు గాదు. వారూ పునీతులే అవుతారు.

మొదటిరోజున సంతానులు కావలిసైన్యాన్ని ముట్టడించి నష్టం గలిగించడంచేత తిరిగి ముట్టడించేయెడల జననాశం గాకుండా వుండటానికి యోచనలు జరుగుతున్నవి. ఆఫీసుకు ఫర్లాంగుదూరాన చుట్టూ మెరుపుసారముతో గూడిన తీగెలు కంచె వేయించి మరఫిరంగులు పెట్టించడానికి 1000 మరఫిరంగులు పంపించమని చెన్నపట్టణానికి తీగె యివ్వగా చాలినన్ని వారిదగ్గర లేనందున యితర రాజధానులకు తారిచ్చి తెప్పిస్తున్నారు. అరండల్ పేటా, బ్రాడీపేటలో యిండ్లన్నీ ఖాళీ చేయవలసిందని వుత్తరువులయినవి. యీ సంగతులన్నీ ~~వెంకటదాసు~~ విని కలెక్టరును పిలిపించుకొని వృథా జన

హింసకు హేతువు లయినమాట్లడులు. యిక జరుగకుండా తాను బందోబస్తుచేసినానని, జనులు వృథాగా యిండ్లు విడువవలసినకారణం లేదనీ తాను దిట్టపరచినందుకు ఆరాత్రి ముట్టడి లేకపోవడమే కారణమనీ చెప్పి వొప్పించి ప్రయాసలు మాన్పించాడు. కొండ వీటికొండలమీద మిడతలదండు వాలినట్లు యెక్కడ జూసినా దొంగలపుట్టని గొడ్లు గాసేవాండ్లు గ్రామాలలోకి కబుర్లు దెచ్చారు. కాని గాలి వచ్చేంగనే పురుగులు లేచి పోయినట్లు దొంగలంతా రెండవరోజు సాయంత్రానికి మాయమైపోయినారు. కొండన దొంగలజాడలు లేవని తెలియపర్చంగనే కొత్తసేన అవసరం లేదని టెలిగ్రాములు పంపి సైన్య మాపివేశారు.

వాయిదారోజున జనం ఊరంతా కిటకిటలాడుతున్నది. జనవత్తిడిలో ముద్దాయిని కలెక్టరాఫీసుకు తీసుకొనిపోవడ మసాధ్యమని తోచి తాలూకాఫీసులోనే విచారించవలసిం దని కలెక్టరు జడ్జీగారికి కబురంపాడు. ప్లీడర్లు చాలామంది తమకు వకాల్తునామాలు వస్తవని ఆశపడ్డారు గాని వెంకటదాసు వకీళ్లను పెట్టుకోలేదు. వెంకటదాసును మంచంమీద జయిలునుంచి తాలూకాఫీసులోగుండా తీసుకొనివచ్చారు. వేల జనం తిరునాళ్ళప్రజవలె అండల్ పేట, బ్రాడీపేటలనిండా మూగివున్నది. కొరిటిపాటిరోడ్డుమీద రహదారి ఆగిపోయింది. రణగుణధ్వనిగా గోలపుట్టి కోర్టులో విచారణ సాగలేదు, పోలీసులను పంపినా జనం కదలలేదు. హెండర్సన్ గారు విచారణ ఆపి జనాన్నితోసుకొని వాకిట్లోకివచ్చి అందరూ వెళ్లిపోవల్సిందని కోరాడు. వెంకటదాసును వొక్కమాటు కండ్ల జూడందీ పో మని పట్టుపట్టారు. అంతట మేజిస్ట్రీటు అఫీసుఆవరణలో యెత్తుగా బల్లలు వేయించి వెంకటదాసుమంచం వాటిమీద బెట్టించాడు. దాసు లేచి కూర్చున్నాడు. ఆంధ్రదేశా న్నల్లకల్లోలంచేసిన మహాశక్తివంతుడు వికలాంగుడై వుక్కుచెడి మంచంలోపడి వుండడంచూచి జనం దుఃఖించారు. యితడెవరో విచిత్రపురుషు డని విస్మయపడ్డారు. మంచం దింపి ఆఫీసులోకి తీసుకొని పోవంగనే జనం గాలికి మేఘాలమోస్తరుగా విచ్చిపోయినారు. విచారణ ప్రారంభ మయింది.

కో—నీ పేరు వెంకటదాసా? జగ్గడా?

వెం—నా పేరు వెంకటదాసు వురఫు, జగ్గడు.

కో—జగ్గడా? జగన్నాథమా?

వెం—జగ్గడే. అదే నాకు ప్రియమైన పేరు.

ఫిర్యాదితరపు విచారణ ప్రారంభ మయింది. కృష్ణాజిల్లాలో జమీందారీ యిండ్లలో జరిగిన రెండుబందిపోట్లనుగురించీ, కర్నూలులో వొక వర్తకుడింట్లో జరిగిన కన్నపునేరమునుగురించీ సాక్ష్యం పెట్టారు. యీ మూడుకేసులలోను జగ్గడు స్వయంగా వుండి చేయించినట్లు అతనిని గుర్తించినట్లు సాక్ష్యం వచ్చింది. మూడుచోరీలలోను షుమారు 10 లక్షలసొమ్ము పోయింది. మొయ్యలేక వెండినగలు పారవేసిపోయినారు. యినపపెట్టెల తాళాలదగ్గర మెరపుసారం ప్రయోగించి గోడయిటికెలు దీసినట్లు ఇనప బెద్దికలు తీసి పారవేసివున్నవి. లండను పారిసునగరాలలో చోరాగ్రేసరు లుపయోగించేసాధనా లుపయోగించారు. రషియాదేశమునుంచి బోల్షివిక్కులివి సప్లయిచేసి వుంటారని ఫిర్యాదితరపున సూచించారు. "శోషించినధనాన్ని సంస్థానాల ఆదాయము

లనూ, మోటారుబండ్లకూ దాసీలకూ బోగంకత్తెలకూ సారాయిలకు ఉపయోగించి పాడుచెయ్యగా కొంతభాగమయినా బీదల కుపయోగించకపోతే మళ్లీ వచ్చి దర్శనం చేస్తామని జగ్గడు యింటివారిని లేపి చెప్పిపోయినా" డని యిద్దరు జమీందారులూ సాక్ష్యం చెప్పారు. వర్తకుడు తాను చోరీ జరిగినప్పుడు ముద్దాయిని బాగా చూచాను గాని యిప్పుడు గుర్తించలేకున్నాడు. సొత్తు మాత్రం వొక కేసులోనూ చిక్కలేదు.

కో—ఇన్స్పెక్టరుగారూ! యీనగలన్నీ యితరుల కమ్ముకోకుండా యేమి చేస్తున్నారు.

ఇ—నల్లమలకొండలలో జగ్గడు టంకసాల పెట్టించి కాసులూ కారీలు చేయించిన అచ్చులు సోదాలలో దొరికినవి. వాయిదా యిస్తే అవి తెప్పించి దాఖలు చేయిస్తాను.

కో—యీ కేసుకు సంబంధమేమున్నది? నగలలోవుండే రత్నాలేమయినవి?

ఇ—అవి వూడదీసి అమ్మకుంటే గుర్తుపట్టడం కష్టం. సంతానులు చేసిన అన్ని చోరీలలో రిపోర్టుదాఖలా పదిలక్షల రూపాయల ఖరీదుగల రాళ్ళు పోయినట్టు తేలుతుంది. వొక్కరాయి గూడా మాకు చిక్కలేదు.

కో—సాక్ష్యం పూర్తి అయిందా?

ఇ—చిత్తం.

కో—వెంకటదాసూ—ఆపేరునే పిలవడం నా కిష్టం. నీ తల్లిదండ్రులు పెట్టిన పేరు యెందుకు మార్చుకుంటావు?

వెం—చిత్తం. వెంకటదాసే నా పేరు. మధ్యవచ్చిన పేరు మధ్యనే పోనీయండి. ఆలోచించుకుంటే నా చరిత్ర యావత్తూ లోకానికి రజ్జుసర్పభ్రాంతిగా వుండక పోదు.

కో—వేదాంతివిగూడానా!

వెం—వేదాలను అంతమొందించేవాడని ఆ మాటఅర్థమిచ్చేటట్టయితే వేదాంతినే?

కో—వేదాలను అంతము చేస్తావా?

వెం—లోక కంటకములైన ధర్మాలందులో వుంటే వాటిని.

కో—సాక్ష్యమంతా విన్నావుదా, యేమి చెపుతావు?

వెం—సాక్ష్యమంతా నిజమే. కొన్ని కొత్తసంగతులు చెప్పుకోవలసి వున్నవి. వుత్తరువు దయచేయిస్తే చెపుతాను.

కో—దేనిని గురించి?

వెం—ఫిర్యాదీ, యిండియాచక్రవర్తి నే జేసినవి దొంగతనాలంటాడు. నేకాదంటాను. ఆసందర్భంలో నే జెప్పేది సాకల్యంగా వ్రాసుకోవలసిందని నా కోరిక.

కో—చెప్పుకోవచ్చు. యావత్తూ వ్రాస్తాను.

వెం—సృష్ట్యాదిన హక్కు స్వత్వాలు లేవు. జనులు సోదరభావంతో భూదేవి యిచ్చిన పంటను అన్యోన్యతానికభావంతో అందరూ అనుభవిస్తూ వుండేవారు. గ్రామంలో నిలువచేసిన ధాన్యాలపాతళ్లు: గాదెలు, కొట్టు గ్రామసంఘాలు గ్రామసమూహానికై వుపయోగిస్తూవుండేవాండ్లు. జనులందరికీ సంఘసేవదప్ప రెండవ సేవ లేదు. ఆహార పదార్థాలే ద్రవ్యం. ధనకాంక్ష పుట్టలేదు. వెండిబంగారు పెంకుల కింకా విలువ లేదు. ఆహోరాత్రాలు వాటిని కాపాడేకాలం గాదు. అంతా పనిచేసుకుండేవాండ్లు. ఆరోగ్య

వంతులై అనుభవించేవాండ్లు ఆ రోజులలో సంపాదన అనుభవించడంకోసం గాని దాచుకొని కాపాడడంకోసం గాదు. మనసుకు తృప్తివుండేది. వ్యాకులమూ, తొందరా, పోటీలూ లేవు. జనులు నిర్మలమనస్కులై ఆనంద మనుభవిస్తూవుండేవాండ్లు. అందరూ భాగ్యవంతులే. దారిద్ర్యమే లేదు. స్వర్గం భూమిమీదనే వుండేది. అంతవరకూ దేవుడు చక్కగా పాలిస్తూవుండేవాడో లేక అప్పటికి దేవు డింకా పుట్టనేలేదో, పుట్టినా మయినార్టీ కాలమో, వెళ్లినా పట్టాభిషేకం కట్టుకోదేమో. ఇట్లా వుండగా ఈశ్వరుడు వచ్చి ప్రపంచ మంతా నా దన్నాడు. నేను గొప్పవాడిని గనుక నా కంతా మీరు సేవచెయ్యండన్నాడు. తనకు మేడలుగట్టమన్నాడు. తననురధ మెక్కించి మొయ్యమన్నాడు ఈశ్వరుడి ఐశ్వర్యంచూచి చిన్నదేవుళ్లు బైలుదేరారు. త్రిమూర్తుల మన్నారు. దిక్పాలకులమన్నారు. చివరకు మా గణితం ముప్పైమూడు కోట్లన్నారు. ఇంకా పెరిగింది. గ్రామదేవతలూ గృహదేవతలూగూడా పుట్టారు. జనులసంఖ్యకంటే దేవతలసంఖ్యే యెక్కువైంది. కొలువులు సాగినవి. వీండ్లనుజూచి కొందరు జనులకుకూడా నోళ్లూరినవి. గురువులు భూదేవతలమని బయలుదేరారు. పుడమిదయ్యాలై ఐశ్వర్యవంతులు పుట్టారు. యథాశక్తిగా దేశాలు, గ్రామాలు, క్షేత్రాలు; ధనధాన్యాలు ఆక్రమించుకొన్నారు మనుష్యులను బానిసలుచేసి పశుత్వమిచ్చి వారిమీద సైతం స్వామ్యం సంపాదించారు. అందలాలెక్కుతున్నారు. పోటీదార్లెక్కువ గావడంచేత గావాలె, ఈశ్వరుడు స్వర్గాన్ని హరించి భూమిమీదనుంచి యెత్తుకొనిపోయి యెక్కడనో పెట్టుకున్నాడు. స్వర్గం భూదేవతలకూ ధనికులకుకూడా దూరమే అయింది. యెవరైనా అక్కడి కడుగు పెట్టగలరుగాని వీండ్లకు సాధ్యంగాదు. అని తెలిసి ఐశ్వర్యవంతులు తక్కినవన్నీ అరుపుకున్నారు ... ... ... స్వర్గం భూలోకం విడువంగనే నరకమూ, దుఃఖమూ, అత్యాశా అతృప్తి, లోభమూ, దారిద్ర్యమూ, పన్నులూ అతిశయించినవి. ఇనుక మేట వేసినట్టు ధనం యేకొద్దిమంది దగ్గరనో చేరింది. వొకచోట పల్లం చేస్తేనేకాని వేరొకచోట మెట్ట యేర్పడదు. భూమి కృంగి చెరువయితే పక్కన కొండవొకటి పైకుబుకుతుంది. వొకద్వీపం మునిగి మరొకద్వీప మేర్పడుతుంది. ఆ శేష జనులూ దరిద్రులై యెవరో కొందరు భాగ్యవంతులైనారు. భాగ్యవంతులకే భాగ్యం, దరిద్రులకే దారిద్ర్యం నిలకడయింది. రెండూ పెంపుగూడా అవుతున్నవి. సమర్థులయి యితరుల ధన మపహరించిన వారికేగాక అప్రయోజకులైనవారి సంతానానికే వారసత్వ ప్రకారం ధనం రావలసిందని చట్టాలు చేసుకున్నారు. కష్టపడి పంటలు పండించి చేతిపనులు చేసి అమర్చిన పదార్థమంతా ధనికు లపహరించి తిని తొక్కి తొంబాడిచేసి శ్రమపడి పనిచేసేవాండ్లకు ఆహారము లేకుండా చేస్తున్నారు... ... ... ... ... ... ... ... ... ... ...

వీటి కనుకూలంగా చట్టాలుకూడా చేసుకున్నారు. భాగ్యవంతులు బీదలను దోచుకుంటే దాని పేరు వ్యవహారం. బీదలు తమహక్కును తీసుకుంటే చౌర్యం.........బీదల దగ్గర నుంచి మోసము చేసి ఆకర్షించిన ధనం మరల బీదలు లాక్కుంటే యెట్లా తప్పయిందో కోర్టువారు నిర్ధారణ చేయగోరుచున్నాను. ఇటువంటి అక్రమచట్టాలఘోరపసంతానమే బీదల నేరాలు. అశాస్త్రీయచౌర్యములకంటె శాస్త్రీయచౌర్యములే లోకాని కెక్కువ హాని చేస్తున్నవి. భాగ్యవంతుల కుపయోగించేది చట్టసమ్మతం. కానిది నేరం. భాగ్యవంతుల ప్రాణానికి విలువ యెక్కువ. బీదవానికంటె భాగ్యవంతుని కునకమే అతిశయం

బీద లోడ్చినచెమటా రక్తమూ కరుడుగట్టి ధనికుని భాగ్యమవుతుంది. కాని యిది భాగ్యవంతు డంగీకరించడు. భాగ్యవంతుడు పేదవాని కెంత అవసరమో పేదవాడు భాగ్యవంతుని కంతవసరం కాని భాగ్యవంతు డది గుర్తించడు. బీదవాండ్లను భాగ్యవంతుల క్షేమానికే భగవంతుడు సృష్టించాడనే వాండ్ల నమ్మకం అంతరించిన్ను బీదలజన్మలు ప్రయోజనకారులు గావు, అందువల్ల భాగ్యవంతుల కుపయోగపడనిబీదవాం డ్లుండనవసరము లేదు, యిది కలియుగధర్మం మతకర్తలీకలియుగధర్మాల నంగీనరించరు. మత కర్తలబోధలు వారిఅనుచరులకక్కరలేదు. వారిధర్మాల కనుగుణమైన కృతయుగధర్మాలను పునరుద్ధరించవలెననినా ప్రయత్నము. కలియుగంలో రాక్షసులు లేరంటారు గాని ధనికులే కలియుగరాక్షసులు......మా సంతానుల చర్యలవల్ల ధనికుల భారం తగ్గుతుంది, బీదలకు సుఖం గలుగుతుంది. దేశమాత ప్రసాదించగల సౌభాగ్యాలు ఆమె సంతానమంతా సమానంగా అనుభవించడానికవకాశం గలిగి యిహమే స్వర్గ మవుతుంది. దేవరాజ్యం భూమిమీద తిరిగీ పునస్థాపితం గావడమే నాపరమావధి. నాపరమావధే నాదేవుడు. దానిని పొందడమే నా కానందం.

కో__స్వర్గలోకభోగాలు నీ కవసరం లేదా?

వెం__వాటి సంగతి నాకు తెలియదు. యింతవరకు యెవరికీ తెలియదనే నా అభిప్రాయం. దానివిషయమై విచారించినవాం డ్లంతా తలాఒక అభిప్రాయం చెప్పారు. పరలోకవిషయాలు అక్కడికి పోయినప్పుడు విచారించుకోవచ్చు. యిప్పుడీ లోకం బాగుచేతాం. ఇంతమాత్రం చేయగలిగితే చాలు. మేఘాలను నమ్మి చెరువు తెగగొట్టుకొన్నట్టు అనుమానస్పదమయిన పరలోకంకోసం యిహాన్ని త్యజించవద్దు.

కో__ధనధాన్యాలూ, సుఖదుఃఖాలూ పూర్వజన్మం కర్మలవల్ల మానవులకు లభించవా? తక్కవనోములు నోచి యెక్కువకోరికలు కోరితే యేమి ప్రయోజనం?

వెం__పూర్వజన్మ కర్మవల్లనే లభిస్తవనుకోండి. భాగ్యవంతులకు ప్రాప్తముండే వారు బీదలధనాన్ని అపహరించారు. యిప్పుడూ పూర్వజన్మ కర్మఫలంచేతనే బీదలు తమ న్యాయార్జితాన్ని తిరిగీ పొందుతున్నారు.

కో__అయితే సంతానులు శిక్షించబడుతున్నారు గదా.

వెం__అవును. భాగ్యవంతులబాటు సాగినంత వరకు శిక్షింప బడుతూనే వుంటారు. భాగ్యవంతులు తమ వర్తనను మార్చుకోకపోతే బీదలే చట్టాలు మార్చి లోకములో భూతల స్వర్గం స్థాపిస్తారు. ఈ ధర్మం చిరవేగడానికి దయా సత్యశౌచాలు సాధనంగా తీనుకొంటాం. నా హయాంలో జరిగిన వొక్క బందిపోటులో గూడా హత్యలు జరగలేదు. నా అనుచరులు మద్యపానం, వ్యభిచారం విడిచిపెట్టినారు. నాధర్మ ప్రభుత్వంలో పంజాబు దురంతాలు జరగడం సాధ్యంగాదు. నాది హృదయ రాజ్యం, నా రాజ్యం నశించదు. నే బోయిన తరువాతగూడా అది నిలిచే వుంటుంది. జనుల హృదయపీఠాలలో నా సింహాసనం నిలిపాను. నా ధర్మాలు అములులోకి రాక తప్పవు. పాలనా పద్ధతులు అవసరాన్ని బట్టి మారుతుంటవి.

కో__ముగించావా?

వెం__ముగించినట్లే. ఆయాసంగా వుంది. యిప్పటికే గ్రంథం పెరిగింది.

కోర్టు__తీర్పు__వెంకటదాను పురఫు జగ్గడు అనే బందిపోటునాయకుడు

విచిత్రపురుషుడు. దయాసత్యశౌచాలు తనవుద్యమానికి ఆధారము లంటాడు. తనమీద వచ్చిన సాక్ష్యమంతా సత్యమే నని అంగీకరించి సత్యంయెడల తనకు గౌరవ మున్న దని నిరూపించాడు. అతని అనుచరులవల్ల అనేకబందిపోట్లు జరిగించినా వొక్కచోటకూడా హత్యలు జరిగించలేదు. వారందరూ అదివరకు దుర్వృత్తులు గలవారైనా యితని అదుపుచేత మద్యపానాదిదురభ్యాసాలు వదలిపెట్టినందుకు పోలీసుసాక్ష్యమే రుజువు. దీనివల్ల యీబందిపోటునాయకుడు మానవులను సన్మార్గంలో నడిపించడానికి కొంత సమర్థుడైనది తెలుతుంది. యితడే వొకపీఠాధిపతో లేక రాజో అయితే లోకానికి మహోపకారం చేసేవాడేమో! యీ విషయమై అతనిని ప్రశ్నిస్తే తానుగూడా తక్కిన గురువులు రాజులతో పాటివాడినే అయ్యేవాణ్ణని చెప్పేవాడు. యితని వర్తనం పీనల్ కోడ్డు మూడువందలతొంభై అయిదవ సెక్షనుప్రకారం నేరం అయినట్టు నిర్ధారణ చేశాను. అయినా యితడు సర్వోత్కృష్టమయిన వుద్దేశ్యముతో తాను చేసేది లోకసేవనీ, తన ధర్మాలు కొంతకాలానికి సర్వజనులచేతనూ అంగీకరించబడుత వనీ, నమ్మి బందిపోట్లను జరిగించడం నిర్వివాదాంశం. రాబోవు తరాలవారు యితనివర్తన నెట్లు భావిస్తారో గాని ప్రస్తుత చట్టాలప్రకారం యితడు నేరస్తుడనక తప్పదు. పై కారణాలచేత సరళభావంతో అయిదు సంవత్సరాలు విడిఖైదు మాత్రం విధించాను. యితనిని నిడదవోలు సెంట్రలు జయిలుకు పంపడమవును.

ఎ. జి. హెండర్ సన్, ఐ. సి. ఎస్.

దండనాథుడు. ౮ - ౨ - ౨౨. రాత్రి తొమ్మిదిగంటలు.

---

తరువాయి పేజీ నంబరు 383 కు బదులు 371 పొరపాటున పడినది.

ఓమ్!

బ్రహ్మకృపా హి కేవలమ్

# మాలపల్లి

## నాల్గవ భాగము

### ఒకటవ అధ్యాయం

### జైలు

రామదాసునూ, ఆయన స్నేహితులనూ, వెంకటదాసునూ సెంట్రలుజయిలుకు బంపారు. వారి జైలుజీవితం చెప్పకపూర్వం జైళ్లలోని ఏర్పాట్లుకొన్ని తెలుపడం అవసరం. నిడదవోలు సెంట్రలుజెయిలు బ్రిటిషుప్రభుత్వములో మొట్టమొదట స్థాపించిన జయిళ్లలో వొకటి. తొలిప్రారంభములో చిన్నదిగా కట్టినా క్రమంగా విశ్లంబ్రం చేసారు. పాత భాగంలో అరా వొంటికొట్లున్నవి. ఖైదీలందరిని ముందు వొంటరిగా వొంటికొట్లల్లో వుంచేవాళ్లు. దీనిలో తూర్పుపడమరలరస్తా పోతుంది. రస్తాకు దక్షిణంగావున్న నాలుగు బారకాసులలో ౧౦౦ గదు లున్నవి. దానికుత్తరంగా అష్టకోణాల చిన్న ఆవరణం దాని కానుకొని నలుదిక్కులా వ్యాపించే ఆరు బారకాసులూ, డెబ్భైయెనిమిది గదులూ వున్నవి. దీని కుత్తరంగా 30 గదుల బారకాసున్నది. దీనికీ కొత్తభాగానికీ సంబంధం లేకుండా మధ్య ప్రహరీ వున్నది. పాతజయిలు కానుకొని వాయువ్యంగా కొత్తజయిలు కట్టారు. సింహద్వారం తూర్పుకున్నది. దీనికి మధ్య గోపురమనే పేరుగల మూడంతస్తుల మేడలో సూపరింటెండెంటు ఆఫీసూ దానికి చుట్టూ ౮౦ గజాల వెడల్పుగల మెరబా గుండ్రంగా వుంటుంది. ఈ మెరబాచుట్టూ యేడుబారకాసులు వ్యాపించి వుంటవి. ప్రతిబారకాసుచుట్టూ ఓపినంత విడిస్థలం చక్కగా వుంటుంది. ఐదవ బారకాసులో రెండువరుసలు చీకటి వొంటికొట్లుంటవి. వొకవరుసలో మరణదండన పొందినవాండ్లనుంచుతారు. రెండవది చీకటికొట్లుగా వుపయోగించుతారు, తక్కిన ఆరుబార కాసులలో వొంటికొట్లు లేవు. వొక్కొక్కదాంట్లో ౧౨ మంది పడుకొనడానికి వీలుగా చావళ్లుంటవి. ప్రతిసావిట్లో మలమూత్రాలకు చిన్న ఆరలుండేవి. ఇప్పుడవి తీసివేసి సావిట్లోనే బహిరంగస్థలములలో మలమూత్రభాండా లుంచుతారు. దానిని బట్టి ఖైదీలు పూర్వానికంటె నాగరికులయినా రని స్పష్టంగా చెప్పవచ్చు. ప్రతిబారకాసుకూ సంబంధించి ఆవరణలో వెడిగెలగా కక్కసుదొడ్లు వుంటుంది. రెండుజయిళ్లకూ చుట్టూ వుండే ప్రహరీగోడ మూడునిలువులయెత్తున గాజుపెంకుల మసురు బోసి వుంటుంది. తూర్పున రహదారి తక్కినవైపుల జయిలుకు సంబంధించిన వేలకొలది యెకరాల తోటభూములూ వున్నవి రహదారిలోనుంచి చీలి జైలులోకి రోడ్డుపోతుంది.

ఈ చీలురోడ్డుకు కుడివైపున ౨౦౦ ఖయిదీలను వుంచడానికి వీలయిన క్వారంటేను కట్టించారు. దీనిలో కొన్ని వొంటికొట్లూ సాళీళ్లుగూడా వున్నవి. సెంట్రలుజయిలుకు వచ్చే ఖయిదీలందరినీ అంటురోగా లున్నవేమో పరికించడానికి సాధారణంగా పది రోజు దీంట్లొ వుంచుతారు. దీనిలో వుండే వుక్కుకష్టం తరువాత విపులంగా చదువు దురుగాని.

దీని వానుకొని ఆడవాండ్లక్వారంటే నంటుంది. ఈ రెంటికే పడమరగా వురి మాను కట్టారు యీ యింట్లో యిద్దరుమనుష్యులను ఒకేసారిగాని లేక వొకటిచెడిపోతే పని ఆగకుండా రెండవవానికి కట్టి వురి దీయుడానికిగాని వీలయ్యేటట్టు గాని యేర్పాటు జేశారు.

రోడ్డుకు దాపట సివిలుఖయిదీలను వుంచడానికి జైలుఖానా కట్టారు. దీనిలో కూడా ౨౦౦ మిందిని వుంచవచ్చు. యీమూటికీ పెద్దజైలుకు మోస్తరుగానే గాజు పెంకులమదుళ్లుబోసిన చుట్టుగోడ లుంటవి. జైలునిండా బ్రహ్మాండమైన రావులూ, చింతలూ, వేపలూ పెంచారు, జైలుపొలాలలో ఖయిదీలచేత వ్యవసాయం చేయించి కపిలెల్క్రింద అనేకరకాల పంటలూ, కూరగాయలు పండిస్తారు. ప్రతి బారరాసుకు సంబంధించి కార్ఖానా లుంటవిగాని క్వారంటేనులోమాత్రం రాళ్లు పగలగొట్టడం సాగ నారదీయడమే చేయిస్తారు.

నిడదవోలు సెంట్రలుజయిలు పదహారువందల ఖయిదీలు పడుతుంది. దీనిని రాజ ధానిలో మొదటిరకం జయిలుగా యెంచుతారు. ఆరితేరిన దొంగలతో నిండిన యీ పెద్దగ్రామాన్ని పాలించడం మహాకష్టపుపనే, యింతమందికి మూడుపూటలా భోజ నాలూ, వీళ్లందరిచేతా పనిచేయించడం, కాపలాచేసి అదుపులో వుంచడం, రోగమూ నొప్పి వస్తే బాగుచేయడం, గుడ్డలియ్యడం, కొత్తవాండ్లను చేర్చుకుంటూ గడువుతీరిన వాండ్లను విడిపించడం, ఆవరణలో జరిగే నేరాలను శిక్షించడం, యిటువంటి పను లెన్నో వున్నవి. వీటిని నిర్వహించటానికి శాఖోపశాఖలుగల అధికారవర్గం మున్నది. ఇది యిండియాలోని ఆంగ్ల పాలనాపద్ధతివలెనే రెండంతస్తులుగా వుంటుంది. సాధా రణంగా గవర్నరు మొదలు కలెక్టరువరకూ తనిఖీఅధికారం యావత్తూ తెల్లవుద్యోగస్తుల చేతులలో నున్నట్లే సూపరింటెండెంటు మొదలు నారరువరకూ అధికారంచెలాయించే భాగంవొకంతస్తూ, ఖైదీవార్డరు, మొదలు ఖైదీమేస్త్రీ వరకు మన నేటి వుద్యోగాలను బోలిన రెండవ అంతస్తుగా విభజించవచ్చు. పైశాఖ వాండ్లు స్వతంత్రులు. క్రిందిశాఖ వాండ్లుఅస్వతంత్రులు. సూపరిండెంటూ, జైలరూ, డిప్యూటీజయిలరూ, ఛీఫువార్డరు, చిన్నఛీఫువార్డరూ, హెడ్ వార్డర్లూ, వార్డర్లూ అని షుమారుమంది సర్కారువుద్యోగు లున్నారు. యిదిగాక గుమాస్తావర్గం, భండారవర్గమని రెండుశాఖ లున్నవి. ఆఫీసులో పెద్దగుమాస్తాను శిరస్తాదారనవచ్చును. భండారంశాఖవారు జయిలులో చేయబడే వస్తువుల క్రయవిక్రయాలు జరుపుతుంటారు. సూపరింటెండెంటు పాలకవర్గాధ్యక్షుడు. జైలరు అతనికి ప్రధాని. సాధారణముగా చేతిపనులూ, క్రయవిక్రయాలు యితను జరిపి స్తుంటాడు. సహాయ జయిలరు భోజనపదార్థాలు తయారుచేయించి సకాలములో ఖైదీ లందరికి అన్నవస్త్రాలు తయారుచేయించి యిప్పించుతుంటాడు వార్డర్లను పైతన్నెగారి గా

వుండే ఖైదీలను అదుపులో వుంచేపని ఛీఫువార్డరుమీద వుంటుంది ఖయిదీలచేత పనులు చేయించుతూ అదుపులో వుంచడం కొంతవరకు ఫారా వేయడం వార్డరుపని.

వార్డర్లకు తరువాతివాండ్లు ఖైదీవార్డర్లు. పాత నేరస్థులు యీవుద్యోగాలకు అర్హులుగారు. పెద్దశిక్షలుపడి మంచినడవడికగలవాండ్లను ఖైదీవార్డర్లుగా నియమిస్తారు వాండ్లకు చక్కని తెల్లపరాయి, చొక్కాలు, నడుముకు టంగు, తెల్లటోపి, యిత్తడి బిళ్లలలాటి వీరికి అధికారచిహ్నాలు. నెలకొకరూపాయిజీతం, వరెన్నం, మంచం, తాగా కుడవా లోహపుపాత్రలు, ఖైదుకాలములోనుండి పని జేసినకాలానికి నెలకు ౨ రోజులవంతున తీసివేత, ఇవే వీండ్లకు కలిగేలాభాలు. రాత్రి రెండుమాట్లు తడవకు రెండుగంటలవంతున ఫారా యిస్తూ పగలు వార్డర్లతో కలిసి ఖైదీలచేత పనులు చేయిస్తూవుంటారు. వీండ్లక్రిందివాండ్లు ఓవరుశీయర్లు తెల్లలాగు, చొక్కా, టోపీ వీండ్ల అధికార చిహ్నాలు నెలకు ఆరురోజులు తీసివేత. మంచినడతగల ఖైదీలందరు యీవుద్యోగం పొందటానికర్హులు. రాత్రి రెండుగంటలసేపు పావిట్లో ఫారాయిస్తూ పగలు ఖైదీవార్డర్లతో కలిసి పని చేయిస్తుంటారు. వీండ్లకు నెలకు అరరూపాయి జీతం. నైటు వాచర్లు లేక మేస్త్రీలు ఓవరుశీయర్లకు తరువాతివాండ్లు. అధికారానికి గుర్తుగా రెట్టన యిత్తడిబిళ్ల కట్టుకుంటారు. వీండ్లకు నెలకు నాలుగణాలు జీతం. నాలుగురోజులు తీసివేత. ఖైదీవుద్యోగస్థులందరికీ కాలికడియాలు తీసివేస్తారు.

జైళ్లు సెంట్రల్ జయిళ్లు జిల్లా జైళ్ళు తాలూకా లేక సబ్ జయిళ్లు అని మూడు విధాలు. సంవత్సరం లేక అంతకంటె యెక్కువశిక్ష పొందినఖైదీలు సెంట్రల్ ఖైదీలు కొన్నిజిల్లాలకు కలిసి వొక సెంట్రలుజయిలుంటుంది కొన్నిజిల్లాలలో జిల్లాజైళ్లుంటవి. వీటిలో ఒక సంవత్సరానికి తక్కువశిక్ష పడినఖైదీలను వుంచుతారు. ఇవి లేని జిల్లాల నుండి జిల్లాఖైదీలను సెంట్రలుకే పంపుతారు. సబుజైయిళ్లలో కేసు విచారణలోనున్న వాండ్లనూ, నెలలోపు శిక్షలవాండ్లను వుంచుతారు. యిదివరకు జన్మఖైదీలను మొదట బంకోలుకు, తరువాత అండమానులకు పంపుతుండేవారు. యిటీవల యీపద్ధతిమార్చి వీండ్లను కూడా సెంట్రలుజయిళ్లలోనే వుంచుతున్నారు. ఇప్పుడు ఘాతుకనేరములు చేసిన రాజకీయఖైదీలనుమాత్రము ద్వీపాంతరము పంపుతున్నారు.

ఖైదీలు సివిలుఖైదీలు, విడిఖైదీలు, కఠినఖైదీ లని మూడువిధాలు. బాకీలు చెల్లింపజేసే నిమిత్తం డిక్రీదార్లు అరెస్టుచేయించేవాండ్లు సివిలుఖైదీలు. స్మాలుకాజుడిక్రీకింద ఆరువారాలు, అసలు డిక్రీలకింద ఆరునెలలు వీండ్లను ఖైదులో నుంచవచ్చు. వీరి భోజన ఖర్చు డిక్రీదారే భరించుకోవలసి వుంటుంది. వీరికి నిర్బంధం తక్కువ. నేరస్థులుగా యెంచబడరు

సింపిలు లేక విడిఖయిదీలకు వరకం లేదు. వీండ్లను నియమితకాలాలలో భోజనం మొదలయినవాటికి బయటికి దీసి మిగిలినకాలం చావళ్లలో తాళాలువేసి వుంచుతారు. కఠినఖైదీలతోపాటు వీండ్లుగూడా పనిజేస్తే వీండ్లుగూడా సంవత్సరానికి నెలవంతున శిక్ష తీసివేత పొందవచ్చును.

కఠినశిక్ష వేయబడినవాండ్లు పనిచేయవలసివుంటుంది. బాగా పనిచేస్తే సంవత్సరమునకు ఒక నెలవంతున తీసివేతయిస్తారు. దీర్ఘశిక్షలు వేయబడ్డవాండ్లకు త్వరలో తేలే తేలిక పనులిస్తారు. ఖైదీలందరికి వాండ్లసంఖ్య శిక్షవేసిన తేదీ, విడుదలచేయవలసిన తేది

చెక్కించి మెడలో బిళ్లలు కడతారు. సంవత్సరపు లోపు శిక్షలవాండ్లకు చెక్క బిళ్లలు, ఆపైవాండ్లకు సత్తుబిళ్లలు, జన్మఖైదీలకు తుత్తునాగపు బిళ్లలూ యిస్తారు. జన్మఖయిదీలకు ఎఱ్ఱకుళ్లాయి, పాతనేరస్థులకు నల్లకుళ్లాయి, తక్కినవాండ్లకు తెల్లకుళ్లాయి గురుతులుగా వుంటవి. విడిఖైదీలు తమస్వంతదుస్తులు తెచ్చికట్టుకోవచ్చు. లేనివాండ్లయితే సామాన్య కఠినఖైదీలకిచ్చే చల్లాడంచొక్కా కుళ్లాయి చేతిగుడ్డ గోచీ యిస్తారు. కఠినఖైదీల కందరికీ కాళ్లకు యినుపకడియం వేస్తారు.

కోస్తాజైలుకు నైరుతీమూలని ఆడవాండ్లజయిలున్నది. ఆడవాళ్లకాళ్లకు కడియం వుండదు. జన్మఖయిదీలు ఎఱ్ఱంచుచీర, పాతనేరస్థులు నల్లంచుచీర, సాధారణఖయిదీలు అంచులేని తెల్లజామారు కట్టుకుంటారు. ఖయిదీవార్డర్లు మొదలైన వుద్యోగస్థులు ఆడఖయిదీలలోనూ వుంటారు. వీళ్లకు ప్రత్యేకంగా ఆడమనిషి సూపరింటెండెంటు. వార్డర్లూ ఆడవాండ్లే. వీళ్లందరూ పెద్దజయిలు సూపరింటెండెంటు అధికారానికిలోబడి వుంటారు.

ఈజయిలులో చేసేపనులన్నింటిలోను రత్నకంబళ్ల నేతవలన విశేషంగా ఆదా వస్తుంది. వేలకొలది రూపాయల విలువగల తివాసులు యూరపు మొదలయిన ఖండాలకు కూడా పంపుతున్నారు. అనేకరకాల అనలువేసి రత్నకంబళ్ళు నేస్తారు. ఈజయిలులోనే ఉన్నికి అనేకరకాలరంగులు వేస్తారు. ఒక్కొక్కప్పుడు పని తూగక రాత్రులుకూడా ఖయిదీలు నేసూ నేసుంటారు. ఎక్కువ పని చేసినందుకు మంచి భోజనం ప్రత్యేకరుసుం లేక ఎక్కువతిపివేత యిస్తూంటారు. రత్నకంబళ్ల నేత చిత్రంగా వుంటుంది. ఒకడు పాటపాడుతూంటే రెండవవాడు ఆపాటప్రకారం చేసి కోస్తుంటాడు. ఒకవుప్పు నేసేటప్పుడు మొదటివాడు యీ క్రిందివిధంగా పాటపాడుతూంటాడు.

"సెంటర్‌లోనే మాయ (వలుపు) వుండాది. మాయపైన్నే మాయవొకటి. ఆ మాయపైన్నే మాయపక్కలోనే మూడుబోలు (బ్లూ) వుండాది. మూడుబోలు పక్కలోనే రెండుయిడచే బోలువొకటి వుండాది. బోలుపైన్నే ముందుకు మాయవుండాది. మూడుమాయకు రెండుమాయ ముందుకు పోయేటట్టు వొక్క మాయపైన మాయవొకటి. మళ్లీ మాయపక్కలోనే నాలుగువిడిచీ ఎరుపువొక్కటి వుండాదీ. తెల్లమాయి కోసినావా?"

జవాబు—"కోసినాను."

"రెండుమాయ మూసిపోయింది మళ్లి పక్కలోనే మూడువిడిచీ నాలుగు తెల్ల మాయ కోసుకో. ఎక్క తెల్లమాయా ముందుకు పోతాది."

ఈవిధంగా పాటా, నేతా జరుగుతూంటుంది. ఈపాట చదివితే అగోచరంగా వున్నా, దానిప్రకారం అనవేసి నేస్తే చక్కనిపువ్వు యేర్పడుతుంది. రత్నకంబళ్ల నేత విశేషంగా వృద్ధిచేస్తే మిక్కిలి లాభకరమైన వృత్తి కావచ్చు. కోరికలప్రకారం వందలఅడుగుల పొడుగూ సెలవూపెట్టి తివాసులు తయారుచేసి వేలకొలది రూపాయల కమ్ముతారు.

రత్నకంబళ్లకు తర్వాత విరివిగా జరిగేపని చెప్పులు కుట్టడం. ఖయిదీలలో చాలా మంది పంచములుంటారు. గనుక యీపని విశేషంగా సాగుతుంది. ఇండియా సైనికులకు క్రోంచెప్పులు సరసమైన ధరలకు చేస్తారు. వీళ్లకు క్రోం చవుకగా దొరకడంచేత

యితరచోట్లకంటే చెప్పులు చవుకగా దొరుకుతవి. బహుశా కూలి వూరికేరావడంచేతనేమో. జయిలుకు వెలుపల యిటికా సింహా కాల్పించి మంచి లాభం తీస్తారు. ముక్కరాయి కొట్టించడం, గులకసున్నం కాల్పించడం, నూలుసంచులూ, చాపలు, నవారు అల్లడం, కొబ్బరితాడు పేనడం మొదలయినవి ఆదాయంవచ్చే యితరవృత్తులు.

వ్యవసాయంవల్ల ధాన్యంకూడా పండిస్తారు. వర్షాధారం కనుకనూ, భూమి సారవంతం కాని ఎర్రనేల కనుకనూ ఖయిదీల భోజనానికి చాలినంతధాన్యం పండదు. కపిలెల్క్రింద కూరగాయలు అమోఘంగా కాయిస్తారు. గుమ్మడికాయలు పరిమాణంలోనూ రుచిలోనూ మిక్కిలి శ్రేష్టములు. బళ్లకొలదిగా చిక్కుడుకాయలూ, వంకాయలూ, రామాఫలాలు, ముల్లంగిసంపలు, ఉల్లిగడ్డలు; ఆకుకూరలు కొల్లలుగా పెంచుతారు. ఇన్నిరకాలకూరలు అగ్గవగా దొరికినా ఖయిదీలకు విశేషంగా వుపయోగపడేది ముల్లంగిఆకే. తక్కినవి లాభానికి అమ్మినా భాగానే వుండును. చాలాభాగం ఖయిదీల్క్రింద ఖర్చువ్రాసి నడిపింటివాళ్లే తింటారు. జైలలో చేసినవస్తువులు, పంటలు అమ్మడంలో చాలాభాగము వుద్యోగస్తులు తింటారు. ఆహారపదార్థాలు కొనడంలో దోపిడీ జరుగుతుంది. కొన్నపదార్థాలు చాలాభాగం మాయంకూడా అవుతవి. నాలుగోవంతుకు తక్కువకాకుండా వుద్యోగిస్తులు అపహరిస్తారనడంలో అతిశయోక్తి లేదు.

ఖయిదీలు అస్వతంత్రులుగనుక దీని నాపలేరు. అమెరికా, జర్మనీదేశములలోని జైలుపాలనాపద్ధతి అవలంభిస్తే నరకతుల్యాలుగావున్న మనజైళ్లు విద్యాలయాలు చేసి ఖయిదీలవర్తన మార్పుకరమైన పౌరులనుజేసి విడిచిపెట్టవచ్చును. అన్ని ప్రభుత్వశాఖలలోను సంస్కరణ మవసరమన్నమాట వాస్తవమే గాని జైలుపాలనాపద్ధతి సమూలంగా రద్దుచేయడం మొదటిసంగతి. ఇది దిద్దితే బాగుపడేది కాదు. ఈ పాలనాపద్ధతివలన వేలకొలది ఆత్మలు కురూపమును పొందుచున్నవి. వికారరూపం పడుతున్నది. ఖయిదీలందరు జైలు ప్రవేశించేటప్పటికంటె వెళ్లిపోయేటప్పుడు అనేకవిధాల క్షీణిస్తున్నారు. జైలులో తప్పక దుర్నీతి అలవడుతుంది ఆత్మగౌరవము నశిస్తుంది. మతం పోతుంది. బూతు లలవాటుపడుతవి, దేహబలం తగ్గుతుంది. ముక్కోపితనం అలవడుతుంది.

ఖయిదీలవర్తన బాగుచేయడానికై జైళ్లేర్పడ్డవనే భావం పై అధికారుల మొదలు వార్డరువరకూ ఒక వుద్యోగస్తునికీ గమనంలో వున్నట్టు ఆచరణలోకి కనపడదు, ఇంతకంటె కఠినమైనమాటలే వుపయోగించవచ్చు. జైలు వుద్యోగులు సర్వవిధముల ఖయిదీలను పాడుచేయడమేగాకుండా తామూకూడా పాడవుతున్నారు. వాళ్లలో దయా సత్యశౌచాలు పూర్తిగా నశిస్తున్నవి. మనుష్యత్వం పోగొట్టుకొంటున్నారు. ఖైదీలూ వుద్యోగులూకూడా భారతీయులే గనుక వుభయులకొరకూ దుఃఖించవలసిందే. భారతీయులు కాకున్నా చెడిపోయే ప్రతిమానవునికొరకూ విచారించటం ధర్మం.

ఆదాయం తెచ్చేపనులుగాక ఖైదీల స్వంతవుపయోగానికై అనేకపనులు జరుపవలసివున్నవి. బియ్యం దంచడం. రాగులూ, గోధుమలూ విసరడం, పప్పుచేయడం, గానుగాడడం, నీళ్లు పంపుచేయడం, వంటలు చేయడం, కొబ్బరినారచాప లల్లడం,

గుడ్డలూ గొంగళ్లూ నేయడం, చల్లాడాలు చొక్కాలు కుట్టడం. వైద్యం మొదలైన వెన్నో వున్నవి.

ఈ జైలులో పన్నెండువందలనుండి పదహారువందలవరకూ ఖైదీ లుందురని చదువరులు మరువద్దు. వీరందరకీ తెల్లవారి ఆరున్నరకల్లా, రాగిగటకో, వరిగంజో యేర్పాటు ప్రకారం యివ్వక తప్పదు. మధ్యాహ్నం పదకొండుగంటలకల్లా పడి ప్రకారం అన్నం రాగిరొట్టెలూ సంకటి సాంబారు చేసి యే బ్లాకులో వాండ్లకక్కడ వడ్డన జరుగవలసియుంటుంది. సాయంత్రం అయిదుగంటలయ్యేసరికి ఆవిధంగా జరుపకతప్పదు. ఆలస్యమైతే ఆరు గంటలలోపల అందరినీ గదులలో పెట్టి తాళం వేయడానికి వీలుండదు. వుదయం ఒక్కొక్కరికి నాలుగౌన్సులబియ్యం లేక రాగి పిండివంతున గంజి కాచి యిస్తారు. మధ్యాహ్నం విడిఖైదీలకు యేడౌన్సుల వంతునను్నా, సాయంత్రం అందరికీ యేడౌన్సుల వంతునను్నా, పిండిగాని బియ్యంగాని యిస్తారు. మధ్యాహ్నం సాతంత్రం రెండుఔన్సుల పప్పూ, లేక కూర, అరఔన్సు నూనె, వుల్లిగడ్డలు, మసాలా, వుప్పు వేసి సాధకం చేస్తారు. గోధుమరొట్టెలవాళ్లకూ పైలెక్కనే పిండీ అధరువూ యిస్తారు. ఈ ప్రకారంగా రాజుగారి మహాసత్రం ప్రతిరోజూ జరుగుతుంది. అవిచ్ఛిన్నమైన యీ సత్రయాగం జరుపుతూ పందలకొలది ఖైదీలు, వార్డర్లు, ఖైదీవార్డర్లు దంచడం విసరడం, వంట, వడ్డనపనిమీద వుంటారు. ఇది యెంతకష్టపువనో సంతర్పణలో మెదిగినవాళ్లకుగాని తెలియదు. రాగులువిసరడం, గానుగాడడం, నీళ్ల పంపు త్రిప్పడం రాళ్ళు గొట్టడం మిక్కిలి కష్టమైనపనులు. దంపడం, విసరడం, వండడం కష్టమైనా ఖైదీలకు అవి యిష్టమైనపనులు. వాళ్లు యిష్టంవచ్చినంత తిని యితరులకు పెట్టి పలుకుబడి సంపాదిస్తారు. ధనాకర్షణకు, పొగాకుసంపాదనకూ వీలైనపనులు, కొందరు లోలాయిలు విసిరే పిండికంటె బొక్కపిండే యెక్కువ. చాలామంది సహాయనిరాకరణ ఖైదీలూ యీ రకంవాండ్లే. పూర్వం బియ్యం అడఖయిదీలే దంపుతూండేవాళ్ళు ఈపనివాండ్లకు తేమలక పోతే సంచులు నేయడం మొదలగు సన్నపనులిచ్చేవరకు దంపే ఆడఖయిదీలకు సగంవొళ్లుతీసింది. ఖయిదీలందరికీ గొంగళ్లూ చాపలూ నేయడం, లాగులూ చొక్కాలూ టోపీలూ కుట్టడంపని చాలామందికి పడుతుంది.

దర్జాగల విడిఖయిదీలకు, ఖయిదీవార్డర్లకూ పళ్లేములూ, లోటాలూ యివ్వడం మామూలు. ప్రతిబ్లాకులో అక్కడ పడుకుండే ఖయిదీలందరూ భోజనం చేయడానికి చెట్లక్రింద ఒక అడుగు ఘనపరిమాణంగల గచ్చుతిన్నెలు వేసివుంటవి. యెవరితిన్నె దగ్గర వారు కూర్చుండి తిన్నెమీద మల్ల పెట్టుకొని భోజనంచేసి కడిగి ముంత అరుగుమీదబెట్టి మల బోర్లిస్తారు. లెమ్మని వార్డరు వుత్తర్వు చేయంగనే అందరూ ఫైలులో అనగా నలుగురేసి వరసగా కూర్చుంటారు. ఎవ్వరిబ్లాకులోనే వారు పనిచేయవలసిన నియమం లేదు. వార్డరు వుత్తర్వు యీయంగనే అందరూ లేచి ఫయిలు తప్పకుండా యెవరికార్ఖానాలోకి వాళ్ళు వెళ్ళుతారు.

ఖయిదీలందరూ వారివారిపనులలో యుగుంచిన టాసు (Task) యివ్వవలసివుంటుంది. ఇయ్యనివాళ్లకు శిక్ష విధిస్తారు. ఈపని పూరా మధ్యమ కనీసము లనిమూడు విధాలు. సాధారణంగా ప్రతీకఠినఖయిదీ పూర్తిటాసు యీయవలసి వుంటుంది. అశక్తతా వృద్ధాప్యం మొదలైనవానిచేత ఖయిదీలవల్ల తక్కువపని పుచ్చుకోవచ్చు పూర్తి

పని అయాయవలసిన వాళ్లకు మెడలో తెల్లదారం కడతారు. నల్లదారం కట్టిన వాళ్లకు సగంపని. కనీసపుపని యివ్వవలసిన వాళ్లకు ఎఱ్ఱదారం గుర్తు. కడపటివాండ్లకుపని పేరుకు మాత్రమే.

ఖయిదీలు అనుసరించవలసిన నియమాలు క్లుప్తంగా చెప్పుతాను. జైలుపుద్యోగులకు తగిన మర్యాదలు చూపాలి. చౌర్యం వగైరా నేరాలు చేయకూడదు. ఇతర బ్లాకుల వాండ్లతో మాట్లాడకూడదు. సంగీతాలూ ఆటలూ పాటలూ పనికిరావు. పొగాకు రేమయూపకంగానూ వుపయోగించకూడదు. ఫయిలు తప్పి నడువరాదు. భోజనపదార్థాలు దొంగలించరాదు, మార్చుకోనూకూడదు. వుత్తరువుపొందనిది కాగితాలు మొదలైన వ్రాతసామగ్రి పుస్తకాలు వుంచుకోకూడదు. ఉద్యోగులమీదగాని ఖయిదీలమీదగాని తప్పుడుఫిర్యాదులు చేయకూడదు. నియమితస్థలలో తప్ప మలమూత్ర విసర్జనం చేయరాదు. కావలెనని వ్యాధి పెంపుజేసి పొడిగించకూడదు. యెవరైనా వుద్యోగస్తులమీద తిరగబడితే వుద్యోగస్తులకు తోడ్పడవలెను.

ఇట్టివే నిబంధనలు యింకా వున్నాయి. ప్రతి ఆదివారం ఉదయం లెక్కకాంగానే నిబంధనలు క్లుప్తంగా చదివి వినిపిస్తారు. యే సెంట్రల్ జైలులోనైనా ఖయిదీలు యెక్కువగా వున్నా మరికొన్నింటిలో తక్కువగావున్నా, యే ఖయిదీలైనా వొక సెంట్రలుజైలులో వుండడం అనుచితమని తోచినా భాషావివక్షత లేకుండా మరి వొక చోటకి మారుస్తారు. నిడదవోలు సెంట్రలుజైలులో వ్యవహారం నిర్వహించే వారరంతా తెలుగువాండ్రే. ఖయిదీలలో పంజాబీలు, ఓంఢ్రులు, ఆంధ్రులు, అరవలు, మలయాళీలు, కన్నడులు, నెబులుండాగా అందరూ వున్నారు. ఒకరిభాష వొకరికి తెలియదు. ఇతర భాషలు తెలియనివాండ్లకు జీవితం దుర్భరమవుతుంది. భగవంతుడిచ్చినవాణినికూడా వుపయోగించవీలులేదు. ఖయిదీలను మాటలు వచ్చిన మనుష్యుల్నిగా భావించరు. కాగితాలమీద ఖయిదీలసంఖ్యే కావలిసింది. పనిచేయించేటప్పుడు వార్డరు తెలుగులో వుత్తరువు యిస్తాడు, ఖయిదీవార్డరు తనకు వచ్చినయేభాషలోనో అరుస్తాడు, ఇవి రెండూ ఖయిదీలకు తెలియకపోవచ్చు. అర్థంకాక పని చేయనందుకు బూతులు తిడతారు. అవీ అర్థంకావు, ఆంతట లాఠీదెబ్బలు పడతవి. ఈ బాధలుపడలేక ఖయిదీలు మరొక జైలుకు మార్చమంటారు. అధికారులు లీకారణం చాలదంటారు.

ఖయిదీల స్వల్పనేరాలు శిక్షించడానికి సూపర్నెంటుకు అధికారమున్నది. పెద్దనేరాలు జరిగితే ముద్దాయీలను మామూలుకోర్టుకు పంపవలసి వుంటుంది. ఖయిదీలను కొట్టడం మొదలైన శిక్షలు విధించడానికి ఒక్క సూపరెంటుకే అధికారముంది. ఆయన తాపేదారుకు లేదు. ముక్కాలాన కొట్టడం, చీకటికొట్లో పెట్టడం; కొట్లలో వొంటరిగా పెట్టి తాళాలువేయడం, అడ్డబేడీలు, నిలువుబేడీలు, కఠినపుపని విధించడం, పస్తుపెట్టడం, తక్కువన్నం పెట్టడం, మంపలింపు మొదలైన శిక్షలు సూపరెంటు స్వయంగా విచారించి విధించడానికి అధికారము వున్నది.

ఊళ్లోవుండే పెద్దమనుష్యులను సూపరెంటుకు తోడ్పడడానికి ప్రభుత్వము వారు కొందరిని నియమించవచ్చు వీరిని విజిటర్లంటారు. వీరు సాధారణంగా జీ హుజూరులై వుంటారు. ప్రభుత్వపద్ధతిలో తప్పులేమీ వీళ్లకు కనపడకూడదు. ఎవరైనా సాహసించి దోషాలు కనపరిస్తే మళ్లీ వాళ్లను నియమించరు. వీరు ఖయిదీలకు భోజనాదులు సక్ర

మంగా జరుగుతున్నదో లేదో, విచారించి సూపరెంటుకు తెలియపరచవచ్చును. ఖయిదీలను ఉద్యోగులు కొడితే విచారించి శిక్షించడానికి తమకు కూడా అధికారమున్నదని వీళ్లకు తెలియదు. స్వదేశీవాండ్ల తగాదాలలో యీసంగతి బైటపడ్డది.

జైలుకు సంబంధించి ఒక చిన్నబడి, ఆస్పత్రి వున్నవి. బాలఖయిదీలకు రోజూ ఒక గంట చదువుచెపుతారు. చదువుకొని బాగుపడ్డవాండ్లెవరూ కనపడరు. ఐ. జి. గారు సంవత్సరపుతనిఖీకి రాబోయే ముందు కొన్ని పిల్లలపేర్లు జేర్పిస్తే వాండ్లు విశ్రాంతిగా ఒకగంటసేపు పనూపోతూ వుంటారు. ఆస్పత్రులలో కొన్నిచోట్ల సూపరెంటే డాక్టరుగా వుంటాడు. దీనంత చెడుపద్ధతి మరొకటిలేదు. ఈయనకు సహాయంగా కొందరు సర్జనులు కాంపౌండర్లు వుంటారు. కాయినా నిరోచనాలమందు కట్టుగుడ్డలు మాత్రమే యిక్కడ సమృద్ధిగా దొరికే ఔషధసామగ్రులు. తక్కిన మందులు వెదుకవలసిందే.

అనితారికగా జయిలుసంగతులు కొన్ని చెప్పబడ్డవి. వీటి సహాయంతో చదువరులు తరువాతఅధ్యాయములను ఓపికతో చదివి మహాజనులు జయిలు సంస్కారణానికి పూనుకొంటారని తలుస్తాను.

---

## రెండవ అధ్యాయం

## సన్యాసం

రామదాసు పుల్లప్ప మహాలక్ష్మి ఉదయం యేడుగంటలకు నిడదవోలుస్టేషన్‌లో దిగారు, వారిని తీసుకువచ్చిన జయిలుగురుపోలీలు ఉదయకాల్యాలు తీర్పించి యెనిమిది గంటలకు సెంట్రలు జయిలుకు తీసికొనిపోయి వొప్పచెప్పారు. ఆడవాండ్లకు వేరే జయిలు వుంటుందనీ, భార్యాభర్తలవియోగంకూడా సంభవిస్తుందనీ నిడదవోలు వచ్చిన తర్వాత జవానులు చెప్పారు. రామదాసు సద్గురునామము సంస్మరించి యిప్పటికిపూర్తయియిందని అన్నాడు. మాలక్ష్మి ఇందరివెంబడి నడచి వచ్చింపన్నమాటే గాని తనపై తానెఱుగదు. ఇటువంటిసమయములలో ఆమెకుమాట్లాడకుండా పూరుకోడంమామూలు. రామదానుపంక కన్నెత్తి చూడలేకపోయింది. జయిలుదగ్గరకు రాంగానె వార్డర్లు ముగ్గురిని స్వాధీనపర్చుకొన్నారు రోడ్డుకు యెడమప్రక్కగా వున్న అడ్మిషను ఆఫీసులో డిప్యూడిజైలరు కూర్చునివున్నాడు. పెరియులూ లాయపిళ్ల చాలా సర్వీసుగలవాడు, మనిషి పొడతీరి. చామనచాయ. దేహం ముడతలు పడ్డవి. సూటు తొడుక్కొన్నాడు గాని ధోవతి కట్టుకున్నట్టయితే ఆ మనకున్న ఆరవజాడ్యం మఱుగుపడేదే. కండ్లుచాలా యెఱ్ఱగా వున్నవి. సర్దుకొని కుర్చీలో కూర్చుండి కొత్తఖయిదీలను తెమ్మని వార్డరకు సైగ చేశాడు, మనముగ్గురు ఖయిదీలనూ హాజరు పెట్టారు.

పిళ్ల—దాన్ని ముందు తరాజులో యెక్కించు.

వార్డరు— తరాజుమీద యెక్కు.

మాలక్ష్మికి తరాజు యెక్కడమంటే అర్థంకాలేదు. ఇటువంటి త్రాసుయెన్నడూ ఆమె చూడలేదు. తోచక నిలుచున్నది.

పిళ్ల—ఎక్కలేమే?

మాలక్ష్మి—ఎక్కడ ?

పిల్ల—అలంజకు చూపించవే ఎక్కడ యెక్కుతారో.

దగ్గర నిల్చున్న వార్డరమ్మ కలుకు చూపులు పిల్ల గారిపై నెగిడిస్తూ మాలక్ష్మిని చెయిపట్టి తరాజుమీదికి యెక్కించింది.

పిల్ల—దిగు. పేరు చెప్పు.

మాలక్ష్మి—నాపేరు మాలక్ష్మి.

పిల్ల—తీసుకుపో యిక, దాన్ని క్వారంటైన్ లోకి.

వార్డరమ్మ నడవమన్నది. మాలక్ష్మి మెడ పక్కకు దిప్పి రామదాసువంక బిక్క చూపులు చూచి కండ్లు నేలకేసి "మళ్లీ చూడడం వున్నదా?" అన్నది.

రామ—సద్గురూ, వాడిదయ ప్రకారం జరిగితీరుతుంది.

మాలక్ష్మి—పిల్లలసంగతి తెలిస్తే నాకు కబురుచెయ్యి.

వార్డరు—చేస్తారులే పద.

పుల్లప్ప—(రహస్యంగా) పిల్లను యేదోమాట చెప్పి లోగట్టుకోవాలి. ఆ యేర్పాటు తర్వాతనే జేస్తాను. డబ్బుంటే కొండమీద కోతి దిగివస్తుంది.

పిల్ల—అముసలివాణ్ణెక్కమను. అఁ—౧౧౦ పౌనులు తూగావు. దిగు. నీ వెక్కు—౧౮౦ పౌనులు.

పుల్లప్ప—నిన్న గుంటూరు రైలుస్టేషన్ లో తూచుకుంటే ౧౯౦ పౌనులు వ్నాను. ఒక్కరోజుకే పదిపౌన్లు తగ్గానా ?

పిల్ల—ఒరే వార్డరు ! నీలాఠీ యేమైంది ?

వార్డరు లాఠీతో మోదాడు. పుల్లప్ప కొంచెంసేపు విలవిల్లాడి వూరుకున్నాడు.

పిల్ల—౧౮౦ పౌన్లు యెలాతూగావో తెలిసిందా ? జెయిలుపడి దిని వూరుదువు గాని. మీ యిద్దరికిగూడా రాగిపడి వేశాను.

పుల్లప్ప—ఆ ముసిలాయనకు తీర్పులో రైనుపడి ప్రాకారంపి. మే మెన్నడూ రాగి తినియెరగం

పిల్ల—ఔనురా. మీరంతా మాలదొరలు. సన్నబియ్యం, చిన్నచేపలూ కావాలి.

వార్డరు—(రహస్యంగా) ఆ సంగతంతా నే జెప్తాతా పదండి.

పిల్ల—తీసుకొనిపో.

వార్డరు యిద్దరినీ క్వారంటులోకి తీసుకొనిపోయినాడు. పదకొండు గంటలైంది. బాగా యెండగాస్తున్నది. గేటువార్డరు సోదా చేయించాడు. పుల్లప్ప గుడ్డలన్నీ విడిచి కుప్పపెట్టాడు. రామదాసు దోవతి విడవడానికి సందేహిస్తున్నాడు.

వార్డరు—విడవవేమిరా.

రామదాసు—ఏదైనా గోచీ యిప్పించండి.

వార్డరు—గోచీ గావలెనా ? విడువు.

అని లాఠీయెత్తి గూడమీద పొడిచేవరకు యెముక కదిలింది.

రామదాసు—సద్గురూ ! ఈ అభిమానంకూడా యింతటితో వదలిపోయింది. ద్రౌపదినీ గోపికలనూ యిట్టిస్థితికి దెచ్చే రక్షించావు. పుట్టినప్పటి స్థితిలోకి దెచ్చావు. బాలులవుండే నిష్కపట హృదయంకూడా దయచెయ్యి !

---

రామదాసుకూడా ధోవతివిడిచి దిగంబరుడై నిలువబడి అప్రయత్నంగా ఎడమ చెయ్యి అడ్డంపెట్టుకున్నాడు.

వార్డరు—బీడీలేమైనా దాచిపెట్టుకున్నావా? చెయ్యిఅడ్డం పెట్టుకుంటున్నావు

రామదాసు—స—రే—సద్దురూ—తీసా.

వార్డరు—కూర్చోండి—లేవండి.

కూర్చోండి—లేవండి.

నీ పేరేమి ? పుల్లప్పా. ఇరకబట్టుకొని కూర్చుంటావేమి ? చప్పున కూర్చో, లాఠీ విరుగుతుంది.

పుల్లప్ప చప్పున కూర్చున్నాడు. ఎక్కడనుండో రెండుబేడలు కింద రాలినవి. ఓవర్సీయరు యేరుకొని నీళ్లుపెట్టి కడిగి ఒకబేడ గేటువార్డరు కిచ్చి రెండవది తానూ, ఖయిదీవార్డరూ తర్వాత పంచుకున్నారు.

వార్డరు—వీడిదగ్గర యింకా యెన్నివున్నవో నోరు పగలదీయించండి.

పుల్లప్ప—ఇక నేమీ లేవండి సామితోడు.

వార్డరు—సరే ఆగోచీ పెట్టుకోండి, గొరగరా వీళ్లకు.

పుల్లప్పకు మంచిజుట్టు వున్నది. కుయి కుయి మనకుండా కూర్చున్నాడు. కత్తి చిత్రంగా వుంది. దూదిబస్తాలకు చుట్టేరేకును ఒకపక్క రాతితో సాగగొట్టి రాతిపలకమీద పదునుపెట్టారు. తల తడపలేదు. జుత్తు యెడంచేత లంకించుకొని ముందుకు లాగి రేకుపెట్టి వెనుకకు దోకాడు. ఒకపొర పీతోలు వూడింది. గాట్లు పడ్డాయి. పుల్లప్పకుచేస్తుంటే రామదాసు పక్కననిలబడి చూస్తున్నాడు. జుట్టుబట్టుకొని తలగొరగడం చూసి శిఖ మిగులుస్తా రనుకొన్నాడు. చుట్టూ పూర్తికాంగానే గేటు వార్డరు పరుగెత్తుకొనివచ్చి పుల్లప్పజుట్టు పట్టుకొని నిలుచున్నాడు. తనిఖీవార్డరుకూడా వచ్చి పట్టుకొన్నాడు, వుభయులూ లాగులాడుతున్నారు.

పుల్లప్ప—అయ్యా! నాప్రాణాలు పోతున్నవి. విడవండి.

రామదాసు—అత డేమితప్పు చేశాడండీ.

ఎరుకలమంగలి—పోరా కామాటి నాయీ నీకేం తెలుసు. అయ్యా ! మీ యిద్దరికీ తగాదా లేకుండా నే చెరిసగంగా పంచిపెడతా.

వార్డరు—నిన్న నా యిన్‌చార్జికయిదీవి నేను కక్కసులోకి పోయివచ్చే టప్పటికి అంతా తను మూటకట్టుకొని బేడ కమ్ముకున్నాడు. దాంట్లోభాగం యిస్తే యిందులోసగం యిస్తా. లేకపోతే యిదంతా నాకు రావలసిందే. ఇందాకటిబేడలోది. ముందు అణా యివతల పెట్టు. లేకపోతే రిపోర్టు చేస్తా.

గే. వా—రిపోర్టుకు నే భయపడేవాణ్ణికాను. నిన్నటివి పట్టిబిలుసువెంట్రుకలు. యివి పట్టుకుచ్చుమోస్తరుగా వున్నవి.

పుల్లప్ప—నాప్రాణం పోతున్నది. జుట్టు విడిచిపెట్టి భాగాలు తెగదెంపు చేసుకోండి. ఇంతకూ అసలువాడికి నాకేమీ భాగం లేకుండాజేస్తారా.

వార్డరు—నీ డెవ్వడో గడుసుముండాకొడుకురా. రేపు నీకు ఆరుబీడీలిస్తాము.

పుల్లప్ప—నోట్లోకో.

గే. వా—చూస్తాములే.

పుల్లప్ప—రెండు బేడలూ వూడబెరుకుకుంటిరి. ఈపొద్దుగతేమి?

వార్డరు—ఈవేళ సాధ్యంకాదు. తెచ్చిందైపోయింది. సాయంత్రందాకా బైట కుపోము. ఎక్కడైనా దొరికితే చూస్తాము. సోదాలో దొరికిన బేడలుకూడా రాసిన జేర్చి అంతా చెరిసగం చూచుకుందాం.

మంగలి—ఇవ్వాళ కీప్రకారం పోనీయండి.

ఉభయవార్డర్లూ రాజీపడ్డారు. జుట్టుగొరగంగనే గేటువార్డరు పొదంగాజేర్చి మూటకట్టుకున్నాడు. పుల్లప్పకుమాత్రం పీడవదలినట్లు తేలికగా వుంది. లేచినిలువబడి,

పుల్లప్ప—నోరు తుత్తరగా వుంది. ఏమైనా పెట్టరా ?

గేటువార్డరుకూ పుల్లప్పకూ దోస్తీ కుదిరింది. పొగాకుముక్క తుంపిచేతికిచ్చాడు.

పుల్లప్ప కనకం యిచ్చినట్లుగా సంతోషించి ఒకతుంపు విఱిచి నోట్లో వేసు కొని రెండవది గోచీలో దాచిపెట్టుకున్నాడు. రామదాసుయొక్క తలవూచి వూబ చెత్తవలె నాలుగుపోచ లున్నవి. వాటికోసం యెవరూ తగాదా పడలేదు. మంగలి క్షణంలో యావత్తూ వరసబెట్టి దోకాడు. రామదాసుకండ్లకు నీళ్లు వచ్చినవి.

రామదాసు— కొంచమైనా శిఖ వుంచరా ?

మంగలి—ఖర్చు అయిపోతుందనా ఏడుస్తున్నావు !—అని అంటూ యావత్తు జుత్తు గొఱిగాడు.

రా—సరే యిక్కడికి సన్యాసం పూర్తిఅయింది. అయితే "తలలు బోడులైతే తలపులు బోడులా" అని వేమన్నగారు అన్నారు.

పు—మీకు రెండూ బోడులే.

రా—అయితే బలవంతసన్యాసం అయిందోయ్.

పుల్లప్ప—అట్లా కాదు. కాయ పండి యెండి రాలింది. నేను మీ అండను చేరాను. ఎప్పటికైనా జ్ఞాపకం వుంచుకోండి.

తర్వాత యిద్దరికీ కాలికి యినపకడియం బిగించారు. మీకు బిళ్ల దెచ్చి మెళ్లో గడతారు. అదీ కడియం తుప్పపట్టకుండా తెల్లగా తోముతుండండి. నల్లబడితే లాఠీ విఱుగుతుందని వార్డరు చెప్పాడు. ఇద్దరికీచెతి వొకముంతా పళ్లా యిచ్చి ప్రతిదినం కూర్చుని భోజనంచేసే తిన్నె చూపించారు. రెండోమాటు బూర వూదారు. క్వారం టులోవున్న నూటయేభైమంది ఖయిదీలు పని చాలించివచ్చి యెవరిముంతలు వాళ్లు తీసుకున్నారు. క్వారంటువార్డరు "రైజ్" అనీ. ఓవర్సీరు "లేస్" అనీ అన్నారు. రామదాసుకు అర్థం తెలియకపోయినా పుల్లప్ప తక్కినవాండ్లు లేస్తే తానూ లేచాడు. మళ్లీ వార్డరు "డౌన్" అనేవరకు అందరూ కూర్చున్నారు. రెండుమాటలూ రామదాసు సందర్భాన తెలిసికొన్నాడు. వార్డరు ఫయి లని వుత్తరువు చేయంగనే అందరూ నాలుగుబార్లు దీటి కూర్చున్నారు. "రైస్" "మాస్" అనంగనే అంతా లేచి బయలుదేరారు. అందరూ త్వరగా నడవడంలో రామదాసు కొంచం వరసతొలిగాడు. ఫేడేలుమని లాఠీ భుజంమీదికి దిగింది. రామదాసు అదరిపడి నిలువబడి చూచాడు. జనం తోసుకొని వస్తున్నది. వార్డరు "హాల్టు" చెప్పి లైను యెందుకు తొలిగావని కర్ర యెత్తాడు.

రామదాసు—నాకు తెలియదు. చెప్పకూడదా ?

వార్డ—ప్రతికొత్తగాడిదెకు చెప్పేవరకు నానోరు నొప్పియెత్తుతున్నది. నోటితో చెబితేమట్టుకు జ్ఞాపకం వుంటుందా ? లాటీతో చెబితే మరచిపోరు.

అంతా నీళ్ళకుండదగ్గరకు బోయి ఒంటిబారుదీటి నిలవబడి అల్లరిలేకుండా ఒకరితర్వాత వొకరు ముంచుకొని వలుగు రేసి ఫయిలులో నిల్చున్నారు. వార్డరు మార్చి చెప్పంగనే బయలుదేరి తిన్నెలదగ్గరకు వచ్చి యెవరిచోట వాండ్లు కూర్చున్నారు. ఇనప మంచాలమీద గుడ్డలుకప్పి మోసుకొనివచ్చి దిమ్మెలదగ్గర అన్నమూగొట్టెలూ దింపారు. వాటివెంటనే సాంబారుగంగాళం వచ్చింది. నూటయాభైమందికని రెంటిమీదా వ్రాసివున్నది. వార్డరు రైజ్ చెప్పంగనే అంతా వొంటిఫయిలున వచ్చి యెవరిపడి వాళ్లు వరుసగా తీసికొని అక్కడనుంచి సాంబారు గంగాళందగ్గరకు బోయి తలా వొక ఔన్సుపులుసు పోయించుకొని తిన్నెల దగ్గరకు వచ్చి కూర్చుని అన్నం దినడం ప్రారంభించారు. రామదాసుకూ పుల్లప్పకూ పడి రాలేదు. పుల్లప్ప వార్డరును అడిగితే యీ పూటకు కావలసిన సామాగ్రి పొద్దున యిచ్చారు. మీకు పడి సాయంత్రానికి కాని రాదన్నాడు. మంచంమీద ఒకగొట్టె మిగిలివున్నది. వార్డరు అది తుంపి చెరిసగం పంచిపెట్టి మిగిలిన పులుసు చెరికాస్త పోయించాడు. రామదాసుకు వుల్లిగడ్డ యిష్టం లేదు. పులుసు గౌలుకొట్టింది. అది ముల్లంగిఆకుపులుసు. పుచ్చినవీ ముదిరినవీ ముల్లంగి దుంపలుకూడా అందులో వేశారు. తుంగా గతికె యేరి వెయ్యలేదు. తెల్లని పురుగులు పైన తేలుతున్నవి. పుల్లప్ప వార్డరుకుచూపించాడు. పుణ్యానికి పుట్టెడిస్తే పిచ్చకుంచమని పోట్లాడుతున్నావా అని అన్నాడు. రామదాసు పులుసు వదలి గొట్టె తిన్నాడు. అప్పుడే సెంట్రలు జైలులో రామదాసుకు ఒకపూట గడచిపోయింది. వార్డరు 'రైస్' చెప్పంగనే లేచి మల్లలు కడిగి తిన్నెలమీద పెట్టి యేపనికి పోవలసినవాళ్లు ఆ గుంపుగా ఫయిలు కూర్చున్నారు. రామదాసుకూ పుల్లప్పకూ పడి యేర్పాటు చేయలేదుగాని పని యేర్పాటు చేశారు. సుత్తె యిచ్చి ముక్కరాళ్లు కొట్టమన్నారు. మొదటిరోజు గనుక 'టాసు' యిమ్మని బలవంతపెట్టలేదు. రెండుగంటలకు అందరినీ కక్కసుకు వదలారు. పాకీపనివాడు చెకుముకిరాతితో నిప్పుకొట్టి వుంచాడు. బీడీలు ముట్టించుకొని ఒకర్ని ఆనుకొని ఒకరు కూర్చొని సందేహనివర్తి చేసుకొన్నారు. రామదాసుకు మొదటిరోజులలో సందేహంగా వున్నది కాని, మధ్యాహ్నం సోదా అయిన తర్వాత జంకు తీరింది. పాతజైలు పాకీదొడ్డిలో ఒకరికొకరికి మధ్య అడ్డగోడ లున్నవిగాని కొత్త జైలులో ఆ పద్ధతిమార్చి అడ్డంలేకుండా ఒక్కటేగది యేర్పరచి, నేటీవుల మూఢాచారాలు పోగొట్టి నాగరికత నేర్పారు. కొత్తజైలులోకూడా పూర్వపు యేర్పాటు ప్రకారం ప్రతిసావిట్లో దొడ్డికి అరగోడలు పెట్టివుండేవి. ప్రతిసావిట్లో పదముగ్గురికి పడుకు నేందుకు మట్టి అరుగులుంటవి. ఇప్పుడాపద్ధతి మార్చి మట్టి అరుగుల బదులు చక్కటి పాలగచ్చుటరుగులు వేయించి దొడ్డిస్థలంలోగూడా మరి రెండరుగులు గట్టించి స్థలంలో పేస్తరుతీసారు. మానం పోయినా గచ్చుటయగులు వచ్చాయి. మలమూత్రపు కుండలు సావిట్లో బహిరంగంగానే పెడతారు. అందరి యెదటా కూర్చోవలసిందే. నిజానికి జైలుకు చోటుకఱువులేదు. వేలకొలది యెకరాలు చుట్టూవున్నవి. ప్రతిబార కాసుచుట్టూ విశాలమైన ఆవరణం వున్నది. దానిలో రస్తాలు: పూలచెట్లుకూడా. వేస్తారు. ఇంతస్థలం వున్నా సావిళ్ళల్లో అధికార్లు నీతి బెట్టి స్థలం పెచ్చుదీస్తారు. స్థల

లాభంకంటె నీతి ముఖ్యమైన దని మన వుద్యోగులైనా చెప్పరు. ప్రారంభంలో వున్న మంచియేర్పాట్లుమార్చి, దుర్నీతి నేర్పేపద్ధతులు కొత్తగా యెందుకు అవలంబిస్తున్నారో తెలియదు.

పూర్వం ఆంగ్లేయులు మన ఆచారాలు యెక్కువ గౌరవిస్తూండేవారా ? లేక మనవిద్యాధికులు నాగరికులై కొత్తపద్ధతులు యేర్పరిపిస్తున్నారా ? ప్రారంభంలో సోదాచేసేటప్పుడు దిగంబరులను చేయవలసిన అవసర మేమున్నది ? అవసరమున్నా బహిరంగంగా యెందుకు చేయడం ? గోచీలలో డబ్బు బీడీలు దాచుకుంటూరని ఒక జవాబు చెపుతారు. ఇంత శల్యపరీక్ష చేసి ఒక కేసైనా రిపోర్టవుతున్నదా ? జైలులో చుట్ట తాగనివాండ్లెవరు ? ఉద్యోగస్తులు చేయకూడనిపనైనా బహిరంగంగా జైలులో చుట్టలు తాగడంలేదా ? నూటికి తొంభైమంది ఖైదీలు పొగాకు యేదో ఒకరూపంగా రోజూ వుపయోగించేవాండ్లే. అదివరకు చుట్ట అలవాటులేని వాళ్లుకూడా జైలుకు వచ్చినాకే కొత్తగా చాలమంది నేర్చుకుంటూరు. కులాసా వస్తువనికదా జైళ్లలో పొగాకు నిషేధించారు. పాతక మని గాదు. గొప్పదుర్వ్యసనమూగాదు. ఖైదీ లనుభవించగల కులాసవస్తు విదిగొనుకటే. "కాపీనసంరక్షణార్థమయం పటాటోపః" అని జైలులో చుట్ట తాగితే మేజస్ట్రీటువద్ద రెండు సంవత్సరాలు శిక్ష. ఒక కేసూ మేజస్ట్రీటుకు పోదు. పోనీ, ఆపగలిగారా ?

ఈ జైలులోకి ప్రతిదినం యెంతలేదన్నా ఒక అర్ధమణుగు పొగాకు, బీడీకట్టలు నాలుగురూపాయిల పొడుమూ రా నేవస్తున్నవి. నిర్బంధాలవల్ల ఖరీదెక్కువ కావడం చట్టవిరుద్ధమైంది గనుక ఖయిదీలకు బాధలుతప్ప యీ నిషేధంవల్లయితర ప్రయోజనం కనుపడదు. ఖయిదీలు మొదటవచ్చేటప్పుడు ఒకటిరెండు బీడీలు దాచిపెట్టుకుంటూ రనుకోండి. అవి యెన్నాళ్లు వస్తవి ! పొగాకంతా వార్డర్లే తెచ్చి అమ్ముతారు. బైటిపనికి పోయేకూలీలు తెచ్చేది గేటులో సాధారణంగా ఆపవచ్చు. గేటువార్డరు నామకా సోదాజేస్తుంటాడు; గాని వార్డర్లు కాని ఖయిదీలుగాని తెచ్చే పొగాకు పట్టుకోడు. ఏ వార్డరైనా విరోధంచేత ఖయిదీదగ్గర పుగాకు పట్టుకుంటే ఖయిదీని శిక్షిస్తారుగాని అది యెక్కడినుంచి వచ్చిందో నిగ్గదీసి విచారణ చేయరు. ఈ నిర్బంధమువల్ల ఖయిదీలను క్రిందివుద్యోగస్తులకు లోబరచడంతప్ప మరొకలాభం కనపడదు. కాస్తపచ్చిగల ఖయిదీ జైలులోకి రాంగనే వార్డర్లు తమలో పోటీలుపడి అతనిని తమ ఖాతాదారుగా యేర్పర్చుకుంటూరు. ఖయిదీవార్డర్లు, ఓవర్సీర్లు చిల్లర దుకాణదార్లని చెప్పవచ్చు. వీళ్ళకు వార్డర్లు సప్లయి చేస్తూంటారు. పచ్చిగల ఆసాములకు వార్డర్లు పెట్టుబడిపెట్టి యింటిదగ్గరనుండి తమ పేర రహస్యంగా మనీయార్డర్లు తెప్పించుకుంటూరు. వచ్చినపైకం చెటిసగం. అంతా వార్డరనుభవించడమూ కద్దు. చాలామంది వార్డర్లను నమ్మరు. వీళ్ళకు పాకీవాడే కోశాధికారి.

ఒక సూపరెంటు ఒకన్యాయస్థుణ్ణి గేటుసోదాకు నియమించి పొగాకు దిగుమతి ఆపవలెనని చూశాడుగాని మూటలు గేటుద్వారా రావడంమాని రాత్రులు గోడలు దూకడం మొదలుపెట్టినవి. వెదురుగెడలకు మూటలు తగిలించి సంకేతస్థలములో గోడ మీదుగా లోపల విడిస్తే లోపల పహరాచేసే ఖయిదీవార్డర్లు అందుకొని గెడ బైటకి వేసేవారు. ఉభయులకూ సాంకేతిక పదాలుంటవి. వార్డర్ల కిది పెద్ద వర్తకం. బాగా

వ్యవహారం పొగేవాండ్లు ఆజీలుగా తలా పదిరూపాయలు సంపాదించు కుంటారు.

దీని నింతట నిలిపి పొగాకువల్ల యెట్టిబాధలు కల్గుతున్నవో పనిబడ్డప్పుడల్లా ముందుచెబుతాను. పుల్లప్పా రామదాసూ దొడ్డిపని దీర్చుకొనబోయినారు. ఆ సావిట్లో గట్టిన నీళ్ళగచ్చుతొట్టె మూడుకావిళ్లు బడుతుంది. పాకీవాడు తగినన్ని నీళ్లు వుంచవలె. సాధారణంగా ఒక కడవనీళ్లయినా వుండవు.

రామ—నీళ్లు లేవేమోయ్.

పాకీ—మొట్టన గొట్టండిరా యీ మాలనాయుణ్ణి. ఎవరికీ అవసరంలేని నీళ్లు యీ మాలవాడికి కావలసి వచ్చినవి. ఈ వచ్చిన నూరుమందికీ నీవేమి తలకట్టువా?

రామదాసూ పుల్లప్పా మెదలకుండా గోచిపెట్టుకొని వెళ్లిపోయినారు. పుల్లప్ప యెక్కడిదో బీడీ సంపాదించుకొని తాగుతున్నాడు.

రామ—ఎంగిలి బీడేనా ?

పుల్లప్ప—కాదండి నా స్వంతమే. నేనొక బుగితక్కువపని జేసా. రెండు బేడలు రాలిపోగా యింకా వొకటి నిల్చింది.

రామ—అసాధ్యుడవే. బీడీ అంతా తాగినట్లు లేదే.

పుల్లప్ప—సగందాగి పక్కవాడికిచ్చా. వాడు సాయంత్రం నాకో దమ్మిస్తాడు. మిగిలిన తుంపు పాకీవాడి కిచ్చాను. జైలులోకల్లా వాడిదే అదృష్టం. తాగిన్ని బీడీ ముక్కలు దొరుకుతవి.

రామ—అన్నట్టు వాడితో యేదో రహస్యం మాటాడుతున్నావు!

పుల్లప్ప—యేదోలే పోనీయండి. తమకు చెప్పవలసినది కాదు.

రామ—చెప్పవోయ్. నాదగ్గరెందుకు దాస్తావు ? సంగతులు తెలిసికోవాలె.

పుల్లప్ప—యేమైనా జీవాట్లు పెట్టండి. చేసిన తప్పు చెబుతా. నిన్న అయిదు రూపాయల బేడలు మింగా. రెండురోజులలో అన్నీ బైటికి వస్తవి. పాకీవాడితో తీసి వుంచమని చెప్పా.

రామ—యిదంతా నిజమేనా ?

పుల్లప్ప—తమతో అబద్ధమా ?

రామ—ఏం చిత్రం ! పాకీవాడు లేవంటేనో ?

పుల్లప్ప—ఒకమాటు వాడా పనికి వస్తే యితరులు నమ్ముతారా ? ముద్ర శుద్ధిగా తీసి వుంచుతాడు. లెక్క మాకు తెలిసిందేగా. పెట్టెలో దాచిపెట్టుకున్నట్టే. వాడికీ ఒకపావులా డబ్బులు ముట్టజెబుతా.

రామ—సరే పద. ఇది వొక కొత్తప్రపంచం. క్రమంగా గాని ఏ లోక వ్యవహారాలైనా తెలియవు.

---

## మూడవ అధ్యాయం

# ఎంతకఠినశిక్ష

అర్ధభోజనంతో పొద్దుగూకులూ యెండలో పనిచేయడంచేత రామదాసు మొట్ట గిలబడ్డాడు. సుత్తె లేవడంలేదు. ముఖం అగ్గి దగిలింది. నడుమ నడుమ అలుపు దీర్చు కుంటూ చేతనయినంతవరకు కొడుతున్నాడు. ఖయిదీ వార్డరువచ్చి,

ఖ-వా. అరే, కామాటినాయీ, కూర్చున్నావు లోలాయిల్లో చేరుతావా ?

పుల్లప్ప—ఆయన బతికిచెడ్డమనిషి. యీ నాటి కీలిప్పలు వచ్చినవి. కడుపులో యెత్తులేనిదే సుత్తె యెట్లా లేస్తుంది. మధ్యాహ్నం పస్తేఅయె.

వార్డరు—మీ శిఫారసులు చూస్తే నాకు గొంతుమీదికి వస్తుంది. నా కిచ్చిన మనుషులనుబట్టి నే పని వప్పజెప్పాలె. రేపు నల్లదార మెయ్యమని దొర నడు క్కొమ్మను.

బూర వూదారు. రెండవసారి వూదేలోపల కురదలాలు పూర్తిచేసుకొని బంతిగా బయలుదేరి దిమ్మెలదగ్గరకు బోయి అంతా నీళ్లు దెచ్చుకున్నారు. విశ్రపడి వాండ్లందరికీ ఆవేళ అన్నపుముద్దలు వచ్చినవి. రామదాసు అన్నము దీసుకొని పులుసు బోయించుకున్నాడు. వుప్పుడుబియ్యపు అన్న మెన్నడూ అతడు చూడలేదు. పత్తివిత్తుల కుడితి మోస్తరుగా పులుసున్నది. ముడికందులు నానబోసి వడకట్టి ముద్దబడ దంపి కాగే పులుసులో పిండివేసి వండి నూనె పోస్తారు. పూర్వం పప్పుజేసి సాంబారు చేసేవారు. పొట్టులో దింటే బలమని డాక్టర్లు చేసారట. కందులు పొట్టుతో జబ్బని పెసలు పొట్టుతీస్తే జబ్బని అనుభవాన్ని బట్టి మనకు దెలుసు. డాక్టర్లు బతికి వున్నవాణ్ణి చచ్చాడంటే మనము వొప్పుకొనితీరవలసిందే. అప్పటికి నెలరోజులనుండి కొత్తపద్ధతి అవలంబిస్తున్నారు. సగంమందికి పాసనాలు బుట్టినవి. ఖయిదీలంతా లగ్గలకెక్కారు. చాలామంది జబ్బుపడితే చెడ్డపేరు వస్తుందని దొర భయపడితే క్రమంగా అలవాటుపడి సర్దుకుంటుం దంటాడు పిచ్చయ్యశాస్త్రి.

సూ—మనకు కొత్తవాండ్లెప్పుడూ వస్తూనేవుంటారు. ఇద్దగ్గ జారియాకూడా అయినారు.

పి—ఈజబ్బులు చాలా నటన. ఇంకా చూడాలె.

సూ—ఇంతమంది జబ్బుపడ్డందుకు మనం పైకి సంజాయిషీ వ్రాయాలె.

పి—వీండ్లది గ్రహణికింద చేర్చక జ్వరం తలనొప్పికూడా వున్నది గనుక వాటి కింద చేస్తుదాము.

సూ—ఏదో మాటరాకుండా చూడు. అయినా కందులే వుపయోగించమని వుత్తరువు లేదు.

పి—సరిపడుతుందేమో చూడమన్నారు.

సూ—అంటే సరిపడేటట్లు చూడవలసిందనికూడా ఉత్తరువు ధ్వనిస్తున్నది. సరిపడలేదంటే చాలదు. తగినన్ని కారణాలుకూడా చూపాలె.

అందుమీదట కందులపులుసే ఖాయపరచారు.

రా—ఈ బియ్యం ఈ దేశానివి గామాలె. గంగ్రమెతుకు లరిగేనా ?

పుల్లప్ప—కడుపులో కాలుతుంటే అరగక తిరగమళ్లుతవా ? పులుసు తప్పక అడ్డంబడ వేస్తుం దంటారు. కనిపెట్టితిసండి.

రా—ఈ పీచుదుంప లేమిటి ?

పు—ముల్లంగిదుంపలు. పొద్దున వేసింది వీటి ఆకే. ఈ పసరే సగంరోగాలకు మూల మంటారు. ఈ దుంపలు చాలకాలం దింటే చెన్నపట్టణపుజబ్బు వస్తుందంటారు.

రామ—ఇదేమిపులుసు ? దీంట్లో ఉప్పూ, పులుసు, కారము మూడూ లేవూ. ఈ భోజనంవల్ల ఇంద్రియనిగ్రహం సులభంగా పట్టుపడుతుంది.

పు—ఆఁ. అన్నిధ్యాసలూ పోతవి. అసలు ఇచ్చే ఉభయాలలోనే వుప్పూ కారం మధ్యం. దానికి తోడు కత్తిరింపు. వొట్టుకు మీరు మనకే లాభ మంటారు. మమ్మల నందరినీ సన్యాసం పుచ్చుకోమంటారా ?

ఆకలి రుచెరుగదు. కందులపులుసుతో వుప్పుడుబియ్య పన్న మంతా తిన్నారు. పుల్లప్పకు ఆగలేదు. మల్లగిరి గుజ్జుతింటున్నాడు. వేళ్లసందులు నాకాడు. నాలుక పెదవులు నెమకింది. అన్న మసుగుముఖమైతే పాడు. పొద్దు గూకుతున్నది. వార్డరు వచ్చి లెమ్మన్నాడు. అందరూ లేచి సావిళ్లముందు వరుసగా కూర్చున్నారు. వార్డరు లెక్క పెట్టుకున్నాడు. ఫస్టు క్వారంటుకు కొత్తగా వచ్చినవాండ్లను ౨౦ మందిని వొంటి కొట్లలో వేశారు, అవి చాలక రామాదాసునూ, పుల్లప్పనూ ౨౦ మంది బయటపనిచేసే ఖయిదీలను సూపరిండెంటుగారియింట్లోపనిచేసే వంతకూలీలను కలిపి కాలికడియాలలో గుండా తీగెదూర్చి కట్టి పెద్దసావిట్లో వేశారు. చదువరులు మేకలను దొడ్లల్లో కట్టి వేసేపద్ధతి ఎరిగేవుంటారు. ప్రతిమేకకూ మెడకు తమ్మెతాడు వుంటుంది. దాంట్లోగుండా పొడుగాటితాడు దూర్చి చివరలు కట్టివేస్తారు. మేకలన్నీ చెదరకుండా వుంటవి. గాడిదగుంపులు మరొకవిధంగా కడతారు. చిన్నతాళ్లుపెట్టిఒకదానికాలు రెండవదానికి కడతారు. అన్నిటికీ లంకెవేసి ఒకదానినిమాత్రం గుంజకు కట్టివేస్తారు.

కొత్త ఖయిదీల కెవ్వరికీ యింకా నారచాపలుగాని గొంగళ్లుగాని దుస్తులుగాని యియ్యలేదు. కొత్తలు ముప్పదిమందికిగాను పదిహేనుగురికి మాత్రం చింపిరిగొంగళ్లిచ్చారు. వీండ్లలో పదిమందికి ఒంటికొట్టేళ్లు దొరికినవి. తక్కిన అయిదుగురికి చింపి చాపలు మాత్రమిచ్చారు. పుల్లప్ప గంధ్రగొంద్రితనంచేసి చిన్నదైనా చాపా గొంగడీ సంపాదించుకున్నాడు. రామదాసుకు ఏమీదొరకలేదు, పుల్లప్ప తనగొంగడి రామదాసు కిచ్చాడు. చాపకూడా యిస్తేవస్తే పుచ్చుకోలేదు, అందరినీ సావిట్లోకి తీసుకొని పోయి గోడవైపు తల పెట్టించి రెండువరుసలుగా పడుకోబెట్టారు కాళ్లు చాపుకుంటే మధ్యాన ఒకగజం మెల్లా వుంటుంది. కాళ్లకడియాలగుండా పొడుగుపాటి గొలుసు మార్చి రెండువైపులా కట్టివేశారు. రెండుబార్లవాండ్లకు కలిపి నలుగురేసిమందికి నడుమ అందికెలో వుండేటట్టుగా పెద్దమలమూత్రపుమల్లలు రెండు బెట్టారు. బయట వెన్నెల వుందిగాని తలుపులు కిటికీలు బార్లా తీసిపెట్టినా లోపల గబ్బిగీముగా వున్నది. అడివికి గాసినవెన్నెలయింది నక్షత్రరూపములు పొందిన భగవత్సంకల్పాలు ఖయిదీల హృదయాలలో సత్సంకల్పాలను జనింపజేయడానికి అవకాశం కలుగజేయడం లేదు. పండువెన్నెలలూ గాని గాఢాంధకారములోని ఆకాశసౌందర్యా న్ననుభవించేభాగ్యం ఖయిదీలకు లేదు. ఎంత కఠినశిక్ష!

## నాల్గవ అధ్యాయం

# సొంతయిల్లు

వార్డరు తాళాలు వేయడమే తడవుగా ఖైదీ లంతా చెకుముకిబిళ్లలు గొట్టి బీడీలు చుట్టలు ముట్టించారు చీకట్లో జుంజుర్లు వెలిగినట్లు వెలుగుతున్నవి. రామదాసు కిటికీకిందుగా పడుకున్నాడు. యిద్దరు ఖయిదీలకు తరువాత పడుకున్న పాతఖయిదీ యెవ్వడో కిటికీకి వెలుపల పడేటట్టు వెయ్యవలెనని కేకరించి వుమ్మాడు. అది అంత దూరము పోక కిటికీకింద పడుకున్న మనిషిమీద పడడం చూచి పకపకనవ్వుతూ పక్కవాండ్లతో తా నెట్లా తుపుక్కున వుమ్మివేసిందీ, అది దూరంపోక లప్పెదు ముసలివాడిమొగాన ఎట్లా పడ్డదీ, వాడు చవటపెద్దమ్మలాగు తుడుచుకొని వూరుకొన్నదీ చిలవలకు పలవలు చేర్చి వర్ణించి చెపుతున్నాడు. వాడు రాజమండ్రి జయిలులో మునుపు పుల్లప్పకు పాతస్నేహితుడు. వాండ్లు కడుపుబ్బ నవ్వుతున్నారు. ఒకడు కోమటిహాస్యం చెబుతున్నాడు. మరికొందరు, వొకడు బంగారక్క, వొకడు కేతిగాడు, వొకడు జుట్టుపోలిగాడు పాత్రలుగా ఎంచుకొని వాటికి తగిన వలపుపాటలు పాడుతున్నారు. "నిన్న దెచ్చిన నీలిచల్లాడం" అనే పదం కేతిగా డెత్తుకున్నాడు. చావిడంతా నవ్వులతో బద్దలయిపోయింది. ఆ పాట ముగియగానే బంగారక్క యేం జేస్తున్నదని కొందరు రసికులు కేకలువేశారు. బంగారక్కపాత్ర చివాలున లేచి "మొన్న దెచ్చిన మొగ్గలరవిక" అని చరణ మెత్తుకొని కీచుగొంతుతో పాడుతుంటే జనంలో రక్తి ఆకాశ మంటింది. వీధిభాగవతంలో మాధవివేషం వేసిన ఒక గొల్లవాడు తన ఆనవంధం ఎనిమిటిమీది పదాలు పాడితేనే గాని మజా వుండదని లేచి పాడడం ప్రారంభించాడు;

"కొట్టొస్తడే నాకు నవ్వొస్తదే (యీడిజిమ్మడ)
కొట్టొస్తడే నాకు నవ్వొస్తదే
కూరుచుంటె లేవలేదు కూరచట్టి దించలేదు॥ కొ॥

తక్కినవాండ్లు దరువువేయడం మొదలుబెట్టారు. చప్పట్లు మిన్నుముట్టినవి.

పు—నీవేమిట్రా కాముడూ, ఇంతసేపటినుంచీ యెవరో ననుకుంటున్నా.

కాముడు—పుల్లప్పవా! మహారాజా హాజరయింద్. మగసిరి అంటే నీదిరా. నాకునను వచ్చినవాడివి. నామర్దాపని చేసిరా లేదుగదా? దొంగదాసరివాడు దారిదోపిడి పని కప్పమూ దిగడు. ఎన్నేండ్లు వేయించుకొచ్చావు?

పు—చెప్పుకోడానికి నాకే సిగ్గుగావుంది, సీటాక్టుకేసే. తొమ్మిదినెలలువేశాడు వాడి సొమ్మేమో పోయినట్టు.

కా—సిగ్గులేక చక్కబిల్ల వేయించుకొని వచ్చావుటరా? నీవు రెండుసార్లు వేయించుకొన్న శిక్షగూడా మునుపు నాకు రిమిషన్ యిచ్చినంత లేదు. ఇప్పుడు మళ్లీ రాజాగా పదేండ్లు వేయించుకొని వచ్చా. నన్నిక కదిలించేవాండ్లు లేరు.

పు—ప్లీడరును బెట్టుకొని వాదించుకున్నావా?

కా—అటువంటి పనెన్నడూ చేయను. గాంధిమహాత్ముడు చెప్పినట్లే ప్లీడరును

పెట్టుకోకుండా జడ్జీతో “నన్నేమీ అడగవద్దు. నీ యిష్టము వచ్చినట్టు చేసుకో” అని చెప్పా.

పు—అవురా పుల్! మొగాన గొట్టిన ట్టన్నావే!

కా—మ రేమనుకున్నావు! వాడూ మొగాన గొట్టినట్టె వదేండ్లు శిక్ష చెప్పాడు.

పు—గాంధీ గారిని ఎవరూ పట్టుకోలేరుట.

కా—మనిషి యెదర కనపడుతూనే వుంటాట్ట. పట్టుకుంటే చేతికి తగలడుట. బొంబాయిగవర్నరు గాంధిగారినిసముద్రపుగట్టుననిలుచో బెట్టికొట్టితేకగలలేదట. సేనానాయకుడుని పిలిచి స్వయంగా కత్తితో నరకమని వుత్తరువిస్తే కత్తి ఎత్తేవరకు ఆది తాచుబామంత మల్లెదండై చేతికి చుట్టుకొన్నదట. ఆ యన బుద్ధిపూర్వకంగా పట్టుబడితే తప్ప నరమానవుడికి చిక్కడు.

పు—వోరే కామన్న, నీవు యిన్నిమంచిసంగతులు తెలిసినవాడివి. యిందాకా పెద్దమనిషిమీద ఆట్లా వుమ్మేశావెందుకు! ఆయన యెటువంటివాడనుకున్నావు! ఏదో కర్మబొసిగి వచ్చాడు గాని మనబోటివాండ్లం వెదికినా దర్శనం దొరకవలసినవాడు గాడు.

కా—పొరపాటున నే జరిగింది. ఆటువంటివాండ్లంటే ముందుగా చెప్పవద్దా? స్వామీ! నే వెయ్యవలెనని వెయ్యలేదు. ఈతప్పు గాయండి.

రా—దాని కేమి. పొరపాటు ఎవరికయినా వస్తుంది అందుకోసమింతగా ప్రాధేయపడడ మెందుకు?

కా—చిత్తం. యోగులు వుమ్మేస్తే తుడుచుకొనిపోతా రంటారు. ఇదేకామాలె. అయ్యా గాంధిగారినిగురించి ఆగుబ్బుగా జెప్పుకుంటున్నారు. మన కేమయినా లాభం చేస్తారా?

రామ—మహాభావుడు పూనుకున్నాడు. ఎవరిబాగు వాండ్లు చేసుకోవాలె. మనంకూడా ప్రయత్నం చెయ్యాలె. యింతసేపటినుంచీ మీరు యిన్నిమాటలు మాట్లాడుకున్నారుగదా. వాటివల్ల నోరు చెడడం తప్ప చింతాకంత లాభ మున్నదీ!

కా—నిజమేకాని మాకు కాలం జరిగే దెట్లా? సందలు కూకంగనే లోపలికి బంపిరి. పొద్దుపొడిచేదాకా యెంతసేపని నిద్రబోతాం! ఎట్లాగో కాలం వెళ్లబుచ్చుకోవాలె. మాలో కొందరం చదువుకున్నవాండ్లంకూడా వున్నాము. కాస్త పిల్లికబెడితె గొరుకొయ్యలు నెత్తిమీదికి వచ్చిందాకా చదువుకొందుము. మీబోటివాండ్లు యేవయినా మంచిసంగతులు చెప్పితే వినవచ్చు. ఏదీ పల్లకాడంటారు. వుత్తరవు లేకుండా రామాయణం వెంట దెచ్చుకున్నాడని యిప్పుడు ఒక భట్రాజు ఖయిదిమీద కేసు విచారిస్తున్నారు.

రా—యీ జయిలుపద్ధతేర్పాటు చేసినవాండ్లకు మతి వున్నట్లు కనపడదు. సెటిల్మెంట్లల్లో గాని జయిళ్లల్లో గాని వేలకొలదిజనాన్ని బాగుచెయ్యడానికి అవకాశమున్నది. తెలియ కడుగుతాను, నా కొక్కమాట చెప్పు. నీవు మీవూళ్లో కాలుకుపోతే శుద్ధిచేసుకోవడం అలవాటుందీ!

కా—మాదాసర్లంతా చెంబు తీసుకపోవడం అలవాటున్నవాండ్లె. సీమాట్టు

మూలంగా యెంత లేదన్నా మావాండ్లను ౨౦౦ మందిని జయిలుకు బట్టించారు. అప్పటి నుంచీ అలవాటు తప్పిపోయింది.

రా—జయిలుకు వచ్చి నేర్చుకొన్న మొదటిసంగతి ఇదా!

కా—రెండోది స్నానం చెయ్యకపోవడం. పొద్దుగూకులూ చెమటబెట్ట పని చేస్తాం. దంపు, మోత, మట్టిపని చేసేవాండ్ల వొళ్లు దుమ్ముకొట్టుకొని పై బేజారై వుంటుంది. దులుపుకొని పడుకుంటాం. వారానికొకమాటు ఆదివారం గుడ్డలుతుక్కోవడానికీ, స్నానం చెయ్యడానికి యెడ మిస్తారుగాని నీళ్లియ్యరు. భావిదగ్గర వొక్క తొట్టిలో నీళ్లు బోసి పాతికమందిని తొట్టిదగ్గర నిలువబెట్టి ఒక ఖయిదు వార్డరు తొట్టిలో నిలువబడి దోసిటితో మామీదికి నీళ్లు జిమ్ముతారు. మనిషికి రెండు ముంతలయినా మయిన బడవు.

రా—యిదా వాకస్నానం! లోపలగూడా యిదేమోస్తరా?

కా—అంతా వొకటే వరవడి. పశువులమోస్తరుగా కట్టివేయడం మాత్రం తప్పుతుంది. ఉదయం ఆరుగంటలయ్యేవరకు ఖయిదీలలెక్క తేలుతుంది. ఏడుగంటలలోగా బయలుకు పోవడం, నీళ్ళు తెచ్చుకోవడ, మొంగం కడుక్కోవడం, భోజనం చెయ్యడం పూర్తిఅయి పనికి హాజరు కావాలె. గుడ్డివాండ్లు కాకపోతే యివన్నీ ఒక గంటలో ఎట్టా అవుత వనుకుంటారు! రూలుప్రకారము రాత్రులు విధిలేనప్పుడు తప్ప యితర సందర్భాలలో గదిలోబెట్టిన కుండలో మలవిసర్జనం చేయకూడదు. రెండు కారణాలచేత యీరూ లెవ్వరూ పాటించరు. తాళాలు తియ్యకపూర్వమే అందరూ గదులలోనే విసర్జనం చేస్తే గంజి దాగే వేళకు పైలుకు అందుకోవచ్చు. పని యేడు గంటలకు ప్రారంభమవుతుంది. తాళాలు తీసినతరువాత బయలుకు పోవలసివస్తే వేళకు పనికి బోవడం తెమలదు. పాకీదొడ్లుకుస్సందులు. వొకరికొకరు అనుకొనికూర్చున్నా ఒకపర్యాయం ౨౦ మందికంటె వీలుండదు. రెండువందలమందికి తక్కువలేని బ్లాకులో మానము బోగొట్టుకొని కూర్చున్నా కనీసము గంటపడుతుంది. అందరికీ పడక సావిట్లో నివర్తించుకోడం సాధ్యంకాదు. ఎవరికి యేవేళకు అవకాశం చిక్కుతుందో నిలుకు లేదు. ఉదయం అవకాశము చిక్కనివాండ్లు తొమ్మిదిగంటలకు విడిచినపుడు పోతారు. ఈ అకాలవిసర్జనాలవల్ల స్వాభావికమయిన అలవాట్లు చెడి, ఆకలితగ్గి, విరేచన బద్ధకాలూ, గ్రహణిబాధలూ, పాసనాలూ అర్ధాన్నం తింటూన్నా తేపా వస్తూంటవి, నిబంధనలూ, ఖయిదీలబాధలూ యెట్లా వున్నా వార్డరు తనకు మాట రాకుండా యేడుగంటలలోగానే భోజనాలు పూర్తి అయ్యేమార్గం చూచుకుంటూ వుదయం పాకీదొడ్డికి తాళం వేసి వుంచుతారు. రెండవకారణంకూడా బలమైనదే గదులలోనే నివర్తిచేసుకుంటే తోటీ పని చేయ నవసరము లేదు పాకీదొడ్లో నీళ్లఖర్చుకూడా వుండదు. వుదయము లేవంగనే ఆ యా గదులలో పాకీకులాలకు సంబంధించినవాండ్లందరూ కుండలు మోసుకొనిపోయి దిబ్బదగ్గర విడుస్తారు. 'దేవుడు వరమిచ్చినా నంబి వర మివ్వ' డని వార్డరు వాలాయకం తీర్చుకోడానికి పది నిముషాలు ఆలుపుతీసినా తోటీ తన కిష్టులను తప్ప తక్కినవాళ్లను చేరకుండా పారకతో కొడతాడు. ఎక్కడికి బోయినా డబ్బులేనివాడు దుబ్బుకు కొఱగాడు. అదిగాక ఉదయం తొమ్మిదిగంటలకు సూపరిండెంటు శుభ్రంగా వూడుస్తున్నదీ లేనిదీ తనిఖీచేయడానికి, అప్పుడప్పుడు

వస్తూంటాడు. ఖయిదీలు ఉదయం దొడ్డి వుసతోగిస్తే తొమ్మిదిగంటలలోపల శుభ్రం చేయడం తోటీకి కష్టం, వార్డరుకు మాట వస్తుంది. అందువల్ల దొరవచ్చి చూచేవరకూ దొడ్లో కెంరినీ పోనీరు.

రామ—కొంత పెద్దదొడ్లు కట్టి మరికొంత వ్యవధానం యిస్తే యీ చిక్కులు పోను.

కా—పందలూ వేలూ జీతాలు తిసడానికి తప్ప యీసంగతులు ఆలోచించేవా ళ్ళెవ రిక్కడ?

రామ—నీ విదివరకు ఖయిదు కెన్నిమార్లు వచ్చావు?

కా—ఇది మూడోసారి.

రా—ఏమినేరాలు చేశావు?

కా—మొదటిసారి కలువురోజులలో ఒకపర్యాయం గడ్డిదిన్నా. దానికి ఒంది పోటు నెర మని మూడేండ్లు వేశారు. రెండోసారీ యీసారీ వటి అక్రందాలువేసి కేసులు పెట్టారు. నేరాలు జరిగినమాట వాస్తవమేగాని అవి నూవల్ల జరుగలేదు. ఆ చేసినవాళ్లు యిప్పటికీ దొంగతనాలు చేసి పంచుకుంటూ నేవున్నారు. పట్టివాండ్లం ఏడు గురం రెండోకేసులో వచ్చి పడ్డాము. ఈ రెండుకేసులలోనూ ఆరుగురు మాత్రం ఈ కేసులలో చేయకపోయినా అప్పుడప్పుడు సంచారం పోతున్నవాళ్లే. నే ప్రమాణంచేసి చెపుతాను. ఈ కేసులో వృధాగా నాకు పాతనేరస్థుడ నని పదేండ్లు పడ్డది. అయితే నేను చింతపడడంలే దరకోండి.

రా—ఎందుకల?

కా—మొదటికే నయినతర్వాత నాపెళ్లాం రెండేళ్లు చూచి యింకొకణ్ణి తీసు కొని లేచిపోయింది. రెండోసారి ఆయిదేళ్లు పడ్డప్పుడు నాఅమ్మ నా భర్యలుగురేండ్ల పిల్లవాణ్ణి పెట్టుకొని రెండేండ్లు నెట్టుకువచ్చి కాలంజేసింది. తర్వాత పిల్లవాడు చెడు సావాసాలుమరిగి ఏదో దోపిడికేసులో యెవడో కూనీజేస్తే వీడుకూడా ఆగుంపులో వున్నాడని పదేండ్లు వేశారు. వాడు కన్ననూరు జైలులో వున్నాడట. నాకు ప్రపంచంలో యిక నెవరూలేరు. బైట నాకేంపని? మొదటి రెండుమాట్లూ గలసి తీసివేత పోను ఆరేండ్లు ఖయిదుచేశాను. బయట వలుగురిలో తలయెత్తుకొని తిరగడానికి మొగం చెల్లను, చేసినా చెయ్యకపోయినా దొంగని నామొగాన వ్రాశారు. అడుగు కదలించ డానికి వీలులేకుండా వేటకుక్కలమోసరుగా పోలీసువాండ్లు వెంటబడతారు. వారు గూరుపోతే మన బుకు రిపోర్టు చేసుకోవాలి. ఇదంతా యెందుకు వచ్చినశ్రమ. మొదటి సారి యేమనుకున్నా యీ మూడోతడవ రెండువేలజీతం తినేజడ్జీకీ, బంగారపు గడి యారపు గొలుసులు వేసికొని వచ్చిన పంచాయతీదారులకూ, పోలీసులకూ. తప్పసాక్షు లకూ వేయిదండాలు పెట్టుకుంటున్నా. ఇక పదేళ్లవరకు జైలువాళ్లు పెట్టినంత దిని తోచినంతపని జేసూ గుండె నిమ్మళంగా వుంటాను. నే నింకా బ్రతికి బైటికిబోతినా పోలీసువాండ్లను దయవచ్చి నన్ను తిరగనిచ్చినంతకాలం ఇష్టంవచ్చినన్ని దోపిళ్లుజేసి వదిరూపాయల చేమెల్లాతో మళ్లీ నాస్వంతయింటికి వస్తాను.

అని చెప్పేవరకు కళ్లలో తేజన్సు కళకళలాడింది, చీకట్లో యెవరూ గమనించ లేదు.

రామ—నీ సొంతయిల్లెక్కడ?

కామడు—'రామాయణ మంతా విని రాముడికి సీత యేమి గావలె' నని అన్నాడట నీబోటివాడు. ఇంతసేపటినుంచీ నే చెబుతున్న దేమిటి? బైట నా అన్న వాళ్లు లేరు. ఉన్న నలుసొక్కడూ నా మోస్తరుగానే జైలురొట్టెలు తింటున్నాడు. ఒక గుడిసె వుంటే మావూరు ఆసామీ మాఅక్క చావంగనే చొప్పదొడ్లో గలుపుకున్నాడు. నే వెళ్ళినప్పుడు అడిగితే నీపేరు గలవాండ్లు యెవ్వరూ యీ వూరిలో కాపురమే వుండలే దన్నాడు. నాకు అయినవాళ్లంతా యిక్కడనే వున్నారు, ఇదే నా యిల్లూ, నావూరూ, నాలోకం, స్వర్గం నరకం గూడా యిదే. నేనుమాత్రం ఒక బుద్ధితక్కువపని జేశా. రెండో కేసైనతర్వాత నాలుగునెలలే పోలీసువాండ్లు బైటవుండ నిచ్చారు. దీపం వుండంగనే చక్కబెట్టుకోవలసింది. మడిగట్టుకొని కూర్చుంటే నా వెంట బడ రనుకున్నా. నేను మా వూరు బోంగనే మామునసబు తనకు భాగమిస్తే నన్ను లెక్కలు గప్పి కాస్తానన్నాడు. చోరీలకు నే నొప్పుకోలేదు. ఆయన సలహా విని వ్యవహారమే సాగించినట్లయితే లక్షణంగా తిని తాగి పాతికరూపాయలు మిగుల్చుకొని జైలులోకి రాంగనే ఛీఫువార్డరు మొగాన్న పదిరూపాయలు పారవేస్తే నా యిష్టంవచ్చినట్లు లోలాయిలాగ తిరగనిచ్చేవాడు. అరరూపాయి పారవేస్తే రెండు పూటలా నెలరోజులు యెక్కువముద్ద లిస్తారు. నాకిచ్చే రాగిపడిఅమ్ముకుంటే చుట్టపొగ గడుస్తుంది. అదీ చెడగొట్టుకున్నా. అయ్యా! ఒక్కమాట చెపుతాను. ఈ ప్రపంచంలో న్యాయానికి కూడులేదు. ఏదోవిధంగా పదిడబ్బులు పోగుచేసుకున్నవాడే వుత్తముడు.

"శ్లో. యస్యాస్తి విత్తం స నరః కులీనః స పండిత స్సశ్రుతవాన్ గుణజ్ఞః,
స యేవ వక్తా సచ దర్శనీయః సర్వేగుణాః కాంచన మాశ్రయంతే."

అన్నాడు.

రా—నీవేమి చదువుకున్నావు?

కా—మానాయన బాగా చదువుకొన్నవాడు. ఆయన వున్నంతవరకు అట్టహాసంగా వున్నవాళ్లమే. నాకు తెలుగులో బాగానే డొక్కశుద్ధి అయింది. 'శత శ్లోకేన పండితః' అని పదిశ్లోకాలుగూడా యేకరువు పెట్టా. ఆపండితులదగ్గర పండితుడనిపించుకుంటూ పిత్రార్జితం కాస్తా అప్పులకుబెట్టి లోకంమీద బడ్డా. ఇంత ఒడి చెప్పుకొన్నా జీవనం జరిగేది. దానికి పరీక్షలైతేనేగాని వల్లకాదన్నారు. ఇప్పుడు నే నేంపరీక్షలకు బోతా! సరే మళ్లీ నా కథ ప్రారంభిస్తా. ఇప్పటికైనా మించిపోయింది లేదు. మా అమ్మతాలూకు పూసా బుట్టా అమ్మినబాపతు యిరవై రూపాయ లున్నవి. వాటిలో పదిరూపాయలు పిల్లవాడికి పంపి అయిదు రూపాయలు ఛీఫువార్డరు కిచ్చి తక్కినదానితో పొగాకుబేరం పెడతా. దానిమీద నెలకు రెండురూపాయలు తీయవచ్చు, అర్ధరూపాయి ఖర్చుపెట్టానంటె రెండుపూటలా యెక్కితొక్కుతున్న ఆ వరి బియ్యపు అన్నం. ప్రయోజకుడయితే యెక్కడైనా కాలం బాగానే గడుపుకుంటాడు. ఇదివరకు నా దగ్గిర ఒకలోపం వుండేది. అది దిద్దుకుంటా.

రా—ఏమిటా లోపం?

కా__న్యాయంగా పోవలె ననుకోవడమే. దానిమూలంగానే చెడ్డా: పూర్వకథ యెత్తుకుంటె యిది స్పష్టంగా రుజువౌతుంది.

'ఆల్ యీజు వెల్' అని ఫారావార్డరు కేకవేశాడు,

రా__సమయాని కన్నావు. నే నిదివరకు సెటిల్‌మెంటే నరకమనుకున్నా ఇది దానిని మించివున్నది. దీనికే రౌరవమని పేరు పెట్టవచ్చు.

కా__కాసేపు వూరుకోండి. వాడు రౌండు దిరిగి వెళ్లుతాడు. తర్వాత మళ్లీ ప్రారంభింతాము.

## అయిదవ అధ్యాయం

# దేవుడి చరిత్ర

కా__పోయినాడు. పారా మారిపోతుంది. రెండవవాడు వచ్చేవరకూ స్వయం రాజా స్వయం మంత్రి. కాకపోతేమట్టుకు వీడు చేసేదేమున్నది? వంగితే నెత్తికెక్కుతారు. ఆదిప్రపంచ స్వభావం. యీవార్డరది ౧౫ రూపాయల బండారం. దానికే వీండ్లకు మెడమీద తల నిలవదు.

రా__అయ్యా! మీకు ఆక్షేపణ లేకపోతె మీ పూర్వచరిత్ర విపులంగా చెప్పండి. మీ నామధేయ మేమి?

కా__నాపూర్వపు పేరు కామానాయుడు. అడిగారు గనుక పెద్దలు చెప్పుకుంటున్నా, పుణ్యమా పురుషార్థమా?

రా__మానవుడి చరిత్రంటే దేవుని చరిత్ర. గడ్డిపోచచరిత్రగూడా అటువంటిదే. సృష్టిలో ప్రతివస్తువూ గమనిస్తే చాలుగాని భగవంతుని చరిత్ర వెల్లడిస్తుంది. కవులు వ్రాసిన కృత్రిమచరిత్రలు భగవల్లీలలని చదువుతారు గాని, మహాకవి రచించిన యీసృష్టికావ్యం చదువగలవాడికి ప్రతి అణువూ భగవల్లీలలనే బోధిస్తుంది. చదువగలవాడికే కాదు; ఆకవి ప్రతివాండ్లచేత తాను రచించిన మహాకావ్యం అనుక్షణం పారాయణ చేయిస్తూనేవుంటాడు. ప్రతిక్షణానికీ ఒక్కొక్క మెట్టెక్కిస్తూ గడ్డిపోచనూ, పిపీలికాన్నీ మానవునీ, దేవతనూ తనదగ్గరకూ చేదుకుంటూనే వుంటాడు. ప్రతిఅణువూ చేదుకో కోటయ్యా అని అంటూనేవుంటుంది. గనుక మీ చరిత్ర జ్ఞానబోధకం కాకతప్పదు.

కా__అయితే వినండి జయిలుకు వచ్చినతరువాత కామానాయుడు కాముడయినాడు. గుడ్డిగవ్వజెయ్యని యీవార్డరంతా మోతుబర్లను సహా యేమిరా అనే పిలుస్తారు మా నాయన రెండువేలు ఋణంచేసి చనిపోయినాడు, బాకీ లిమిటేషన్ పట్టింది. సాహుకారు పొరపాటు జరిగిందంటే తిరిగి వాయిదా బండి. పత్రం ఆస్తి అంతా తాకట్టుబెట్టి వ్రాసి యిచ్చాను. తర్వాత అయిదేండ్లు కడుపు నాయగట్టుకొని వుండినదంతా ఆజీలుగా వాయిదాలన్నీ చెల్లించితీర్చాను. యీవత్తుబాకీ తీసుకొని చెల్లు కనుపరచకుండా మూడువేలకు డిక్రీపొంది చెంబు బోకెలతో గూడా వేలం బాడించాడు. యీ కర్మమంతా నే చేతుల దెచ్చుకొన్నదే. మొగట న్యాయానికి బోయి కాలదోషంబట్టిన బాకీ తిరగవ్రాసి గాలికి బోయ్యేది కాలిమీదకు తోసుకున్నా. అన్యాయానికి తలంచుకున్నట్టయితే, కామానాయుడినల్లా యీపాటికి కామానాయుడు

గారి సర్యోవాణ్ణే. న్యాయానికి బోయి అన్యాయపుడిక్రీని మీదికి దెచ్చుకొని కామా నామాయుడినల్లా కాముడినయి చోటా కట్టెదెబ్బలూ, బూటుకాళ్ల తన్నులూ తుక్కిరి మిక్కిరిలాడకుండా తింటున్నా. యిచ్చినడబ్బు ఎందుకు చెల్లువేయించుకోకపోవాలె! లోకంలో న్యాయమున్నదనుకోవడమే నా లోపం. ఆస్తియావత్తు వేసుకోగా ఇంకా బాకీ నిల్వదేల్చి అట్టేపెట్టాడు. మొన్న జయిలులోనుంచి బయటికి పోయినప్పుడు నే నేమో పగదీర్చుకుంటా నని నన్ను వూళ్ళో లేకుండా వెళ్లగొట్టడంకోసం డిక్రీబాకీ ఫయిసలు చేసుకోకపోతే హాజరువారంటు పెట్టిస్తానని బెదరించాడు. అసలు నేను కొసవెర్రివాణ్ణి. ముక్కోపంతో చేతిలోవున్న కర్రయెత్తా. యేదేవుడో అడ్డపడ్డాడు గాని ఆదెబ్బతో శిరస్సు లేవాలిసిందే యెందుకో అజ్జాయించా.

రా—(నిట్టూర్పుతో) మీచరిత్ర చిత్రంగావుంది. యిటువంటిచరిత్రలు ప్రపంచంలో చాలా వుంటవనుకుంటాను. కోర్టులో జరిగేఅన్యాయంవల్ల ఎంతబాధ పడ్డారు! మీకు జరిగిన అన్యాయం తప్పుడిక్రీతో ప్రారంభమైంది

కా—అంతటితో పోయిందా! నాది యెనిమిదివేల ఆస్తి: మూడువేలకు కొట్టివేయడం రెండవది. వేలం అన్యాయం అని పిటీషన్ పెట్టితే తోసివేయడం మూడవది. సరిగా వేలం వేయించుకుండే భారం నాదట. సర్కారునౌకరు లంచం తిని తప్పుడు వేలం వేస్తే దానికి జవాబుదారీ సర్కారుకు లేదట.

రా—రెండవసారి అయిదు సంవత్సరాలూ, మూడోమాటు పదిసంవత్సరాలూ, దానితో మీజీవితం సాగించడం, ఆ క్రమపు తీర్పులవల్లా నేరములవల్లా మీసర్వస్వం జీవితంతో సహా నాశనం చెయ్యడం చూస్తే ప్రభుత్వంవారి కార్యాలయాలకు న్యాయస్థానాలా అన్యాయస్థానాలా తగినపేరు?

కా—నాసంగతేమిటి గాని బందిపోటుఖయిదీలను కడపజిల్లా ఖూనీఖయిదీలను విచారించండి. వొక్కొక్క కేసులో పదిమందికీ యిరవైమందికీ పదిసంవత్సరాలు మొదలు యిరవై సంవత్సరాలవరకూ శిక్షలు పడ్డిస్తూంటారు. ఆ ఖయిదీలను పిలిపించి వాస్తవం చెప్పమని అడగండి, అన్యాయస్థానాలలో అబద్ధాలు చెప్పాలె గాని బయట చెప్పవలసిన అవసరం లేదు. చేసినవాండ్లు తమ ప్రతాపాన్ని వర్ణిస్తూ నిజం యావత్తు చెప్పుతారు. కేసు చేసినవాండ్లలో చాలామందిని పోలీసులు ముద్దాయిలుగానే చేర్చరు. చెయ్యనివాండ్లను చాలామందిని ముద్దాయిలను జేసి జన్మశిక్షలుకూడా వేయిస్తారు. యిదంతా తెలియక చేసేది కాదు. బుద్ధిపూర్వకంగా చేసేపని. చేసినవాండ్లను వదలివెయ్యడం చెయ్యనివాండ్లకు శిక్షవేయించడంచేత కావేషాలు పెరిగి కొత్తకేసులకు కారణాలు అవుతవి. డబ్బిచ్చి తప్పించుకోవచ్చుగదా! అని కొందరికి ఆలుసు. ఖూనీ చేసినవాండ్లు తప్పించుకోవడంవల్ల కొందరికి వుక్రోషం. శత్రువులను అక్రమంగా కేసులలో యిరికించవచ్చునని ఆశ. ఇవన్నీ వొకదానికొకటి పెనవేసుకొని ఖూనీలు జరుగుతవి. వొకకేసు విత్తనంగా జరిగినా వొకదానికొకటి కొక్కెలుతగిలించినట్లు అవిచ్ఛిన్నంగా జరుగుతూనేవుంటవి.

రా—యివరకు నాకున్న అభిప్రాయాలన్నీ మీరు ధృఢపర్చారు. దిగువ జాతులకు జీవనంజరిగేటట్టు పని జూపి, పోలీసుడిపార్టుమెంటు యెత్తివేస్తే చాలా

కేసులు తగ్గిపోతవి. యీ డిపార్టుమెంటు తీసివేస్తే కలిగేనష్టంకంటే వచ్చేలాభమే యెక్కువని నా అభిప్రాయం.

కామానాయుడు సుఖీపాట్లతో ఊఁకొట్టుతూ కొంతసేపటి కది చాలించాడు రామదాసది కనిపెట్టి నిద్రవస్తున్నట్లున్నది. కడుకొండని సగం గొంగడి పక్కకింద వేసుకొని రెండోసగం కప్పుకొని మెదలకుండా పండుకున్నాడు. వుత్తరక్షణం కామానాయుడు త్రుళ్లిపడి లేచి:

కా—అయ్యా! మరుపుచొచ్చిన చెప్పలేదు. వొకటి సంబిది. రెండవది చింపిరిది నావు రెండుగొంగళ్లున్నవి. మీకు పక్కకు లేమ కావాలె. వొకటి తీసుకోండి.

రా—నాకున్న గొంగడితోనే సరిపుచ్చుకొంటా, మీ చింపిరిగొంగడి పుల్లప్ప కియ్యండి. చావ వత్తుకుంటూ సొండెంవలె పండుకున్నాడు.

కా—పుల్లప్పా! యిదుగో గొంగడి. కాస్త రెక్కలమీద అడ్డం వేసుకో.

కామానాయుడు అయిదునిమిషాలకు గురక ప్రారంభించాడు రామదాసుకు నిద్ర బట్టలేదు. కామానాయుడిచరిత్ర చిత్రంగా కనబడ్డది. పాప మతడు స్వాభావికంగా మంచివాడు. దయార్ద్రహృదయం గలవాడుకూడాను. లోకుల దుర్మార్గమూ, అన్యాయమూ అతనిలో క్రోధం పుట్టించి ద్వేషపూరితుని జేసినవి. అతనికి లోకమంటేనే వాకర బుట్టింది. దానిని శత్రుస్థానంగా భావిస్తున్నాడు. మనుష్యులకు తృప్తి లేదంటారు. గాని యెక్కడికక్కడ మనసు కుదుర్చుకుంటూనే వుంటారు, అతడు ఛీఫువార్డరుప్రమోషం సంపాదించి పోగాకుసరకంతో జీవనం హాయిగా గడపవచ్చుననుకుంటున్నాడు. ఆమాత్రం అవకాశంకూడా లేక, యితనినే అదృష్టశాలెని భావించేవాండ్లు యీజయిలులో యెందరున్నారో! కడుపునిండా అన్నం లేక పిడుగుకాకులా పనిచేసి దెబ్బలు తిని దిగంబరులై నాపచాపమీద పడుకొని కట్టుకోవడానికి గొంగడిపీలయినా లేక చలికి వణుకుతూ పడుకున్నా యీ ఖయిదీలు తమ ప్రస్తుతస్థితి యావత్తూ మరచిపోయి కేకిసలు గొడుతూ, సంగీతాలు పాడుతూ, ఆనందించడం చూస్తే మానవుడు యెట్టి హీనపరిస్థితులలోనూగూడా కష్టాలన్నీ మరచి సౌఖ్య మనుభవిస్తూనే వుంటాడు. రామదాసుకీవిధంగా చాలసేపు ఆలోచనలు పోతూనే వున్నవి. మాలక్ష్మి యేమవస్త పడుతున్నదో, యే అమర్యాదలకు లోబరిచారో, సెటిల్‌మెంటులో పిల్ల లేవిధంగా వున్నారో, అప్పుడికి వొంట్లో యెట్లా వున్నదో; నాయుడుగారు పిల్లలను స్వాధీనపర్చుకోవడానికి యే ప్రయత్నాలు చేస్తున్నారో! మొదలయిన ఆలోచనలన్నీ పొద్దు కడ్డంవచ్చే మబ్బులవలె రామదాసు నిర్మలమయిన హృదయాకాశాన్ని ఆవరిస్తున్నవి. తలంపులు మనసును పీకుతున్నట్లే పూరెళ్ల దోమలు వొళ్లు పీకుతున్నవి. వీటిని తోలలేక చూరవిడిచి వూరుకున్నాడు. వాటి యిష్టమువచ్చినట్లు విహరిస్తున్నవి. కొంతసేపటికి దోమలు దేహరక్తం పీల్చి తృప్తిపడ్డవిగాని తలపులు సముద్రకెరటాలవలె ఎడతెరిపి లేకుండా వస్తూనేవున్నవి. పోనుపోను తలకు వేడెక్కింది. అర్ధరాత్రి దాటినా కంటికి కూరుకు రాలేదు. లేచి కూర్చున్నాడు. మనసు స్వాధీనపర్చుకోవలెనని ప్రయత్నించాడు. కట్టివేసిన కుక్క గుంజుకుంటూ మొరిగినట్లు, పరుగులు ప్రారంభించింది. కుక్కయినా కొంతసేపటికి అలుపువచ్చి వూరుకుండేది. మనసు బంధించినకొద్దీ పలుపు పొడుగవుతున్నది. కాని

ధీరుడై ప్రయత్నానికేదీ అసాధ్యం లేదు. పద్మాసనంమీద కూర్చుంటా మనుకుంటే కట్టివేసిన రెండవకాలు స్వాధీనం కాలేదు. మొదట నిస్పృహజెంది దృఢసంకల్పాలకు విఘ్నాలు అడ్డంగావడమేమునే దృఢనిశ్చయంతో పద్మాసనం వేసుకొన్నట్లే భావించి విన్నజేర్చినట్లు మనస్సును కూడదీసుకున్నాడు. మనస్సును జయించినవాడికి లేనిదేమున్నది! సమస్తం వున్నది. 'నిర్వాణమపి దుర్లభం, అర్వాచీనాని కింపునః' అన్నట్లు మోక్షమే విధిలేకవచ్చి పడుతున్నప్పుడు మధ్యలాభాలు ఆగుతవా? తెల్లవారుఝామదాకా అలాగేకూర్చున్నాడు స్వాధీనమయినమనస్సును యిక కట్టి విడువగూడదని సహస్రారబృందావనములోనో తప్పితే మధురాబృందావనంలోనో తప్ప యితరచోట్ల విహరించగూడదని కట్టుబాటు చేశాడు కొంతసేపటికి పద్మాసనంనుంచి దిగి గొంగడి కప్పుకొని నిద్రపోయినాడు. పారావాండ్లు తిరుగుతూనేవున్నారు. రామదాసు స్వర్గంలో వున్నప్పుడుకూడా ఆలీజ్ వెల్-అంతా నరకమేనని పారావాండ్లు వుంటూనేవున్నారు. అధికారితారతమ్యాలనుబట్టి స్వర్గనరకాలు ఇహలోకంలోనే మానవులు అనుభవిస్తుంటారు గదా!

---

## ఆరవ అధ్యాయం

# పెద్దయ్య

లోకమంతా నిద్రపోతున్నా గ్రహాలు తమపరిధులలో బీటు తిరుగుతూ మానవులకు సుఖదుఃఖాలోనగూర్చేవిధంగా క్వారంటీను నిశ్శబ్దంగా వున్నా వార్డర్లు వొకరితరువాత వొకరు గస్తీ తిరుగుతూనేవున్నారు. తలుపులూ కిటికీలూ పరీక్షించుకుంటున్నారు. వార్డులోపల పారాజేసే వొవరుశీయర్లు వంతులప్రకారం ప్రతి అయిదు నిమిషాలకు ఆలీజ్ వెల్ అంటున్నారు. దానిని ఆధారం చేసుకొని ఫారావార్డరు గేటులోవుండి కేకవేసే వార్డరుకు అంతా క్షేమమని జవాబు చెప్పుతున్నాడు. చిన్న ఛీఫువార్డరు జ్ఞానానందంనాయుడు రౌండుకు వచ్చాడు. ఆయన చాలమంచివాడు. జయిలులో ఆయన వుండబట్టి ఆప్రాంతంలో వర్షం గురుస్తున్నది. లేకపోతే అక్కడ జాగేఘోరకృత్యాలకు జయిలుమీద చినుకు పడకపోయేను. క్వారంటులో రాత్రులు ఖయిదీవార్డర్లు పహరాచెయ్యరు వార్డర్లే గస్తీ తిరుగుతుంటారు. నాయుడు రౌండుకు వచ్చినప్పుడు వార్డరు మునిసామి పారా జేస్తున్నాడు. అతడు పాపభీతిగలవాడు. పదిసంవత్సరములనుంచి నౌకరీ చేస్తున్నా ఛీఫువార్డరును ఆశ్రయించడముగాని తృణమో కణమో ముట్టచెప్పటముగాని జయిలులోసామగ్రి వుద్యోగులయిండ్లలో చేర్పించడంగాని, ఆఖరుకు ఖయిదీలవల్ల మామూళ్లిప్పించడంగాని లేకపోవడంచేత తోటివాండ్లు నకటవశిరగతివరకూ పైకి బోయిన అతడింకా వొక్కమార్కూ సంపాదించుకోలేదు. జయిలులో వున్న రెయిన భైరవందివార్డర్లలోను యితడూ వెంకటాచలమూ మాత్రమే న్యాయముస్తులు. యితనికి కొంతవరకు వేదాంతంలో ప్రవేశంగూడ వున్నది పారా వేస్తూ అంతా క్షేమమని కేకవేసి తత్వాలు పాడుకుంటున్నాడు. చేలాంతరువెలుతురున ప్రతికిటికీలోగుండా చూచి పరీక్షిస్తూవచ్చి రామదాసు యోగ

సముధిలో వుండడం గమనించి విభ్రమపడి జయిలు పవిత్ర మయ్యేటందుకూ, ఆహోరాత్రాలు ఈ మహూశంలో బడి ప్రపంచమార్గాలే మరచిపోయిన తనబోటి వాండ్లు తరించడానికీ అప్పుడప్పుడు ఈ మహాత్ములు జయిళ్లకు వస్తుంటా రని సంతోషించాడు నాయరుకు పారాలో కనపడి.

మునుసామి—కాకుల్లో కలహంసను చూచారా?

నాయరు—అతడు పరమహంసే. మధ్యాహ్నం నే నిట్లా వస్తే అతనిచేత బండలు పగలగొట్టిస్తున్నారు. వోపినంతవరకు వొళ్లు దాచుకోకుండా చేస్తున్నా వార్డర్లు వేధిస్తున్నారు. మనిషిదగ్గిర వచ్చి వున్నదేమో కనుక్కోవడానికి ఛీఫువార్డరు క్రాంటె త్నం చేయిస్తున్నట్టు కనపడుతున్నది. రేపు వుదయం సూపరిండెంటుతో ఫయిలుకు వస్తే వృద్ధాప్యంచేత పనిచేయలేననీ తీర్పులో వున్నప్రకారం రైసుపడి యిప్పించ వలసిదనీ అడిగించు. నేను దొరతో మాట్లాడుతాను.

ము—చిత్తం తమ రతనికి వుపకారం చేయడం గొప్పసంగతి. అతనిభార్యా ఆడజయిల్లో వున్నది. ఆ మెవిషయంగూడా యేదో పుణ్యం గట్టుకోండి.

నా—పొద్దున దొరతో చెప్పకుండేటప్పుడు యేదో వొక సందర్భంలో తన భార్యకూడా జయిలులో వున్నట్టు చెప్పించు. ఆమె సంగతిగూడా మాట్లాడుతాను. ఆమె ముసలిదో కాదో?

ము—వాండ్లు పొద్దున వచ్చినప్పుడు చూచాను పెద్దవారుమనిషి, ఆఖరుకు నల్ల దారం వేయించినా మెరుగే.

పారా పూర్తి అయింది. మునిస్వామి వెళ్లిపోతూ సంగతులు యావత్తు పుల్లప్పతో చెప్పి "యివ్వాళ తప్పితే వారం రోజులుదాకా చిన్న ఛీఫువార్డరు దొరతో ఫైలుకు రాడు. తప్పక యివ్వాళ నే అడిగించు"మని వెళ్లిపోయినాడు.

రాత్రి మూడుగంట లయ్యేవరకు మూత్రపాత్రలు చాలవరకూ నిండి దుర్గంధం సావిడంతా వ్యాపిస్తున్నది. మలపాత్రలుగూడా అసహ్య మవుతున్నవి. ఆరో పారా ప్రారంభించగనే వోవరుశీరు రైస్ చెప్పాడు. కొందరులేచి విసర్జిస్తున్నారు. సావిట్లో వున్న నలభైపాత్రలూ అరోచకమైనవి. పుల్లప్ప లేచి కక్కుసుకుపోయివచ్చి—

పు—అయ్యా! తమరు అనుమానం తీర్చుకోరా?

రా—నిన్న మధ్యాహ్నం రాగిరొట్టె తినబట్టిగావాలె కడుపులో కలపెల్లాడుతున్నది. యిక్కడ నీళ్లు లేవుగా.

పు—నీళ్లెక్కడా లేవు. ప్రొద్దున తొమ్మిదిగంటలదాకా వార్డరు కక్కుసుకు తాళం తియ్యడు. రూలుప్రకారం కొట్లుతాళాలు, తీసేవరకు కక్కుసు తెరిచివుంచాలె. రాత్రి చావిట్లో పెట్టినపాత్రలు, అత్యవసరమైనప్పుడు తప్ప సాధారణగా వుపయోగింపగూడదు. అదంతా పోనిచ్చి దొర తనిఖీచేసిపోయినతరువాత తాళం దీస్తాడు.

రా—దొర యింతమాత్రం కనుక్కోలేడా? మనం చెప్పుకోకూడదూ?

పు—దొర యెన్నని చూస్తాడు? తాబేదార్లు గమనించాలిగాని ప్రతీపైఅధికారి తెలుసుకోవడం కష్టం. ఖయిదీలు యెవడూ చెప్పడానికి దొమ్ము చాలదు. ప్రతివాడూ తనపబ్బం గడుపుకుండేవాడే. పాకీవాడితో స్నేహం సంపాదిస్తే సలక్షణంగా అన్నీ గడుపుకోవచ్చు. వొకవేళ యెవడైనా మొండివాడుండి దొరకు చెప్పు

కున్నా యీ ఖయిదీ లంతా వార్డరు ప్రతిరోజూ తనను కొట్లు తీయడంవే కళ్ళకు పంపిస్తున్నా డని సాక్ష్యం చెప్పతారు. అటుతర్వాత తప్పుడు రిపోర్టు చేసినందుకు అడ్డ బేడీలో నిలువు బేడీలో పడతవి, బేడీలు పడకపోయినా ఆసాయంత్రమో ప్రొద్దునో రిపోర్టుచేసినవాడి వీపున చోటాకట్టె విరుగుతుంది.

రా—కొట్టినందుకు ఫిర్యాదు చేస్తేనో?

పు—దీనికి లేనిసాక్ష్యం దాని కెక్కడ వస్తుంది?

గాయం లేకపోతే కొట్టలేదంటారు. కనబడుతుంటే తాను పనిచేయకుండా వుండడానికి స్వయంగా గాయం చేసుకున్నాడంటారు. నిశ్చయంగా రిపోర్టుచేస్తాడని ముందుగా తెలిస్తే అధికారులను ధిక్కరించాడనీ, లేక కొట్టవచ్చాడనీ ముందుగానే వార్డరుఫిర్యాదు చేస్తాడు. సూపరిండెంటు యీ కేసు విచారణకు పిలిచేలోగా యితడు తనను వార్డరు కొట్టాడనీ చెప్పుకోడానికి పోనియ్యరు. వార్డరో ఖయిదీవార్డరో వెంటలేనిదీ యేఖయిదీ గూడా జయిలులో తన బారకాసు విడిచిపోగూడదు. తనమీద కేసు - నిమిత్తం పిల్చినప్పుడు తనను కొట్టాడని చెప్పుకుంటే తప్పుడువాదం చేశాడని కఠినంగా శిక్షించిన కేసులు అనేక మున్నవి. యెదురువాదం చేసుకుంటే యెక్కువ శిక్షపడుతుందని తనను కొట్టిన సంగతి దాచుకొని తనమీద వచ్చిన అబద్ధపు కేసు నిజమేనని వొప్పుకొని సత్యవంతుడని దొరవల్ల మెప్పుపొంది తక్కువశిక్షలు పొందినవాండ్లనేకులున్నారు. యీ ప్రకారం కొన్నాళ్లు జరిగిన తరువాత పర్యవసాన మేమవుతుంది? జయిలులో జరిగే వొకనేరమూ రిపోర్టుగాదు. వొకడూ సాక్ష్యం చెప్పడు. పదహారువందలమంది దుర్మార్గులుండే ఖయిదులో వొక్కనేరంగూడా జరిగినట్టు నేరపు జాబితాలో వుండదు. ఖయిదీలను మంచిఖాయిదాలో వుంచారనీ, జయిలు పాలన మంచి అదుపుతోనూ, సమర్థతోనూ జరుపుతున్నారనీ, ఖయిదీలంతా సుశిక్షితులు కావడంచేత జయిలులో నేరములే నశించినవనీ, దొరగారి పాలనాశక్తి అద్భుతమనీ, తక్కిన జయిళ్లకు అధికారులుగా వుండే నేటీవులు నిడదవోలు సెంట్రలుజయిలుచూచి పాలనాపద్ధతి నేర్చుకోవలసిందనీ మద్రాసుప్రభుత్వంవారు తమ సాంవత్సరిక ప్రకటనలో పురస్కరించి వొక ప్రతిని తక్కిన జయిళ్లకు పంపుతారు.

కా—లేచి కూర్చొని యీమధ్య స్వరాజ్యపువాండ్లు కొందరు యీ జైలుకు వచ్చారు. పెద్దయ్యగారు కొన్ని కేసులు దొరకు రిపోర్టు చేశారు. విచారణకువచ్చేరోజున జైలరు మొదలుకొని తక్కిన వుద్యోగులు యావత్తుమంది దెబ్బలు తిన్నవాండ్లను సాక్షులను తిరగదీసి అందరిచేత దెబ్బలుకొట్టలేదనిపించారు. డుబ్ జైలర్ (డుబ్=డిప్యూటియొక్క పొట్టిరూపం) తనమీద స్వదేశీవాడు అక్రమకేసు పెట్టాడనీ బేడీలు వేయించవలసిందనీ వాదించాడు. తరువాత సూపరిండెంటు పెద్దయ్యగారిని పిలిపించాడు. వార్డరు ఆయనను వెంటబెట్టుకొని తీసుకపోతుంటే ఆయనను తప్పకుండా చీకటికొట్లో వేయిస్తారనీ జైలంతా వుడికిపోతున్నది. ఆయనను వార్డరు సూపరింటెండెంటు దగ్గరకు తీసుకొని పోయేటప్పుడు యెదురుగా వచ్చిన ఖయిదీవార్డర్లు, ఖయిదీలు కండ్లనీళ్లు పెట్టుకొని చాటుగా దణ్ణం పెట్టారు. సూపరింటెండెంటు దగ్గరకు ఆయన నిర్భయంగా వచ్చాడు. వుద్యోగస్థులంతా ఆయనముందు పిచ్చికలలాగు కనపడ్డా సూపరింటెండెంటు యేదో అడిగేవరకు ఖండితంగా జవాబు చెప్పారు. కోర్టులో హాజరుగా వున్న దెబ్బలు

తిన్నవాండ్లకూ సాతులకూ మొగాన కళవచ్చింది. అప్పుడు యీమాటలు జరిగినవి.

సూ—మీ కేసు అబద్ధమని తెలుస్తున్నది.

పె—నిజమని నాకు తెలుసు. నే నీ కండ్లతో చూచాను.

సూ—అయితే విచారిస్తారా ?

పె—విచారిస్తాను. ఒక్క సంగతి వున్నది. మీకీకేసు రిపోర్టుచేసినప్పుడు కొట్టిన వుద్యోగులకు తెలియకుండా దెబ్బలు తిన్నవాండ్లను సాతులను స్వయంగా పిలిపించి కనుక్కొమని కోరాను. ఆ ప్రకారం జరిగించారా ?

సూ—లేదు.

పె—యీ కేసు విచారించేటప్పుడు ఆ సంగతి మాత్రం జ్ఞాపకం వుంచుకోండి.

సూ—కానియ్యండి. రే కేసు ముందెత్తుకో మంటారు ?

పె—శేషయ్య కేసు విచారిస్తాను. యేమయ్యా డుబ్ జైలరుగారు కొట్టారా ?

శేషయ్య—అయ్యా ! కొట్టారండి మో కాళ్లు, మోచేతులు వాచినవండి.

సూ—దేనితో ?

పె—దేనితో కొట్టారు ?

శే—చోటా కట్టెతో. రూళ్లకఱ్ఱతోగూడా కొట్టారు.

సూ—యిందాకా యెందుకు లేదని చెప్పావు ?

శే—వీండ్లు అట్లా చెప్పకపోతే కొడతా మన్నారు.

డుబ్ జైలరూ, తక్కిన వుద్యోగులూ, యీ మార్పు చూచి ఆశ్చర్యపడి చూస్తున్నారు.

సూ—సాతులను మీ రేమయినా సవాళ్లు అడుగుతారా ?

డుబ్బు—అయ్యవారికీ నీకూ పరిచయము వుందిగదా ?

శే—మొన్న చూడడమే.

డు—నీవు అయ్యవారికి చుట్టలు అమ్ముతుంటావుగదా ?

పె—నా కిప్పటికి నలభైనాలుగేండ్లు నిండవచ్చినవి. యిదివరకు పొగాకు యే రూపాన వుపయోగించలేదు. యిక జయిలులో నేర్చుకోవాలె.

డు—జవాబు చెప్పవేమి ?

సూ—ఆ ప్రశ్న వద్దు. యింకొకటి అడుగు.

డు—యిక లేవు.

పె—యింకా సాతు లున్నారు,

సూ—మీరు చూచారుగదా ?

పె—చూచాను.

సు—యిక సాక్ష్యం అవసరం లేదు.

డు—వాండ్లు తిన్నగా పనిచేయకపోతే చిన్నగా కొట్టాను.

పె—యిదివరకు కొట్టనే లేదంటిరే ?

సూ—కొట్టడానికి నీ కధికారం లేదు.

డు—దెబ్బలు తిన్నవాడు వూరుకుంటే ఫిర్యాదు చేయడానికి యీయన యెవరు ?

పె—ప్రతివాండ్లకూ అధికార మున్నది.

సు—ఆయనకు నేనధికారం యిచ్చా.

పె—దెబ్బలు తిన్నవాడు వచ్చి సాక్ష్యం యిచ్చాడుగదా ?

సు—యిక మీరు వెళ్లవచ్చు. పిల్లగారూ ! మీకు ప్రథమ తప్పిదంగా యేంచి పదిహేను రూపాయలు జుల్మానా వేశా.

అప్పటినుంచి స్వదేశీవాండ్ల యెదుట దెబ్బలు కొట్టడం ఆగిపోయింది; అదివరకు పెద్దకఱ్ఱలతో పాతికదెబ్బలు కొట్టిన కేసు లున్నవి.

రా—యెందుకు కొట్టడం ?

కా—అనేక కారణా లుంటవి. పనిలో అశ్రద్ధ జరిగిందనీ, మాట్లాడుతున్నాడనీ, నియమించినకాలానికి లోగా కక్కుసుకు వెళ్లాడనీ, బియ్యపుబస్తాలు మోయలేనన్నాడనీ, జయిలులో వార్డరు కందిపప్పు దొంగిలించి తెమ్మంటే తేలేదనీ, పొగాకు వొక వార్డరుదగ్గిర మాని యింకొకరి దగ్గిర కొంటున్నాడనీ, భోజన, పదార్థాల విషయం, కంబళ్లు వగైరాల విషయం, ఫిర్యాదు చేశాడనీ ఫయిలులోనుంచి తొలిగాడనీ, యిటువంటికారణాలు యెన్నో వుంటవి. యీ ప్రకారం కొట్టికొట్టి ఖయిదీల మనుష్యభావాన్నే చంపివేశారు. ఖయిదీ రిపోర్టు చేయడు. యీ దెబ్బ లన్నీ మొదట తనకు వేసినశిక్షలోభాగ మనుకొని అనుభవిస్తాడు. జయిలరు మొదలు తనిఖీదారువరకూ పెద్దకఱ్ఱలు చేతబట్టుకొని పొద్దుగూకులూ పశువులను బాదినట్లు బాత్తూ పనిచేస్తుంటారు. జయిలువుద్యోగస్తులందరినీ మూడుభాగాలుగా విడదీయవచ్చు. చిన్న ఛీపువార్డరు రెమిషన్ గుమస్తా ఆసుపత్రి కాంపౌండరూ వార్డరు మునిస్వామీ వెంకటాచలమూ మనుష్యులకోటిలో చేరినవాండ్లు. సూపరింటెండెంటు మధ్యముడు, సద్భావాలుకలవాడు. తక్కినవాండ్లందరూ రాక్షసగణంలో చేరినవాండ్లు. కొన్నిసంవత్సరాలక్రితం హెడ్ వార్డరు బ్రహ్మానందం వొకఖయిదీని కొట్టి చంపితే వందలకొలదీఖయిదీలూ వుద్యోగులూ యెరిగినసంగతయినా, నేరస్తుని శిక్షించటానికి జయిలువుద్యోగులు ప్రయత్నంచేయక పోగా డాక్టరు దెబ్బలుకావనీ, యేదో పనిముట్టుతగిలి చచ్చాడనీ, సర్టిఫికేటు యిచ్చాడు. అదిగాక యీ మధ్య వొకస్వదేశపుఆయనను చావుదెబ్బలు గొట్టారు వుద్యోగులు చాలామంది ముందుగా ఆలోచించికొట్టించిందే. అనేకమంది కొట్టడంచూచారు. సూపరింటెండెంటు మొదలుకొని వార్డరువరకూ, న్యాయం కనుక్కోవలెనని గాని నేరస్తులను శిక్షింపవలెనని గాని ప్రయత్నమే లేకపోగా కండ్లారాచూచి చూచినది చెప్పడానికి సిద్ధంగా వున్న సాక్షులను భయపెట్టీ శిక్షించీ, బహుమతు లిచ్చీ బెదరించీ చెప్పకుండాచేశారు యీ కేసులోనే యిట్లా జరిగితే యిక ఖయిదీలబిసాదెంత ?

ఓవరుసీరు—మీసోది చాలించి కక్కుసుకు పోయి రాండి తొమ్మిదిగంటల లోగా తయారుకాకపోతే చోటాకట్టె విరుగుతుంది

కా—తరువాత మాట్లాడుదాం మీపని తీర్చుకొనిరండి.

రా—రామరామ ! నీళ్లు లేకుండా యెట్లాగండి ?

"క. ఆకలములు వృత్తుకయును"

అని తిక్కన్నగారు ఆపద్ధర్మంగా చెప్పారు. అదిగూడా గతిలేకపోయెను. దేహ

మున్నంతవరకు దేహధర్మాలు అవలంబించకతప్పదుగదా? అంటూ రామదాసు మెల్లగా లేచి గొలుసులాగి చిమ్మచీకట్లో తాళ్లాడుకుంటూ భాండాలవద్దకు జరిగాడు. యేభాండం దేనికో తెలియక తడివి చూచేవరకు చేతులు అసహ్యమైనవి. చేతులు కుండకు తుడిచి అనుమానం తీర్చుకొనివచ్చి పడుకున్నాడు. కొంతసేపటికి చేతివాసన పోయింది అంతట హెడ్ వార్డరు వచ్చి గొలుసులు విప్పించి అందరినీ బయటకితెచ్చి భూలోకం చూపించి ఫైలుగూర్చోబెట్టి లెక్కచూచుకొని వెళ్లిపోయినాడు

రా—పుల్లప్ప! యిక్కడ వున్నన్నాళ్లూ చుక్కలూ చందమామా కనబడవు. గదా?

పు—యమలోకంలో చంద్రుడూ చుక్కలూ పొడవవు. యిది అభాపురి.

## ఏడవ అధ్యాయం

## పిడత

తెల్లవారింది. పుల్లప్ప నాకబలిపిడతకంటె కాస్త చిన్నపిడతనిండా బొగ్గుపొడి పోసుకొని పండ్లు తోముకొనేటందుకు రామదాసుకు తెచ్చి యిచ్చాడు. మహర్షికి లేడిపిల్ల దొరికినట్లుగా రామదాసు పిడతచూచి ఆనందపడుతూ,

రా—ఈబుడ్లు మనకోసం పుర్మాయించి చేయించినట్లున్నారు. వీటికోసం ప్రత్యేకం సువల బెట్టించారా?

పు—పిల్ల లాడుకోవడానికి బాగా పనికివస్తవి. దీనిని భద్రంగా మీ పడక దగ్గిర దాచుకోండి.

రా—గోచికంటె గొప్పదరిద్రమూ అనేసామెత క్వారంటులో వుండే ఖయిదీలలో బుట్టినట్లున్నది. గోచిపాతరాయుడికి కుండపెంకు పోయినందువల్ల వచ్చే నష్టముండదు. అయినా యీబుడ్డి ముద్దువస్తున్నది యెత్తుకొనిపోయేవరకూ దాచుకుందాం. అని అస్తారుపాదంగా తీసుకొనిపోయి పక్కదగ్గర దాచుకున్నాడు.

అంతా గంజిదాగి యెవరిపనికి వారు పోయినారు. పుల్లప్ప రామదాసు రాళ్లు గొడుతున్నారు. కామానాయుడు కపిలపనికి పోయినాడు. దొర తొమ్మిదిగంటలకల్లా ఫయిలుకు వస్తాడన్నారు. యెనిమిదిన్నరకే అంతా తిరిగివచ్చారు; క్వారంటు ఖయిదీలలో షుమారు 30 మందికి గోచులు తప్ప దుస్తులుగాని, చాపలుగాని, గొంగళ్లుగాని యియ్యలేదు, వీండ్లలో యెవరూ చేతడిగలవాండ్లు లేరు, తొందరపడి దుస్తులు కివరూ మామూళ్లియ్యలేదు. వుద్యోగస్తులతో పాటు వాండ్లూ మొండిబడి కూర్చున్నారు. పై వేషాన్నిబట్టి కొందరిని వార్డరు కదిలించి చూచాడుగాని యెవడూ సందుపెట్టలేదు. దొర వచ్చేవేళవుతున్నది. చల్లాడాలు, చట్టలూ మాత్రం పిళ్లేగారు తెప్పించి దొరగారివల్ల తప్పట్కారాలు రాకుండా బొత్తిగా ఆశలేదనుకున్న వాండ్లకు కొందరికిచ్చి తక్కినవాండ్లను గదిలోబెట్టి తాళం వేయించాడు. తక్కిన అందరినీ అలంకరించి ఫయిలులో నిలువబెట్టించి దొరతో గలసి ఫయిలు తనిఖీకి వచ్చాడు. దొర అందరి మొగాలు చూస్తూ వెళ్లిపోతుంటే వొకడు సలాం బెట్టంగనే నిలువబడ్డాడు.

కా—మాది రాజమహేంద్రం. ఇప్పుడు బియ్యం మా కలవాటులేక విరోచనాలవుతున్నవి. పచ్చిబియ్యపు అన్నం స్వయంలోనుంచి పులుసు యిప్పించండి.

సూ—వూరకే మార్చడానికి వీలులేదు, బాగా జబ్బుచేసి ఆసుపత్రికివస్తే పచ్చిబియ్యపు అన్నమిస్తారు, నీవు బ్రాహ్మణుడవు గావు గనుక స్వయంలోనుంచి యియ్యడానికి వీలులేదు.

కా—బాగా జబ్బు చేసేవరకు ఇదే తింటూంటే చివరకు నయంగాకపోతేనో ?

డు-జ—యెవడురా వీడు అధిక ప్రసంగి.

సూ—(నవ్వుతూ) నయంగాకపోతే మార్చే అవసరంలేదు.

కా—మీరు చెప్పేప్రకారం నయమయితేనూ ఆవసరం లేదన్నమాటే, బాగా వుంది తీర్పు,

సూపరింటెండెంటుగారు మొహం చిట్లించుకొని జవాబుచెప్పక ముందు నడుస్తున్నాడు. డుబ్ జయిలరుకు కొమ్ములులేవుగాని తప్పక లూళాయపిల్లే. సూటు వేసుకొని తొడుగుమోస్తరుగా జరుగుతూ దొరవెంబడి వస్తున్నాడు. చిన్న సర్జను షోకులబొమ్మ. యెర్రగా పుల్లగా వుంటాడు. హృదయం మట్టుకు కాలుసలుపు. దయాదాక్షిణ్యాలులేవు ఉపకారం చేయకపోతే మానె బుద్ధిపూర్వకంగా అపకారంచేస్తాడు. వేంబయ్యరు (వేపఅయ్యరు) అనే పేరు జ్యోతిష్కుడెవడో యితని భావిచరిత్రకనిపెట్టే పెట్టాడు. టక్కుటక్కుమని బూటుకాళ్ల చప్పుడుతో దొరపక్కగా ఆయన వస్తున్నాడు. హృదయ నైర్మల్యం ముఖాన వెలిబుచ్చే చిరునవ్వుతో జ్ఞానానందనాయరు దొరకు కుడిప్రక్క నిలువబడి రామదాసుకోసం ఫయిలులో వెతుకుతున్నాడు. యెక్కడా కనుపడలేదు. అనుమానపడి.

జ్ఞా—డుబ్ జయిలరుతో (రహస్యంగా) కొందరు ఫయిలులో లేట్లున్నారే.?

పి—మీ కెవరు గావాలె. యెవరయినా పనికి బోయినవాడు దాక్కున్నాడేమో ? తర్వాత కనుక్కుందాము లెండి.

జ్ఞా—కాదు, ఫైలులో సూపరిండెంటును కొన్ని సంగతులుతప్పకుండా యివ్వేళ అడుగుతా నన్నాడు.

పి—వాడెవడు ? యేమడుగుతాడు ? వచ్చేసారి అడగగూడదా ?

జ్ఞా—వొక ముసలిమాలవాడు ఆతని పేరు రామదాసు. యేమీ పని చేయలేక బాధపడుతున్నాడు. అతనికి అన్నపుపడి వేయించి పని తగ్గించే యేర్పాటు చేయాలె.

పి.—ఓసి యింతేనా-అన్నప్పడి తీర్పులోనే వున్నది. వేసివేతాం. వచ్చేఫయిలు వరకూ పనిలేకుండా చేయింతాం. ప్రస్తుతం వూరుకోండి. వాడికి గొంగళ్లులేవు.

పు—(వృద్ధభావలో) అయ్యా ! సలామండి.

సూ—యేమి చెప్పుకుంటావు ?

పు—రాత్రి నాకూ యింకా 30 మందికి చట్టలుగాని చాపలుగాని గొంగళ్లుగాని లేవు. చలికి బాధపడ్డాం ప్రొద్దున కొంతమందికి కాలిచట్టలూ, చేతిచట్టలూ మాత్రం వొక జతయిచ్చి అలంకరించారు. అవి మళ్లీ మీరు గోడ తిరుగంగనే వూడదీసుకుంటారు.

పి—వూడదీసుకుంటారని నీ కెట్లా తెలుసు ?

పు—అది మామూలె.

పి—నీ వెప్పుడు వచ్చావు ?

పు—నిన్నండి.

సూ—నిన్న వచ్చినవాడివి యిక్కడ జరిగే మామూలు సంగతి యెట్లా చెప్ప గలవు ?

పి—యీ పూట కొత్తగా యిచ్చిం దెవరికి ?

పు—యీ పదిమందీ యీ పూట యిచ్చినవాండ్లేనండి

పి—యివి మీరు నిన్న కాదట్రా యిచ్చింది.

ఖై—తమరు మాకు నిన్ననే దయచేశారండి.

పు—యిప్పుడు వీండ్లంతా భయపడి అబద్ధాలు చెప్పుతున్నారు. చట్టలు కొత్త మాసినవేమో చూడండి. అది పోనీయండి వీండ్లకు గొంగళ్లు, చాపలు యిచ్చారేమో కనుక్కోండి.

సూ—(ఇంగ్లీషులో) మీకు గొంగళ్లు, చాపలు యియ్యలేదా ?

పి—అరవంలో-మీకు నిన్న గొంగళ్లు చాపలూ యిచ్చారుగదా.

చాలమంది అరవము తెలియని తెలుగువాండ్లు. ముగ్గురు అరవవాండ్లు. యిచ్చారు గావాలె అన్నారు. పిల్లియిచ్చారని చెప్పుతున్నాడు అని యింగ్లీషులో తర్జుమాచేసారు.

పు—మీ రేమి అడిగారో వాండ్లేమి చెప్పారో నాకు తెలియదండి.

పి—నేను తప్పు తర్జుమా చేశానట. నీకు అరవంగాని ఇంగ్లీషుగాని వచ్చునా?

పు—రాదండి.

పి—నేను తప్పుతర్జుమా చేశానని అతడి కెట్లా తెలుసు? అరవం ఇంగ్లీషు తనకు రావట.

సూ—తర్జుమా సరియైనదేనా?

జ్ఞా—అరవం బాగా నాకు తెలియదు. నాది మలయాళం. చాలాభాగం ఖయిదీలు తెలుగులో మాట్లాడుతుండడంచేత మీసంభాషణే నా కర్థం కాలేదు.

సూ—యేమీ తోచక వుద్దుతో - తర్జుమా సరియైనదే మా వుద్యోగులను నేను నమ్ముతాను.

పి—యేం పుల్లప్పా ! నీవు తప్పుపిర్యాదులు చేస్తున్నావు యెందుకు శిక్షించ గూడ దంటున్నారు దొరగారు.

పు—నాకంతం తీయిస్తా నన్నా భయం లేదు. మీరు దాచిపెట్టిన పదిహేను మందినీ పట్టిస్తాను నాతో దయచేయండి.

పి—వాళ్లంతా అబద్ధాలు ఆడుతున్నారట. పదండి వాడితో నేమి?

సూపరిండెంటు ముందుకు సాగి వెళ్లుతున్నాడు.

పి—వో యివార్డరు! పుల్లప్పను ౧౦ గంటలకు నా ఆఫీసుకు తీసుకొని రా. బేడీలు వేయిస్తా. వూరికే తీసుకొనిరాబోకు.

వా—చిత్తం.

సూపరిండెంటు వెళ్లిపోయినాడు. వార్డరు పుల్లప్పను చోటాకట్టెతో పిక్కల మీద మోకాళ్లమీద కుమ్మాడు. కొట్టారని చెప్పుతున్నా విచారించే దిక్కుండదని

విలవిలలాడుతూ వార్డరు కాళ్లమీద బడ్డాడు. పడ్డవాడిని మరి రెండు బాదారు. రక్తమయమైంది నూపరిండెంటుకు చూపుతా నని లేచి పరుగెత్తుతున్నాడు. ఇంతలో ఛీఫు వార్డరు యెదురుగా వచ్చి యిద్దరు ఖయిదీలచేత పట్టించి ఆసుపత్రిలో రోగిగా చేర్పించకుండా గాయాలకు మందువేయించి మళ్ళీ క్వారంటులోకి బంపాడు. రామదాసు మొదలైన వాండ్లకందరికీ తెలిసింది. ఖయిదీలందరూ వుద్యోగస్తులను అయ్యా నాయనా అని బతిమెలాడుకోవాలెగాని వాండ్లమీద ఫిర్యాదు లేమిటని పుల్లప్పనే చీవాట్లు పెట్టారు.

పు—నన్ను గొట్టడం మీరంతా చూచారుగదా యిప్పుడు ఫిర్యాదు చేసుకోవడానికి పోనియ్యకపోయినా మళ్ళీ ఫయిలులో చెప్పుకుంటాను. చూచిన సంగతులు సాక్ష్యం చెప్పండి.

ఖయి—వుద్యోగస్తులమీద సాక్ష్యం చెప్పించి మాకు బేడీలు వేయించవలెనని చూస్తున్నావా? యీమాత్రంగా బతకనియ్యి. యిది అసలే ఖయిదు. దీంట్లో దెబ్బలుకొట్టక ముద్దుపెట్టుకుంటా రనుకున్నావా? యేదోకాలం వెళ్లబుచ్చుకొని పోవాలె. వొకవేళ ఫిర్యాదు చేస్తావే మాదవయ్యా. పడ్డదెబ్బలు మళ్ళీవచ్చేనా? యేందో తోచనిపని. మమ్ములనుకూడా యిరికిస్తానంటా వెందుకు.

యింతలో పిళ్లగారు మళ్ళీ లోపలికివచ్చి - యేడిరా వాడు. యింకా ఫిర్యాదుకు పోతానంటున్నాడా - అన్నాడు.

వా—దొరకు దెబ్బలు చూపిస్తాడట, సాక్ష్యం కుదుర్చుకుంటున్నాడు,

పి—వార్డరుతో- నీకుయెన్నిమాట్లు చెప్పినా బుద్ధిలేదు. వాడు లేచి పోగలిగేటట్టుగానా కొట్టేది యేమిరా ఫిర్యాదుకు పోతావా?

పుల్లప్ప మాట్లాడకుండా తల వంచుకున్నాడు.

పి—వీడు తప్పుడు రిపోర్టు చేసినందుకు యీ పూట పస్తు,

పు—అట్లని శిక్షల రిపోర్టులో వ్రాయండి,

పి.—వ్రాయవలెనా? వ్రాయకపోతే యేమి చేస్తావో చూతాం. సాయంత్రం గంజిమాత్ర మియ్యండి, అక్కడికి తిక్క చాలభాగం వదులుతుంది.

పు—నేను దొంగదాసరివాణ్ణి యింతమాత్రానికి వంగేవాడినిగాను

పిళ్లె చోటా కట్టెతో మో కాళ్లమీద రెండుదెబ్బలు గొట్టంగనే కొండకేకలు పెట్టుతూ కిందపడ్డాడు,

పి—చాలునా?

పు—చాలేదే? మీ రోజులు మంచివైనవి, ప్రొద్దున దాచిపెట్టిన పదిహేను మందిని దొర వచ్చేముందు యింకొక కొట్లో వేయక పోయినట్లయితే నా తడాఖా చూపించేవాడినే,

పి—దొరగారికి చూపుతానంటివే చూపకపోయినావా?

పు—రెండోకొట్టు యేదో తెలిస్తే అంతపని చేసేవుందును

సి—నీ కేమయినా మేస్త్రీపని యిప్పించమంటావా?

పు—ఏదో తగలవేయించండి

పి—కొత్తవాడివి. నెలరోజులు జరగనియ్యి. అందాకా లోలాయిగా వుంచి

గాయాలు నయం జేసుకో (తనలో) నల్లకుళ్ళాయి, వీడికి మేస్త్రీపని యెట్లా వస్తుందను కున్నాడో?

పిల్ల రామదాసుదగ్గరకు వచ్చి నీకు 'అన్నపుపడి వేళాను పనిసంగతిలో'

వా—తక్కినసంగతులు నే మాట్లాడి మనవిజేస్తాలెండి కొద్దిరోజులలో వాండ్ల వాండ్లెవరో వస్తారట

పి—సరే. (రహస్యంగా) యీ దెబ్బల సంగతి స్వదేశీవాండ్లకు తెలియనివ్వ బోకు. వాళ్లు సాక్షులను నిలువదీస్తారు ప్రాణంమీదికి వచ్చేను

వా—తలా వొకబీడి పారవేశా. సాక్షులెవరూ పలికేవాండ్లు లేరు

డుబ్ జయిలరు కొత్తగా దుస్తులు యిచ్చినవాండ్లనందరిని పిలిపించి వరుసగా నిలువబెట్టి విడిపించి మూటగట్టించాడు వాండ్లు లబలబలాడుతుంటే గుడ్డలు కుట్టించి యిస్తానని సమాధానపరచి రామదాసుకు వొకజోడు దుస్తులూ, కంబళీ, చాపా, యిప్పించి వచ్చే ఫయిలుదాకా తేలికపని యియ్యమని వార్డరుతో చెప్పి అన్నపుపడి వ్రాసి వెళ్లిపోయినాడు.

---

## ఎనిమిదవ అధ్యాయం

## వెంకటదాసు

జయిలులో జన మంతా యెవడో బందిపోటుదొంగ శిక్షకు వస్తున్నాడని గలభాగా చెప్పుకుంటున్నారు వుద్యోగస్తులు రామంనాళీగా వస్తూపోతూ వున్నారు. గేటుదగ్గర వార్డరను విచ్చుకత్తులతో రెండుబార్లు దీర్చి నిలువబెట్టారు. ముందు డోలీ వస్తున్నది. పోలీసుఫూటు చుట్టూ కమ్మి నడుస్తున్నారు. వేలకొలది జనం వెంటవస్తున్నది జయిలరు గేటుకు ౨౦ గజాల ముందుకువచ్చి జనాన్ని ఆగమని వుత్తరువుజేశాడు జనం లక్ష్యపెట్టలేదు. అప్పుడు వెంటవస్తూవున్న డాక్టరు అక్కడ మేరువపానివుంటే యొక్క 'జగడు చాల జబ్బుస్థితిలో వున్నాడు (జగన్నాథమని కేకలు) జగన్నాథం లేచి కూర్చోగూడా లేదు. త్వరగా లోపలికి తీసుకొనిపోయి కట్టుకట్టితే కొంతబాధ తగ్గవచ్చునని చెప్పాడు. అంతట జనం గట్టుకుతగిలిన తరంగాలు మోస్తరుగా ఆగిపోయి జగన్నాథంకు జై అని కేకలువేశారు. నిజంగా ఆతడు జగన్నాథుడేఅని కొందరన్నారు. ఆతడు ప్రపంచాన్ని యేలకపోయినా అతని ఆదర్శాలు మానవులభావప్రపంచాన్ని యేలుతవని మరికొందరన్నారు. నిశ్శబ్దంగా డోలీ లోపలికి వచ్చింది. సరాసరి ఆసుపత్రికి తీసుకొనిపోయి పడుకోబెట్టిగాయాలు కడిగి కట్టుగట్టారు ఆతనితో వచ్చిన సర్జను కర్నూలుజిల్లా కలెక్టరిచ్చిన పరిచయపు వుత్తరమును సూపరిండెటుకందిచ్చి వారికి జగ్గడిపైవున్న అభిమానం దెలిపి వెళ్లి పోయినాడు

సూ—నీ పేరు జగన్నాథమా?

జ—మొదటిపేరు జగ్గడండీ. జగన్నాథ మని కొంద రంటారు.

సూ—కలెక్టరుగారు నీమీద చాలా దయగా వున్నారే!

జ—వారు చాలా యోగ్యులు.

సూ— నీవు చాలా జబ్బుస్థితిలో వున్నావు, నావల్ల నీకు కావలసిం దేమి?

జ— మా అయ్య రామదాసు అనే ఆయన, మాలక్ష్మి అనేమా అమ్మ యీ జయిలో వున్నారు. నేను వెళ్లి పోయేవరకూ నా మంచందగ్గర వుండటానికి వుత్తర్వు యిప్పించండి.

సూ— పిల్లగారితో- వా రెవరో మీకు గుర్తేనా?

పి— గుంటూరునించి రెండురోజుల్క్రిందట వచ్చినవాండ్లా?

జ— అవును.

సూ— వాండ్లనిద్దరినీ ఆసుపత్రిలో వుంచు. యీదగ్గిరమంచాలు రెండూ వాండ్లకియ్యండి. యీగదిలో యింకెవరూ వుండకూడదు. వాండ్లు మాట్లాడుకుండేటప్పుడు మీలెవ్వరూ సమీపంలో వుండనవసరంలేదు. వెంటనే పిలిపించండి.

పి— చిత్తం.

సూ— సర్జను లిద్దరు, వొకరు విడిస్తే వొకరు హాజరుగా వుండి యీ రోగిని చూస్తుండండి శస్త్రచికిత్స చెయ్యడానికి వల్లవుతుందేమో రేపుపొద్దుటికి తేల్చండి. యిప్పటికి వీలులేదనే తోస్తుంది. కొద్దిగా మత్తుకూడా యేర్పడుతున్నదేమో గమనించండి.

రామదాసునూ మాలక్ష్మినీ పిలుచుకుని రావడానికి వెళ్లిన వార్డరు వుభయులనూ వెంటబెట్టుకుని వచ్చి ఆసుపత్రిలో దిగవిడిచాడు. వాండ్లకు వెంకటదాసు వచ్చిన సంగతి తెలియదు! తక్కళ్ల జగ్గడు మిమ్ములను చూస్తానంటున్నాడని మాత్రం చెప్పారు. రామదాసుకు అనుమానం తగిలి వెంకటదాసు ఆతని గుంపులో చేరి తన సంగతి చెప్పివుంటాడని అనుకున్నాడు: వుభయులూ వెంకటదాసు పడుకున్న చావిట్లోకి పోయినారు. వెంకటదాసు కైవారం జేసినట్టు యతిరాజుకు వొంటి చేతితో నమస్కారం జేశాడు. మాలక్ష్మి దూరంనుంచి దిగాలబడిచూచి పోలికలనుబట్టి గుర్తించి నా వెంకడు, నావెంకడని పరుగెత్తివచ్చి కావలించుకొని యేడుస్తూ వెర్రిదానివలె మళ్లీమళ్లీ ముద్దు బెట్టుకుంటున్నది. స్తన్యంకూడా చేపుకు వచ్చినవేమో చెప్పలేము. ఆమె పొందిన ఆనందాన్ని వర్ణించడం కంటే అమ్మపొందే ఆనందం పొందిందంటే చాలు. యితర మాటలతో చెప్పడానికే వీలులేదు. రామదాసు రిచ్చవడి చూస్తూ "నీవా జగ్గడివి! ఆశ్చర్యం. ధర్మదేవతవనిపించుకున్నావు" అన్నాడు.

వెం— అయ్యా! మీ యిద్దరికీ సంతానంవల్ల దుఃఖమేగాని సుఖంగలుగలేదు.

రా— నాబిడ్డలు కొంతవరకు సంతోషపడేటట్టు చేసినా సిగ్గుపడేటట్టు వర్తించలేదు. జగ్గడి చరిత్ర యావత్తు వింటూనే వున్నాను. నీవే జగ్గడివని యిప్పుడు తెలిసింది.

వెం— నీ బిడ్డలు వీరులు వీరోచితమరణమే పొందారు. పొందుతారు. సుఖదుఃఖాలకు నీవతీతుడవు గనుక నీ విషయమై నాకు యెక్కువచింత లేదుగాని అమ్మదే కష్టదశ.

రా— అంతేకాదు. ఆమె మీ అమ్మ. ప్రేమ విషయంలో అమ్మకూ, అయ్యకూ హస్తిమశకాంతరం వార వుంటుంది.

వెం— వాస్తవమే గాని అయ్యను మించిన రక్షకుడు లేడు.

రా— అమ్మ దేవత. సమస్తమూ అమ్మే. అటువంటి వస్తువు యిహపరాలలో వెదకినా మరొకటి కనపడదు. కాని నీ మాటలు దుఃఖవార్తను సూచిస్తున్నవి.

మా__దేనికయినా వొడిబట్టే వున్నా. పిల్లల సంగతేమి?

రా__నాయుడుగారు క్షేమమా?

వెం__నాయుడుగారు వొక విధాన క్షేమంగానే వున్నారు.

మా__జోతి అప్పుడో?

వెం__లేరు.

మా__లేనేలేరా?

మాలక్ష్మి నేలకు జారింది. యేమీ మాట్లాడ లేకపోయింది. వెంకటదాసు తన వొంటిచేతితో కూర్చోబెట్టాడు

రామదాసు వేదాంతం కాసేపు మూలగూర్చున్నది. ప్రేమకు మించిన వేదాంత మేమున్నది? ప్రేమరహితమయిన జ్ఞానం చవిటి నేలవంటిది__

రా__అమ్మా జ్యోతీ, యీ ముసల్లను విడనాడి పోయినారా? మమ్మాలను కడతేరుస్తానంటివే? మమ్మాలను వదిలిపోవలసిన అవసరం వచ్చిందా? అప్పుడి సంగతేమిటి?

మాలక్ష్మి వాల్చిన రెప్పలు తెరచింది.

వెం__జోతమ్మ ఆత్మహత్య చేసుకొన్నతరువాత అప్పుడు ఆమెనే అనుసరించి శవముతో సహితం కృష్ణాప్రవాహగతుడయినాడు పిల్లవాడిని మంగళాపురం వెంకటయ్యగారు తీసుకొనిపోయినారు.

మాలక్ష్మి పడిపోయింది.

రా__ఆహా! రామానాయుడుగారేమయినారు!

వెం__పిల్లలను విడిపించే ప్రయత్నంలో కారాగారప్రాప్తిని పొందారు. వారం రోజులు ఖయిదులో వుంచినానికే కేసు ఫయిసలుఅయి తర్వాత ఆయనను నిర్దోషిరిగా యెంచి విడిచిపెట్టించారు. రెండుమూడు రోజులలో యిక్కడికి వస్తారని వింటూను.

రా__అప్పుడిది యెంత అద్భుతమయిన సహగమనం? యిదిగదా నిజమైనప్రేమ వివాహబంధమూ దైహిక సంబంధమూ లేకనే అద్భుతమైన ఆత్మీయప్రేమ కనబరచారు. అప్పుడు చెప్పినట్టు ఐహికాముష్మికాల రెంటికీ ప్రేమ అనే రస్తా వేసి యాత్ర చేశారు వారు ధన్యులు.

వెం__అదంతా నాకు తెలియదు! ప్రేమఅనేది యెక్కడా నాకు కనపడలేదు. వొకచోట వుంటే రెండోచోట లేకుండా బోదు. యిహపరాలుండడమే నిశ్చయమయితే రెంటిలోను ప్రేమ శూన్యమే. అమ్మను నా చేతిమీద నిలుపలేకుండా వున్నాను. జారి పోతున్నది. మన స్వరంతి లేదుగా మాలె యిటువచ్చి పట్టుకో.

రా__యిదేమిటి? జావాలె చేతికి రావడంలేదు.

వెం__నే లేపలేను, సర్జనుగారిని కేకవెయ్యి.

సర్జన్__యీ మాటలు విని లోపలికివచ్చి యేమది?

వెం__మా అమ్మగారు కుమార్తెయొక్క మరణవార్త విన్నది, నాడి తప్పి తున్నట్టు కనబడుతున్నది. తమరు చూడండి.

రా__పరీక్షించి-యిదివరకే తప్పింది నీవు చాలా జబ్బులో వున్నావు దుఃఖించవద్దు. మీ నాయనకు పెద్దతనంలో కష్టపురోజులు.

రామదాసు భార్యాపాదాలలో తల పెట్టుకొని కూర్చున్నాడు.

వెం.—మా అమ్మ వెళ్లిపోయిందా ? ప్రపంచంలో ప్రేమ లేదన్నారు. తప్పు కుండా అమ్మకడుపులో ప్రేమ వున్నది. అమ్మే దేవుడు. మరియొక దేవుడు లేడు, అయ్యా, డాక్టరుగారు, మాఅమ్మ చెయ్యి నాచేతికి తగిలించండి వొక్కమాటు. నా హృదయ మతాసం చల్లారుతుంది.

రా.—మాలక్ష్మీ ! నన్ను విడిచిపోయినావా ?

యింతవరకూ నానీడవలె వెంట వుంటుంటివి. యెట్లా విడిచిపోగలిగావు ! వస్తువు లేకుండా ఛాయ వుండగలదా ? ఛాయ లేకుండా వస్తువూ వుండదు ప్రకృతీ పురుషలక్షణ మిదే. యీసృష్టి కంతా భగవంతుడే సాక్షి నిరాలంబనగా యీసృష్టి నిలవలేదు. వియోగదుఃఖం మనకంటె ఆయనకే యెక్కువ. వ్యసని. నిన్ను వదిలిపెట్టి యెలా వుండేది ? కట్టి తెమ్మనన్న భాగ్యం నాకింకా వున్నది. అదితిని మరిపోవాలె. నాకు విమోచనం కలుగలేదు. జ్యోతీ అప్పాదాసులు తరించిన ప్రేమమార్గంకూడా నాకు కనబడడంలేదు. వృద్ధాప్యం వచ్చినకొద్దీ జీవుడికి పంచేంద్రియాలతో సంబంధ వొకటెతరువాత వొకటి వూడిపోతున్నవి, యివన్నీ బంధాలా ? నీవు నాకు బంధానివా ?

జ్యోతి అప్పాదాసులూ వొకరి కొకరు తెప్పలయి తేలిపోయినారే? నిన్ను నేను బంధ మనుకోవడం నాబుద్ధి జాడ్యమే నాదౌర్భాగ్యమే నిన్ను భరించలేక పోయిందని బలవంతంగా కూర్చొపెట్టబోయినాడు. శరీరమంతా చైతన్యరహితంగా కనబడ్డది గాని చేతులుమాత్రం కొంగర్లుపోయినట్లు చలిస్తున్నవి కళేబరం కూర్చోబడక జారింది. ఆ జారడంలో చేతులు రామదాసుపాదాలను వునికినట్లు స్పృశించినవి. పట్టుకున్నవి. స్థూలశరీరంయొక్క చేతులకు పట్టు చిక్కలేదు గాని సూక్ష్మహస్తాలు పాదాలనుగట్టిగా పట్టుకొనే వుంటవి. చైతన్యం చేతులలోనుంచి గూడా లేచిపోయింది.

సూపరింటెండెంటు కీసంగతి తెలిసివచ్చాడు. శవాన్ని దహనం చేసు కుంటారా ? ఖననం చేసుకుంటారా ? అని అడిగితే వెంకటదాసు ప్రస్తుతం వొక పెట్టెలోపెట్టి పాతిపెట్టి వీలుప్రకారం ఆపెట్టె తమ గ్రామానికి తీసుకొనిపోవడానికి వుత్తర్వు లియ్యవలసిందని కోరాడు. చిన్న సర్జను అట్లా చెయ్యడానికి రూల్సు ఒప్పవని అనవచ్చాడు. గాని సూపరింటెండెంటు ఆప్రకారమే చేసుకోవచ్చునని వుత్తర్వు లిచ్చాడు. జయిలువెలపల వొకప్రత్యేక స్థలంలో ఖననానికి యేర్పాటుచేసి వెంకట దాసు కోరికప్రకారం అతనినికూడా శవంతో సమాధిదగ్గరకు తీసుకొనిపోయి నారు. అతనిచేతిమీదుగా మొదటిసారి పట్టిజల్లి పూడ్చడం ప్రారంభించాడు. ప్రాప్త మున్నవాండ్లంతా తోడ్పడి ధర్మమట్టి జల్లి పూర్తిజేశారు.

సూ.—వెంకటదాసూ, నీవు చాలాజబ్బుస్థితిలో వున్నావు. నేరాలిక చేయలే వని సర్కారుకు వ్రాసి నిన్ను విడిపిస్తాను. అట్లా చేయవచ్చునా ?

వెం.—తమరు విడిపిస్తే నాఅభ్యంతరం యేమీలేదు. కాని నా వాండ్లంతాపరలో కానికి వెళ్లిపోయినారు. యిక మిగిలింది నాతండ్రి ఒకడే. తమ్ముడు పసివాడు యీ యనను విడిచి బయటికి పోవాలననే అపేక్షలేదు, ఆయననుకూడా వదిలించడం సాధ్యం

అయితేసరి. కాకపోతే వాళల్యాలను కూడా మావూరు తీసుకొని పోవడానికి వుత్తరువు దయచేయండి.

నూ——ఆయనను వదిలిపెట్టమని వ్రాయడానికి నాకధికారంలేదు. ఆయనచేసింది నాయకానేరం గనుక వుభయులను గురించి వ్రాసిచూస్తాను, అనుకూలమైన వుత్తరువులు వస్తే వుభయులను విడిచి పెడతాను. నీకు జబ్బునయమైనా నేరమురేమీ చేయగల వని తోచదు.

వెం——మీరు వుత్తర్వులు వచ్చేలోగా నేను మరణించకపోతే వెళుతాను. నేను మరణించినా మానాయనగారిని వదలిపెట్టండి.

నూ——యెవరికి వుత్తరువు వచ్చినా వొదిలిపెట్టడానికి ఆక్షేపణయేమీవుండదు.

---

## తొమ్మిదవ అధ్యాయం

## ఆచరణసాధ్యమే

రామదాసు జోడుపడిపోయిన పక్షివలె తన మంచంమీద ముడుచుకొని కూర్చు న్నాడు. సాయంకాలము అన్నపువడి వచ్చింది. వొక్క కణమయినా నోటికి పోలేదు. అన్నమంతా జాడువాలి కిచ్చివేశాడు. ముప్పై సంవత్సరాలనుంచీ యే విధమయిన దీర్ఘ మనస్తాపాలు లేకుండా కలిసిమెలిసి వున్న తన అర్ధాంగియొక్క వియోగం దుస్సహమై జోతీ అప్పాదాసుల మరణానికే విచారపడుతుంటే మాలక్ష్మియొక్క అకస్మిక మరణం దుఃఖముయొక్క బాధనే తీసివేసింది. యేమీ తోచక మానివలె మంచం మీద కూర్చున్నాడు. వెంకటదాసుకు దుఃఖంవల్లనో, నాలుగైదుమాట్లు లేవడంచేత కట్లు కదలడంవల్లనో గాయాలబాధ యెక్కువయి నిద్రపట్టలేదు. వుభయులూ అతికష్టంమీద రాత్రి వేగించారు. వొకరొకరి క్షేమం విచారించుకోడానికయినా మనస్వాస్థ్యం లేక పోయింది. రామదాసు మెదలకుండా పండుకున్నాడు. గాని వెంకటదాసు కెల్లవార్లూ మూలుగుతూనే వున్నాడు. మేలుకొని ఉండీ రామదాసది గమనించలేదు. క్వారంటు కంటె ఆసుపత్రిలో కొంత బాహ్యశుద్ధివున్నా అక్కడి వైద్యులకు క్వారంటులోని వుద్యోగులకన్న మాత్రమయినా హృదయశుద్ధి లేదు సర్జను లిద్దరూ బ్రాహ్మణులే. ఇది వరకు చెప్పిన రాక్షసగణంలో చేరుతారు. బ్రహ్మరాక్షసులంటే రాక్షసులలో బ్రాహ్మ ణులా! బ్రాహ్మణులలో రాక్షసులా? వైద్యజ్ఞానం వుభయులకూ పూర్ణసంఖ్యే. దయా దాక్షిణ్యాలు అంటే వైద్యం చేసేటప్పుడు రోగులను ఖయిదీలుగా భావించగూడ దని వారికి తెలియదు. సూపరింటెంటూ డాక్టరూ వొకమనిషే కావడంచేత డాక్టరు తన పూర్వసంస్కారం మరచిపోడు. ఆసుపత్రికి కంపౌండరు రామస్వామినాయుడే ఆధా రం. ఆయన లేకపోతే రోగులు మరిగిపోవలసిందే రూలుప్రకారం సర్జను లే రణాలు కడగాలెగాని జయిలాసుపత్రిలో అక్కడవుండే ఓవరుశీయరే వ్రణ చికిత్సకుడు. పూర్వపు సూపరింటెంటు వైద్యుడు గాడు. జిల్లాసర్జను నెలకు రెండువందల రూపా యిలు ఎక్కువిస్తే ప్రతిరోజూవచ్చి రోగులను చూచేవాడు. యిప్పటి సూపరింటెంటును సీమలో పెద్దడాక్టరు పరీక్షలలో యేరుకున్నారు. యీయన పూర్వము సేనలో డాక్ట

రుగా వుండేవాడు. పాపం వారిని జిల్లాసర్జన్ గారైనా వెళ్లక సూపరింటెండెంటుపనీ డాక్టరుపనీ వొక్కరికే యిచ్చే యేర్పాటుజేసి తద్వారా తెల్లకిల్లవాళ్లకోసం పెద్ద వుద్యోగం సృష్టించి రెండుపనులకు రెండు అరకంటల చొప్పున నెలకు రు ౧౨౦౦ లు జీతమేర్పరచి నియమించారు ఖయిదీలవల్ల వచ్చే ఆదాయం యావత్తు యీ తెల్లయేనుగుకు సరిపోతుంది. వుద్యోగస్థులందరికీ యిండ్లు వుచితముగా యిస్తారు. సూపరింటెండెంటు గారియింటిదగ్గిర రోజుకు ౧౧ మంది ఖయిదీలు శంతుల ప్రకారము పనిచేస్తారు. డాక్టరు పనిచేసినందుకు సూపరింటెండెంటుకు రు ౬౦౦ లు అదనంగా యిస్తున్నారుగదా! యీ డబ్బంతా యెలా తేలాలి? ప్రతిసంవత్సరం జయిలుఆదాయం తక్కువై ఖర్చు అధికమై లెక్కతప్పుతుంటే సూపరింటెండెంటు జీతం తగ్గించకుండా ఆసుపత్రి ఖర్చు తగ్గించారు. ఆసుపత్రిలో వాడేవి ముఖ్యమైనవి మూడేమందులు. యేకమూలికా ప్రయోగ మనడం కంటె త్రిమూలికా ప్రయోగమంటే నిజం చెప్పినట్టు వుంటుంది. విరోచనాలమందు మొదటిమూలిక, రెండవది కొయినా, నెత్తురుబంకకు పొడిపిల్లమందు మూడవది. ముఖ్యంగా యీ మూటితో ఆసుపత్రి సాగిస్తున్నారు యిందువల్ల డాక్టరు జీతం చాలవరకు కూడివస్తున్నది. పూర్వం జిల్లాసర్జను రోగులకు సరిఅయిన పథ్యం పెట్టించేవాడు. బలహీనులకు పాలు, రొట్టె మొదలయిన ఆహారం అవసరాన్నిబట్టి యిప్పిస్తుండేవాడు. యిప్పుడు అన్ని రోగాలకు వొకటే పథ్యం. లంకణం పరమౌషధ మన్నట్లు దెబ్బతగిలిన వాడికి, న్యుమోనియా వచ్చినవాడికి, విరోచనాలవాడికి వరిగంజే పథ్యం, అన్నంబెట్టక మాడుస్తారని ఖయిదీలు తమ వార్డులో చావడానికైనా వొప్పుకుంటారుగాని ఆసుపత్రికి పోరు. అందువల్ల తోచినంతవరకు జయిలుకు పనిచేస్తుంటారు.

డాక్టర్లకు పని తక్కువవుతుంది. మందుల ఖర్చులేదు. యీమధ్య స్వదేశీ ఖయిదీలందరూ యీ సంగతులన్నీ కలెక్టరు మొదలయిన విజిటర్లకు జెప్పి గోలబెట్టారు. యిప్పుడు వాండ్లకు మాత్రం పాలూ, సబ్బుగంజీ, గోధుమగంజీ యిచ్చామనిపిస్తున్నారు. నిడపవోలు ఆసుపత్రిభాషలో పంచదార అంటే నుసికిబెల్లం అని అర్థం స్వదేశీ వాండ్లు పంచదారంటే నల్లబెల్లం గాదు, తెల్లనిపొడి అని అర్థం జెప్పితే అప్పటినుంచి చక్కెర తెప్పించి పాలలోకిస్తున్నారు. యీ పాలూ, గంజీకూడా రోగుల అవసరాన్ని బట్టి యియ్యరు. కొత్తరోగికి పాలియ్యవలసి వుంటే పాతవాళ్లకవసరమయినా వాళ్లకిచ్చేవి తగ్గించి కొత్తవాళ్లకిస్తారు. అంటే తాము నిర్ణయించుకొన్న పాలనుబట్టి పథ్యం పెడతారు గాని పథ్యావసరాన్నిబట్టి పాలు కొనరు. డాక్టరు కొనే పాలనుబట్టి రోగాలు రావలసి వుంటుంది. సామాన్యపు రోగులను ఆసుపత్రిలో వుంచరు. పొద్దుటిపూట వచ్చి మందుతాగి పొమ్మంటారు. జడ్జీగారు వుత్తరం వ్రాయబట్టి గామాలె, వెంకటదాసుకు పాలూ రొట్టె యిస్తున్నారు.

తెల్లవారేవరకు ఆ దరికి గంజే వచ్చింది రామదాసు గంజిదాగి వెంకటదాసువద్ద కూర్చున్నాడు. వెంకటదాసుకు సన్ననిమబ్బులు వస్తున్నవి. సర్జనిది గమనించలేదు. రామదాసుకు అనుమానం దోచింది.

రా—నాయనా! కళ్లు మూసుకొన్నావేమిరా!

వెం—యేమీ లేదు నిద్ర వస్తున్నట్టుగా వున్నది.

యింతలో నాకిట్లో యేడుపు వినబడ్డది. రామదాసు గుమ్మంలోకి పోయి తొంగి చూచాడు. యెవడో రోగి విరోచనా లవుతున్నవని వస్తే సర్జను లిది నమ్మక కర్ర బెట్టి వెనుక మడ్డిలో పొడిచారు. రోగి కేకలువేసి మొత్తుకుంటుంటే పిచ్చయ్యశాస్త్రి నవ్వుతూ విరోచనాలు కావంటా యిదే మందురా?—అన్నాడు. ఇంకొకడువచ్చి విరోచనాలకు మందియ్యమంటే కర్రదెబ్బలుకొట్టి దీనివల్ల విరోచనం కాలేదా? అని అడిగాడు. సకాలంలో అవుషధాలివ్వక రోగం ముదిరినాక ఆసుపత్రిలోకి తీసుకొనిపోవడం చేత అధిక బాధ ననుభవించిన రోగులనేకు లున్నారు, యీ ఆసుపత్రులు వుద్యోగులజీతాలు పుట్టడంకోసంబుట్టినవే గాని, రోగులవ్యాధులను కుదర్చడానికి కాదు. సూపరింటెండెంటూ డాక్టరూ వొకడుగా వుండడం సర్వానర్థాలకు మూలం. యీ ఆసుపత్రి చర్యలు జూచి తాను చిన్నప్పుడు చదువుకొన్న ధన్వంతరి పద్యాలలోని చికిత్స రామదాసుకు చాలా మెరుగుగా కనపడి పద్యాలు గుప్తికి తెచ్చుకొని:

"శ్లో॥ అర్కక్షీరే స్నుహీక్షీరే శిలాచూర్ణేచ మర్దితమ్,
నేత్రద్వయే రంజనం కుర్యాత్ పర్వతోఽపి నదృశ్యతే,"

ఆ. గీ. "దగ్గుగల్లువాని డొక్కలి మెడఁగట్టి,
లోతినీటిలోనఁ బాతిపెట్టి
ఒకటిరెండుప్రొద్దు లూరంగఁ బెట్టితే,
దగ్గు విడిచి వాఁడు దక్కు మాను!"

అని చదువుకుంటూ లోపలి కొచ్చాడు. రెండవ సర్జన్ వెంకటదాసును పరీక్షించి మంచందగ్గిర నిలువబడి చూస్తున్నాడు.

వెం—యీమత్తుకు కారణ మేమి?

స—నేనూ అదే ఆలోచిస్తున్నాను, యెప్పటినుంచిది?

వెం—నిన్న మధ్యాహ్నంనుంచి సూక్ష్మంగా అపస్మారకం వస్తూ వుదయం వుండుండి యెక్కువగ వస్తున్నది.

స—దొరగారు రెండుగంటలకు వస్తారు. మళ్లీ వచ్చి చూస్తాం.

వెం—మీ రేమీ చికిత్స చేయలేరా?

స—వారి సలహకూడా పుచ్చుకొంటే మంచిది.

వెం—యెవరికి? మీకా? నాకా మంచిది? వెంటనే సంధిచ్ఛేదము నాకు మంచి దని తోస్తుంది. యిప్పటికే చాలా ఆలస్యం చేశారు.

స—వారిసలహా యెందుకయినా మంచిదే యీకాస్తలో మిగిలిపోయే దేముంది?

వెం—యిక మిగలబోయే దేమీలే దని నాకూ తెలుసు. వారి సలహా పుచ్చుకుంటే మీ జవాబుదారీ లేకుండా పోతుందని మీవుద్దేశం. అవేకదా, మీరన్న మంచి.

స—నీవిషయమై సూపరింటెంటుకు రిపోర్టు జేస్తా. అమర్యాదగా మాట్లాడుతున్నావు.

వెం—రిపోర్టు నన్ను బాధించే యెత్తు దాటిపోయింది. రాత్రి నన్ను వొకరూటయినా చూడకపోతిరి. నిన్న పగలు మూడింటికి సాయంత్రమూ రాలేదు. నిన్న ప్రొద్దున్నే యేర్పడ్డ మగత యింతవరకెవ్వరూ కనుక్కోలేకపోయినారు. మీమీద నేను రిపోర్టు చేయదలచలేదు. మీ అశ్రద్ధ మిమ్ములనే కొట్టనియ్యి.

సర్వను టకటకలాడుతూ వెళ్లిపోయినాను. మధ్యాహ్న అరగంటకల్లా మగత అధికమై సన్నగా శ్వాస బయలుదేరింది. రామదాసు వచ్చి వెంకటదాసు పక్కమీద కూర్చున్నాడు. మగత ముంపులుగా వస్తుండడంచేత అప్పుడు రెప్పలు మూతబడ్డవి. రామదాసు "వెంకడూ" అని పిల్చాడు గాని దేహం కదిలినా కండ్లు తెరపిడి పడలేదు. అయిదునిమిషాలలో చక్కగా మాట్లాడాడు.

రా—నాయనా! యెట్లా వున్నది?

వెం.—యెట్లా యేముున్నది? సమీపిస్తున్నది. యిందాకటి మగతలో కొత్త మార్పు గోచరమయినది. ఆ అయిదునిమిషాలూ కొత్త ప్రపంచంలో వున్నట్టు కనపడ్డది. అయ్యా! నాకొక్క వ్యసనం వున్నది, నన్ను సృష్టించి అష్టకష్టాలూ పడ్డ నా అమ్మా నాయనల ఋణం తీర్చుకోలేకపోతిని కదా? మీకు బాకీదారుణ్ణయి వచ్చి మిమ్ములను బాధించి వెళ్లిపోతూన్నాను.

రా—నాన్నా! నీవు అట్లా అనవద్దు. పితాపుత్రసంబంధంలో ఋణసంబంధం లేదు. ఈ సంబంధం మహాపవిత్రమై వుభయులకూ తరణోపాయమైనది. పుత్రుడిమీద దయలేని తల్లి తండ్రు లుండరు. పుత్రప్రేమచేతనే వారికి ఆత్మోపలబ్ధి కలుగుతుంది. ప్రేమస్వరూపాన్ని బొందుతారు పుత్రోదయ మయినప్పటినుండీ తల్లితండ్రులు చేసే సేవ సాధనచతుష్టయాలకంటే ఆత్మోపలబ్ధికి యెక్కువ సాహాయ్యకారవుతుంది నాన్నా! నీవు మహోపకారం చేసి వెళ్లుతున్నావు. నీ కేమీ ప్రత్యుపకారం చేయలేకపోయినాను.

వెం.—యెవరుచేసిన సేవకయినా విలువగట్టవచ్చును గాని, తల్లితండ్రుల సేవకు విలువలేదు. మానవులకు తల్లితండ్రులకంటె వేరు దైవంలేదు. వారిసేవవల్లనే లోకానికి సమస్తశ్రేయాలూ కలుగుతవి.

మళ్లీ మగత వచ్చింది. జ్వరంగూడా యెక్కువయింది. వొకటి రెండు తబ్బిబ్బు మాటలుకూడా అన్నాడు. మాంద్యం పూర్తిగావచ్చినతరువాత కండ్లు మూసుకొనిపడుకున్నాడు. యీసారి మగతలో వ్రణబాధకూడా పడుతున్నట్లు లేదు. చాలా సేపటికి తెలివివచ్చింది.

రా—గడ్డం పుణికి—నాన్నా! యెట్లా వుంది?

వెం.—క్రమంగా క్షీణించుకొనివస్తున్నది.

రా—బాబూ! నామాట విని వొక్కమాటు నారాయణా! అనుకో.

వెం.—యెవ రాతడు?

రా—దయామయుడైన భగవంతుడు. తృస్కారంగా మాట్లాడగూడదు.

వెం.—భగవంతు డేనేమోగాని దయామయుడు మాత్రం గాడు. ఈ దయామయుడు లోకమంతా పంచ మహాపాతక పట్నంచేశాడు. ఈ దేవుడనే ఆయన వొకడుంటే జనమంతా ఆయనమీద తిరుగబడి సన్మార్గవర్తిని చేయడ మవసరం. యెన్నాళ్లని యీ వూరుకోవడం? దీనివల్ల మనకు చాలా అగౌరవం

రా—యెట్లా అగౌరవం?

వెం.—మీ దేవుడు ఆలనా పాలనాలేని పరరాజువలె వున్నాడుగాని జనులకష్టనిష్టూరాలు యోచించే స్వదేశీప్రభువుగా లేడు. యెక్కడో స్వర్గంలో వున్నాడం

టారు. చేతగానివాడు అక్కడవుండి యీప్రపంచపాలన యెందుకు నెత్తిన బెట్టుకోవాలె? దేశంలో దుర్మార్గ మింత యెందుకు ప్రబలాలె? మంచిచట్ట మొకటీ కనపడదు. దుర్మార్గచట్టాలకు బుద్ధిహీనులుగాని లోబడరు. యెన్నాళ్లని వూరుకోవడం ?

రా — ఆస్తిక్యవిషయంలో నీ కభిప్రాయభేద మున్న దనుకో. ఆ పవిత్రనామం స్మరించినందువల్ల నీకు నష్ట మేమున్నది.

వెం — నష్టమా? అది ఆత్మవంచన మవుతుంది. "బహుధావిభజ్యమ ప్యేవం ననమేయంతు కస్యచిత్" చేయి విరిగింది, కాలు తెగింది, మిగిలిన మొండాన్ని వేయిగా విభజించినా యెప్పుడూ నా శిరస్సువంచను. ఆచీలికలుకూడా వంచవు.

వెంకటదాసుకు వుద్రేకంచేత ముఖం గాదరించి జేవురు గమ్మింది. నొసట వుబికి రక్తనాళాలు చెమర్చినవి.

రా — ముఖాన చెయిబెట్టి తుడిచి — పిచ్చి తండ్రీ! కొంచంస్వస్థపడు. నీనమ్మక ప్రకారమే వుండు. భగవంతునియందు నీకు నమ్మకం కలుగకపోతే నీతప్పేమీ లేదు.

నీకు వున్నంత ధర్మనిష్ఠ నాకులేదు. వూరికే నమస్కారాలు పెట్టి యేమిప్రయోజనం? ఆత్మశుద్ధి వుండాలి.

మళ్లీ తెర వచ్చింది. క్రిందటిసారికంటె త్వరగాకూడా వచ్చింది. చాలా సేపున్నది. తగ్గిపోంగనే కండ్లు తెరిచాడు.

రా — నాన్నా! యిందాకా పరిస్థితులు మారుతున్నట్లు కనపడ్డవన్నావే. ఇప్పుడెట్లా వున్నది ?

వెం — రంగమంతా మారిపోతున్నది. ఆఖరురంగంకూడా ముగింపుకు వచ్చింది. తెర పడబోతున్నది. నాటకంపూర్తి అవుతున్నదిగదా! నే నెట్లా ఆడానో చెప్పు? నీవు నిజం చెప్పేవాడివని ఆత్మతృప్తికొరకై అడిగాను రామదాసు దీర్ఘాలోచనజేసి,

రా — నీది చాలా కొత్తనాటకం. నీ నాటకనియమాలు గూడా వేరే. కొత్తపంథా దొక్కావు నేను మామూలుదారిని పోయినవాణ్ణి. నీది మార్గం కా దని చెప్పలేనుగాని, అంతా అవలంబిస్తే యెట్లా వుంటుందో చూడాలి. నీమార్గం నియమబద్ధం మట్టుకు అవును. ఆ నియమాలు చాలా వుత్కృష్టమైనవనీ, అమలులో పెట్టడం కష్టమేమో ననీ చాలా మందికి అనుమానం.

వెం — ధర్మాచరణం ఎప్పుడూ కష్టమే. అలవాటుబడితే సులభమే అవుతుంది. యిదివరకు జయిలుజీవితంయొక్క యేర్పాట్లు నీకు దెలియవు. నేను యిదివర కొకమాటు మూడుసంవత్సరాలు శిక్షబడి మారుపేరుతో జయిలులో మూడునెల్లుండి నాబదు లింకొకణ్ణిబెట్టి వేలుముద్రలు సూపరిండెంటుకు యిచ్చి వెళ్లిపోయినాను. ఇంకొకాయన సూపరిండెంటుగా వుండేవాడు. ఆదొర పరీక్షయి ముఖ్యసమయాల్లో నన్ను బయటకి పంపడానికీ, నాయకులు వచ్చి నావల్ల సలహాలు పుచ్చుకోవడానికీ సదుపాయం చేసి తానుకూడా లాభం పొందుతుండేవాడు. నాసిద్ధాంతాలు ఆచరణసాధ్యమా గాదా యనిగదా నీకు సందేహం. యీజయిలుపద్ధతి చూస్తే నాసిద్ధాంతా లెందుకు ఆచరణయోగ్యాలు కావో తెలియకుండా వున్నది. యిక్కడ జన్మఖయిదీ లున్నారు. యౌవ్వనులూ, వృద్ధులూ, నడివయస్సువాండ్లూ వున్నారు. కొందరు పిల్లలూ ఆడవాండ్లతో వుంటారు. ఖయిదీలే చాలామంది వుద్యోగస్తులుగా వుండి, జయిలుపని

యావత్తూ నడిపిస్తున్నారు. అమెరికాజయిలులో సర్కారు వుద్యోగస్తులసంఖ్య చాలా తక్కువ. అక్కడ జయిళ్లు స్వరాజ్యంగల చిన్నచిన్న సామంతరాజ్యాలుగా వుంటవి. సామంతరాజ్యాలన్నీ స్వపరిపాలనంగల జయిళ్ళనే చెప్పవచ్చు. జయిలురాజ్యంలో ఖయిదీ లెన్నుకొన్నా లేక చక్రవర్తి యేర్పాటుచేసినా జయిలుఅధికారులను ప్రభువుల క్రింద యెంచుకోండాం. అయిర్లండు, బవేరియా, మైసూరు స్వరాజ్యంగల సామంత రాజ్యాలు. జయిళ్లుకూడా యిటువంటివే అనుకో. సామంతరాజ్యాల పాలనకూ జయిలు రాజ్యాల పాలనకూ భేద మున్నది. జైలు చిన్నగ్రామమంత రాజ్యం. దీంట్లో రెండు వేలజనం, దీనికి రెండువేల యకరాలభూమీ వున్నవి. అయితే భూములంత మంచివి కావు. అంతా గరువే. కొంత కుండేటికండ నేలకూడా వున్నది. భూములు మంచి వైతే దీనికి కావలసిన ధాన్యంకంటె యెక్కువే పండించవచ్చు. ప్రతివాడూ పని చేయక తప్పదు. ఖయిదీల తెలివితేటలనుబట్టి ప్రతివాడికీ అధికారులే వృత్తివిభజనము చేసి పని నియమిస్తారు. అనేక వృత్తులు చేస్తారు. వాటిమూలంగా ధనాకర్షణ చేస్తు న్నారు. రత్నకంబళ్లు, చక్కని చెప్పులూ, చిరిచాపలూ మొదలయిన వెన్నో సున్నితపు పనులు జరుగుతూవున్నవి. యెవడియ్యవలసి పని వాడు సాయంత్రానికి లెక్కప్రకా రం వొప్పజెప్పుతాడు. భూములవల్లా చేతిపనులవల్లా వచ్చే ఆదాయం యావత్తు ప్రభు త్వానికే పోతుంది. భూములూ దానివే. వృత్తులకు పెట్టుబడీ అదే పెట్టుతుంది. జయిళ్ల వల్ల చాలా ఆదావస్తుంది. అయ్యేఖర్చుకంటె కూడా మిగులుతుంది. మిగిలిన డబ్బు యావత్తూ కొందరే అపహరిస్తారు. ఖయిదీలకు కడుపుకొట్టి, అర్ధాన్నం బెట్టి, అధికా రులే వందలూ వేలూ జీతాలు తింటారు. సూపరింటెండెంటుకే యింటి అద్దె మొదలయినవి కలుపుకొని సంవత్సరానికి పదహారువేలరూపాయిలు ముట్టుతవి. నెలకు ౧౨౦౦ వంతున వాడ్లర జీతం అవుతుంది. యింకా వుద్యోగు లనేకు లున్నారు. యిందులో చాలా భాగం కొట్టివేస్తే జనాని కన్నవస్త్రాల కేమీ లోపమే వుండదు యీ జయిలు జనంలో రాజా, బంటూ, ధనికుడూ, దరిద్రుడూ, కులస్థుడూ, కులహీనుడూ మొదలయిన భేదాలన్నీ సమసిపోతవి. అందరూ పని చెయ్యాలె. అందరికీ వొకటే భోజనం. వొకటేమో స్తరు గుడ్డలు, పక్కలూ వొకేతరహాచే. అందరికీ కట్టియిండ్లే రేప నేదిగులు లేదు. పోటీలు లేవు. ఆసుగ్గాలేను. ఆసుపత్రీ స్కూల్ కూడా వున్నవి. అవి యింకా వృద్ధి చేసుకోవచ్చు. జయిలుభూములలోగాని, వృత్తుల లాభములోగాని వ్యక్తి సత్వాలు లేవు. అన్నీ జయిలువే. జయిలువంటే జనాని వన్నూట. తొంబయి తొమ్మిదిమంది పస్తు పడుకుంటే, వొకడు పండుగ చేసుకొని, పిండివంటలు తినే పద్ధ తులు యిక్కడ లేవు. వ్యక్తి సత్వాలూ, అనవసర తారతమ్యాలూ లేని సర్వసమత్వ ధర్మం జయిలులో ప్రతిపాదించబడుతున్నది. అయితే జయిలుకు రావడానికి జనులకు భయ మెందుకు? యెవళ్లు భయపడుతున్నారు? బయట సోమరులుగా దిని పికాళ్లు కొట్టే భోగపురుషులు భయపడతారు. బయట పస్తులు పడీపడి వారానికొక్క మాట యినా కడుపునిండా భోజనం లేక, చేసుకొందామంటే పని దొరకక, చేస్తే కడుపు నిండక మలమలమాడే జనులందరికీ జయిలంటే సంతోషమే! జయిళ్లకు పోవడంవల్ల వచ్చే అపకీర్తి, బంధువియోగం, జయిలు వెలుపల సోమరు లనుభవించే భోగమూ, కొంతవరకు జయిలంటే జనులను భయపెడతవి. కాని యీ పద్ధతి దేశ జనులంతా అవ

లంభించి, జయిలు జీవితానికి అనుబంధంగా వుండే పారతంత్ర్యం, బంధువియోగం, అల్ప భోజనం, అపకీర్తి మొదలయిన లోపాలు తొలగిస్తే, జనులందరూ యీ జీవితమందు వుండే అసహ్యతను పోగొట్టుకొని దీనికి అలవాటుపడతారు. యీ పద్ధతిలోవుండే అసాధ్యమేమీ లేదు. ఆచరణలో పెట్టడానికి ఆటంకాలు ధనికవర్గమూ, దానిచేత రక్షింపబడే నిరంకుశప్రభుత్వమూ తప్ప, వేరే లేవు. సాధర్మ్యం జను లవలంబిస్తే, ప్రతివాళ్లూ యథాశక్తిగా పాటుపడి, అవసరమైనంత తిని, గుండె నిమ్మళంగా రేపనే చింత లేకుండా, విద్యాబుద్ధు లభ్యసిస్తూ, పస్తులు లేనీ, భోగాలులేనీ, రోగాలులేనీ, నేరాలులేనీ, వ్యాజ్యాలులేనీ, ద్వేషాలులేనీ స్వచ్ఛంద జీవితాలు అనుభవించడానికి అవకాశ మొంటుంది. దేవుడొక డుంటే యిప్పుడాయన వద్దరకు వెళ్లుతాగదా ? యీ మార్గం ఆయనకు పనికివస్తుందేమో కనుక్కుంటూ స్వర్గరాజ్యం దేవుడు వచ్చి భూమిమీద స్థాపిస్తాడని కొందరు చెప్పుతున్నారు గదా? ఆవొచ్చే దేవుడికి యీపద్ధతంతా వ్రాసిస్తాను. అయినా వొక్క సందేహం దేవుడువచ్చి ఆ మాట చెప్పినా ధనికు లాయనను అంగీకరిస్తారని తోచదు. ఆయన దేవుడు కాడని వాళ్ళే అంటారు. శిలువన కొడతారు. బందిపోటు దొంగంటారు. ఖయిదులో వేస్తారు. అప్పుడు బీదవాండ్ల దేవుడూ భాగ్యవంతులదేవుడూ వేరవుతారు. రెండు సైన్యాలుగా యేర్పడి యుద్ధం చేస్తారు. అది నైతిక యుద్ధం. అధర్మం నశిస్తుంది ధర్మం స్థాపిత మవుతుంది దయామయుడయిన దేవుడు లోకం పాలిస్తాడు ఆయనను జనులంతా తండ్రిని ప్రేమించినట్లు అనగా, నిన్ను నేను ప్రేమించినట్లు ప్రేమిస్తారు. అంతవరకూ అమ్మనూ నిన్ను మాత్రమే ప్రేమిస్తా. మీయిద్దరే దేవుళ్లు

మళ్లీ వంపు వచ్చింది. రామదాసు నిశ్చేష్టుడయి వింటూ కూర్చున్నాడు. చెప్పడం ఆగినతర్వాతకూడా, తనకూ మగతవచ్చినట్టే కూర్చున్నాడు. యీ తడవ మగత వొక అరగంట సేపున్నది. మళ్ళీ తెలివి కొంత తగ్గే వచ్చింది. వెంకటదాసు పేజీ తిప్పినట్టు తిరిగి ప్రారంభించాడు.

రా—నాన్నా! నీ జీవితం విచిత్రనాటకం.

వెం—అట్లాగా? నీ అభిప్రాయం నే శిరసావహిస్తాను. నాకు మరణ మాసన్నమవుతున్నది. తెరపడబోతున్నది. రంగాలన్నీ మరుపుకు వస్తున్నవి. సూర్యచంద్ర తారకమండలాలు దృష్టికి మరుగవుతున్నవి. మంమాలకొండ, పూరగొండా, కొండవీటి కొండా, గన్నేర్లవాగూ, పల్నాడడవులూ, నల్లమలవనాంతరాలూ నాకు ప్రియులయిన సనాతనులూ, తెరలోకి పోతున్నారు. ఆహా ! అమ్మా నీవు తప్ప నా కితర ప్రపంచ మేమీ గోచరం కావడం లేదు. యీ లోకం యొక్క పొలిమేర గట్టుమీద నుంచున్నాను.

అక్కడా మీ—రి—ద్ద—అంతా శమించినది. యీ శరీరములోనుండి లోకమంతా వెలిగిన నీలకాంతిగల మహాతేజం గుప్పున ఆకాశానికి లేచింది. రామదాసుకు మాత్రం దృష్టిగోచర మయింది.

రా—నాన్నా! నేపెంచినశరీరం నాయెదాన పారవేసి వెళ్లిపోయావా?

జవాబు లేదు. అంతా నిశ్శబ్ద మయింది. రామదాసు సమాధి నిష్ఠుడయిన యోగీంద్రుడివలె కూర్చున్నాడు. తరువాత సూపరింటెండెంటుకు యీ వార్త తెలిసి,

ఆసుపత్రికి వచ్చి, నీకు కావలసినప్పుడు తల్లీ కొడుకుల శల్యాలు తీసుకపోవచ్చునని ఆర్డరు వేసి ఖననం చేయించాడు.

---

## పదియవ అధ్యాయం

## అహింస

మరునాడు సూపరింటెండెంటు రామదాసుకు మెడ నల్లదారము కట్టించి 1 టో బారకాసుకు పొమ్మన్నాడు.

సూ—నీవు చేతనయింతవట్టుకు యేదయినా తేలికపని చేస్తూవుండు. తూకు వేసే వాడికి సహాయంగా వుంటావా? ప్రస్తుతం వాడికి యిచ్చే ఒక రూపాయిలో నీకొక పావులా యిప్పిస్తా.

రా—ఆ పనేమిటో నాకు తెలీదు. తాళ్లు బాగా పేనుతాను. ఆపని చెప్పించండి.

సూ—ఖూనీ చేసినవాండ్లను వురితీయడం.

రా—రామచంద్రా! యింతేబతుకూ బతికి ఇంటివెనుక చావా! అయ్యా, నాకు చేత గాదాపని.

సూ—అది చేతకాకపోతే అడవలో యీగలు చంపడానికుండు. తాడు పేనడము కఠినమయిన పని చేతులు పోతవి.

రా—వద్దు వద్దు. తాడుపని బాగా అలవాటు. నాలుగురోజులు చేయించి చూడండి.

సూ—యీగలపని చాలా సులభం. ముసలివాండ్లకు తగినపని. యెండలో తిరగనవసరం లేదు. వాకిటిదగ్గర కూర్చొని వచ్చేపోయే వాటినల్లా చంపవచ్చు.

రా—నాకు తాడుపనే యిప్పించండి. చేయిదిరగా మొదటినుంచీ పేనినవాడిని

సూ—సరే నీయిష్టము. ఆ పనికే పో. చేయలేనప్పుడు చెప్పుకో మార్చుతా.

రా—చిత్తం.

రామదాసు ఒకటో బారకాసుకు పోయినాడు. రెండో వార్డులో ఒక అరుగిచ్చారు. కామానాయుడునీ, పుల్లప్పనూ, బయటుపని తీసివేసి ఆవార్డులోనే వుంచారు. ఆబారకాసులో ౮ సావిళ్లున్నవి వొక్కొక్కదాంట్లో వొకచిన్న కక్కసుదొడ్డి వెలుపలికి కట్టివున్నది యిది చాలా పూర్వోత్తరపు పద్ధతి. మలమూత్రాలకు రెండు అరలుగా వుంటవి. కడుక్కోడానికి అవకాశంగా వున్నది. గదిలోవాండ్లు కనుపడరు. దాంట్లో బానలు రెంటికీ పెట్టారు. ప్రతిగదిలోను ౧౩ అరుగులు వుంటవి. రెండుగదులకూ మధ్య గోడలో యెత్తుగా కిటికీలో రెండుగదులకూ వెలుతురు కనపడేటందుకు లాంతరు పెడుతారు. అయిదుగదులకుగాను రెండు లాంతర్లు వున్నందున ఒకటి చీకటిగుయ్యారమే. లాంతరులో చిన్న దీపం పెడతారు. లీలగా కనుపడుతుంది. మామూలు తడంగాలు జరిగి అంతా భోజనం చేశారు. రూల్సుప్రకారము వొక్కొక చావిట్లో ౧౩ గురుని వుంచవలసినా, జన మెక్కువయినపుడెల్లా ౧౬ కింటిదాకా వేస్తారు. ఆరోజు యెక్కువగా వేసినయిద్దరూ నేలమీద పడుకొన్నారు. రామదాసుకు

వొకమూల అరుగు వచ్చినది. పాకీదొడ్లకు దూరంగాకూడావున్నది. రామానాయుడూ పుల్లప్పా, నోటిసుంచితనాన రామదాసుకు పక్క అరుగులవాండ్లకు తమ అరుగులిచ్చి వాండ్లవి తీసుకొన్నారు. రామదాసుకు పొరజూసుకొంటే ఈ జయిలు ప్రపంచములో ఆప్తులు వాండ్లిద్దరే కనబడ్డారు. బయటమాత్ర మెవరున్నారు? బొడ్డూడని పిల్లవాడూ, వెంకటయ్యా, రామానాయుడూ లోకబాంధవులు. రామదాసుకు లోకములో ప్రత్యేకబంధాలు తెగినకొద్దీ లోకబంధుత్వ భావం యెక్కు వవుతున్నవి. సంగరహితు డయివున్నాడు. స్వార్థచింత పోయింది. పరార్థచింత బలమయింది. కేవల సన్యాసయినాడు. ఆయన విడిచిపెట్టింది బాహ్యవేషాలు గావు. ప్రపంచం విడిచి అడవికి బోలేదు జనంమధ్యనే విజనస్థలం సమకూర్చుకున్నాడు అరిషడ్వర్గాలు జయించాడు యింకాయనకు శత్రువు లేరీ? వాచాలత్వం, వాక్పారుష్యం, హేళనా అంతర్ధాన మయినవి. మృదు వాక్కులతో అప్రియం గాకుండా, హేతువు చెప్పగలడు. కొంతవరకు జింహ్వాచాపల్య ముండేది ఉప్పు కారంలేని జయిలు భోజనంచేత అదీ కట్టుబడ్డది. శమదమాదు లేర్పడ్డవి. శాంతస్వరూపు డయినాడు, తరంగఘోషలో శయనించిన విష్ణుమూర్తివలె పోట్లలూ, కేకలూ, బూతులూ చెలరేగుతున్నా నిశ్చంచల మయిన మనస్సుతో అరుగుమీద పడుకున్నాడు. పుల్లప్పా, రామానాయుడు దూరంగా కూర్చొని బీడీ తాగివచ్చి "అయ్యా! నిదురబట్టిందా?" అని పిలిచారు.

రా — లేదు. వూరకనే కండ్లుమూసుకొని పండుకున్నాను. యేమిటా పిండివంట వాసన?

పు — యేమీ లేదు. ఖయిదీలు కొందరు భండారములోనుంచి కందిపప్పూ, నూనె తెచ్చుకొని వడలు చేసుకొంటున్నారు.

రా — బయటికి వాసన కొట్టితే వార్డరు రారుకొంటారూ?

పు — జయిల్లో రాత్రులు ఫారావేసేది ఖయిదీవార్డర్లే. క్వారంటులో మొస్తరుగాడు. తొమ్మిది గంటలతర్వాత వొకరు గడియారం చూడడానికి, మరొకరు తనిఖీకి వస్తారు. టవరులో యిద్దరు హెడ్ వార్డర్లు మాత్రమున్నా పారారు రారు. ఖయిదీ వార్డరు చూచినా రెండు వడలిస్తే చూడనట్టే వుంటాడు. తమరు రెండివ్వమని నా చేతి కిచ్చారు.

రా — భండారములో చోరీచేసి తెచ్చారన్న మాటేనా?

పు — ఆమాట అంటా రని అనుకుంటూనే వున్నాము యేదో వాండ్ల తంటాలు వాండ్లు పడతారు. దీర్ఘశిక్షలు బొంది చప్పిడికూడు తింటూ నాలుక చవిచచ్చి యెంత కాలముని వుంటారు? వాండ్లసుడైనా వాండ్ల కిస్తున్నారా అంటే అదీ లేదు. భండారమంతా వుద్యోగస్తులు దోచుకుంటుంటే వీళ్లు మాత్ర మెందుకు తిన గూడదు?

రా — యీవిషయములో తగువు చెప్పడానికి నాకుతోచలేదు. అయినా అవి నాకు వద్దు ఆ కముకుకం పేమిటి?

పు — అరే! అదీ యిప్పుడే పెట్టారు తమరు చెప్పవలసిందికాదు. కొందరు మూడిగెలు వుసెలను వుచ్చులువేపి పట్టుకొని యిప్పుడు కాల్చుకుంటున్నారు. పిండివంట చెయ్యంగా నూనె మిగిలితే దాంట్లోవేసి వేలుస్తున్నారు.

రా — మీరు మాంసం తినరా?

పు—వారు ముట్టుకోరు.

కా—అయితే గారెలుకూడా వారికి పనికిరావు మెత్తనిది పిండిలో కలిపారు.

పు—అదోకటా ? వారు తీసుకోకపోవడమే మేలయింది. లేకపోతే అభ్యాసు పనోను. యివ్వే మావాండ్లు చేసే అవకతవక పనులు.

కా—అయితే నాకూ వద్దు

తక్కినవాండ్లు—అయ్యా మాకూ వద్దు, మాంసంకూడా తినం. పొద్దున రేండూ యెవరికీ తెలియకుండా పారవేస్తాం

రా—సరే బాగున్నది

పు—మా కేమయినా మంచిమాటలు చెప్పండి యిక్కడ మిమ్మును సెటిల్ మెంటులో మోస్తరుగా వద్దనేవాండ్లులేరు.

రా—మీ కందరికీ తెలియని మంచిమాట లేమున్నవి ? సంగతులందరికీ తెలుసు వాటి ప్రకారం నడుచుకోంగాని

పు—చదువుకుంటే విశేష సంగతులు తెలుస్తవి.

రా—తెలుస్తవన్న మాట నిజమే చదువువేరు, సద్గుణంవేరు యిప్పుడు మీకు తెలిసినవి ఆచరించండి. చదువుకొనే విషయమయి సోమవారం దొర నడుగుదాం.

పు—అవును మమ్మ నిప్పుడేమి చేయమంటారు ?

రా—మీ రెవ్వరూ లోలాయిలవలె తిరుగకుండా మీరు చేయవలసినంత పని జేసి బయటికి బోయినా జీవనాధారంగా పనికివచ్చేది యేదో వొకవృత్తి నేర్చుకోండి. మీ అభిలాష ననుసరించి, యెవరేమి చేయవలసిందీ రేపు యేర్పరుచు కొందాం. నాకు సల్లనార మిచ్చినా నలుగురితోపాటు దారం నేసి చూపిస్తాను.

కా—రోజూ దేవుడి పేరు తలుచుకోవడం మంచిది.

రా—అవును. సాయంత్రం వుదయం మనమంతా కలిసి ప్రార్థన చేతాం. మనం మాట్లాడుకోవడ మయిన తర్వాత యీరోజే ప్రారంభింతాం.

కా—తరువాత యేమిటి ?

రా—మీ కొక్క సంగతి చెపుతాను కోపపడకుండా వుంటే.

కా—మా మేలుకోసమే గదా ? తమరు చెప్పడం. కోప మెందుకు ?

రా—స్వరాజ్యపు ఖయిదీలు కక్కసుదొడ్లో తొట్టినిండా మామూలు ప్రకారం నీళ్లు పోయించి వుంచవలసిందని దొరతో చెప్పితే దొర ఆ ప్రకారం పోయిస్తున్నాడు. మీరు కడుక్కోవడం లేదట అది యెందువల్ల ?

కా—యెందువల్లనంటే, వీండ్లలో కొందరికి ఎన్నడూ అలవాటులేదు. పశువులు మోస్తరే. తక్కినవాండ్లకి పూర్వం అలవాటువున్నా జయిలుకు వచ్చినతరువాత బొత్తిగా తప్పిపోయింది వీళ్ళందరికీ ఇక అలవాటు చెయ్యాలె.

పు—రాత్రిపూట మనసాకిట్లో నీళ్లు లేవుగదా, దాని కేమిచేతాం ? నీళ్లు లోపలికి తెచ్చుకొన్నా అవి బైటకిపోయే మార్గంలేదు.

రా—నీలయింతవరకు మానాం. యింతకంటె మంచిరోజులు వస్తే యెక్కువ సంగతులు ఆలోచించుకుందాం. కేవలం అవసరమున్నవాండ్లు తప్పరాత్రులుకక్కసుకు

పోవద్దు. పొద్దున్న లెక్క కాంగానే పోదాం. దొడ్లో అందరికీ స్థలం వ్యవధి లేకపోతే దొరతో చెపుదాం. దొడ్డి పెదద్దయినాచేయిస్తాడు లేక పని ౭౪ కైనా ప్రారంభించమని అడుగుదాం.

పు—అడిగితే వినేనాథు డెవరు ? యెండా కాలంలో ఆరింటికి పని ప్రారంభిస్తారు.

కా—స్వరాజ్యపువాండ్లకు తెలియపరుచుదాం. వాండ్లు యిక్కడ ప్రయత్నించి నిడివేరకపోతే బయటికి వెళ్లినతర్వాతనయినా పనిజేస్తారు. సంగతులు యీవత్తు బయటు బెట్టడం అవసరం అందాకా యెందుకు? స్వదేశీవాండ్లు యిక్కడ కుల్లంతా బయటు బెడతారనేగదా వాండ్లకు అన్ని సౌకర్యాలు యేర్పరుస్తున్నారు. మనం కూడా అట్లా చేస్తే మనమాటలుమాత్రం యెందుకు వినరు?

వొక ముసలివాడు—సరే యిదంతా బాగానే వున్నది. నీవు చెప్పావు. మేము వినుకొంటాం. ఈగలు చంపకుంటే నీవు తప్పించుకొని వూరుకొంటివి. నా సంగతేమిటి? రోజూ సాయంత్రానికి వొక వందయినా చూపించాలె. నీవు మాంసం తినవద్దంటివి. రోజుకు నూరింటిని జంపితేనే గాని నా బ్రతుకు వెళ్లదు

రా—యిది చాలా పెద్దప్రశ్న. హింస పనికిరానందువల్ల మాంసం తినడం తప్పు. మాసంకోసం చంపడం తప్పు. యిది వూరికే చంపడమే. వీటివల్ల ఆరోగ్యం చెడుతుందని గామాలె యింత యేర్పాటు జేశారు. అబ్బా! నాకేమీ చెప్పడానికి తోచడం లేదు. మనుష్యులు స్వరక్షణకోసం చేసేపని యిది. స్వలాభంకోసం యితరులకు హాని చెయ్యవచ్చునా? వ్యసనిగాకుండా లోకబాధ నివారణార్థం వేటాడవచ్చునన్నారు యీగలు చంపడమూ దానికిందకే తీసుకోవాలె. ఫలాపేక్ష రహితంగా చేయవలెనన్న మాట. యీగలు చంపవలెననే వాడికి వ్యసనమేమున్నది? జింకలను వేటాడి మాంసం దింటారు. గాని వన్యమృగాల మాంసం పనికిరాదు. యీగలూ వూరికే చంపేవే. యీగలు చంపడం క్రూరమృగముల వేటమోస్తరే అందామా? సుబ్బన్న అతనిపని తాను నెరవేర్చాడు. ఆపని యెందుకు వొప్పుకోవాలె వొప్పుకోకపోతే నీకిచ్చిన పని చేయవలసిందని నిర్బంధిస్తారేమో. అయితే తన నిర్బంధం తప్పించుకోవడానికి ఇతరులను బాధించటం న్యాయమా? అంతకంటె వుద్గ్రంథం లేదుగదా? భారతంలో యేమి చెప్పారో ఆలోచింతాం. అహింస అన్నిటికన్న యెక్కువ ధర్మమన్నారు. అహింసా ధర్మాన్ని పూర్ణంగా ఆచరిస్తే యితర్ల మనసుకుగాని దేహానికిగాని, నొప్పికలిగించకూడదంటున్న అన్ని ధర్మాలూ దీనిలోకే వస్తవన్నారు. యే నేరం చేయడానికి వీలుండదు. మాంసందింటే శరీరానికి అనేకవిధాల లాభమంటూ. నీకు లాభమని యితరులకు హాని జేస్తావా ? అని భారత మాక్షేపిస్తుంది యీ ధర్మం భీష్ముకు ధర్మరాజుకు జెప్పాడు మన ధర్మవ్యాధుడు కొత్త పంథా దొక్కాడు ప్రపంచంలో హింస చేయనివాడెవడో చెప్పమని సవాల్ గొట్టాడు కూరగాయలు తరిగితే వాట్లో జంతువులు చావవా అన్నాడు. చెట్లు నరికినా, మొక్కలు తరిగినా, లోహం కాచినా బాధచేత గిలగిల కొట్టుకుంటున్నవని ప్రకృతి శాస్త్రవేత్తయైన చంద్రవసుగారు ప్రతివాండ్లకూ ప్రత్యక్షంగా చూపించారు.

ఈయన కొత్తసిద్ధాంతంవల్ల అహింసాధర్మ మెగిరిపోయిందని కొందరంటున్నారు. అయితే మనుష్యుడు మనుష్యుణ్ణి హత్యచేస్తే తప్పా? తప్పుకాకపోతే చంపినవాణ్ణి వురి దీయమని చట్ట మెందుకు బుట్టింది? పెద్దచేప చిన్నచేపను తిన్నట్టు బలవంతుడు బలహీనుని జంపి వాడిఆస్తి యెగరుకుపోకూడదు? మనుష్యమాంసంతినే అడవి మనుష్యులను హీనంగా యెందుకుచూడవలె? రాక్షసులన్ క్రూరులని ఎందుకనాలె? తీసినకొద్ది వస్తున్నది. మాంసంతినడమే కాదు. మనుష్యులను చంపడం కూడా తప్పుకాదని తేలుతుంది. హత్య తప్పని చట్టంచేసి పెట్టుకున్నారు. పైగా చంపినవాణ్ణి వురిదీయమున్నారు. అయితే యింతకూ పర్యవసాన మేమి? వసుగారి సిద్ధాంతం పూర్వపు 'అహింసా పరమోధర్మః' అనే ధర్మాన్ని త్రోసివేసిందా? లేదు. త్రోసివేయక దానికి బదులు దానిని విస్తరింపజేసింది. యేసు మానవు లందరినీ తనతోపాటు వారినిగా ప్రేమించమన్నాడు. బైబిలులో చంపడం దోషమని చెప్పితే మాంసభక్షకులగు పడమటివాళ్లు మానవులను చంపడంమాత్రమే దోషమని అర్థంచేశారు. సర్వభూతములను సమానంగా చూచుచుండేవాడే పండితుడని వుపనిషత్తు చెప్పుచున్నది. మహమ్మదీయులు మాంసభక్షకులయినా హింసచేయక పూర్వం ప్రాయశ్చిత్తపూర్వకమైన మంత్రం చదువుతారు. బిసిమిల్లాచేయక చంపినజంతువు మాంసమును వారు తినరు. ధర్మవ్యాధుడు వసుగారి సిద్ధాంతమునకు కలిపే జవాబుచెప్పాడు. చంపడమంతా హింసేనంటూ సాధ్యమైనంత వరకు హింస మానవలసిందన్నాడు. జంతువులను గాని, ధాన్యంగాని, మొక్కలు గాని తినందే జీవిత మసాధ్యమని గ్రహించి ప్రకృతిశాస్త్రసిద్ధమయిన ధర్మమునే బోధించాడు. హిందూధర్మశాస్త్రాలప్రకారం వృక్షలతాదులనేగాక లోహములను కాల్చడమూ హింసే. అందువల్లనే లోహకారకవృత్తిని అహింస దృష్ట్యా ప్రశంసించలేదు. యింకొక ధర్మసూక్ష్మంగూడా వున్నట్లున్నది. కపిల డార్వినుల గుణపరిణామసిద్ధాంతప్రకారం మనకు కనబడేటంతవరకు మానవుడు చివరమెట్టే. అణువు మొదలు మానవునివరకు కోట్లకొలది జన్మలలోని అనుభవం పేర మానవు డయినాడు. అందువల్ల మానవజన్మ యెక్కువ విలువగలది. అందువల్లనే ప్రతిమతంలోనూ మానవజన్మ వుత్తమ మయినదంటారు. అందువల్లనే శిక్షాస్మృతులు మనుష్యుని చంపినందుకు వురిశిక్ష చెప్పి తక్కిన జంతువులను జంపితే తక్కువశిక్ష విధించుచున్నవి. లోహాలను చంపినందుకు దోషం చెప్పినవి గాని శిక్ష చెప్పలేదు. దూడకంటె పడ్డకూ అంబోతంటె గేదెకూ ఖరీదు యెక్కువగదా? అటులనే పరిణామసిద్ధాంతప్రకారం పై మెట్టులో వుండే భూతాలు క్రిందిమెట్టులో వానికంటె యెక్కువ విలువగలవి, కనుక పై మెట్టులోనివానిని జంపడం యెక్కువదోషం. అందువల్లనే ధర్మవ్యాధుడు సాధ్యమయినంతవరకు తక్కువ హింస చేయమన్నాడు. మరియు భూతము లన్నిటికీ వొకేవిధమయినబాధ లేకపోవచ్చు. పైకిపోయినకొద్ది పంచేంద్రియా లెక్కువ సున్నితములయి బాధకూడా యెక్కువ వుంటుంది. వసుగారు చెప్పేప్రకారంకూడా లోహాలకు యెక్కువవేడినిస్తేగాని బాధపడుతున్నట్లు కనుపడదు. అత్తపత్తి కున్న స్పర్శజ్ఞానం తక్కువవానికి లేదు. వృక్షంకంటె జంతువులకు స్పర్శజ్ఞాన మెక్కువ. ఓషధులహింసకంటె జంతువుల హింస బాధనుబట్టి యెక్కువయి తీరవలె. కనుకనే శాకాహారం మాంసాహారంకంటె అహింసరీత్యా మంచిదయి వుంటుంది. యింకొకసంగతికూడావుంది. మాంసవర్జనం చేస

అహింసాధర్మంమీద ఆధారపడ్డది గాదు. మనము తినే ఆహారాన్నిబట్టి మనలో సాత్విక రాజస తామసగుణాలు వృద్ధియౌతవి. మాంసంకంటె తామసగుణాన్ని వృద్ధిచేసే శాకాలనేక మున్నవి. అటువంటిశాకములన్నీ ధర్మశాస్త్రాలు నిషేధిస్తూ సాత్వికగుణాన్ని పెంపు జేసే జంతువుల మాంసములనుగూడా చెప్పినవి. అమాంసములు విశేషంగా రుచించునవిగూడా గాదు. అట్టిజంతువులూ పక్షులూ అరుదుగూడాను. కనుక మాంసం రాజస తామసగుణాలను వృద్ధిజేస్తుందనే నిషేధించపబడ్డది. కనుక జంతుహింస చేయ వద్దని ఖండితంగా చెప్పవచ్చు.

అబ్బే! చిత్తం. నేను యింతసేపటినుంచీ యోచించాను. యీగలు చంపడం తప్పే. యిల్లు శుభ్రముగా వుంచితే యీగలే రావు. యీగలువాలడంవల్ల అనారోగ్యం వృద్ధిఅవుతుందన్నదంకంటె అనారోగ్యవస్తువులు యిండ్లలో వున్నట్లు యీగలుముసరడం వల్ల నిశ్చయించి వాటికి కృతజ్ఞతచూపి యిల్లు బాగుచేసుకోవడం మేలు. యీగలను చంపమనడం చిత్రంగా వున్నది మీ రెంతమందివున్నారు? మీకెట్లా చిక్కుతవి?

ము___మేము ముగ్గురు ముసళ్లంవున్నాం. వాకిళ్లదగ్గిర నిలిచి లోపలవచ్చే వాటిని మాకిచ్చిన తోలువిసనకర్రలను ప్రయోగించి సంహరిస్తాం. చంపినవాటిని నీళ్ల పాత్రలో వేసి వుంచితే ప్రతిరోజు దొరగారు తనిఖీకి వచ్చినప్పుడు అవి దేలి పాతవో కొత్తవో పరీక్షించి దూరంగా పారవేయిస్తారు. వారికి యీగలు చంపించడంమీద వుండే శ్రద్ధ వంటపదార్థం దొంగిలించకుండా చేయడంలోగాని సరియైన సామగ్రి యిప్పించడంలోగాని వుపయోగిస్తే బాగుండు. మేము సోమరులమై కొత్తవి చంపకుండా నిన్న చంపినవే నీళ్లలోవేసి తనకు లెక్క చూపిస్తామని అనుమానం. మరిన్ని చంపకపోతే మాకు శిక్షగూడాను.

కా___వీండ్లు యీగపులులు. వీండ్లుయీగలను లేచి కొట్టనవసరంలేదు. పునులు గారే ముసలికండ్లతో ఒకమూల గూర్చుంటే దారినపోయే యీగలన్నీ దీపంలోపడే రెక్కలపురుగులవలె వీండ్లకండ్లమీదికి వచ్చి వాలుతవి. వీండ్లలెక్కకు అవే చాలు. యీకంపుగొట్టే ముసలివాండ్లను వంటయింట్లోకి రాంకుండాచేస్తే ఆరోగ్యం యెక్కువ బాగా వుంటుందని నా అభిప్రాయం.

అంతా నవ్వారు.

---

## పదునొకండవ అధ్యాయం

## ఉరిశిక్ష

వెంకటస్వామి___కండ్లారుస్తూ_దేవరా! యీగలు చంపడం అనవసరమనీ, పనికి రాదనీ చెప్పారు. మరి నాసంగతేమిటి?

రా___నీచేత యేమిపని చేయిస్తారు?

వెం___వురిదీయడం!

రా___వురిదీయడమా? చెప్పు చెప్పు సవిస్తరంగా. అక్కడయేమేమి చేస్తారో? యీపని నీవెందుకొప్పుకున్నావు?

వెం___స్వప్రయోజనం, స్వామిపనీ రెండూ కలిసివచ్చినవి. దుర్మార్గులను వురి

దీయడం లోకానికి పుణ్యకార్యం గదా! నాకూ మా అన్నకూ తడవకు చెరిపావు సొమ్ము ముడుతుంది. మెడకు మాడకేటున గిటుతుంది. చెరిసగం పంచుకుంటాం. యిక్కడికి అయిదుసంవత్సరాలనుంచి వొక్కతాయిన పనిజేస్తున్నాం. చెరి యెనభై రూపాయిలూ వెనకబడ్డవి, దేవుడు చాలా మేలుజేస్తే, యింకా అయిదేళ్లుంటాం. మాది ఖూనీకేసు లెండి. గల్లుకు తప్పింది, మాకు గూడా వురిజెప్పినట్లయితే యీ సంపాదనంతా యెవరికి బోయేదో! మాకు ప్రాప్తముంటే యింకొకరి కెట్లా బోతుంది? మేము వెళ్లేలోగా యింకా చెరివందా అంటుకోని తీరుతాం. మరియేం జెప్పావు దీనికి? దుర్మార్గులను అచ్చుబోసి వదలమంటావా దేశంమీద?

రా—జన్మశిక్ష వేస్తే చాలదా? చంపకపోతేను.

వెం—మీరు నలుగురూ వాదించుకోండి. అన్నం పున్నం యెరుగనివాణ్ణి. అయినా సరే వాళ్లకు నే నెక్కడ అగుతా!

కా—మనిషి రక్తం రుచిచూచిన పులిని యెప్పుడూ నమ్మరాదు. పంజా ఎప్పుడు విసురుతుందో.

రా—ఖయిదులో వుంచుతారుగదా! అదిగాక యేకోపతాపాన్నో వొకమాటు చంపారని యెప్పుడూ అదేపని చేస్తారా? చేనుదగ్గరా, చెట్టుదగ్గరా యేగాదా పుట్టే పెద్దదయి చంపుకుంటారు. ఖూనీచేసి జన్మశిక్ష పడ్డవాండ్లు అందరినీ చంపుతున్నారా! యెక్కడ జూచినా కాంతా కనకందప్ప ఖూనీలకు మరొక కారణం నాకు కనపడలేదు. చిన్న తగవులకే కాకుండా పెద్దయుద్ధాలకూ యీ రెండే కారణాలు. రామ రావణ యుద్ధం కాంతకోసం; భారతయుద్ధం రెంటికినీ, ద్రౌపదికి పరాభవం జరక్కపోతే ధర్మ రాజు కేవలం రాజ్యంకోసం యుద్ధానికి మొగ్గేవాడుగాడు. వుభయపక్షాలా కోట్లమరణా లకు కారణమైన ఐరోపాయుద్ధం పై భేషజాలెన్ని జెప్పినా భూసంపాదనకోసమో వర్తకం కోసమో జరిగింది. యుద్ధాలు ముగిసినతర్వాత యిన్ని మరణాలకు కారకులైన వాండ్లను వురిదీశారా! న్యాయంగా విచారిస్తే లక్షలజనాన్ని వుభయపక్షాలా ఖూనీనేరం కింద వురిదీయవలసి వుంటుంది. నేలకోసం కొట్టుకొని చావడం నాగరిక జాతులకు న్యాయ మయితే సామాన్యజనులకు అన్యాయమెట్లయింది? భూమికోసం ధర్మరాజూ, భీష్ముడూ, పోట్లాడి అక్షౌహిణీలను జంపితే, యల్లమ్మచౌదరీ. పుల్లయ్యరెడ్డీ భూమికోసం ఎందుకు చంపుకోకూడదు! ధర్మరాజునూ భీష్ముణ్ణీ శిక్షించే నాథు డేడంటారా! పై అధికారి లేకపోయినా వాండ్లు చేసినది తప్పనైనా వొప్పుకుంటే చాలు. భారతకర్త అసత్య దోషానికి ధర్మరాజుకు నరకం జూపించాడుగాని, అక్షౌహిణీలను నరికినందులకు అంద రికీ స్వర్గసుఖ మిప్పించాడు. చచ్చిన వాండ్లకు వీరస్వర్గంగూడా వస్తుందట. యే ధర్మ శాస్త్రంలోను యుద్ధంలో చంపినందుకు శిక్షలు చెప్పలేదు అట్లయితే సామాన్య జనం చంపుకుంటే నేర మెట్లయింది? జాతులదీ సామాన్యజనులదీ నేరమేనని వొప్పుకోన్నా ప్రాణానికి బదులు ప్రాణం దీయవలసిందనే ద్వేషజన్యమయిన చట్టం ధర్మాన్నాధారం జేసుకొనిలేదు. దెబ్బకు దెబ్బా డబ్బుకు డబ్బూ ప్రతి నేరానికీ శిక్షగా విధిస్తున్నట్లయితే ప్రాణానికి ప్రాణమనే సిద్ధాంతాన్ని వొప్పుకోవచ్చు. యే నేరానికీ లేనిది హత్యకు మాత్రం యిటువంటి శిక్ష యెందుకు విధించవలసి వచ్చింది!

కా—రూలో తమ ప్రశ్నకు జవాబు చెప్పగల వాండ్లెవరూ లేరు. తమరే శెలవిస్తే చేతనయినంతవరకు గ్రహిస్తాం.

రా—యుద్ధం జెయ్యడం జాతులకూ సామాన్య జనులకూ తప్పే. మానవునిలో వున్న పశుస్వభావమే చంపుకోవడానికి ప్రేరేపిస్తుంది. గుణపరిణామం జరుగుతున్నా, కోతి ఆదిమమనిషై వాడు రాక్షసుడై తరువాతవాండ్లు రాక్షసప్రాయులయిన జనులయి క్రమంగాగాని మానవుడు తన పశుస్వభావాన్ని పోగొట్టుకొని దివ్యస్వరూపాన్ని పొందడు. మానవులింకా పూర్తిగా సాధువులు కాలేదు. మానవులందరూ సాధుత్వాన్ని పొందినప్పుడే జాతులుగాని ప్రత్యేకవ్యక్తులుగాని కొట్టుకోవడం పశుధర్మంగా యెంచి సరళమార్గాలలో తగవులు పరిష్కరించుకోరు. యిరోపాయుద్ధము ముగిసిన తర్వాత యికమీద జాతులమధ్య యుద్ధాలు జరగకుండా నానాజాతుల సంఘాన్నొకదాని యేర్పరచి దానిద్వారా వ్యవహారాలు రాజీగా ఫయిసలు చేసుకోవడానికి ప్రయత్నం జరిగింది. యిరోపా జాతులలో పశుస్వభావం యుద్ధాంతమందు కొంచెం వెనుకంజ వేసినా, యుద్ధబాధలు మరుపుకువచ్చి యథాప్రకారము శాంతి వ్యాపించి జనులు భోగపరాయణులు కావడముతోటే మళ్లీ యథాస్థితికి వస్తూవున్నారు. సరిసమాన జాతులతో వ్యవహారాలు రాజీగా పరిష్కరించుకుంటున్నా బలహీనులను కత్తితోనే అణచి పెడుతున్నారు. కనుక మానవులలో సాధుస్వభావము వృద్ధిఅయ్యే టప్పటికి యింకా చాలా కాలము పట్టవచ్చు. గాంధిమహాత్ముడు సాధుమార్గాన యిండియాకు స్వరాజ్యం సంపాదించే ప్రయత్నం చేస్తున్నాడు.

“అహింసా పరమో ధర్మః” అనే సూత్రాన్ని అనాదిసిద్ధంగా ఆచరిస్తున్న భారతదేశమే యీ ధర్మాన్ని ప్రతిష్ఠించి లోకానికి మార్గం చూపవలసివుంటుంది. యీ విషయం మీరంతా బాగా గమనించండి. కేవలం స్వాతంత్ర్యము సంపాదించడమే మన ప్రయత్నం గాదు. స్వరాజ్యం నిజంగా స్వర్గరాజ్యమే గావాలె. మన మార్గం రక్తసిక్తమయితే స్వర్గరాజ్యం రాదు. నెత్తురుకూడు మనకు ఒంటదు.

మనమెంత అహింసాధర్మాన్ని పురస్కరించుకొని పనిజేస్తున్నా పశుస్వభావం మధ్యమధ్య పైకి వస్తుంది. స్వచ్ఛమయిన మన మార్గం బొంబాయీ చౌరీచౌరాలలో మయిలపడ్డది. మహాత్ముడు మనమింకా తగినంత గురుశిక్ష పొందలేదనీ, స్వర్గరాజ్యానికింకా అవ్వాలం గావలెనీ యెంచి ప్రయాణం ఆపుమన్నాడు. మనం మనలో దాగివున్న పశుత్వాన్ని చంపటానికే యిప్పుడు మహాత్ముడు బలియైనాడు. మహాత్ముడులోగూడా రోషమయినా పశుస్వభావం యింకా మిగిలివుంటే జయిల్లో హరిస్తుంది. జయిలకుపోయిన వాండ్లందరూ తమలోవున్న పశుస్వభావాన్ని చంపుకోవడానికి, మంచి అవకాశం భగవంతుడిచ్చాడు. ఖయిదులోకి పోయిన యిరవై అయిదువేలమందీ సాధువులయి బయటికి వస్తే వారు మార్గదర్శకులయి అందరినీ సాధువులను చేయవచ్చు. మనమంతా సాధువులు కాంగానే యుద్ధంగోరం. “సంధి మిచ్ఛంతి సాధవః” అనే సరళమార్గాన్నే కార్యం నెరవేర్చుకొంటాం. భారతజాతి నెత్తురుబొట్టు కార్చకుండా స్వాతంత్ర్యాన్ని పొందగలిగితే లోకమంతా అది మహాద్భుతకార్యంగా పరిగణిస్తారు. అహింసాధర్మాన్ని ప్రతిపాదించిన మన ఋషులు అప్పుడుగదా ధన్యవాదం చేస్తారు. చంపడం జాతులకూ ప్రత్యేకవ్యక్తులకూ పనికిరాదు. వుత్తరువు యిచ్చిన జడ్జీదీ తప్పే; వురిదీయించిన ఉద్యో

గులధీ తప్పే. చట్టం చేసిన శాసనసభ్యులకు దోషంలో పెద్దభాగం పంచేరం చేయక తప్పదు. నీవుగూడా తప్పే. జాతులను యుద్ధానికి పురికొల్పిన పశుస్వభావమే శాస్త్రకారులను పురిశిక్ష వేయడానికి పురికొల్పింది. ధర్మశాస్త్రాలలో పురిశిక్ష కేవలం హత్యకే గాక యితర నేరాలకు కూడా విధించియున్నది. తక్కిన నేరాలకు ప్రస్తుతం పురిశిక్ష కొట్టివేసినా యింకా ధర్మశాస్త్రాలకు మకిలె వదలలేదు. అదికూడా తుడిచివేసి శిక్షాస్మృతులను పవిత్రం చేయవలసి వుంటుంది

కా—అయితే జనులు హత్య చేయరా?

రా—హత్య యిప్పుడు మానారా? క్రోధం అధికమైనప్పుడు అన్నిటికీ తెగించే చంపుతాడు. అవతల చంపి యివతలికి వచ్చి తాను చంపానని గర్వపడుతూ ధర్మాధికారులతో డంభోక్తులు పలికేవాండ్లు యెందరు లేరు? అటువంటివాండ్లను పురిచేయడం నిజముగా శిక్ష గాదు. అందువల్లనే శిక్షలేని నేరమేమంటే, హత్యనే చెప్పవలసివస్తుంది. వాడు పశ్చాత్తప్తుడై బాగుపడడానికి అవకాశముగూడా లేదు. కుక్క కరవంగనే పిచ్చియెత్తి అందరినీ కరుస్తుందని భయపడి చంపినట్లు, వొకడిని చంపంగనే వాడిని పురితీయడం అవివేకాన్ని తెలియజేస్తున్నది. ఖయిదులో ఖూనీ నేరస్థుణ్ణి దీర్ఘకాల ముంచితేనే బాగుపడడానికి మార్గం చేయవచ్చు. తాత్కాలిక క్రోధంతో చంపిన వాండ్లను, పురిదీయడంకంటె అన్యాయం లేదు శిక్ష యెప్పుడూ నేరస్థుని బాగుచెయ్యడానికి వుద్దేశించారు అందుచేత చంపినవాడు యేవిధముగానూ బాగుపడడానికి అవకాశమియ్యని పురిశిక్ష సర్వవిధాలా నింద్యమే. కనుక యీ పాపం వొడిగట్టుకోకుండా మీరయినా మానుకుంటే చదువుకున్న వాండ్లు జ్ఞానం మిమ్మను చూచెయినా నేర్చుకుంటారేమో! సరే గాని పురిదీస్తే చోట యేమేమి చేస్తారో వివరంగా చెప్పు.

వెం—యేముంది. మామూలుగా జరిగేదే. పురిదీసే యింట్లో రెండు దూలాలకు రెండువుచ్చులు వేసగట్టి వుంటవి మెడకు తగిలించే భాగం సులభంగా వుచ్చుజారి దబ్బున బిగుసుకోనేందుకు మెత్తగా మైనం పూస్తారు పూర్వం ప్రతిమాటూ కొత్తతాడు వుపయోగిస్తుండేవాళ్లు. యిప్పుడు వృధాఖర్చులేకుండా తెగకుండా వున్నంతకాలం యెన్నిసార్లయినా వొకతాడే వుపయోగిస్తున్నారు, కాళ్లకిందుగా మనిషిలోతు గచ్చుగుంటలు రెండుంటవి. గుంటలమీద చెక్కలు మూతవేస్తారు. చెక్కలు రెండూ జోడించే వుంటవి. వాటి రెంటికీ బిగించి వొక ప్రక్కగా మర వొకటి వుంటుంది. ఆమర దిప్పితే రెండుచెక్కలూ వొంగుతవి గుంట అడుగున కొద్దిగా యిసుక బోసివుంటుంది హైకోర్టువారు పురిశిక్ష ఖాయం చేసిన తర్వాత గవర్నరుగారికి అపీలు చేసుకోకపోయినా, చేస్తే తోసివేసినా పురివేసే తేదీ నియమిస్తారు. జిల్లా కోర్టులో పురిశిక్ష వేసినప్పుడే మనిషి నిరాశ చెందుతాడు. అపీలులో పురి ఖాయమయిన తర్వాత జీవితాశే వదులుతుంది. యీమధ్యకాలంలో కృష్ణా, రామా అనుకొంటూ చదువుకున్నవాండ్లు భజనలు చేసుకుంటారు. రామదాసుచరిత్ర మొదలయిన పుస్తకాలుగూడా చదువుకుంటారు.

రా—పురిశిక్ష ఒడ్డవాండ్లకు కోరినతిండి పెడతారంటారే?

వెం—అదంతా లేదు. పూర్వంసంగతి నాకు తెలియదు. నా హయాంలో అందరికీ పెట్టేభోజనమే వాండ్లకూ పెట్టుతున్నారు భోజనానికి, స్నానానికీ మట్టుకు

బయటికి దీస్తారు అమేషా రాత్రింబగళ్లు వంతులు ప్రకారం ప్రతిఖయిదీకి వొక్కొక వార్డరు చొప్పున ఫారా యిస్తుంటారు, భోజనానికి బయటికి తీసేటప్పుడు ఛీపు వార్డరు వచ్చి బయటికి దీయించి అన్నం తనిఖీజేసి మల్లలో బెట్టింగ్, అపాయకస్తువు లేమయినా ఆత్మహత్య జేసుకోటానికు గదిలోగాని, దుస్తులలోగాని వున్నవేమో జడితీ చేయించి లోపలికి పంపిస్తారు సాధారణముగా వుదయం ౫½ గంటలకు వురి దీస్తారు జబ్బుగావుంటే వురిదీయకూడదు. యెందుకనో తెలియదు. నిండుప్రాణాన్ని వురిదీయవలెనని వుద్దేశ్యంగామాలె. రేపు వురిదీస్తారనంగా ఆమనిషి తూకంగల యిసుకబస్తాను వురితాడు ఆగుతుందో ఆగదో చూడడానికి దూలానికి వేల దీస్తారు. వురిదీసేసమయాన సూపరింటెండెంటు జైలరు, మేజస్ట్రీటు, డాక్టరు, ఛీపు వార్డరు. హాజరులో వుంటారు. వార్డర్లంతా చుట్టూఫారా వేస్తుంటారు. రేపు వురితీస్తారనంగా నేను, మాఅన్నా తాడు సరిజేసి బల్లలన్నీ తుడిచి సిద్ధముగా వుంచుతాము. ఆరోజు వుదయం ౫ గంటలకు వార్డర్లు మమ్ములను కొట్లలో నుంచి వురిమానిదగ్గరకు తీసుకొనిపోతారు. మేము వెళ్లి వుళ్ళి తాళ్లు చూస్తాం. దొరకూడా తనిఖీచేస్తాడు. అంతట ఆయనవుత్తరు వినియోగంనే వార్డరుపోయి ఖయిదీని చేతులు వెనకకూ కండ్లగంతా గట్టి నడిపించి తీసుకొనివస్తాడు. సాధారణంగా ఖయిదీకి యినుకతూకం విన్యాడాన్ని బట్టే మొదటతెలుస్తుంది. ఆరాత్రి సాధారణంగా నిద్రపట్టదు. తీసుకపోవడానికి ప్రతినిమిషం వార్డర్లు వచ్చి లేపనున్నట్టే వుంటుంది. తీసుకొని వచ్చేటప్పుడు సాధారణంగా నడిచేవస్తాడు. తెల్లవాండ్లంత ధైర్యంగా నడవలేరు. నడవలేక కిందపడతారు. అట్లా పడిపోయేవాండ్లు మనలో నూటికి వొకరుగూడావుండరు. నడిపించి తీసుకొనిపోయి బల్లమీద నిలువబెట్టి జాడించకుండా కాళ్లకు తాడుకట్టుతారు. మా అన్న వుచ్చు సరిజూస్తాడు. నే మెడకు తగిలించి బిగిస్తే ముడి ప్రక్కకు పోయేటట్లుగా పెడతాను.

రా—ఆమాత్ర మేమిటి?

వెం—అట్లయితే చప్పున బిగిసి ప్రాణంహాయిగా పోతుంది.

కా—నీ హాయి పాడుగాను—హా యేమిటోయి?

వెం—యెక్కువ శ్రమపడడు. నేను తగిలించంగనే దొర యిషారా యిస్తే జయిలరు కాలితో మర తొక్కుతాడు. చెక్కలు రెండూ వంగుతవి. మనిషి వేలాడుతాడు.

రా—వురి తగిలించేటప్పుడు గాని, మరతప్పేటప్పుడు గాని, మనిషి యేమయినా అంటాడా?

వెం—యేమీ అనడు. ముడుక్కొని వూరుకుంటాడు. బిగుసుకుండేటప్పుడు మాత్రం కిచుక్కుమని చిన్న శబ్దమవుతుంది. మూత్రవిసర్జనం చేసుకుంటాడు. నాలుక, కుడ్లు బైటికివస్తవి. గంటలో వేలాడుతుంటాడు. కాళ్ళు నేలకు తగలవు. అయిదు నిమిషాలలో పని పూర్తిఅవుతుంది. అంతట తలుపులు తాళాలువేసి యెక్కడివాళ్ళక్కడ వెళ్ళుతారు. తరువాత యేడుగంటలకు సూపరిండెంటు వచ్చి తాళందీస్తే నే శవాన్ని దింపి వురి వూడదీస్తాము. దొర డాక్టరు పరీక్షజేసి చచ్చినట్టు సర్టిఫికెటిస్తారు. చచ్చినట్టు ధృడపర్చుకోవడానికి సీలమండలవెనుక నరాలు కోస్తారంటారు గాని యీ

జయిల్లో చేయరు. వురిదీసినవాడిచుట్టాలు కోరితే శవాన్ని స్వాధీనపరుస్తారు. లేకపోతే వైద్యవిద్యాలయాలకు విద్యార్థులు కోసి పరీక్షించుకునేందుకు పంపిస్తారు.

రా__దేవుడు పుట్టించి పెంచినజీవాన్ని అయిదునిమిషాలలో నాశనంచేస్తారా

వెం__ప్రాణమేమి తట్టెడా? పుట్టెడా? నిమిషంలో వుఃస్వస వూదినట్టు గాలి యెగిరిపోతుంది. యింతకూ ఆఘాటానికి అట్లా వ్రాసి పెట్టివున్నవి.

రా__అంతే నన్నావు. ఒక్కమాటలో తేల్చివేశావే!

వెం__కాకపోతే మరియొకరి వశమా? శివు డెరిక లేంది చీమయినా కుట్టదు.

రా__ఆ. అవును. ఆచీమే కుట్టకపోతే మనిషిమాత్రం ఆయన యెరుకలేనిదీ చస్తాడా? పెద్దలు చప్పరించి__అవును గాని, మనుష్యప్రయత్నమే యెక్కువ, పురుషప్రయత్నం ఆరుపాళ్ళయితే దైవంరెండుపాళ్ళు వెంకటస్వామి! నీకర్మసిద్ధాంతం జెప్పి నావుత్సాహం కొంత అణిచావు. గాని లోతుకు దిగి విచారిస్తే నిరుత్సాహపడడానికి కారణంలేదు. వురిశిక్ష ఘోరం నీకు వురితీసేటప్పుడు భయంపుట్టదా?

వెం__పిచ్చిఅయ్యలా వున్నావు. నా చేతిమీదగా యెనభయిమందిని వురిదీశాను వొకటిరెండూ అయ్యేవరకూ కొంచం పీమపీమన్నదిగాని, తరువాత పరిపాటి అయిపోయింది. యిప్పుడు వురిదీయటమంటే నీళ్ల చర్లాటమే.

రా__అవును. వురిశిక్షవేసే జడ్జీలకు, వురిదీయించే సూపరింటెండెంట్లకూ, మేజిస్ట్రేట్లకూ, డాక్టర్లకూ, నీమోస్తరుగానే మొదటకొంచం కష్టంగావున్నా తరువాత గడుసుపోతారు. అనగా సున్నితభావాలు నశించి ఘటాలయినారని అర్థం. యింతమందికి పశుత్వమిప్పిస్తున్న యీవురిశిక్ష పోవడం అవసరము.

కా__శిక్షనసంగతు లెట్లావున్నా, అనేకమంది వొడ్డున బడుతారు. యెన్ని కష్టాలు పడుతున్నా ప్రాణమంటే ప్రతివాడికీ తీపిగదా? అదృష్ట ముంటే యే జాబిలికో బయటన్నా పడతారు.

పదిగంటలు కావచ్చింది. రెండవఘారాకూడా మారిపోయింది. మాటలసందడిన జనం చుట్టలుగూడా మానుకున్నారు. చాలామంది గారెలు వొద్దన్నారు. కొందరు అందరియెదుటా తినకపోయినా తినేవస్తువు పారవేయుగూడదని దాచిపెట్టుకున్నారు. పేల్చిన వుడకను అందరూ పట్టుబట్టి పారవేయమన్నారు. రామదాసు కొంతమనస్సంతోషంతో పడుకున్నాడు. అందరూ మెదలకుండానే పండుకున్నారు. చిటుక్కున శబ్దం దూదికాలిన కమురుకంపు కొద్దిగా పొగవాసన వస్తూనేవున్నది.

---

## పంద్రెడవ అధ్యాయం

## అసహ్యమే లేదు

సోమవారం ఫయిలురోజు నాక ఆరగంటముందే కొట్టు దీశారు. దూరంగా పోయి తెచ్చుకోకుండా బ్లాకు ఆవరణంలోవున్న కొళాయిలోంచే నీళ్లువచ్చినవి చాలాసేపు తెరిచివుంచితే అలస్యమవుతుందని కక్కను వెంటనే మూసి జాడుమాలీ బాగు చేస్తున్నాడు. పెంగాలు కడుక్కొనేవరకు గంజిహండాలు హాజరుగా వున్నవి. వార్డరు

జీవరత్నం అందరినీ వొంటిఘయిలుగా నిలబెట్టించి గంజి పోయిస్తున్నాడు. రత్నం జయిలు వుద్యోగస్థులలో వాత్సల్యగణంలో చేరినవాడు. విడిఖయిదీ రాముడు ఘయిలులో వొక ఆడుగు ప్రక్కకు తొలిగి నిలుచున్నాడు. వార్డరు బూటుకాలుతో తన్ని పోటాకట్టెతో ముంజేతిమీద గొట్టాడు. కాలు నెత్తురు కారుతున్నది. చెయి కదుము గట్టింది. యిద్దరు స్వదేశీఖయిదీలుగూడా చూశారు. వార్డరు వొకాయనకు బీడీ లిచ్చి లోబరుచుకున్నాడు. వొకరిద్దరు స్వదేశీఖయిదీలు దొరతో చెప్పుకోమని రాముణ్ణి ప్రోత్సాహపర్చారు. భోజనాలయినతరువాత ఆవరణమూ, గదులూ శుభ్రంగా వూడ్చారు. చాపలూ, గొంగళ్లూ రెండోజత బట్టలూ, ముందుపర్చుకొని అంతా ఘయిలులో నిలువబడ్డారు. స్వదేశీఖయిదీలు, తక్కినవాండ్లూ కలిసి నిలువడానికి వీలు లేదు. విడిగా నిలుచోవాలె. క్వారంటులో వున్నంతకాలం గొంగడి లేకుండా వుండి కొత్తగా బాంకానులోకి వచ్చినఖయిదీ వొకడు ఘయిలులో నిలుచున్నాడు. వార్డరు వెళ్లి దాక్కొమన్నాడు. స్వదేశీవాండ్ల ఆపరా చూచుకుని వాడు పోలేదు. ఖటకరిస్తూ వార్డరు వూరుకున్నాడు. అంవాటుపడ్డచోటా కట్టె దిలింపి గాని చెయి లేవ లేదు. దొరా, జయిలరూ, సర్జనూ, ఛీపువార్డరూ ఘయిలుకు వచ్చారు. వరుసగా చూస్తూపోతున్నారు. స్వదేశీఖయిదీలు పులుసు బాగుండదనీ, రొట్టెల కిచ్చే గోధుమ పిండిలో బియ్యపుపిండి కలుస్తున్నదనీ, మరికొందరు అన్నం చాలడంలేదు, రొట్టెలిప్పించమనీ అడుగుతున్నారు: చిన్న వుద్యోగస్థుల ప్రాపకం గలవాండ్లు తాము స్వయంగా అడగకట్టు నటించి వాండ్లే అడిగేటట్టు చేసుకున్నారు. తోచిన జవాబులు చెప్పుతూ దొర వెళ్లుతున్నాడు. వొక వెట్టిబాగుల ఖయిదీ స్వదేశీవాండ్లతోపాటు తనకూ రోజూ స్నానం చేయడానికి వుత్తరువు గోరాడు. దొర సాధారణంగా తొణికేవాడు కాదు. హృదయం మంచిది. ఖైదీ ధూర్తుగా మాట్లాడినా వాడిమీద దీర్ఘకోపముండదు. అప్పుడే దయినా లేదన్నా తరువాత ఆలోచించుకొని యుక్తమయిన వుత్తరువు లిస్తాడు. కింది వుద్యోగులే ఆయనను కొంతవరకు చెడుతోవని నడుపుతారు. రాముడు సలాం పెట్టంగనే దొర ఆగాడు. వార్డరు తాను గంజిపోయించుకుండేటప్పుడు కాలిమీద తన్ని చేతిమీద కొట్టాడని చెప్పుతూ గాయాలు చూపించాడు. అక్కడికి స్వదేశీవాండ్లు దూరంలో వున్నారు. వాడు చెప్పినదాంట్లో గంజి అనేమాట వొకటే దొరగారికి తెలిసింది. గాయాలుమాత్రం చూచి వార్డరువంక తిరిగాడు. గంజికీ గాయాలకూ లంకె పెట్టి గంజి పోయించుకోబోతే రాయి తగిలిపడితే గాయమయినది యని హిందూస్తానీలో తర్జుమా చేశాడు. దొర వోదార్చి తక్షణం ఆసుపత్రిలోకి తీసుకొని పొమ్మని సర్జనుకు వుత్తరువు చేసి యింకొక బ్లాకుకు వెళ్లిపోయినాడు. స్వదేశీవాండ్లు వార్డరు నడిగితే తన ప్రాణంమీదికి వచ్చినప్పుడు యేదో అబద్ధమాడి తప్పించుకొన్నా నన్నాడు. స్వదేశీవాండ్లు యేమిచేయవలసినది ఆలోచించుకున్నారు. స్వదేశీ ఖయిదీలు తప్పుజేస్తే వార్డరు రిపోర్టు చెయ్యకుండా వూరుకున్నాడు గనుక అతనిమీద రిపోర్టుచెయ్యవద్దని చాలామంది అన్నారు. వొకాయన మనవాండ్లు చేసే నేరాలు రిపోర్టుచెయ్యకుండా కమ్మిపుచ్చుతూ వుద్యోగస్థులమీద మాత్రం యెందుకు రిపోర్టుచెయ్యడమని వూరుకున్నాడు. పెంత్రంమీద ఖయిదీని కొట్టినందుకూ దొంకు తప్పు సంజాయిషీ యిచ్చినందుకూ రత్నానికి వుద్యోగం పోకుండానిలిచింది. రాముడుమాత్రం ఆసుపత్రిలోవుండి

కాలిమీద దెబ్బకు నాలుగురోజులు గంజిపథ్యంజేసి కొనవూపిరితో వార్డుకు తిరిగివచ్చి స్వదేశీవాండ్లతో మాట్లాడ్డం మానివేశాడు. వార్డరు స్వదేశీవాండ్లు రాముడిని మళ్లీ కొట్టి పెడతారేమోనని రాముడికి రెండుబీడీ లిచ్చి రాజీపర్చుకున్నాడు. అంతటితో రాముడికేసు అంత్యమయింది.

ఫయిలు అయినతర్వాత అంతా చాపలు మడిచి చుట్టలు అరుగుమీద బెట్టుకున్నారు. అన్ని బారకాసులలోను ఫయిలు పూర్తిఅయింది. యెనిమిది గంటలకు పని గంట కొట్టారు. యీలోపుగా రామదాను రెండోచల్లడమూ, చొక్కా యెవరో కాజేశారు. వెదకడాని కవకాశం లేకుండా వార్డరు ఫయిలు కూర్చోమని కేకలువేస్తున్నాడు. రామదాసు వార్డరుతో చెప్పుకుంటే, యెవరికో బీడీల కమ్ముకొని పోయినవని వంకపెట్టావా? అని చోటాకట్టి యెత్తాడు పుల్లప్ప ఆయన పెద్దమనిషి అని చెప్పబోతే కొందరు స్వదేశీవాండ్లే చల్లాడాలు ధోవతులు దొంగిలించి బీడీలకమ్ముకుంటున్నారని ఫిర్యాదు వచ్చింది. దానికేమి చెప్పుతావన్నాడు.

జీవరత్నానికి స్వదేశీవాండ్లమీద బాగా కంటు కలిగింది. వాండ్లను సాధించవలెనని పట్టాడు. స్వదేశీవాండ్లు మొదటిమోస్తరు కాదు. జన మెక్కువైనకొద్దీ అన్ని రకాలవాండ్లూ వచ్చారు. బీడీలూ, సిగరెట్లూ పూర్తిగా తాగుతున్నారు. అల్లరెక్కువయింది. వార్డరీసంగతులు దొరకు రిపోర్టుచేశాడు. సాయంత్రం 7, 8 గంటలమధ్య కాపలా తక్కువ, అంతా చుట్టలుతాగుతుంటారు. డుబ్బుజైలరూ, వార్డరులూ స్వదేశీ వాండ్ల బ్లాకుమీదపడి తాళాలుదీసి సోదాలు జేశారు ఆ రాత్రి యేమీ దొరకలేదు. తక్కిన ఖయిదీలదగ్గిర కొంతపొగాకు దొరికింది గాని ఆసంగతి దొరకు రిపోర్టుకాలేదు. తక్కినవాండ్లెవరూ తాగరనీ, స్వదేశీవాండ్లు ధనవంతులు కావడంచేత వార్డర్లను లోబర్చుకొని తెప్పించుకుంటారనీ దొరకు దెలిసిన సమాచారం. స్వదేశీవాండ్లదగ్గర పట్టుబడ్డా క్రిందివుద్యోగస్తులు బయట బెట్టరని దొర కనుమానం. వొకరోజు స్వదేశీవాండ్లతో స్నానానికి బోయినప్పుడు తానూ. యూరేషియన్ జయిలరూ, వార్డరును తీసుకొనివచ్చి అనుమానపు మనుష్యుల పడకలు సోదాజేశాడు ఒకరి పడకక్రింద పొడుం మాత్రం దొరికింది. అదిదొరికినాయన తనదిగాదు అరుగుమీద యెవరో పొడుంపెట్టి వుంటారు. చూడక దానిమీద పక్కవేసుకున్నానన్నాడు. పెద్దచేపలు చిక్కకపోవడంచేత దొర అంతగా ఆవిషయం గమనించలేదు. స్వల్పంగా వదిలిపెట్టాడు. యింకొకసారి పగలు అంతా వుండగానే జయిలరూ తానూ వచ్చి సోదాచేశారు. యిది వదిలేటట్టు లేదని దొరకు అనుమానంగా వున్నవాండ్లు ప్రస్తుతం మానివేశారని నచ్చజెప్పితే అంతట సోదాలు మానుకున్నారు. ఖయిదీలు నూటికి తొంభైతొమ్మిదిమంది పొగాకు వుపయోగిస్తారనీ వార్డర్లు పొగాకువర్తకం చేస్తారనీ స్వదేశీవాండ్లద్వారా తెలిసింది దానిమీద గేటులో జ్ఞానానందనాయరును జడితీచేయడానికి నియమించారు. అంతవరకు పొగాకు బాహాటంగా సింహద్వారంగుండానే వచ్చేది. బయట పనిచేసే ఖయిదీలు సాయంత్రము లోపలికి వచ్చేటప్పుడు వొకచేతిలో కూరగాయలూ రెండవదానిలో బీడీలు తెచ్చుకుంటె గేటుదగ్గిర కూరగాయలిచ్చి లోపలికి అడ్డంకి లేకుండా పోవచ్చు. జ్ఞానానందనాయరు జడితీ చేయడం మొదలుపెట్టినతరువాత గేటుగుండా విశేషంగా రావడంలేదు.

చాలాభాగం రాత్రులే మూటలుగట్టి వార్డర్లు గోడలుమీదుగా అందిస్తున్నారు. వర్తకం యథాప్రకారంగానే జరుగుతున్నది.

రామదాసుగుడ్డలు పోయినతరువాత పుల్లప్ప జాడాలుతీసి తనవార్డులో వున్న వొక ఖయిదీ కిటికీకమ్ములలోగుండా అవి బయటికి విసిరితే పాకీవాడు దాచి రెండో వార్డులోవున్న యింకొకడి కమ్మకుంటే వాడు పన్నెండు బీడిలిచ్చాడనీ, అవి వుభయులూ పంచుకున్నారనీ తెలిసి వాండ్ల ముగ్గురదుస్తులూ పుల్లప్ప దొంగిలించి దాచి పెట్టి వాండ్లుపోయినవని అనుకుంటే అవి రామదాసుదుస్తులను వెదకబోయినవి నాలుగూ కలసి యెవరివి వాండ్లకు వస్తవని పుల్లప్పన్నాడు. అంతట నలుగురూ తగాదా తీర్చి యెవరివి వాండ్ల కిప్పించాడు.

పుల్లప్ప వంటపనికీ, కామానాయుడు డుబ్ జయిలరుదగ్గిర సామగ్రు లందించే పనికీ, రామదాసు తాడు పేనడానికీ వెళ్లారు. పుల్లప్పకూ, కామానాయుడికీ చాలా మంచిపనులు దొరికినవి. రాజుకూ, ఆంబోతుకూ జయిలులో వంటఖయిదీలకూ అశన లోపముండదు. సామగ్రు లందించే కామానాయుడినికూడా ఈరకంలోనే చేర్చవచ్చు. కామానాయుడిదగ్గర గోధుమపిండి తీసుకొని ఆసుపత్రిపని చేయించే ఖయిదీవార్డరు రోగుల కివ్వవలసిన పాలలో నీళ్లు గలిపి మానెడుపాలూ పంచదారా మిగిల్చి ఆసుపత్రి అడవలో క్షీరాన్నం చేయించారు. గోధుమపిండి మిగిల్చి తరచుగా వుప్మా చేయిస్తుంటారు. కామానాయుడు తనభాగంకింద యిచ్చిన క్షీరాన్నంలో మిగిల్చి రామదాసుకోసం మధ్యాహ్నభోజనానికి వచ్చినప్పుడు తెచ్చి యిచ్చాడు. రామదాసు దాని పుట్టుపూర్వం విచారించి తిననన్నాడు. కామానాయుడు తా నాపని చేసినందుకు పశ్చాత్తాపపడి శిక్షవిధించమని రామదాసును కోరితే ప్రథమతప్పిదంగా యెంచి ఆపూట వుపవాసం, రెండువందలసార్లు రామనామజపం విధించాడు.

ఆపూట భోజనంలోకి సాధకం వంకాయలపులుసూ. కొంత ముల్లంగి ఆకూ, ముదురుగడ్డలూగూడా యిచ్చారు.. జయిలులెక్కలలో ఆరుమళ్లవంకాయలు యిచ్చినట్టు ఖర్చువ్రాసివున్నది. దర్జాకొద్దీ దేశీయవుద్యోగులందరికీ సువారాలు పంపారు. మిగిలినవాట్లో చాలాభాగం వార్డర్లందుకున్నారు. శేషించినవాట్లో యేరి ఖయిదీ వార్డర్లు తియ్యన వండుకున్నారు. మిగిలిన పుచ్చువంకాయలు తరిగి పుచ్చుముక్కలు తీసివేస్తే బొత్తుగా పులుసులో వంకాయలు వేసినట్టే కనపడదని ఆపాళంగానే వేశారు. యిచ్చిన ముల్లంగాకు ముడిగడ్డలుమాత్రం యెవరూ అంటుకోలేదు అంతా పులుసులోనే పడ్డది. పుచ్చుముక్కలూ తెల్లపురుగులూ పులుసుమీద యీదులాడుతున్నవి. యొగ్గులేనివాండ్లు గనుక జనం కనపడ్డపురుగు లేరి రోతలేకుండానే తిన్నారు. "క్షుధాతురాణాం నరుచి ర్న పక్వం" అన్నట్టు పురుగు లుంటేమట్టుకు బాగుండకేమిచేస్తుంది? పుల్లప్ప స్వయంపులుసు తెచ్చేఆయన నడిగి కాస్తవేయించుకొని వచ్చి రామదాసు కిచ్చి యెట్లాగో ఆపూట తోశాడు. పుల్లప్ప అడవలోనే భోజనం జేశాడు. అతనిపని అందరి లోకి వాటంగావున్నది. అంతా పనికి పోయినారు.

రామదాసు చెయిదిరగా తాళ్లు పేనినవాడయినా అలవాటు తప్పి చేయి వరుసు కున్నది. అట్లాగే వొరగదుట్టి సాయంత్రానికి నలుగురితోపాటు తా సిచ్చాడు రూలు ప్రకారం అలకంగా సగం పని చెయ్యవచ్చు నని మనస్సుకు ధైర్యం దోచింది.

సాయంత్రం నవ్వుమొగంతో వచ్చి పుల్లప్పతో చెప్పాడు. అంతా భోజనం చేసి ఫయిలు కూర్చున్నారు. స్వదేశీవాండ్లుకూడా కప్పలతక్కెడవలె ఫయిలు కూర్చుంటున్నారు.

యెవరో కొట్టుకున్నట్టు ఆరుపులు వినపడ్డవి. అడవ కెదురుగా డుజ్ జయిలరు ఆఫీసుముందు గలభా జరుగుతున్నది. ఖయిదీవార్డర్లూ, హాజరులోవున్న కొందరు వార్డర్లూ పరుగెత్తుతున్నారు. యెవరోవార్డరువచ్చి వొకటోనంబరు స్వదేశీవాండ్లుండే బారకాసు ఆవరణకు గేటుతాళం వేశాడు 1- వబ్లాకులో వున్నవల్లకుళ్లాయిలు స్వదేశీవాడిని కొడుతున్నారని అరిచాడు. వెంకటరెడ్డిని కొట్టి మోసుకొనిపోయి ఒంటికొట్లోదోసి దిగంబరినిచేసి మర్దనజేశారు. రెడ్డి చాలాబలవంతుడు. ఛీఫువార్డరుకుకూడా దెబ్బలుతగిలినవి. జయిలులో ఒకవస్తాదు ఖయిదీగా వున్నాడు. వాణ్ణి వుద్యోగస్తులంతా యిష్టమువ్చనట్లు అడవకుపోయి తిననిస్తారు. బలవంతుడయిన యేఖయిదీనైనా కొట్టించేటప్పుడు ఆతనినే వుపయోగిస్తారు. యిది జయిలరూ ఛీఫువార్డరూ ఆలోచించి చేసిన పని. ఛీఫువార్డరు ఆదంసాహెబు స్వభావంగా క్రూరుడు. కాని జిత్తులమారి. సాధారణంగా యెవరికీ చిక్కేవాడుగాడు. జయిలరుమూలకంగా. యీస్వదేశీవాండ్లవ్యవహారంలో యిరుక్కున్నాడుగాని లేకపోతే దూరంగావుండేవాడు. యిరుక్కున్నందుకు శాస్తిఅయింది. కేసు బయటపడకుండాచేయడానికి వుద్యోగస్తులంతా ప్రయత్నించారు. సాక్షుల నందరినీ తిరగదీశారు వొంటికొట్లలో వున్న స్వదేశీవాండ్లనుగూడా తిరగదియ్యడానికి జయిలరు ప్రత్నించాడు. వాండ్లు సాధ్యంకాలేదు. అయినా వాళ్లు ప్రత్యక్ష సాక్షులుకారు. అడవలో పనిజేస్తున్నవాళ్లందరూ ప్రత్యక్షంగా చూచినవాండ్లే. వాండ్లు సాక్ష్యం చెప్పడానికీ సిద్ధంగావున్నారు. వుద్యోగస్తులు వొకండ్లనూ పలకనియ్యలేదు. దెబ్బలుతిన్నవాడు చచ్చినా కేసు యింతే అయ్యేది. సాక్ష్యం జెప్పించదగినటువంటి వుద్యోగస్తులు కోరిప్రకారము పోవడానికి వొప్పుకోనటువంటి ఖయిదీవార్డర్లను కమానెత్తారు. జయిలు అధికారులకూ గవర్నమెంటుకూ అపకీర్తి వస్తుందని న్యాయమైన కేసును కమ్మీచేశారు. యీ కేసు ఫలితం యేమయినా దీనివల్ల నేర్చుకోవలసిననీతి ఒకటున్నది జయిలు సూపరిండెంటుకు లోపడని ప్రత్యేక డిపార్టుమెంటు జయిలులో జరిగే నేరాలను కనిపెట్టి సాక్షులను అమర్చే ప్రత్యేకశాఖ లేకపోతే జయిలుద్యోగులుచేసే దుండగాలు బయటికి రావు. చిన్నఘాత నేరందగ్గరనుంచి హత్యవరకూ యిదివరకు అనేక నేరాలు కమ్మీ జరిగినట్లే! వినికి. వెంకటరెడ్డిని వొంటికొట్టిలో వేసినతర్వాత బిగుళ్లూదారు, నేరము అడవ కెదురుగాజరగనట్టె లెక్క. యెవడయినా అడవలోవాడు సాక్ష్యంచెప్పినా వీలు లేకుండాజేశారు హాజరులోలేనిసూపరిండెంటు తాను వచ్చినప్పుడు బిగులు వొంటికొట్టుదగ్గరనే వేసినట్టు వినబడ్డదని సాక్ష్యం చెప్పుతాడు. ఆయనమోతుబరి సాక్ష్యంమీద అన్నిసాక్షాలు యెగిరిపోతవి. చీకటిపడ్డది. రామదాసు వగైరాలను బారకాసులలోకి పంపి తాళాలువేశారు. తెల్లవార్లూ సాయంత్రంజరిగిన తగాదా కబుర్లేవస్తున్నవి. ఖయిదీవార్డర్లు తలా ఒకరకంగా కబుర్లు దెచ్చేవాండ్లు, ఆరోజు మనమిత్రమండలిలో యితరసంభాషణ లేమీ ముఖ్యమైనవి జరగలేదు. దైవప్రార్థనమాత్రం చేసారు. తేపావచ్చే కబుర్లు తర్కించుకుంటూ ఆలశ్యంగా నిద్రపోయారు. తెల్లవారిలెక్క అయినతర్వాత కామానాయుడు కక్కసుకుపోయినాడు

రాత్రి ఒంటిగంటకే ఫుల్లప్పను వరకు తేపుకొని పోయినారు. వోవరుసీయరు ఆరోజు రెండు మాత్రపుకుండలు కక్కసుకుండా మోయటానికి వొంతులప్రకారం మనుష్యులను యేర్పాటుచెయ్యడంలో రామదాసు మురిగ్గులో వొకడుకావడం తటస్థించింది. యేర్పాటుకాంగనే ఒకడు రెండుకుండలలో మాత్రం ఒకదాంట్లో పోసి ఒట్టికుండ తన నెత్తిని పెట్టుకొని వెళ్లిపోయినాడు. తేలికయిన కక్కసుకుండ రెండవవాడెత్తుకున్నాడు. నిండుకడవ రామదాసుపాల బడ్డది. నీరు తొణికిసలాడుతున్నది. వోవర్‌సీయరుయెవడో టక్కరితనం జేసి ఒట్టికుండ యెత్తుకొని పోయినాడని తిడుతూ పొర్లిపోయేకుండను రామదాసు నెత్తిని పెట్టించాడు. మెల్లగా నడుస్తూ కక్కసుభావిదగ్గర పోయేవరకూ ఆపాదమస్తకం తడిసింది. గుడ్డలు తడిసి ముద్దయినవి. కడుక్కోవడానికి అక్కడ నీళ్లు లేకపోయినవి. తిరిగి బారకాసుకు వచ్చేలోగా ఫుల్లప్పకూ కామానాయుడికీ జరిగిన వృత్తాంతమంతా తెలిసింది వాండ్లు వార్డరును బతిమె లాడుకొని కొళ్లాయిదగ్గర రామదాసు స్నానంచేయడానికి వొప్పించి చొక్కా చల్లాడం తెచ్చి సిద్ధంగా వుంచారు. రామదాసు వచ్చి.

రా—ఫుల్లప్పా! యీరోజువంతుపని చేసివచ్చా. దూరంగావుంటె ఆపని అసహ్యంగా వుండేదిగాని దిగిచేస్తే అన్ని అసహ్యాలు పోయినవి. యెవడివృత్తికి వాడలవాటుపడతాడు యికమీద కక్కసుకుండ చూడంగనే వుమ్మివేసితొలగిపోవడంమట్టుకు నాకుండదు. యీమధ్య స్వదేశీవాండ్లంతా అధికార్లతో తగాదాపడి కుండలుమేము మోస్తామంటూ ముందుకువచ్చి పెద్దాపిన్నా వరుసగా మోశారట. ప్రపంచంలో అసహ్యమంటూ లేదని నాకు స్పష్టమయింది.

ఫు—కండ్లనీండ్లపర్యంత మయి-స్వదేశీవాండ్లంటే యేదో మాట పట్టింపుమీద చేశారు. మొయ్యవలసినజాతులు వేరేవుంటే నిన్నెందుకు మొయ్యమన్నాడు?

రా—అందరదీ వొంతులుగా?

ఫు—ఆకులపువాండ్లలో వొకరొకరికి వొంతుగాని మన కేమివంతు? వోవరుసీయరు టక్కరితనంజేసి యెదట వున్నవాడినెత్తిన బెట్టి పంపాడు.

రా—అయితే నేమిలే. యిదీ వొకందుకు బాగానేవున్నది. అంతా రామమయమే. అసహ్యించుకోవలసిం దేమీ లేదు ఆధర్మం నాకు బాగా సుబోధకమయింది.

ఫు—స్నానం చెయ్యండి.

రా—యెందుకు స్నానం?

ఫు—అనారోగ్యం గాదా, కంపుగొట్టుకొంటూనూ? మాకు చెడుగాలు గొడుతున్నది. మీవద్దకు రావద్దంటారా యేమి?

రా—ఆవును, ఆడవులలో నివసించే అవధూతలు తమయిష్టం వచ్చినట్టుండవచ్చును గాని జనపదంలో వుండే మనబోటివాండ్లు ప్రపంచానికి యెబ్బెరికంగా వుండగూడదు. సాధ్యమయినంతవరకు సరియయిన ప్రపంచధర్మాలే అవలంబిస్తూ పోవాలె.

ఫు—త్వరగా స్నానం చెయ్యండి. భోజనంవేళ అవుతున్నది.

రా—అట్లాగే పదండి.

## పదుమూడవ అధ్యాయం

# భాగాలు

కొబ్బరితాడు పేనడంచేత బుడిపికంటు రాచుకొని చేతు లక్కడక్కడ రొజ్జపుండు పడ్డా రామదాసు సాయంత్రానికి తాపీయ్యగలిగాడు. యథా ప్రకారం భోజనం చేసినతరువాత కొట్లుతాళాలు వేశారు. చుట్టలు తాగడం చాలావరకు తగ్గింది. చుట్టరంధి ఆపుకోలేనివాండ్లు అరుగులసందున కూర్చొని కక్కుర్తి పడుతున్నారు కనపడకుండా కట్టెడుపత్తిస్తే వినకుండా వీరంగమెట్లాగని చెకుముకిరాతి దెబ్బ లందరికీ వినబడ్డవి. అందరూ శబ్దంబుట్టినవైపుకు చూశారు. వొకరిద్దరు సిగ్గుపడి క్రమంగా వారం రోజులలో మానుకుంటా మన్నారు. అన్నపుముద్దలు బీడీలకమ్ముకొని పస్తుపడుకుండే అలవాటు వదిలి కడుపుకు తింటున్నారు సావుగంటలో అంతా రామదాసుచుట్టూ పోగయినారు. బయట పారావేస్తున్న ఖయిదీవార్డరు గుంపు పోగైనా రెందుకనిమందలిస్తే లోపలవున్న వోవరుసీయరు దేవుణ్ణి ప్రార్థన చేసుకుంటున్నా మని జవాబు చెప్పాడు ప్రార్థించుదామని వేరే అడక్కుండానే వోవరుసీయ రిచ్చిన జవాబును బట్టి చుట్టూచేరిన ఖయిదీల వుద్దేశ్యం కనిపెట్టి రామదాసు తత్వాలు పాడడం ప్రారంభించాడు' కాసేపు పాడి భక్తినిగురించి చిన్నవుపన్యాసం చేస్తూ భక్తి అంటే ప్రేమ అని, జ్ఞానం సర్వోత్కృష్టమయిన ప్రేమకు సాధన మని' జ్ఞానం వుదరనిదీ సార్వజనిక ప్రేమ గలుగదనీ, పూవు సౌరభము, పండు మాధుర్యము యిచ్చినట్టే ప్రేమజ్ఞానానికి ఫలమని, ప్రేమగలిగినప్పుడే ఫలాపేక్షరహితమైన లోకసేవ సాధ్యమవుతుందని. ప్రతిఫలం కోరనిది ప్రేమేనని తేలికమాటలతో ప్రేమతత్వం వుపదేశించాడు. జనమంతా వోపికగా కూర్చొని విన్నారు. వుపన్యాస మయినతరువాత రోజూ రామదాసుచరిత్ర చదివి వినిపించేటట్టయితే దీపం యీగదిలో పెట్టిస్తానని వోవరుసీయరు అన్నాడు. అందు కందరూ సంతోషించారు. తత్వాలు భక్తిసంగతులు విన్నతరువాత యెవరూ బూతులు మాట్లాడలేదు. బూతుకీర్తనలు పాడలేదు. యెవరయినా అలవాటు చొప్పున నోరుజారి వొకముక్కఅన్నా పక్కవాండ్లిశ్శోకొట్టి మాన్పేవారు. కాసేపు ఆపామాషీగా కాలం గడిపారు. తొమ్మిది గావచ్చింది గడియారం వచ్చిపోయింది. పెద్ద వుద్యోగస్తులు రౌండుకు వచ్చేవేళగూడా అయింది. అందరూ గుంపుగా చేరితే బాగుండదు. తనిఖీవచ్చే వుద్యోగస్తుడు చూస్తే కోపపడుతాడు. యెవండ్ల అరుగుల మీదికి వాండ్లు పోదా మన్నారు. అంతా తమ అరుగులమీద కూర్చున్నారు. జయిలరు రౌండుకువచ్చి వెళ్లిపోయినాడు. మళ్లీ అంతా రామదాసు చుట్టూపోగయి యేమయినా కథలు చెప్పమన్నారు. పుల్లప్ప కథలకేమి మన జయిళ్లలోవుండే చిక్కులన్నీ ఆయనకు చెప్పకుంటే ఆయన బయటకు పోయినతరువాత నయినా నివర్తిచెయ్యడానికి ప్రయత్నం చేస్తా రన్నాడు.

రా— నేను మీచిక్కులు నివర్తి చేయలేకపోయినా విందామని నాకూ కుతూహలంగానే వున్నది. యేమయినా చెప్పండి.

పు— కామానాయుడు బండారములో జరిగే చిత్రా లన్నీ చెపితే బాగుంటుంది.

కా—అడవసంగతులు నీవు చెప్పరాదా? వాటికంటె చిత్రా లెక్కడవున్నవి?

రా—వలపక్షం లేనీతీర్పు చెపుతాను. ఇద్దరూ చెప్పండి. తూలుగా పోవద్దు పొద్దు బోయింది.

కా—డుబ్ జయిలరూ, హెడ్ గుమాస్తా, పెద్దసర్జనూ వంటసాలవారరూ వొకపార్టీ. తోడుదొంగలన్నమాట. ఇరవయిపుట్ల రాగులు ఇవ్వాళ కంట్రాక్టరు తెచ్చి వొప్పజెప్పుతా డనుకోండి. బండ్లుగేటుబయటే నిలుస్తవి. దొర పెద్దసర్జను తనిఖీ జేస్తారు. చెడగొట్టదలచుకుంటే, పెద్దసర్జను యేదో సమిధ వేస్తాడు. ఆయనను డిప్యూటీజయిలరు లోకట్టుకుంటే యే దుమ్మయినా మంచిసరుకే. రకం తేడాలో వచ్చేలాభంలో కొంత కంట్రాక్టరుకు పోతుంది. వచ్చిన బండ్లలో పదిబస్తాలు పెద్దసర్జను తిప్పివేస్తాడు. దొర లోపల వేయించమని చెప్పి వెళ్లిపోతాడు. అంగీకరించిన బస్తాలన్నీ తూకం వేయించి భండారములో చేరినట్టే హెడ్ రైటరు దస్కతు పెట్టాలె. తోసివేసిన బస్తాలుగూడా మంచివిగానే లోపలికి వస్తవి. మంచివే వెనుకకు పంపివేస్తారు. సరుకులగదిలో రోజుకు రెండుబస్తాలవంతున మిగిల్చిన రాగులు నిల్వవుంటవి. అవి యిప్పుడు లోపలికి చేర్చినట్టే లెక్కచూచుకొని రెండుమూడు బండ్లు బయిటివి బయటే పంపివేస్తారు. దొరవచ్చి తనిఖీ చూచుకున్నా బస్తాలన్నీ చేరినట్టే రుజువులు కనపడతవి. యీ తనిఖీ సాధారణంగా జరగదు. అందువల్ల లోపలవున్న బస్తాలకంటెగూడా యెక్కువే తిరిగిపోతవి. ఆ లోటు నాలుగయిదు రోజులలో పూర్తి అవుతుంది. బియ్యం గొన్నప్పుడు బస్తాలు కంట్రాక్టరింటికి తిరిగిపోవు. జయిలువెలుపల సర్కారుద్యోగస్తులందరికోసం కట్టించినయిండ్లకు చేరుతవి. భాగాలులేని వుద్యోగస్తులకు వాండ్ల కుటుంబానికి కావలసిన బియ్యం, పప్పు, యితర సామాగ్రి పంపడం మామూలు, చింతపండు వగైరాలు వొకటిరెండు పెండెలు బయటవుంచితే దర్జానుబట్టీ, ఖర్చునుబట్టీ, వుద్యోగులంతా పంచుకుంటారు. వాండ్లకు వచ్చిన సామాగ్రి మిగిలితే అమ్ముకోవచ్చు. యిండ్లదగ్గర కందిపప్పు చేసుకోవడం కష్టమని కందులబస్తాలన్నీ లోపలికే వస్తవి. మంచికందులు వచ్చినప్పుడు ఖయిదీలు పప్పు తయారుచేసిన తరువాత బస్తాలు వుద్యోగస్తుల యిండ్లకు చేరుతవి. యీ మోత అదివారం రోజున జరుగుతుంది. ఆరోజున దొర ఆఫీసుకురాడు. కాసేపు ఆసుపత్రిచూచిపోతాడు. వుద్యోగస్తు లారోజున నిర్భయంగా సంచరిస్తారు. వారానికి కావలసిన కిరసనాయిలూ, జయిలులో ఆడే మంచినూనె డబ్బాలతో అరోజున ముఖ్యంగా బయటికి చేరుతవి. ఖయిదీలలో కొందరు ముసలివాండ్లుంటారు. వొక ఖయిదీ ౧౧వ మారు జయిలుకు వచ్చాడు. అడపాదడపా బయటికిపోతూ నలభైయేండ్లు జయిలులో గడిపాడు. యిటువంటి వాండ్లింకా వున్నారు. వాండ్లకు బయట నా అన్నవాండ్లులేరు. జయిలు వుద్యోగులే వాండ్లకు తల్లిదండ్రులు. విడుదలయినా మళ్లీ వస్తారు. పోలీసులూ కోర్టులూ వాండ్లకు మహోపకారులు. ముసలివాండ్లు వీండ్లేమి నేరాలు చెయ్యగలరని దొర పైకి వ్రాసి వదిలిపెట్టిస్తానంటే వాండ్లు వొప్పుకోలేదు. అంతట వాండ్లకు యర్రదారాలుగట్టి బతకమని వదలిపెట్టారు. జయిలులో కరుణతో గూడిందిది వొక్కపనే. పనిచేయలేక పోయినా అన్నం కడుపునిండా తింటారు. ఆదివారం పొద్దుగూకులూ వుద్యోగులయిండ్లకు జయిల్లో నుంచి బరువులు మొయ్యడమే వాండ్లకుపని. వాండ్ల కారోజు వుద్యోగులు అణా బేడా బహుమతిస్తే దుకాణాలకుపోయి నీళ్లుతాగి వస్తారు. వాండ్లకు కాపలాలేదు. రొటుదిరిగి

పక్షులు గూళ్లు చేరినట్టు సాయంత్రానికి జయిలు చేరుతారు. వెళ్లిపోతారనే భయ మెవ రికీ లేదు. వాండ్లకు జయిలుబిడ్డలని పేరు. యే ఖయిదీకి యేది కావలసివుంటే అది తెచ్చి పెడతారు. జయిలులో నీ కెక్కడైనా తిరగవచ్చు. దొరవున్న కాసేపుమాత్రం విశేషంగా బయట తిరగరు.

జయిలరుకూ. ఛీఫువార్డరుకూ భోజన పదార్థాలలో భాగాలు లేవు. జయిలరు ఖైదీలు తయారు చేసే వస్తువులమ్మి లాభాలు తీస్తాడు. బహిరంగంగా అమ్మేవిగాక చెప్పులూ, బూట్లూ, చాపలూ వూళ్లో అమ్మక మవుతుంటవి. ఖైదీలుగూడా వార్డర్ల ద్వారా అమ్ముకొని డబ్బుచేసుకుంటారు. యీమధ్య కొనుగోలు విక్రయాలలో నాలుగు వేలు విడితీపడ్డది. స్వదేశీవాండ్లను బాధించి ప్రభుత్వంవల్ల మెప్పుబొంది తప్పుకోవాలె నని జయిలరు చూశాడు గాని రెండువందలజీతం వచ్చే వుద్యోగానికి రాజీనామా ఇయ్య వలసివచ్చింది. అంతటితో పొయ్యేటట్టు లేదంటారు.

ఛీఫువార్డరుకు భోజనపదార్థాలభాగం లేకపోయినా అతడూ పరి గేరుకుంటూనే వుంటాడు, ఖైదీవార్డరుపనికి శిఫారసు చేసినందుకురు ౯-౦-౦, వోవరుసీయరు పనికి రు. ౩-౦-౦, మేస్త్రీకి ౧ రూపాయి, సాధారణంగా పుచ్చుకుంటాడు. స్థిమంతులు త్వరగా ఖైదీవార్డరుపని రావడానికి యెక్కువగాగూడా యిస్తారు. కొందరు ఖైదీవార్డర్లు ఈ జైలులో రాజులు. ఖూనీకేసులలోనూ' అల్లరికేసులలోనూ వచ్చినవాండ్లు లక్షాధికార్లున్నారు. జైలులో వాండ్లకు, జరగని సౌకర్యమూ మర్యాదా లేవు' వేళ్లతో పని యెప్పుడూ ముట్టరు. అధికారులకు అప్పులు బెడతారు. నజరానా ఇస్తారు' ఇక్కడనుంచి దక్షిణానికి కమా నెత్తిన ఖైదీవార్డరు ఇంకా పదిసంవత్సరాలు శిక్షజరుగ వలసివుంటే నూపరింటెంటుగావున్న డాక్టరుకు యెనిమిదివే లిచ్చి అనారోగ్యకారణా లను బట్టి విడుదల బొందాడుట. డబ్బు చెయ్యలేనిది లేదు. ఇంతేకాకుండా ప్రతిఖైదీ తేలికపని ఇచ్చినందుకు బహుమతు లిస్తాడు. ప్రతివాడికి జైలులోకి రాంగానే కష్టపు పని వేస్తారు. చేయితడిగలవాడు వెంటనే తేలికపనికి పోతాడు, డబ్బియ్యలేని బీదవాండ్లే కష్టపుపని చేసుకుంటారు. డబ్బులేనివాడు డుబ్బుకు కొరగాడు. ప్రతి ఖయిదీకి విడుదలయ్యే టప్పుడు దారిభత్యంక్రింద కొంత పయికం సర్కారువా రిచ్చి పంపుతారు. ఛీఫువార్డరు ప్రతివాండ్లదగ్గరా దాంట్లోనుంచి అణాబేడ వసూలు చేస్తాడు. భాగ్యవంతు లయిన సాక్షులూ. అసిసర్లూ' జూరర్లూ తమకు రావలసిన భత్యాలు కోర్టుగుమాస్తాల కిచ్చినట్టు ఖయిదీలు ఛీఫువార్డరు కిచ్చిపోతారు. ఇవ్వక పోతే మళ్లీ వచ్చినప్పుడు చోటాకట్టెలు విరుగుతవని పాత నేరస్థులకు భయం. కొందరు విడుదలయ్యే వాండ్లు వాగ్దానాలు చేసి యిండ్లకు పోయి పంపుతారు. వెంకటేశ్వర్ల మొక్కుబళ్లకంటె జైలు మొక్కుబళ్లు యెక్కువ శ్రద్ధతో చెల్లుబడెవుతవి మొత్తం మీద ఛీఫువార్డరుకు భోజన ఖర్చుపోను నేలకు రు. ౯౦ ల కంటె పైగానే గిడతవి. ఆదంసాహెబు నలుగురు పెండ్లా లున్నవాడు. జోటి కెప్పుడు తక్కువ వుండరు. నల్లమందు భాయీగూడాను.

రా—యీప్రకారం యెప్పుడూ అవిచ్ఛిన్నంగా జరుగుతుండేదేనా ?

కా—ఆహా జరుగుతుండేదే. వెనుక వొకఅయ్యరు జయిలరుగా వుండగా దొంగ తనాలు సాగేవిగావు. నాతోగూడా ఒక రెడ్డిఖయిదీ సరుకులకొట్లోపని జేస్తాడు. స్వదేశీ

ఆయన పెద్దయ్యగారు రెడ్డిచేత యే ఖయిదీ యేవుద్యోగస్తుడింటికి యేవస్తువులు మోసుకొనిపోయిందీ నమూనావేసి తయారు చేయించారు. యెంతసరుకువచ్చేదీ, లెక్కలలో యెంతవచ్చినట్టు జనుకట్టుకుండేదీ, తేదీవారీగా ఆరాదీసి లెక్కలువ్రాస్తున్నాడు వరుసగా మూడు నెలలలెక్కలు తయారుఅయినవి. యీ సంగతి యెట్లాగో డుబ్ జయిలరు పసిగట్టి రెడ్డి నాపనిలోనించి తీసివేసి వేరొకపనిలో వేశాడు. యిదివరకు వ్రాసిన మూడు నెలలలెక్కలు చాలవాయని డుబ్బను పెద్దయ్య మొగానపట్టుకొని అడిగాడుట పెద్దయ్య కేసు పెట్టడానికి వెనుకాడుతున్నాడు, పదిమంది పిల్లలగలవాడిని పింఛనకు తయారుఅయినవాడిని యెన్నితప్పులు చేసినా మనవాడని, కనికరిస్తున్నట్టు కనుపడుతున్నది. అదిగాక స్వదేశీవాండ్లు కేసు పెట్టరట

రా—యింకా విశేషా లేమీ ?

కా—సరుకులకొట్టులో వుండేప్రతివస్తువలోనూ డబ్బుపిక్కుతూనే వుంటారు. ఆకథలన్నీ చెప్పదలచుకొంటే రాత్రింబవళ్లు పడుతుంది. అన్నిటికంటె ఒకచిత్రమున్నది. యెందుకో పెద్దయ్య సందేహించాడు. గాని ఒక్కచిటుకతో డుబ్బు వదిలేవాడు. పెద్దయ్యతనగదివాకిట్లో వుండి చూస్తే డుబ్బుఆఫీసు కనుపడుతుంది, దొర వెళ్లిపోంగనే డుబ్బు ఆఫీసుకు ఆడవార్డర్లు వస్తుంటారు. పెద్దయ్య డుబ్బుకు పగవాండ్లను దగ్గరకు దీసి సంగతు లన్నీ రాబట్టాడు. అయ్యగారు ఒప్పుకుంటె వార్డరూ రెడ్డీకలిసి తలుపుతాళం బెట్టాలనే. ఆయన యిది అసహ్యపుపని అంటారు. వార్డర్లు పెద్దయ్యను మెడలు విరుస్తున్నారు. ఆయన సాక్ష్యం లేకపోతే కేసు నిలువదు. డుబ్బుపార్టీవాండ్లు తలుపుతీసి దొర వచ్చినతరువాత అంతా వట్టి దంటారని వార్డర్లభయం. పెద్దయ్య ఒక్కముక్క సాక్ష్యం చెప్పుతానంటే అంతా బందవుతుంది. యిట్లా అనుకుంటుండంగనే ఆయనను యింకొకబారకాసుకు మార్చారు.

జైలులోనే యిటువంటి సంగతులు జరుగుతుంటే యింకా యేముంది ?

రా—చివరకు మనకథ రంకుపురాణాలక్రిందికి దిగింది. యిక పుల్లప్పకథవిందాం.

కా—అవును. మార్పులలోనె మధుర మున్నది. పుల్లప్పా! యిక నీకథలు కానియ్యి.

పు—అతనికథలు పూర్తి కానియ్యండీ నావి యింకొకమాటు విందురుగాని అయినా అంత రసవంతంగా వుండవు.

రా—కామానాయుడు శృంగారరసంతో అంత్యంజేశాడు. ముంతఖర్జూరం తిన్న తరువాత చింతపండు బాగుండదు.

పు—నాకథ రేపుసాయంత్రం చెప్పుతా.

రా—సరే. అట్లాగే కానీయి. పొద్దుబోయింది. కామానాయుడు కథ మెచ్చాడు



# పదునాల్గవ అధ్యాయం

## జైలు విశేషాలు

మరురోజు రామదాసు యథాప్రకారంగా తాసియ్యగలిగాడు. యీరోజు ముఖ్యంగా గమనించదగింది వొక్క విషయం మాత్రమున్నది. వెనుక వో ద్రఖయిదీ వొకడు యీ జైలులో కొద్దికాలముండి పోయినాడు. విడుదలయ్యే టప్పుడు వొక వార్డరుకు డబ్బు పంపిస్తానని వాగ్దానం చేసిపోయినాడు. పంపలేదు. తాను మళ్లీవచ్చినా యీ జైలు కిందుకు పంపుతా రనుకున్నాడు. మళ్లీ దీర్ఘశిక్ష పడి కర్మం చాలక యీ జైలుకే కమానెత్తారు. అతనిని వెనుకటి వార్డరు ఛీఫువార్డరుతో మాట్లాడి తన దగ్గరనే పనికి వేయించుకున్నాడు. మొదటిసారి విడిశైదనుభవించడం చేత వో ద్రుడు పనులకల వాటు పడలేదు. పని చేయించడంలో వార్డరు చెప్పేది వొరియవాడి కర్థమయ్యేది కాదు. చెయ్యమన్నాడో, వొద్దన్నాడో కూడా తెలియక పాయేది. వార్డరు ఛోటాకట్టెప్పుడూ వాడి వొంటిమీద ఆడుతూనే వుండేది. పైకం కోసం యింటికి వ్రాస్తే జవాబు రాలేదు. పగలల్లా దెబ్బలు. వొకరితో మాట్లాడేందుకైనా బాసరాదు. జీవితం దుర్భరమైంది. యీ రెండుకారణాలూ చెప్పి దొరను కమానెత్తమనిఫయిలులో రెండు మాట్లడిగాడు. వాడు చెప్పేది యెవ్వరికీ తెలియలేదు. సూపరిండెంటు తలవూచి వెళ్లిపోతూ వచ్చాడు. వీడికి వొకటి రెండు హిందీముక్కలు మాత్రం వచ్చును. చచ్చిపోతానని దగ్గిర వాండ్లకు చెప్పి చింతమానెక్కి అక్కడనుంచి అందరికీ దణ్ణాలుబెట్టికింద బడతానని సైగ జేశాడు. మొదట వట్టిదే అనుకున్నారు. గట్టిదని తెలిసి ఖయిదీవార్డరూ, వార్డరూ బిగుళ్లూదారు, దొర పరుగెత్తుకుంటూ చెట్టుదగ్గెరకు వచ్చేవరకు వో ద్రుడు చేతులు వదలిపెట్టి దొరకు పదిగజాలు దూరంలో పడ్డాడు. వొక చేతీయెముకలు నజ్జునజ్జు అయినవి. వొళ్లంతా వూనమైంది. సూపరిండెంటు భయపడి పరుగెత్తాడు. వ్యవహారం విచారణలోకీ రాలేదు. జరిగింది నేరమే అయినా బయటికివస్తే పాలన బాగుండ లేదంటారని యావత్తూ కప్పిపుచ్చి వొరియాను ఆసుపత్రిలో వుంచి యెముకలు కట్టుకొన్న తరువాత యెక్కడికో కమాను పంపారు. అరోజు సాయంత్రం యథాప్రకారం కొట్లు మూశారు. ఆసుపత్రిలో ఒకరోగి ఆరోజు కాలంజేశాడు. పీనుగ మంచంమీదనే వున్నది. కాలు కిందికి వ్రేలాడుతున్నది. చిన్నసర్జను ఆసుపత్రికి వచ్చి శవముతో సరసాలాడాడు. ఆరోజు వుదయం దొర చూడవచ్చినప్పుడు గోధుమరొట్టె పెట్టించమని అడిగాడుట. సంజు గోధుమరొట్టె తింటే వయమవుతుందని వాడి ఆశ. ఖయిదీకి మాత్రం ప్రాణం తీపిగాదా? చిన్నసర్జను పీనుగును వొరే నాయనా! నీకు రొట్టె పెట్టించేదటరా అని బుజ్జగించి అడిగాడు. అది పలుకలేదు. వైద్యుడు కోపమువచ్చి బూటుకాలితో వ్రేలాడేకాలుతన్ని. పలుకవేమిరా అని బెదరించాడు. అన్నీ భగవంతుడే విచారిస్తాడని గామాలె శవము దానికి జవాబు చెప్పలేదు! వెళ్లిపోయినాడు.

ఆసుపత్రిలో బ్రతకడంకంటె చావడమే యెక్కువ అసహ్యం. బొంగులకు కట్టిన గోనెపట్టలోకి పీనుగనుదోసి వాహకులు వోహో, బీబీం అని నవ్వుతూ మోసుకొని పోయినారు. దొర దగ్గిరవుంటే మొసలకుండానే మోస్తారు. స్వదేశీవుద్యోగస్థులివి గమ

నించరు. శవాన్ని యెట్లా మోసుకొనిపోతేనేమని సర్జను వొక స్వదేశీఆయనకు జవాబు చెప్పాడు.

రోజూ ప్రార్థనచేయడం మామూలు అయింది. రామదాసు ఃసంచినడతను గురించి కొంతసేపు చెప్పినతరువాత పుల్లప్ప దూరంగా పోయి కూర్చున్నాడు. వుపన్యాసం ముగించి పుల్లప్ప యేడని రామదాసడిగితే కామానాయుడు నిన్న నాచేత కథచెప్పించు కొని యివ్వాళ తాను చెప్పబడుతుందని యే అరఃగుసందునో తొంగాడన్నాడు.

రా—అబ్బాయీ! ఆపప్పు ఉడకవు. యిట్లా వచ్చి నీకథ చెప్పు.

పు—యీపూట నాకు సుస్తీగా వుందండీ. రేపు చెపుతాను.

రామ—స్వస్తిగా వుండేమార్గం నే చెపుతా రా.

పు— దగ్గరకు వచ్చి—చెప్పండి.

రా—(వెంగము తేరిపారజూచి) వొకనవ్వు నవ్వు.

పు—నవ్వి, తల పక్కకు తిప్పాడు.

రా—పోయింది, పో.

పుల్లప్ప స్వస్థుడైనాడు. అంతా ఆశ్చర్యపడ్డారు. కథ ప్రారంభమైయింది.

పు—ఆనగనంగా వొకసెంటులు జైలు. అంతా నవ్వారు.

రా—కథానాయకుడు పుల్లప్ప కానియ్యి.

పు—కుసినీలో పనిచేసే వార్డరుదగ్గరునుంచి ఖయిదీదాకా అమ్ముకుండేవాండ్లే పైవాండ్లు డబ్బులకమ్ముకుంటే ఖయిదీలు బీడీల కమ్ముకుంటారు. జయిలుధరల ప్రకారం కానీకి రెండు అన్నాలు. అన్నానికి నాలుగు బీడీలు. అన్న మిస్తే రాగిరొట్టెయిచ్చి రెండుబీడీ లిస్తారు. గోధుమ రొట్టెకు పన్నెండు బీడీలు ఆడవలో పనిచాలా కష్టం. ఆహా రాత్రులు హండాలు పొయిమీద నేవుంటవి రెండువేలజనానికి గంటలప్రకారము మూడు పూటలా అన్నమునరాలె. అడవవాడు రాక్షసగణములోవా డయితేనే గాని నెగ్గలేడు. ఛోటాకట్టె యెప్పుడూ ఆడుతూనేవుంటుంది. కావలా బాగా చేయకపోతేఖయిదీలంతా అమ్ముకుంటారు. వార్డరుదగ్గిర కొనేవాండ్లే వుండరు. ప్రతిపూట తూనికలో యేడన్నాల కొక అన్నం. యేడురొట్టెల కొకరొట్టె పిక్కి మిగులుస్తారు. మూడుపూటలా లెక్క జూస్తే యెంత. పెచ్చువస్తుందో చెప్పవచ్చు. రెండువందల యేబదిమందికి రెండుపూటలకూ సరిపోయ్యే ఆహారం మిగులుతుంది. వీటిలో కొందఋ. వార్డర్లు వూరికే నేతింటారు ఛీఫువార్డరుయింటికి రోజూ మధ్యాన్నం పన్నెండు పోతవి. పైని వేటుగా రాగిరొట్టెలు ఖర్చయ్యే అన్నాలతోను పేస్తరులో శేషించినదాని మోయిను మొదటి బియ్యమిచ్చుడమే తగ్గిస్తారు. యింతమందికి సరిపడేపప్పూ, వుప్పూ, కారమూ, తక్కిన మసాలావస్తువులూ మిగులుతవి. దొర యెప్పుడయినా తనిఖీ చేస్తూనే వుంటాడు. గాని దొరలు గుడ్డిదొరలు, దీనిని పట్టుకోవలెనంటే మనవాండ్రే పట్టాలె. యిప్పుడున్న మన వుద్యోగస్తులలో న్యాయస్తు డొకడూ లేడు. స్వరాజ్యం వస్తే పెద్దయ్య యివన్నీ మారి పోతవంటాడు. గాని నాకు నమ్మకంలేదు. యీమధ్య స్వదేశీవాండ్లను కొందరిని ఆడవలో చేరిస్తే వాండ్లూ కొందరు తక్కినవాండ్ల పాటేఅయినారు. సిక్కులు అడవలోకి రొట్టెకు చేసుకోనేటందుకు వచ్చారా అంటే అందరికీ అడలు. వార్డర్లు యేమయినా యెత్తుకునిపోతుంటే చెవి పట్టుకొని దొరదగ్గరకు లాక్కొనిపోతా మంటారు.

వాండ్లున్నంతసేపు యేదొంగతనమూ జరగదు. అడవలోకి పోయే స్వదేశీవాండ్లు గట్టి పని చేస్తేచాలా వుపయోగ మయ్యేది. వాండ్లేమీ చెయ్యలేకపోయినారు. తగినవాండ్లు పోలేదు.

గంజి గాచడానికి తలకు నాలుగౌన్సుల రాగిపిండి, గోధుమపిండి, బియ్యమూ యిస్తారు. గంజిపోయిదులు సాయంత్రము తీసుకొని వంట రాత్రి పన్నెండు గంటలకు ప్రారంభించి గంజి గాచి వుదయం ఆరుగంటలయ్యేవరకు హండాలు బారకాసులకు తెస్తారు గంజి తనిఖీచేసేవాం డ్లెవ్వరూ లేరు. మనిషికి బియ్యంగానీ, పిండిగానీ రెండుఔన్సులు మాత్రమే గంజికి వుపయోగిస్తారు. తక్కినదంతా వుద్యోగస్తుల లెక్కకిందనే జమ.

కా—యీ దొంగతనాల కేమి. లంచాలు తక్కిన వుద్యోగస్తులుమట్టుకు తినడం లేదా? ప్రతి డిపార్టుమెంటూ యీలాగే యేడుస్తుంది.

పు—అయితే వొక భేదం మాత్రమున్నది. లంచం యిచ్చేవాడు కొంత ప్రతిఫలం పొందుతాడు. డబ్బున్న వాడిస్తాడు. లేనివాడు మానుకుంటాడు. జయిలులో ఖయిదీలు చేసేవస్తువు లమ్ముకొని జయిలరు లాభముతింటే సర్కారు సొమ్ముహరించినట్టే. మనకు నష్టంలేదు. ఖయిదీకు సర్కారు వారిచ్చే పడి తక్కువ. సాధారణంగా నాజూకుగా తినే వాండ్లకుకూడా సరిపోదు. వుప్పు కారంకూడా స్వల్పంగాయిస్తారు. యీ అర్ధాన్నంలో విద్యాధికులమని పేరుబెట్టుకునే వాండ్లంతా చౌర్యంజేసి సగానికిసగం హరించడం కేవలం అన్యాయం. వంటయింట్లోకి వచ్చేవరకే చాలాభాగం హరింపవుతుంది. వచ్చి వండిన తర్వాత నోరుగల దేవుళ్లకు ముందు మొక్కులు చెల్లాలె ఖయిదీ వార్డరందరూ వుదయం సాయంత్రం రెండేసి అన్నాలు తీసుకొని పోతారు. వార్డర్లలో హాజరు వున్న వాండ్లంతా అడవలోనే భోజనం చేస్తారు. తక్కిన ఖయిదీలలో సెలవు పావలా యివ్వగలిగిన ప్రతిఖయిది రెండేసి అన్నాలు తెప్పించుకొంటాడు వంటవాండ్లూ, వడ్డనవాండ్లూ తిన్నంత దిని బీడీల కమ్ముకుంటారు. రెండుబీడీలు అడవకు పట్టుకొని వచ్చిన ప్రతివాడికి వొక అన్నం చేతికిస్తారు. యివన్నీ పోగా తక్కిన అన్నం ముద్దలు వొట్టి దరిద్రగొట్టు ఖయిదీలకు పంపుతారు. వేలు జీతాలు తినేవాండ్లేగాని యిది విచారించే వాడెవడూ లేడు. ఖయిదీల దగ్గరకు వచ్చేవరకు పులుసు వట్టి నీళ్లుగా వుంటుంది. నీళ్లలో ముక్కలూ కూరా దేవుకుంటారు పయినుంచి కిందిదాకా యెవరు చూడబోయినా దొంగే. వంగి పనిచేసేవా డెవడూ లేడు, అంతా వట్టిబూటకం రూలుప్రకారం ఐ. జీ. సంవత్సరానికి వొక్కమాటూ, సూపరిండెంటు వారాని కొకమాటూ. జయిలరు ప్రతిదినమూ ప్రతిఖయిదీని చూడాలె. దొరమాత్రం వారాని కొకమాటు ప్రతి ఖయిదీని చూశానని పిస్తాడు. అందరినీ వరుసగా నిలుచోబెట్టి చూస్తూ పోతాడు. తనిఖీవార్డర్లు దొర చూడడానికి వచ్చినప్పుడు యేమీ చెప్పకోకూడదనీ, దానికి వ్యతిరేకముగా చ రిస్తే కష్టె విరుగుతుందనీ చెపుతారు; అందువల్ల యెవడూ నోరెత్తడు. స్వదేశీవాండ్లున్న బ్లాకులో మాత్రం ఖయిదీలప్పుడప్పుడు ధైర్యంచేసి దొరను యేదయినా అడుగుతున్నారు. తక్కిన బారకాసులలో కిమిన్నాస్తి నోరెత్త గూడదు. ఫయిలుకు పోయేటప్పుడు జయిలరు సూపరిండెంటు వెంట తిరుగుతాడు. అంతకు మిక్కిలి సాధారణంగా యెవరినీ చూడడు. కార్ఖానాలలోకి అప్పుడప్పుడు పోతుంటాడు, యిది అంతా యెందుకు! మొన్న యిన స్పెక్టరు జనరలు వచ్చి యెంతమందిని చూచాడు? ఆఫీసులో కూర్చొని చుట్టు తిరిగి

పోయినాడు. స్వదేశీవాండ్లు స్నానానికి పోంగా చూచి వారి బారకానుకు వచ్చి వొకరిద్దరు స్నానానికి పోనివాండ్లను చూచిపోయినాడు. ఐ. జీ. గారే యింతగా చూస్తే జయిలరెంతగా చూస్తాడు! సర్జనుజనరలుగారు వస్తారని గడబిడగా చెప్పుతున్నారు. మోటారుమీద ఆసుపత్రికి వచ్చి పోయినాడుట. ఆసుపత్రిలో వున్న నోరుగల స్వదేశీ ఖయిదీ పడుకుండే గదికి బయట తాళంవేశారు. యెందుకో ఆయనకు తెలియదు. తీరా విచారిస్తే సర్జనుజనరలు వచ్చిపోయినాడని తెలిసింది. యిదంతా జౌర చేయించాడని గాని ఆయనకు తెలుసునని గాని అనడానికి వీలులేదు. యివి బయటికివస్తే దొరకు మాట వస్తుందనీ అందువల్ల ఆగ్రహం రావచ్చుననీ భయం. యిదంతా సంస్కారం కావలెనంటే జాతిలో నీతివర్తన యెంత అభివృద్ధి కావలెనో ఆలోచించుకోండి. స్వదేశీవాండ్లలో యీ దోషం తగులని వాండ్లెందరో నాకు లెక్కబెట్టి చెప్పు. రేపు వాండ్లను జయిలు వుద్యోగులనుగా యేర్పాటు చేసినా యింతేపని జరుగుతుందని నా అభిప్రాయం.

రా—నిట్టూర్పుతో యీ కథింతటితో ఆపి, రెండువేల జనానికి భోజనపు ఏర్పాటుకు యెంత పెద్ద ఏర్పాటు చేసివుంటారో నా కాశ్చర్యంగా వున్నది. అవి కొంచెం వర్ణించి చెప్పు.

పు—పూటకు పది పదునాలుగువందల రాగిరొట్టెలు కాలుస్తారు, నాలుగుగజాల పొడుగునా, గజమెత్తునా గోడవెంబడి గాడిపొయ్యి గట్టి పక్కగుండా మానులు నరికి పొయ్యిలో పచ్చివే పడవేస్తారు. యిల్లంతా పొగ కమ్ముకొని మనుష్యులు నిలువడానికి వీలులేకుండా వుంటుంది. యేరోజు కావలసిన వంటచెరకు ఆరోజు చెట్లు పడనరికి వెయ్యడమే. యింతమందికి వంట యెందుకట్టెలు లేకుండా యెట్లాచేస్తారని వుద్యోగులనుకుంటారో తెలియదు. వంటచేసే ఖయిదీలు బాధలు చెప్పుకున్నా వినేవాండ్లులేరు. యీ పెద్దపొయ్యిమీద నాలుగుగజాలు పొడుగూ, గజం వెడల్పుగల యినపపెనం వేస్తారు. వొక్కొక్కసారి వందరొట్టెలు కాలుతుండవచ్చు. నాలుగు వరసలుగా నాలుగు గజాల పొడుగునావేస్తారు. నానిపిండి కొల్చి ముద్దలు చేసేవాండ్లూ, రొట్టెలు తట్టే వాండ్లూ పెనంమీదవేసి నీళ్లు జల్లేవాండ్లూ, తిరగవేసేవాండ్లూ విధీ విరామం లేకుండా పనిచేస్తూనే వుంటారు. యింకొకచోట మధ్య పొగబోయే చిమ్నీ, మూడువయిపులా గోడలుబెట్టి వొక్కొకవయిపున రెండేసిపొయిలూ వుంటవి. వొక వైపున అన్నం, వొక వైపున పులుసూ, ఒక వైపున పప్పూ వుడుకుతుంటవి. యీ భైశేర్లు వుడికే గంగాళాలతో వొండుతుంటారు. గంగాళాలు చెవులలో బొంగులుదూర్చి యిద్దరు బుజానబెట్టుకొని వుడికిన హండాలు దింపుతుంటారు. గాడిపొయిలలో పచ్చిమానులు పడవేస్తుంటే పొగనే అగ్గికి యెండి కొంత సేపటికి గణగణలాడుతూ మండుతుంటవి. వంట అయిన తరువాత లెక్క ప్రకారం యేవార్డుకు పోవలసినభోజనం అక్కడికి పంపుతుంటారు. అన్నంముద్దలు గొట్టడంలో చాలా చాకచక్యం వుంటుంది. అదిమి గొడితే అన్నం యెక్కువపడుతుంది. తేల్చికొడితే పెద్దముద్దలలో రెండేసి ఔన్సులు మిగులుచుకోవచ్చు. తగాదాలు పెట్టేవాండ్లున్న బారకాసులలోకి తక్కువ ముద్దలు పంపరు. మొత్తంమీద మెత్తనివాండ్లున్న బ్లాకులలో యేపిచ్చముద్దలయినా చలామణి అవుతవి. హండాలలో కాస్తగంజెక్కువవుండేటట్లు వొసరుపోస్తే ముద్ద సళువవుతుంది. యెంత పెద్దదొరనయినా కండ్లుమూసి తూనిక చూపించవచ్చు, యిదంతా పరీక్షించి కనుక్కుండేవాడు లేడు

దొరకు ప్రయత్నించినా కనుక్కోవడం సాధ్యంకాదు. యెక్కడనొక్కాలెనో ఆయనకు తెలియదు. నొప్పిలేనిచోట వత్తితే డాక్టరు కేమి తెలుస్తుంది? జయిలు బాగుచేయవలెనని ప్రయత్నించడం నిష్ప్రయోజనం. నలుగురు బయటవాండ్లూ చూడడానికి వీలులేకపోవడమే కారణం, ఖయిదీలకు వుద్యోగస్తులను పరీక్షించే అధికారముంటే వాండ్లు అదుపులోవుండరని బయటివాండ్లకు స్వేచ్ఛగా ఖయిదీలతో మాట్లాడి సంగతులు తెలుసుకొనే వీలుంటే కారాగృహము యొక్క భయమె పోతుందని యెంచడంమూలంగా జయిళ్లు పాడవుతున్నవి. యీ అభిప్రాయాలకి తోడు, మంచివర్తనగలవాండ్లను యేరి వుద్యోగాలకు నియమించకపోవడం మరియొకలోపం.

రా—ఖయిదీలకే జ్ఞానం కలిగించి వాండ్లవల్లనే యీ అక్రమాలు అణచాలె.

కా—వాండ్లను పశువులుగా నుంచినంతకాలం వాండ్ల నణచడానికి కఱ్ఱేసాధనం. కాని వాండ్లకు జ్ఞానం వృద్ధిజేస్తే మాటలచేతనే అదుపులో వుంచవచ్చు.

పు—అధికారం చేతులో వున్నవాడల్లా దొంగే అవుతాడు.

రా—పుల్లప్పా! నీవు సర్వం అనర్థమేననే సిద్ధాంతం అవలంబిస్తున్నావు. ప్రపంచాన్ని అన్నివిషయాలా అదృష్టితో చూడడం తప్పు. నాకుకూడా మనస్సుకు కష్టంగా వుంది బాగుచేసేభారం భగవంతుడిది. మనకు దిగు లెందుకు? మనధర్మం మనం చేస్తేచాలు. మిగతాది. ఆయనే జాగ్రత్తపెట్టుకొంటాడు. పోయి పడుకోండి.

---

## పదునైదవ అధ్యాయం

# మార్పు

రామదాసుకు జయిలుజీవితం కొత్తబాసింది. మొదట యెబ్బెరికంగా వున్న పద్ధతులన్నీ పాతగిలి సాధారణమయిపోయినవి. రేపులూ మాపులూ రాటపాకులవలె క్షణంలో తిరిగివస్తున్నవి, మొదట వుత్సాహంగా తాను యివ్వవలసిన దానికంటె యెక్కువపని చేస్తూ మొదటిరకంతాసు యిస్తున్నా కొన్నాళ్లకు విసుగెత్తి నల్లదారపువాండ్లతో పాటు పనిచేస్తున్నాడు. యెండలు బాగా ముదిరినవి. సంవత్సరాది వెళ్లిపోయి చైత్రమాసం జోరబడి సగపడ్డది. రామదాసు క్వారంటులోనుంచి ఆసుపత్రికి రావడం వచ్చినవెంటనే పిల్లలమరణవార్త వినడం, మాలక్ష్మి వెంకటదాసూ పోవడం, వొకదానివెంట వొకటి తగిలిన వేలికే తగిలినట్టు సంభవించి యితరజోక్యాలేమీ పెట్టుకోలేదు. వీరదాసూ, రంగదాసూ మొదలయినవాండ్లు నిడదవోలు జయిల్లోనే మూడో బారకానులో వున్నా రామదాసు వచ్చినసంగతిగాని, అతనికి వచ్చిన విపత్తులనుగురించిగాని వినలేదు తక్కెళ్లజగ్గడు వచ్చి చనిపోయినాడని విన్నారు. గాని ఆతడు తమ వెంకటదాసే నని యెరుగరు. ఒకటవ బారకానులో పుల్లప్పా, రామదాసు కలుసుకున్న తరువాతకూడా వాళ్లతో మాట్లాడడం పడలేదు. మూడవ బారకానులో వంచేలున్నవని అక్కడి కెవ్వరినీ పోనియ్యడంగాని, అక్కడి వాండ్లను యితరబ్లాకులకు రానివ్వడంగాని లేదు. నాలుగవబ్లాకులో వంచేలు ముమ్మరమై ప్రతివాండ్లూ మజ్జిడ్డుగా పాడిపోవడంచేత పెయ్యానివాండ్లను అక్కడ

నుంచి తీసి యితరచోట్లకు సర్ది నాలుగో బ్లాకును ప్రత్యేక ఆసుపత్రిగా చెయ్యడంలో పుల్లప్ప ఛీపువార్డరుతో యేదో తంత్రంజేసి మంగళాపురపువాండ్లను వొకటవబ్లాకులో వేయించాడు గాని తమసావిట్లో వుంచడం వీలులేకపోయింది. పగల్లా వొకరినొకరు చూచుకొని మాట్లాడటానికి వీలు కలిగింది. రామదాసుసంగతి క్రమంగా అన్ని బ్లాకులలోను తెలిసింది. వొకటవ బ్లాకులో వున్న ౧౧ వ సావిళ్ల వాండ్లూ తలా వొకరోజు రామదాసును మార్చి తమ సావిళ్లలో పడుకోబెట్టుకుంటూ, లోకసంగతులూ, నీతిమత బోధలూ వింటున్నారు. తక్కిన బారకాసులవాండ్లు గూడా తమ సావిళ్లలోవున్న చదువుకున్న ఖయిదీలను బతిమలాడుకొని స్వదేశీవాండ్ల దగ్గర నుంచి పుస్తకాలు తీసుకొనిపోయి చదివించుకుంటున్నారు. యీ సంగతులు సూప రింటెంటుగారికి తెలియలేదు. యెరిగినవాండ్లు నలుగురూ వొకచోటే వున్నా కొన్ని నెలలు గడిచేవరకూ జీవితంలో ముక్కుడక్కలు దిన్న రామదాసుకుకూడా తత్వం మారి పోయింది. అక్కడికీ రోజూ కొంతపని చేస్తూవున్నా స్వేచ్ఛగా దిరక్కపోవడంచేత అన్నం సరిగా అరగడంలేదు మనిషి దుర్బలుడై పట్టుమని పదినిమిషాలు ఫయిలులో గొంతుకూర్చోలేడు. కాళ్లు తిమ్మిరిపట్టేవి. యెప్పుడయినా నీళ్లకోసం దూరంగాపోవలసి వస్తే రెండుఫర్లాంగులు నడిచేవరకు కాళ్లు తీసేవి. కదలకుండా కాసేపు నిలువంగనే పిక్కలు నొప్పిపట్టేవి. మజ్జిగలేకపోవడం, నువ్వులనూనె పులుసులో వేయడం, తలంటు లేకపోగా వారానికొక్కమారయినా స్నానవసతి లేకపోవడంచేత శరీరం పైత్యదా రుణానబడి వయస్సు మీరినా నరవనితలంతా పలితరోగికివలె జనపనార కట్టయింది. అయిదారు నెలలు మాడున చమురు పెట్టుకొని యెరగడు. కండ్లకు బాగా మసకలేర్పడ్డవి: స్వదేశీవాండ్లు రోజూ స్నానం చేయడంచూస్తే వొంటికి రోమాంచం కలిగింది. యీ మార్పుల కేమిగాని బలహీనులకూ, వృద్ధులకూ రక్షణసాధనమైన కోపం ప్రవేశించింది. స్వల్పవిషయాలకుగూడా మనశ్శాంతి పోయేది. ప్రతిదానికీ అనవసరమయిన పట్టుదల యేర్పడ్డది. యిదివరకు యెదటివాండ్ల ఆక్షేపణలకూ, దూషణలకూ పెడమొగం పెట్టె వాడు. యిప్పుడు తనలో దోషంలేదని తెలిసికూడా తన జీవితాన్ని గురించి స్వల్పవిమ ర్శన చేసినా సహించలేకపోతున్నాడు. యితరులకు యేస్వల్పబాధ గలిగినా మనస్సుకు అనవసరమయిన వుద్రేకం గలిగేది. ఇంద్రియ నిగ్రహంగల రామదాసు స్థితే యిలావుంటే తక్కినవాళ్ల సంగతి చెప్పవలసిన పనిలేదు. రాయివంటి శరీరముగల పుల్లప్ప బొత్తిగా డసిలిపోయినాడు. ప్రతిదానికి చిర్రుమనడం అందరికీ స్వభావగుణం అయింది. వీరదాసు మొదలే ముక్కోపి. పైగా అరవైమోపడిలో వుండడం, అర్ధభోజనం బొత్తిగా దిగ దీసింది. ముల్లంగిఆకు పులుసు పడక రెండుమూడుసారులు ఆసుపత్రిలో వుండివచ్చాడు. మనిషి బొత్తిగా భవిష్యం, హావిష్యం లేకుండా పోయినాడు బయట జీవనాధారమేమీ లేనివాళ్లకు జయిలులో వుండడమే మేలంటారనుకున్నవాళ్లకు దేహమనోబలాలు క్షీణించి వున్నవి. దేహంయొక్కయూ, ఆత్మయొక్కయూ సర్వశక్తులకూ పుష్టినిచ్చే స్వాతం త్ర్యము లేనప్పుడు అన్నిశక్తులూ క్షీణించే వుంటవి.

నిడదవోలు సెంట్రలు జయిలులో చాలా బ్లాకులలో జనం నిండాలేరు. గడువు తీరినవాండ్లు వెలుపలికి పోతున్నారు, గాని క్రొత్తగా వచ్చేవాండ్లు తక్కువ. సీ. టి. అక్టు ఖయిదీ లెవ్వరూ రావడంలేదు. అందువల్ల జయిళ్లలో నాలుగోవంతుసంఖ్య తగ్గింది.

మహాత్ముని అసహాయోద్యమం దేశమంతటా వ్యాపించినది. మాలపల్లెలు మగ్గాలతో నిండినవి. సాలీలూ, తొగటలూ, మాలలూ మొదలయిన తంతువాయ జాతులన్నీ దేశానికి కావలసిన గుడ్డలన్నీ నేయలేకుండా వున్నారు. సాధారణంగా వాండ్ల కుటుంబాలకు సరిపోయ్యే కూలి గిట్టుతున్నది. సంతానములలో చాలమంది డబ్బుచేతికి చిక్కించుకొన్న వాండ్లు బాగా పుష్టిపడ్డారు. స్వదేశీ చెప్పులయందు జనానికి అభిమానం కలగడంతోనే మాదిగవాండ్లకుకూడా చేతినిండాపని దొరుకుతున్నది. ఖద్దరు వృద్ధికావడంతోనే కోట్ల మందికి వడకడం, యేకడం, రంగులద్దడం పని సరిపోతున్నది. ముతక నూలు మాత్రం వడకడం చేతనయినవాండ్లు సన్నపునూలు తీస్తున్నారు. పత్తిపండే జిల్లాలలో నేత మరీ యెక్కువయింది. చాలాజిల్లాలు నేతజిల్లాలని పేరుపడ్డవి. వాటిల్లో వుండే పెద్దబస్తీలన్నిటిలోను ఖద్దరు సంతలు పెట్టి అధికంగా వుండే నూలూ, గుడ్డలూ యితర జిల్లాల కెగుమతి చేస్తున్నారు, ప్రతినెలా సంతలసంఖ్య పెరుగుతున్నది. మొదటి నెల సంతలుగా పెట్టినవి పక్షసంతలూ, వారసంతలుగా మారినవి. మాలమాదిగె పల్లెలలో పూర్వం జగ్గడి సంతానములుగా వుండి చెయిమెల్లా చిక్కించుకొన్నవాళ్ళు చాలామంది ఖద్దరువర్తకం ప్రారంభించి గుడ్డలూ, నూలుకొని నిలువజేసి దూరపుసంతలకు పంపుతున్నారు. పల్నాడు మాంచెస్టరయింది. సీమనూలంటే పల్నాటిసీమ కొండవీటిసీమ యని అర్థం రూఢమవుతున్నది. ఖద్దరువల్ల కోట్లకొలది జనానికి జీవనం కలగడంతోనే తక్కినకూలీలకు వ్యవసాయపుపనులవల్ల యెడతెగకుండా కూలి దొరికి సుఖజీవనం జరుగుతున్నది. విదేశీగుడ్డ లమ్మే వర్తకు లంతా స్వదేశీగుడ్డలనే అమ్ముతున్నారు. యిదివరదాకా అహమ్మదాబాదు బొంబయిమిల్లులలో ముతకనూలు వడికేయంత్రాలన్నీ ఆపని కట్టిపెట్టి సన్నపునూలుమాత్రం వడుకుతూ కొన్నింటిని యితరపనుల కుపయోగిస్తున్నారు. అందుమూలంగా యితర వృత్తులు చాలా అభివృద్ధి అవుతున్నవి.

కూలీలకు పని పుష్కలంగా దొరికి, డబ్బు మిగులుతుండడముతోనే కూలి కూటాలకూ పరపతిసంఘాలకూ ప్రాముఖ్యత హెచ్చింది. వూరూరా వొకరి ప్రయత్నం లేకుండానే సంఘా లేర్పడుతున్నవి; జనం బొత్తుగా తాగుడు మానివేశారు. యేయింగ్లీషు విద్యాధికులలోనో తప్ప సామాన్య జనంలో మత్తుద్రవ్యాల వుపయోగం లేనేలేదు. ప్రభుత్వోద్యోగులూ, సారాయి యిజారాదారులూ జనులచేత సారాయి తాగించవలెనని విశ్వప్రయత్నాలు చేస్తున్నారు, సారాయి తాగవద్దని బోధిస్తే శిక్షించడానికి మొగంచెల్లక బోధకులు అల్లరి చేస్తున్నారనీ, జనులకు తాగేటందుకు స్వతంత్రత వుండాలనీ, దేనికీ నిర్బంధ ముండకూడదనీ, ప్రబోధకులమీద వుద్యోగులు తప్పుకేసులు పెట్టి నిర్బంధాలపాలు జేస్తున్నారు. వొకగడుసుప్రచారకుడిమీద తాగవద్దని నిర్బంధిస్తున్నట్లు కేసు పెట్టి విచారణ జరగడంలో యీక్రిందిసంభాషణ జరిగింది.

జిల్లామేజస్ట్రీటు — సారాయిదుకాణాలదగ్గరకు పోయేవాండ్లను నీవు నిర్బంధిస్తున్నావా?

ముద్దాయి — మాపేటలో దుకాణం నడివూళ్ళో వున్నది. చుట్టుపట్టల కాపురం

వుండే మాకు తాగుబోతులు తొందర జేస్తుంటే ఆపడానికి ప్రయత్నించిన మాట వాస్తవం.

జి—మే—దూరంగా బెడితే తాగేవాండ్లకువట్టు కిబ్బంది గాదా!

ము—తాగేసౌకర్యం తాగేవాండ్లవుసులు. మీరు చూస్తుంటే కాపురముండే వాండ్లసౌకర్యం వుసులూ నేను చూస్తున్నాను.

జి—మే—అందరిహక్కులూ కాపాడడం ప్రభుత్వంవారి ధర్మం మయివున్నది.

ము—చుట్టుపక్కల అల్లరులు లేకుండా కాపుర ముండటానికి మాకు వుండే హక్కును ప్రభుత్వమువారు. కాపాడవలెకాని తాగి అల్లరిచేసే హక్కును కాపాడవలసిన బాధ్యత ప్రభుత్వంమీద లేదు.

జి—మే—ప్రచారకులు చేసేబోధలవల్ల యెట్టినేరాలు జరుగుతున్నవో తెలుసునా? కులకట్టుకు వ్యతిరేకంగా తాగినవాడికి అలగాజాతులు నెత్తిగొరిగించి అవమానం జేశారట. యీసంగతి మాపార్లమెంటులోగూడా ప్రశ్నించారు. యీదేశంలోని మూఢాచారులకు నాగరకదేశాలు నవ్వవా?

ము—అవును. నవ్వుతవి. తాగవద్దని బోధించే పెద్దలను శిక్షించి ఖయిదులో బెట్టి నెత్తిగొరిగించి అవమానపరచిన ప్రభుత్వపుజాతివారు నవ్వినా నవ్వనియ్యి. తాము మోదించి అములులో బెట్టిస్తున్నచట్టాల అలగాజాతులుగూడా నవ్వేటట్టుగా వున్నదని పార్లమెంటు సభికులకు తెలియదుగామాలె. యిటువంటి నాగరికులచట్టాలకంటె మూఢుల ఆచారాలే యెక్కువ నీతిదాయకాలని నేస్పష్టంగా చెప్పగలను. రాజకీయ ప్రభువు వేస్తున్న శిక్షకంటె సంఘం అనేప్రభువువేసేశిక్ష యెక్కువఫలకారి, న్యాయమయినదినీ. ప్రభుత్వం వేసేశిక్షలంత కఠినంగా సంఘం వేసేశిక్షలుండవని నా అనుభవం.

ముద్దాయిని ప్రశ్నలడగడం దొరగారికి యిబ్బందికరంగా దోచి జామీను. వుత్తర్వు ఖాయం జేశారు. జామీ నివ్వడానికి ముద్దాయి నిరాకరించినందువల్ల స్వాతంత్ర్యరక్షకుడయిన మేజస్ట్రీటుగారు సంవత్సరం ఖయిదుశిక్షా, రాగిపడి వేసేముద్దాయి నారాయణరావుపంతులును సెంట్రలుజయిలుకు పంపారు. యిటువంటి కేసులు అనేక జరుగుతున్నవి.

---

## పదునాఱవ అధ్యాయం

## పొందు

ఆసహాయోద్యమంయొక్క విచిత్రచరిత్రతో మన కవసరం లేదు. కొన్నాళ్లు ఆటూ, కొన్నాళ్లూ పోటుగా వుద్యమం అడుగులు వేసింది. మహాత్ముడు కొంతకాలం వుపేక్ష అనే పంచమోపాయాన్ని అవలంబించాడు. యీ సంధికాలంలోగూడా చక్రం పనిజేస్తూనే వుండడంచేత యిదిగూడా యుద్ధకాలమనే, చెప్పవచ్చును. మాడరేట్లు కాంగ్రెసువర్గాలను బిగబట్టవలెనని ప్రయత్నించారుగాని మహాజనులు సాగనియ్య లేదు. మహాజనుల పరమావధులను గుర్తెరిగి గమ్యస్థానం చేర్చ నుద్యుక్తులయిన వారినే నాయకులనుగా గ్రహించే స్థితిలో జనులున్నారుగాని స్వామికార్యం స్వకార్యంగూడా చూసుకుందామని దూరంగా నిలిచి వీలయితే దోట్లుబెట్టి కొన్ని పండ్లు గోసి కొన్ని తమ

వుళ్లోకీ, వీలయితే కొన్ని దేశజనులకూ హక్కులు సంపాయింతా మనే నాయకులను గ్రహించరు. అందువల్ల కొందరు వృద్ధులూ, స్వార్థపరులూ, వెనుకంజ వేసినా చాలా మంది వుద్యమంలో నూతనంగా ప్రవేశించారు. దేశమంతా దౌర్జన్యరహిత మయిన మహాయుద్ధానికి తయారయింది. పునర్యుద్ధం ప్రకటించడానికి దేశం తయారయింది. నాయకులు ఆహవప్రకటన చేయక తప్పదని దేశం ఘోరసంగ్రామంలోకి దిగకపూర్వమే శాంతికి భంగం కలుగకుండా జేసి భారతీయులు జన్మస్వాతంత్ర్యముల నంగీకరించి స్వరాజ్య మియ్యవలసిందని ప్రభుత్వంవారిని కోరారు. ఇండియాలోని ఆంగ్లేయులూ, ఆంగ్లో హైందవులూ యింగ్లండు యికముందు భారతదేశంతో సంబంధం పెట్టుకోదలచు కుంటే వలసదేశముల స్వరాజ్య మియ్యవలసివుంటుందని నిశ్చయించుకొన్నారు. మాంచెష్టరు వర్తకులు మరింత ప్రోద్బలం చేశారు. అంతట దేశమునకు కాంగ్రెసుకోరిన ప్రకారము స్వరాజ్యం వచ్చింది కేంద్రప్రభుత్వం దేశమొత్తానికి సంబంధించిన వ్యవహారాలన్నీ చూస్తూ, భారత పార్లమెంటుకు జవాబు. చెపుతుంటుంది. హిందూస్తానీ పార్లమెంటుయొక్క సలహాప్రకారం బ్రిటిషుపార్లమెంటు విదేశపు వ్యవహారములు నడుపుతుంటుంది. త్వరలో బ్రిటీషురాజ్యంలో వుండే అన్నిదేశాలప్రతినిధులూ మహాపార్లమెంటు యేర్పాట్లుజేసి, హిందూస్తానులకు దగినప్రాతినిధ్య మియ్యడానికి యేర్పాటయింది. అన్నివిధములా హిందుస్తానమునకు బ్రిటీషు రాజ్యములోని అందరు భాగస్తులతోపాటు సమానహక్కు గౌరవములు గలిగినవి.

భారతీయులు దౌర్జన్యరహిత మయిన సత్యమార్గమున స్వరాజ్యమును సంపాదించి లోకానికి మార్గదర్శకు లయినారు. యీవిధంగా సంపాదించిన హక్కులను దేశక్షేమమునకు ప్రాచీనగౌరవ మనగా, తగినట్టుగా వుపయోగించ సంసిద్ధులుగానున్నారు.

హిందూస్తానముయొక్క ప్రాచీనవిజ్ఞానమూ, ఆధునికశాస్త్రపరిజ్ఞానమూ, వారి బుద్ధికుశలతా, సౌజన్యమూ, అనంతములయిన ఖనిజములూ, సమృద్ధమయిన పాడీ పంటా మొదలయినవన్నీ భారతీయులకు బ్రిటీషురాజ్యములోనేగాక ప్రపంచమంతటిలోనూ అగ్రస్థానము తెచ్చినవి. హిందూస్తానమూ, చైనా, జపానురాజ్యములూ మైత్రిగలిగి ప్రపంచమున ప్రాముఖ్యత వహించినవి ప్రపంచవ్యవహారనిర్ణయములకూ, విజ్ఞానమునకూ కేంద్రస్థానం పడమటినుండి తూర్పుకు జారింది.

---

## పదునేడవ అధ్యాయం

# విమోచనం

పార్లమెంటులో హిందూస్తానీ స్వరాజ్యచట్టం తీర్పకాంగనే, రాజకీయఖయిదీలందరినీ వొదిలిపెట్టారు. కేవల అసహాయోద్యమమునకు సంబంధించినవాండ్లనే గాక రాజకీయసంబంధముగల బందిపోట్లూ, పంజాబుకుట్రలూ, పాటకోద్యమం, మునిసిపాలిటీలూ, అడవిచట్టాలూ, మద్యపానం, సెటిల్ మెంటూ మొదలయినవాటికి సంబంధించిన యావత్తు కేసులలో శిక్షబడ్డవాండ్లందరూ రాజకీయ నేరస్తులుగానే యెంచబడి విడుదల జేయబడ్డారు. రణరంగములో జయమును బొంది యిండ్లకువచ్చే వీరులనువలె దేశీయులందరూ విడుదలయిన యావత్తుమంది ఖయిదీలను ఆహ్వానించి స్వాగతమిచ్చారు.

విడుదలైన రాజకీయనేరస్తులందరూ స్వరాజ్యపార్లమెంటును ఢిల్లీలో ప్రారంభించే రోజున అది దేశాని కంతకూ ముక్తిదినం గనుక జయిల్ఖానాలలోని యావత్తుమంది ఖయిదీలనూ విడుదలచేసి దేశీయులందరికీ ఆనందం కలిగించవలసిందనీ దేశంలోని ప్రస్తుత చిత్రపరిస్థితులవలన కలిగిన దారిద్ర్యమే అనేకములయిన నేరాలకు కారణ మయిందనీ పంచాయితీలు నశించి, పోలీసు న్యాయశాఖలు ప్రబలి, అన్యాయం పెడమార్గంబట్టిఅనేకులను కేవల కల్పితనేరాలకూ, సాంకేతిక నేరాలకూ, అక్రమంగా శిక్షించడంచేతనూ, స్వరాజ్యం లభించి నూతనపరిస్థితులు గలగడంతోటే వృత్తులు వృద్ధయి, ప్రతివాండ్లకూ న్యాయంగా జీవించడానికి అవకాశం కలిగి నేరా లాగిపోవడానికీ, దేశగౌరవము సంపాదించడానికీ అవకాశ మియ్యవలసిందనీ, దేశమంతా ఆందోళన కలిగించారు. దేశం సుముఖ మయింది. ఖయిదీ లందరూ స్వరాజ్యం రాంగనే తమకందరికీ జూబిలీ వస్తుందనీ, అప్పుడు యావత్తుమందినీ విడిచిపెడతారనీ ఉవ్విళ్లూరుతున్నారు. స్వరాజ్య పార్లమెంటు వారంరోజులకు ప్రారంభిస్తారనంగా హిందూస్తాన శాసనసభ జరిగింది. స్వరాజ్యం సంపాదించిన మహాత్మా మున్నగువారి దేశసేవను అభినందిస్తూ నొకతీర్మానమూ, స్వరాజ్యమిచ్చినందుకు ఆంగ్లపార్లమెంటుకు కృతజ్ఞతను దెల్పుతూ నొక తీర్మానమూ, పార్లమెంటు స్థాపించేరోజున యావత్తుమంది ఖయిదీలను వదిలిపెట్టవలసిందని ఒక తీర్మానముమాత్రం చేసి సభ అంతమైంది.

స్వరాజ్యపార్లమెంటు ప్రారంభించేదినం వచ్చింది. ఆరోజున దేశంలో అస్వతంత్రులు లేరు. కొత్తపార్లమెంటు రాకపూర్వమే రాష్ట్రీయ శాసనసభలు పురుషులతోపాటు స్త్రీలకు రాజకీయహక్కు లిచ్చినవి. నూతన శాసనసభలకు కొందరు స్త్రీలను సభికులగా యెన్నుకొన్నారు. ప్రారంభదినం పండుగగా భావించి జనులు వుత్సవాలకు ప్రయత్నం చేస్తున్నారు. శాసనసభికు లంతా ఖద్దరు దుస్తులు వేసుకొని సభలకు పోయినారు. ప్రతివాండ్లూ యిండ్లకు సున్నం, యెర్రమన్ను పట్టెలువేసి, అలికి ముగ్గులు బెట్టి తోరణాలు గట్టారు. వందలసంవత్సరాల నుంచి పరరాజుల హస్తగతమై దేహబలం, ఆత్మబలం కోల్పోయి చీడబట్టిన పయిరు వలె అణగారి కృశించిన మహాజాతి తిరిగి స్వచ్ఛంద మలయమారుతం తోలంగనే ఆనందంతో వుత్సాహపడుతున్నది. పూర్వరాజకీయ వ్యవహారాలలో పైతరగతుల పురుషులు మాత్రం జోక్యం కలుగజేసుకుంటుండేవాండ్లు. యిప్పుడా పరిస్తితులు మారిపోయి స్వరాజ్యసంపాదనలో స్త్రీలు పురుషులూ అష్టాదశవర్ణములవారూ, అన్నిమతముల వారూ పాల్గొని వుండడంచేతనూ, ముఖ్యంగా స్త్రీలు సాహసంతో తమపుత్రులనూ, బంధువులనూ, దేశసేవకర్పించి తాము స్వయముగా శ్రమపడి కారాగృహములకు పోవడమే గాకుండా, స్వరాజ్యసాధనకు ప్రథమకారణ మయినఖద్దరు నూలు వడికి వస్త్రములు నేసి స్వరాజ్య సంపాదనకు తోడ్పడ్డారు. అందుచేత స్వరాజ్య నిర్వహణంలో పాల్గొనడానికి వారి కెక్కువ అర్హత గలిగింది. పూర్వంమోస్తరు గాకుండా సంఘాభివృద్ధికెన్ని సంస్కరణలు సుతారంగా చేయవలసి వున్నవి. స్త్రీ లా పనికి మిక్కిలి తగియున్నారు.

అన్ని గ్రామాలకంటెను మంగళాపురంలో వుత్సాహ మెక్కువయింది. వూళ్లో వుండే అన్నికులాల పెద్దలూ బయలుదేరి విడుదలయిన సమయానికి నిడదవోలు వెళ్లి

పన్నెండు గంటలకు గేటుదగ్గిర కనిపెట్టుకొని కూర్చున్నారు. రామదాసూ, రంగదాసూ వీరదాసూ మొదలైన షుమారు నాలుగువందలమంది పెటిల్ మెంట్లకూ, కార్మిక సంఘాలకూ చెందిన వాండ్లున్నారు. అసహాయోద్యమ ఖయిదీలను, అదివరకే రాజమహేంద్రవరం కమాన్సెత్తడం చేత వాండ్లెవరూలేరు. గేటుదగ్గిరనుంచి అంతా పెద్ద వుత్సాహంతో బయలుదేరారు. రామదాస యతీంద్రుడు విజయపతాకం చేతపట్టుకొని నడుమ వస్తున్నాడు. వుభయపార్శ్వాలా వెంకటయ్య, రామానాయుడు పాదచారులైనడుస్తున్నారు. వారివెనుక మాలక్ష్మి వెంకటదాసుల ఆస్తికలు రెండుపెట్టెలలో పెట్టుకొని రంగదాసూ, వీరదాసూ మోసుకొని వస్తున్నారు. పుల్లప్పా. కామానాయుడూ జైలులో రామదాసువల్ల కారణంబొంది ముఖ్యశిష్యులైనారు. పుల్లప్ప రామదాసుతోపాటు విడుదల బొంది ఆయన కోరిక ప్రకారం రామదాసుకు ముందువైపున నడుస్తూ 'గురురాజుకుజై' అని కేకలు వేస్తున్నాడు రామదాసు దగ్గర జైలులో చదువుకొని, నీతిబోధను గ్రహించి, కారణమును బొందిన ఖయిదీలెందరో 'మహాత్మా గాంధికి జై' 'వీరబ్రహ్మం గారికీ జై' అని కేకలువేస్తూ చుట్టూ కమ్ముకొని నడుస్తున్నారు. అందరూ సరాసరి స్టేషనుకు వచ్చి యెవరివైపునకు వారు వెళ్లుతూ రామదాసుకు కులవివక్షత లేకుండా దండప్రణామం జేసి వెళ్లుతున్నారు. కాకినాడ పాసింజరులో రామదాసూ, వారి మిత్రబృందమూ బెజవాడ దాటి సత్తెనపల్లిలో దిగారు. మంగళాపురపు జనులు యిండ్లదగ్గిర కుక్క కావలి కూడా లేకుండా బయలుదేరి స్టేషనుకు వచ్చారు. చుట్టుపట్ల గ్రామాల వాండ్లుకూడా స్టేషనుదగ్గిరకు భజనలతో వచ్చారు. స్టేషను దగ్గిరనుంచి వుత్సవం బయలుదేదింది. కొందరు చితారు చేతబట్టుకొని బ్రహ్మంగారి తత్వాలు పాడుతున్నారు. మరికొందరు భక్తికీర్తనలు పాడుతూ భజనలు చేస్తున్నారు. పదకొండు గంటలకల్లా వూరుజేరి, వొకగంటసేపు వూరేగి, మునిపల్లెబోయి సందులు, గొందులు పర్యటనంజేసి రామదాసు తాలూకు పూర్వం వేలంబడ్డ యింటిదగ్గర అంతా ఆగారు. యిల్లు సున్నంగొట్టి తోరణాలు గట్టివున్నది. రామదాసును గృహప్రవేశం చెయ్యమంటే నిదానించాడు. వెంకటయ్య జేబులో వున్న దానపత్రందీసి 'యిది రంగడిల్లు. మీ పూర్వపు ఆస్తిలో సగం మధ్యఫలసాయంలో ౫౦౦ రూపాయలు అతని పేర బెట్టి మిమ్మను ఆస్తికి గార్డియన్‌గా యేర్పరచమని శేషించిన సగం సంగమందిరానికిస్తా' నని చెప్పి దస్తావేజు చేతికిచ్చాడు. అందుకు రామదాసు 'మీ ఔదార్యం మేర మీరిందని నాకు తోచినా, మీ యేర్పాటు యొక్క యుక్తాయుక్తములను విమర్శించడానికి నే సమర్థుడను గాను. మీ ఆజ్ఞ శిరసావహించి ప్రవేశిస్తున్నా' నని రంగణ్ణి చేతబట్టి నడిపించుకొని గృహప్రవేశం చేశాడు. సంగదాసు యొక్క సర్వతోముఖజ్ఞానం, అద్భుత త్యాగం, జోతీ. అప్పాదాసుల ప్రేమలీలలూ, మాలక్ష్మియొక్క మాతృవాత్సల్యం, వెంకటదాసుయొక్క కైంకర్యం, పితృప్రేమ ప్రశంసిస్తూ సెనలుజల్లి తాంబూలాలు పుచ్చుకొని అందరూ వెళ్లిపోయినారు. కోటమ్మగారు వృద్ధాప్యంచేత పక్కె రైలుదగ్గరకురాలేకక ఱ్ఱపాడుస్తూ వొగుడాకువలె జనసమర్థానికి దూరంగానడిచివచ్చి వెలుపలనిలుచున్నదనీ, మహాగందరగోళంలో ఆమెనూ యెవరూ గమనించలేదనీ,యెవరో రామదాసుతో చెప్పారు. అంబారవముతో అవుకై పసుగత్తు దూడవలె అమ్మా, అమ్మా అని కేకలువేస్తూ దాసు పసుగత్తి పండియెండినా బ్రహ్మతేజముచే ప్రకాశించే కోటమ్మగారిని యాభైగజముల దూరంలో చూచి తన తల్లిదండ్రుల పేరూ,

తనపేరూ చెప్పుకొని సాష్టాంగ దండప్రమాణం చేశాడు. కోటమ్మగారు శరీరం కృశించినా తగ్గని దూరదృష్టితో కనుల ఆనందభాష్పవర్షమును గురిపిస్తూ మా యోగీంద్రుని ఆహ్వానంచేసే భాగ్యం మాకు లభించింది. ధన్యులమైనా మన్నది. రామదాసులేచి కుశల ప్రశ్నములయిన తరువాత కోటమ్మగారింటికి వెళ్లారు. చూడవచ్చిన బయటిజనానికంతకు వెంకటయ్య భోజనప్రయత్నం అదివరకే చేయించాడు. అందరూ భోజనాలుచేసి రామదాసును సెలవడిగి తిరిగీ కళాశాలోత్సవానికి వస్తామని వెళ్లిపోయినారు.

---

## పదునెనిమిదవ అధ్యాయం

# కార్యక్రమం

స్వరాజ్యం లభించింది. హిందుస్థానీ పార్లమెంటుకు, రాష్ట్రపార్లమెంటుకు ఎన్నికలు జరిగినవి. స్వరాజ్య సంపాదనప్పటికంటె ఎక్కువశ్రద్ధతో దేశక్షేమానికై పనిచేయడానికి పూనుకొన్నారు. పార్లమెంటు సభికులు కేవల పోతవిగ్రహాలు గారు. తమ ధర్మాలు తాము గుర్తెరిగి దేశక్షేమానికి తోడ్పడవలెననే వుద్దేశ్యముతో వచ్చారు. వోట్లు యిచ్చేటప్పుడు దేశక్షేమమే ప్రధానంగా యెంచుకొని చేతులెత్తుతున్నారు. సభికులు తమయావత్తుకాలము పార్లమెంటుపనిలో నువయోగించవలెనన్నా, పార్లమెంటు ధనికులచేతిలో పడకుండా అన్నితరగతులవారు ప్రవేశించడానికి అవకాశమియ్యవలెనన్నా, యిగ్లండులోమోస్తరుగా సభికులకు తగినజీతాలు యియ్యంది వీలు లేదని గ్రహించి మర్యాదగా జీవించడానికి తగినగౌరవవేతన మేర్పరిచారు. అందువల్ల సభికులు స్వంతపను లున్నప్పుడూ యిష్టం లేనప్పుడూ సభకు రావడంమానుకోకుండా హాజరయితీరుతున్నారు. ఆంధ్రపార్లమెంటుకు స్త్రీ లెన్నుకోబడ్డారు. అనేకులు కూలిసభికులు వచ్చారు. ఏ పార్లమెంటులోను యింకా పక్షాలేర్పడలేదు. దేశానికి ముఖ్యంగా అవసరమైన విషయాలు అందరికీ స్పష్టంగా కనబడుతున్నవేగనుక, విశేష చర్చలు జరగడంలేదు. అనేకతీర్మానాలు ఏకాభిప్రాయంగానే వెళ్లిపోతున్నవి. ప్రథమ సంవత్సరంలో ఆదుర్దాకొద్దీ అమలులో పెట్టడానికి వీలైనవాటికంటె ఎక్కువతీర్మానాలు చేసారు. పూర్తిగా అమలులోనికి రావడానికి కొంతకాలము పట్టినా అందరియొక్క క్షేమము పార్లమెంటువారు విచారిస్తున్నట్లు స్పష్టపడుతున్నది. మొదటిసంవత్సరంలో యితరవిషయములలో చేసినతీర్మానాలు కాక దిగువతరగతులకు ముఖ్యంగా సంబంధించిన యీ దిగువశాసనాలు ఆంధ్రపార్లమెంటువారు చేశారు.

౧. ప్రథమతీర్మానం:—

ధర్మవిద్యకు సంబంధించియున్నది. విధిగా బాలికాబాలకు లందరూ విద్య నేర్చుకోవలసిందే. ప్రతివారు కొంతవృత్తి విద్యకూడా నేర్చుకోవడం అవసరం. ప్రతివూళ్లోను, పల్లెలలోను వుండే బాలబాలిక లందరకీ సామాన్యవిద్యా, వృత్తివిద్య నేర్పేవసతిగల బళ్లేర్పర్చడం చట్టంయొక్క గమ్యస్థాన మని వుపోద్ఘాతంలో నిర్ధారణ చేయబడ్డది. నిరుపేదలకు పుస్తకాలు, వ్రాతపనిముట్లు యివ్వడానికి ఏర్పాటుచేశారు. ప్రభుత్వమువారు తాము స్వయముగా బళ్లు పెట్టడమేకాకుండా మతసంఘాలు, యితరసంఘాలు బళ్లు

పెడితే వాటికి తగినంత ప్రోత్సాహ మియ్యవలసిందని, మతసంఘాలు పిల్లలకు తల్లి దండ్రుల యిష్టంలేనిదీ పరమతాలను బోధించగూడ దనీ నిబంధన ఏర్పడ్డది.

శాసనసభ సంబంధంగా ధర్మకర్తలను కొందరిని నియమించి ధర్మవిద్యానిధని ఒకనిధిని ఏర్పరచి అందునిమిత్తమై ఒకబడి పేరిటకాని పూరికేగాని యిచ్చినధనాన్ని పాలించి వృద్ధిచేయడానికి ఏర్పాటయింది.

౨. గ్రంథాలయాలు:—

పల్లెబళ్ళలో ప్రథమవిద్య పూర్తికావడంతోటే పైచదువుకు పోవడానికి శక్తిలేని వాండ్లకు విద్య అంతటితో అంత్యంగాకుండా గ్రామములలో పల్లెకూటాలు పెట్టించి వాట్లో గ్రంథాలు, పత్రికలూ వుంచడానికి చట్టాలేర్పడ్డవి. యీచట్టప్రకారంపల్లెకూటాలవిషయమై కొంత శ్రద్ధను గనుపర్చి కొంతఖర్చు భరించడానికి పూనుకొన్న గ్రామాలలో ముందు ఏర్పాటు చేశారు.

3. మద్యపానం:—

మూడవశాసనం:— మద్యపానానికి సంబంధించి వున్నది. మద్యపానం హిందూస్థానుల ఆచారాలకు, హిందూమహమ్మదీయులమితధర్మాలకు వ్యతిరేకం. నూతన పరిస్థితులవల్ల ఏర్పరుపబడ్డ దురాచారం మహాత్ము డేర్పరచిన అసహాయోద్యమం వల్ల నిలిచిపోయింది. మధుపానం నిషేధిస్తూ కఠినశాసన మేర్పరచారు. విదేశాలనుంచి వచ్చే సారాయిలూ, బ్రాందీలు అమితమైన పన్నులువేసి నిషేధించారు. మధువిక్రయంవల్ల సర్కారుకు కలిగే యావత్తునష్టము సర్కారువారే ఫ్యాక్టరీలు పెట్టించి యితరులు పెట్టించేవాటికి కల్లుసప్లయిచేసి కొన్నిదోహదాలవల్ల వెగటువాసన పోగొట్టి చెరకుపంచదారవంటి స్వచ్ఛమైన చక్కెర చేయించి పూడ్చుకొంటూ కొంతకాలంలో ఎక్కువ ధనంకూడా సంపాదించగలిగారు.

౪. శెటిల్ మెంట్లు:—

కొన్నిజాతులను నేరపుజాతు లని పేరుబెట్టి వాండ్ల కిష్టంలేనిదే అందరిని స్వస్థానభ్రష్టులను చేసి శెటిల్ మెంట్లలో నిర్బంధంగా వుంచడం వారి గౌరవమునకు నీతికి, అభివృద్ధికి భంకరం. అవి ఏర్పరచిన స్థానములలో కూలీలకు పోటీ ఎక్కువజేసి ఆర్థికపరిస్థితులను తారుమారు చేస్తున్నవి. అందువల్ల ప్రస్తుత శెటిల్ మెంట్లున్న స్థలములలో వ్యవసాయానికి లాయఖుగావుండే భూములు లేనప్పుడు వాటిని ఫారెస్టుభూములకు మార్చి కొత్తగ్రామాలను కట్టించవలసిందని, యితరచోట్ల వాళ్లకుబంజరుభూములను యిప్పించి జీవనం కల్పించవలసిందని, వారికి చేతిపనులు నేర్పించడానికి ఏర్పాటుచేయవలసిందని శాసన మేర్పరచబడ్డది. కూలీలను బానిసలుగాచూసే దేశాలకు వలసబంపడం మాన్పి మిక్కిలి సారవంతములైన లక్షలకొలది యకరములు బంజరుగావున్న విశాఖపట్టణం, గంజాం మొదలైనజిల్లాలకు వలస బోవడానికి యేర్పాటు చేయడంకొరకు శాసనసభ్యులు కొందరుగల వలసకమిటీ యేర్పాటు చేయబడ్డది. ప్రారంభదశలో కమిటీవారు శిఫారుసుచేసినవారికి వ్యవసాయం నిమిత్తం ద్రవ్యసహాయం చేయడానికి కూడా అవకాశ మియ్యబడ్డది.

౫. దరఖాస్తు నిబంధనలు:—

ఈనిబంధనలవల్ల కలపమానులు పెరిగే పెద్దవనంతరాలు తప్ప తక్కిన అడవు లన్నీ ఫారెష్టుతరగతినుంచి రివిన్యూతరగతికి మార్చి దిగువజాతులకు దరఖాస్తుల కిచ్చి అవసరమైనచోట్ల ప్రత్యేకంగ్రామాలేర్పరచి దానికి యితరచోట్లవుండే పోరంబోకు లను అతరాపుదార్లకు ముఖ్యంగా యివ్వవలసిందనే నియమం రద్దుపరచి, భూములు లేని జాతులకే యివ్వడానికి అనుకూలముగా దరఖాస్తురూల్సు మార్చబడ్డవి. సెటిల్‌మెంటు రద్దుచట్టం క్రింద యేర్పరచబడ వలసకమిటీవారే భూముల దరఖాస్తులు ఫైసలుచేయవల సిందన్నారు. ధనవంతులుగానీ, యిదివరకు భూములున్నవారుగాని దిగువజాతుల వాండ్ల ను లోబరచుకొని వాండ్లపేర భూములు లాలోచీగా దరఖాస్తు పొందగూడదనీ, అట్లా పొందితే బినామిదారు పన్నెండుసంవత్సరములలోగా అనుభవదారునకు కంపెన్సేషన్ యివ్వకుండా వలసకమిటీకి దరఖాస్తుపెట్టి స్వాధీనపర్చుకో వచ్చుననీ బినామీదారు స్వాధీనపర్చుకోకున్నా సర్కారుకు యే దరఖాస్తులయినా బినామీగా పొందబడ్డవని రుజువయితే పట్టా రద్దుపరచి యిరవయనాలుగు సంవత్సరములలోగా స్వాధీనపర్చుకొని యితరులకు దరఖాస్తులకు యివ్వవచ్చుననీ నిబంధన లేర్పడ్డవి.

౬. యిండ్ల చట్టము:—

దిగువజాతుల యిండ్లసమస్య చాలా ముఖ్యమైంది. మాలమాదిగెలూ, యెరుకల యేనాదులూ నివసించేవి యిండ్లుకావు. పట్టికలుగుడులు. వందలకొలది మనుష్యులు నివసించే మాలమాదిగె పల్లెలు కొన్ని గజాలలో యిమిడివున్నవి. దిగువజాతుల కుటుంబాలకు తగి నట్లు యిండ్లస్థలాలు దరఖాస్తుల కియ్యవలసిందనీ, మాలమాదిగెల పల్లెలకు సమీపములో పోరంబోకులు లేకపోతే రహితాధీనములను సర్కారువారు విక్రయించుకొని యిండ్లు కట్టించుకోగలవాండ్ల కియ్యవలసిందనీ, ద్రవ్యోపపత్తి బొత్తిగా లేనివాండ్లకు యిండ్లు కట్టుకోవడానికి వీలయినంతవరకు ధనసహాయ మియ్యవలసిందనీ, శాసన మేర్పడ్డది. యిటువంటి యేర్పాట్లే ప్రపంచంలోవున్న నాగరిక దేశాలన్నిటిలోను చేస్తున్నారు.

౭. నౌకరీ చట్టం దిద్దుబాటు:—

పైతరగతులవారు విద్యాధికులయి వుండడంచేతనూ, వున్నతవిద్య నేర్చుకోవ డానికి వారి కెక్కువ వసతులు వుండడమువల్లనూ, యింతవరకూ వున్నతోద్యోగాలన్నీ ఆక్రమించుకొని వున్నారు. దిగువతరగతులకు వారితో పోటీకి నిలువగల స్థితి యింతలో లభించేటట్టు కనుపడదు. అందుచేత ప్రస్తుతం పోలీసు, రివిన్యూ, సివిల్, పోష్టు, ఫారెస్టు మిలిటరీ మొదలయిన శాఖలలో వున్నత విద్య అవసరములేని చిన్న వుద్యోగాలన్నీ దిగువ తరగతులకు అపుడంచేసి వుంచవలసిందని వుద్యోగ నిబంధనలు మార్చబడ్డవి.

౮. కార్మిక సంఘ చట్టం:—

దేశంలో వృత్తులభివృద్ధి పొందడానికీ, కార్మికులు బాగుపడడానికీ కార్మికసంఘా లవసరము. కూలీలు పశువులవలె పని చేసేవాండ్లుగా వుండడం కంటె లోకపరిస్థితు లెరిగి తెలివిగలవాండ్లయి వుండడం మేలు. వాండ్లువొంటరిగా స్వాభివృద్ధికై చేసేప్రయత్నాలు సాగవు లోకంలో కూలీలు కూటా లేర్పరచుకొని పనిచేయడం నాగరిక లక్షణంగా యెంచుతున్నారు. పూర్వం మన దేశంలో చేతిపనులు చేసే వాండ్లందరూ శ్రేణులుగా,

యేర్పడి పనిచేసేవాండ్లు. వీటివల్ల కూలీల వర్తన, ఆర్థికస్థితీకూడా వృద్ధి అవుతవి. కూలీల సంఘముల పేర్లు, సభికులసంఖ్య మొదలయిన సంగతులు వ్రాసి వుంచడం అవసరం. సభికుల జ్ఞానాభివృద్ధి కివి యెంతో సహకారులు. యీ సంఘాలకు శాసన మూలకమయిన నిలకర మేర్పరచబడ్డది. యీ చట్టంప్రకారము యీ సంఘములధనం సభికుల బాకీలకుగాని, యజమానులూ, కూలీలూ తగాదాలుపడితే అందువల్ల యజమానులకు కలిగే నష్టాలకు గాని, సర్కారుకు అచ్చవలసిన యే విధములయిన రుసుములకుగాని, జవాబుదారీ కాగూడదు. స్వరాజ్య చట్టప్రకారం కూలీలకుకూడా వోటిచ్చే అధికారం రావడంచేత యెటువంటి కూలీలకు వోట్లియ్యవలసిందీ నిర్ధారణ చేయడం కష్టం యీ సంఘాలలో సభికులు కాదగినవాండ్లు కొంత యోగ్యతా, తెలివితేటలూ కలవాండ్లయి వుంటారు. కనుక కార్మిక సంఘాలలో మూడేండ్లు వరుసగా సభికులుగా వున్నవాండ్లూ, నెలజీతగాండ్లూ వోట్లిచ్చే అధికారం కలిగివున్నారు.

౯. ఖద్దరు చట్టం;—

చేతితో వడకడం, నేయడం నశించి యంత్రాలు బయలుదేరిన తరువాత పశ్చిమ దేశాలలో ధనిక కార్మిక సమస్యలు బయలుదేరి అర్థికపరిస్థితులను తారుమారుజేసి యెడతెగని కలహాలకు కారణమైనవి. పల్లెలు పాడుపడి పట్నాలయినవి. స్త్రీలకు జీవనాలు పోయినవి .పట్టణాలకు అనుబంధంగావుండే అనారోగ్యం, అనినీతి, ప్రబలినవి. పూర్వపు హిందూ గ్రామపాలనా పద్ధతి యీ సమస్యల కన్నిటికీ జవాబుచెప్పి సంఘ జీవితం వొడుదొడుకులు లేక సరళంగా ప్రసరించడానికి కారణ మయింది. ప్రస్తుత మా పదతి కొంతవరకు నశిండంవల్ల పాశ్చాత్యసాంఘిక జీవితానికి సంబంధించిన వికారాలన్నీ యిక్కడగూడా పొడజూపుతున్నవి. యివి కొంతవరకూ ఖద్దరు వృద్ధిచేయడంవల్ల అణగవచ్చు. సంఘానికి కూడూ గుడ్డా ముఖ్యావసరములు. ధాన్యం పురుషుడు పండిస్తాడు. స్త్రీ వండుతుంది. కొంతవరకూ వ్యవసాయపు పనులలోనూ సహాయం చేస్తుంది. స్త్రీలు వడుకుతారు పురుషులు నేస్తారు. యీపద్ధతివల్ల స్త్రీ పురుషులు వొకరికి చెయిజాచకుండా స్వతంత్రంగా జీవించడానికి అవకాశమున్నది. ఖద్దరు పోవడంలోనే స్త్రీకి పెండ్లి జీవితమార్గ మయింది. పెండ్లి లేకపోతే మర్యాదగా జీవించడమే కష్టము. యీ సత్యాన్నే పూర్వపు మోటుపాట వెల్లడిస్తుంది.

మగడెందుకే నారీ-మనకు-మగ డెందుకే
అసల్ మగ డెందుకే నారీ

౧. కదురూ చల్లంగుంటే కదిలిస్త గోల్కొండ మ.
౨. రాటం చల్లంగుంటె రప్పిస్త గోల్కొండ. మ.

రాటంయొక్క మాహాత్మ్యం శ్రీనాథకవినిగూడా ఆకర్షించింది.

౩. ఆకదురున శుకరవమును
ఆకదురున భృంగరవము - ఆత్మరవంబున్
యేకీకృతముగ యేకుల
నేకులు విన వడికె ముదిర - యే కులముదిరా ?

అని వర్ణించాడు. ఖద్దరుయొక్క వ్యాపకానికి భంగం లేకుండా వేయదగినంత సుంకం విదేశపునూలుమీద, వస్త్రములమీద విధించబడ్డది. నూలు మామూలుకంటె రోజుకు యెక్కువవడికి జీవనానికి చాలినకూలి సంపాదించడానికీ, సన్నపునూలుకూడా వడకడానికీ, రెండువిధాలయిన రాటాలు కనిపెట్టేటందుకు సర్కారువారు కార్ఖానా తేర్పరచి సుతారపుపనులు తెలిసిన శోధకులను నియమించి, పరిశీలన చేయిస్తున్నారు.

౧౦. ఫాక్టరీచట్టం:—

గిర్నీ కూలీలచేత రోజుకు యెనిమిది గంటలకంటే యెక్కువపని చేయించగూడదని, సదరుకూలీలకు గిర్నీలసమీపములో గాలి వెలుతురూ బాగా వచ్చే బారకాసులు యజమానులు కట్టించి యియ్యవలసిందనీ, వాండ్లపిల్లలచదువుకు తగిన సౌకర్యాలు చేయవలసిందనీ ఈ శాసనం జేశారు. గిర్నీకూలీలను సరిఅయిన కారణంలేనిదే తీసివేయ గూడదనీ, పనిచెయ్యడములో గాయాలు మొదలయినవి తగిలితే యజమానులు నష్టం కట్టియివ్వవలసిందనీ, చాలాకాలం పని చేసినవాండ్లు చాలించుకుండేటప్పుడు బహుమతిగానీ, పింఛనుగానీ యియ్యవలసిందనీ యేర్పరచారు.

౧౧. జయిలు కమిటీ:—

జయిలుపాలనము విద్యామంత్రి కియ్యబడ్డది. జయిళ్లు యిప్పటివలె నరక ప్రాయాలు గాక నేరస్థులను బాగుజేసి పౌరసత్వాలు చలాయించడానికి తగిన యోగ్యత గలిగించి జయిళ్లను, వృత్తివిద్యాలయాలుగా మార్చడపు వుద్దేశ్యంతో జయిలుపాలనం శాసనసభయొక్క వుపసంఘానికి యియ్యబడ్డది. ఖయిదీల విషయములో సంచార స్వాతంత్ర్యమునకూ, భోగాలనుభవించుటకూ దప్ప యితరవిషయము లలో అభివృద్ధి పొందడానికి ప్రతిబంధాలు కలిగించ గూడదని, తగినంత సదుపాయం కలిగించవలసిందని యీ శాసనముయొక్క తలంపు.

౧౨. దేశపాలనము:—

దేశపాలనావిషయిమయిన చర్యలు అందరికీ తెలియడంకోసం న్యాయస్థానా లూ శాసనసభలూ, జిల్లాసంఘాలూ, మునిసిపాలిటీలూ మొదలయిన సర్కారుకార్య స్థానాలు యావత్తూ తమ కార్యవిధానం దేశభాషలో జరుపవలసిందని చట్టంజేశారు. యీచట్టమే లేకపోతే ఆంగ్లభాష బాగా రానివాండ్లకు ప్రవేశమియ్యడమే తప్పు.

యింకా యితరచట్టాలుగూడా దిగువజాతుల అభివృద్ధికై చేయ నుద్దేశించారు. చట్టాలుచేయడంలో వుత్సాహం కనుపర్చడమే గాకుండా అవి జయప్రదంగా అమలు లోకి రావడానికిగూడా ప్రతిశాసనసభ్యుడూ ప్రయత్నిస్తున్నాడు. దేశాభిమానులయిన పెద్దలూ, పిల్లలూ, అనేకులు స్వరాజ్యంవలన ప్రయోజనం జనులకు పూర్తిగా కలి గించడానికి ప్రయత్నిస్తున్నారు. మహాజనులయొక్క క్షేమం తప్ప స్వక్షేమంయెవరూ ప్రధానంగా యెంచుకోవడం లేదు. శాసనసభలు చేస్తున్న అభివృద్ధియొక్క వేగం చూస్తే పదియేండ్లలో పూర్తిచేయవలయునని వుద్దేశించినపనిలో సగవంతు జరిగినా దేశం అతిశీఘ్రకాలంలో బాగుపడుతుందని తోస్తుంది. దేశక్షేమమే ప్రధానంగా యెంచి రాజకీయజీవితం నడిపేజాతికి ఫలాపేక్షలేని కర్మయోగమూ, మోక్షమూ సులభసాధ్యంగదా!

## పందొమ్మిదవ అధ్యాయం

# పెద్దబీగం

పంతులు పయికం యావత్తూ వసూలు చేస్తున్నాడు. అహోరాత్రాలు ఆయనకు అదే ఆందోళన. వెంకటయ్యా, రామానాయుడూ చేసినత్యాగానికి ఆయన కండ్లు మిరుమిట్లు గొన్నవి. తన యజమానులు మహాత్యాగం జేస్తే తాను చౌదరయ్యదగ్గిర తిరిగి స్వాధీనపర్చుకొన్న యీనాం తన అనంతరం నల్లమోతువారి ధర్మంలో కలిసేటట్లు దస్తావేజు వ్రాశాడు. ఆయనకున్న పొలమంతా అదే. దత్తు మానుకున్నాడు వూళ్లూళ్లా తిరిగి బాకీలు వసూలు చేస్తున్నాడు. కాలం సుభిక్షంగా వుండడంచేత బాకీలు, గవ్వలు రాలినట్టు రాలుతున్నవి. పంతులు మొదటనుంచీ నిరాధారులకు బాకీలు పెట్టేవాడు గాదు. నాలుగురూపాయిలు తీసివేసియినా దావాలు డిక్రీలు లేకుండా పయికంయావత్తూ వసూలు చేశాడు. విద్యాలయాలూ, కార్ఖానాలూ, వసతిగృహాలూపూర్తి అయ్యేసరికి మూడులక్షలు పట్టింది. సంగిమందిరానికి ఆనుకొని వున్న పశువులకొట్టాలూ, చొప్పదొడ్లూ, పాటిచేన్లూ, బీమాధవనాలతో నిండిపోయినవి. కొత్తమేడా, పురాతనపుభవంతీ విద్యాలయంలో పనిచేసే వుపాధ్యాయులు కాపురముండడానికి యేర్పాటయింది. ప్రస్తుతం పాఠయింట్లో తమనూ, వుపాధ్యాయులకింద నే లెక్కవేసుకొని రామనాయుడు, వెంకటయ్య సర్వసంగపరిత్యాగులయి లోకసంగ్రహాభిలాష మాత్రావశిష్టులయి లోకములో నివసించదలచి కాపురమున్నారు. భవనాలు పూర్తిగావడంతో ఓ తమతాలూకు స్థిరచరయావత్తైన యావదాస్తి ధర్మం క్రింద వర్తింపజేయడానికి ధర్మపత్రం వ్రాసేనిమిత్తం నారాయణరావుని పిలిపించారు. నరసింహారావు మునిపల్లెలో కాపురం బెట్టి విజయమందిరములో వుపాధ్యాయుడుగా చేరాడు. నారాయణరావు తనపని వదలి కళాశాలలో ప్రధానిగా వుండి కొంతసేపు బోధించడానికీ, పాలనవ్యవహారం నిర్వహించడానికీ అంగీకరించాడు. రామదాసు యొక్క కొట్టమూ, దానికి ఆనుకొనియున్న నల్లమోతువారిపొలమూ కలిపి వొక పెద్ద వుద్యానవనం జేసి దాంట్లో పర్ణశాలలు వేయించి దానికి తపోవనమని పేరుబెట్టారు. యిది మాలపల్లెకూ, వూరికీ మధ్య వున్నది. తపోవనమే రెంటినీ కలిపింది. పుల్లప్పా కామానాయుడూ జయిలునుంచి వచ్చి మంగళాపురంలో రామదాసువద్దిగనే శిక్షణ చేస్తున్నారు. పుల్లప్పా భార్య వసతిగృహములో వంటపనికి కుదిరారు. కామానాయుడిని కిందితరగతులకు పంతులుగా నియమించారు.

కోటమ్మకు అవసానకాల మయింది. ఆమెకు తండ్రి వ్రాసిఇచ్చిన పొలమంతా మాగాణై మంచి ఆదా వస్తున్నది. పదుంపడిలో ధర్మఖర్చు పోను మిగిలినది పెట్టి ఆస్తి పెంపుజేసింది, యావదాస్తి ఇప్పుడు సుదింపువేస్తే లక్షకి మిగిలింది. కోటమ్మతనకున్న ఆస్తంతా తపోవనానికి వ్రాసియిచ్చి దానివల్ల వచ్చే ఆదాయం తపోవనంలో నివసించి తపస్సు చేసుకుండే వాండ్లకు, ప్రస్థానత్రయం భాష్యాలూ పాఠం చెప్పే వాండ్లకూ, చదువుకుండే వాండ్లకూ జాతివిచక్షణ లేకుండా పోషణనిమిత్తం ధర్మంగా జరుగవలసిందని యేర్పాటు చేసింది, మాలక్ష్మి వెంకటదాసుల అస్తికలు తపోవనంలో భూస్థాపనచేసి తిరునాళ్లు కట్టించారు. కోటమ్మ తపోవనములో తనశరీరం భూస్థాపన చెయ్యమని కోరి అంత్యసమయములో తపోవనానికివచ్చి పర్ణశాలలో పరమపదించింది, ఆమెకోరికప్రకారమే సమాధి చేయించారు, ఆహ్వాదానుపాతకాలలో తయారయిన పందలకొలది దిగువజాతులపిల్లలు గిజయశాలాలలో చేరుతామని కోరిస్తున్నారు యితరవూళ్ల వాండ్లూ. ఆ సేవలు పందములూ యేమి

కలు యేనాదులు చదువుకుంటామని వస్తున్నారు.

వొకదినం రాత్రి యెవరో రామానాయుడిని నిద్రలేపారు. ఆయన నిద్రకండ్లతోవచ్చి యెవరని అడిగితే, 'జగన్నాథం మీకీ తాళపుచెవి యియ్య మన్నాడు. దీంట్లో పంచమోద్యమానికీ, పాటకోద్యమానికీ, హక్కున్న'దంటూ చేతికిచ్చి నిలువకుండా వెళ్ళిపోయినాడు. రామానాయుడూ, వెంకటయ్యా బీగాన్ని పరీక్షిస్తే సంగతి బోధపడలేదు. బీగం విలువగల లోహంతోనయినా చేయలేదు. రెండు మహోద్యమాలకు చేయబడ్డ యీధర్మంయొక్క గూఢస్వభావం వారికి గోచరించలేదు. తెల్లవారి పుల్లప్ప వచ్చి పెద్దమందిరానికి తాళం వేశారేమి, సున్నం గొట్టడానికి కూలీలు వచ్చి కూరుచున్నారని చెప్పితే, అన్నయూ, తమ్ముడూ వెళ్ళి పరీక్ష చేస్తే వల్లమాలిన తాళం వాకిటికి వేసున్నది. రాత్రి యిచ్చిన తాళపుచెవి దీనిదే అయివుంటుందని పెట్టిచూస్తే సరిపోయింది. తీసి లోపలికిబోతే వేయేసిరూపాయిలుగల వేయిసంచులు నేలమీద వరుసలుదీర్చి పెట్టివున్నవి. చాలాసేపటివరకూ యెవరికీ అంతుబట్టలేదు. నిర్ఘాంతపోయి బొమ్మలవలె నిలువబడ్డారు. రామానాయుడు జ్ఞాపకం తెచ్చుకొని రాత్రి తాళపుచెవి యిచ్చిన మనిషి జగన్నాథమియ్యమన్నాడని చెప్పినట్టున్నదన్నాడు. శ్రీ జగన్నాథుడయిన భగవంతుడే పల్లెమోతువారి ధర్మానికి మెచ్చి దానికి తోడుగా పంపివుంటాడని వెంకటసుబ్బయ్యన్నాడు. పంతులుగారు ఆలోచనంతా యెందుకని ఒక సంచీ వుచ్చులాగి రూపాయిలు కుమ్మరించాడు. దాంట్లో వొక చీటీవున్నది. దీని ఖులాసా యావత్తూ యీ కాకితం చెపుతుందని విప్పి చదివితే పంచమోద్యమానికీ, పాటకోద్యమానికీ సనాతనుల ధర్మమని లిఖించివున్నది. సరే యిది మనవాడి ధర్మమే జగన్నాథమంటే వెంకటదాసని పంతులన్నాడు. తక్కిన వాళ్ళు జగ్గడికి జై వెంకటదాసుకు జై అని కేకలు వినబడ్డవి. అన్యాయార్జితం యిటువంటి మహోత్కృష్ట ధర్మానికి వినియోగించవచ్చునా అని కొందరన్నారు. అన్యాయపు సొమ్ము దిన్నా గుండ్రింపులో బయటికి వస్తుందిగాని యిముడదని మరికొందరన్నారు. రామదాసు యెటూ చెప్పడానికి తనకు తోచలేదు. సాధనశుద్ధి తక్కువనుకొన్నా గోపన్నా తిరుమంగయాళ్వారు పూర్వంజేసిన కైంకర్యాలు పూజనీయంగానే యెంచబడ్డవన్నారు. రామదాసు నిషేధించకపోతే రూపాయిలు పనికివస్తవని అందరూ అన్నారు. ప్రతి సంచిలోనూ, వొకటేమోస్తరుగా రెండు వుద్యమాలకూ ధర్మమని వ్రాయడంచేతనూ, రాత్రి వచ్చినమనిషి బీగం రెండు వుద్యమాలకూ సంబంధించినదని చెప్పడంచేతను రెంటికీ చెరిసగంగా యివ్వడం న్యాయమన్నారు. దాని కందరూ అంగీకరించి అయిదు లక్షలప్పుడే వెంకటయ్యకు స్వాధీనపర్చి సనాతనధర్మమనేపేరుతో విజయకళాశాలకుపయోగించమన్నారు.

కార్మికోద్యమానికి యివ్వబడ్డ అయిదులక్షలధనం రామానాయుడు బెజవాడలో జరిగిన ఆంధ్రకార్మికమహాసభకు తీసుకొనిపోయి వొప్పజెప్పాడు. ఆసభకు ఫిర్కాకొక్కరిచొప్పున కార్మికసంఘాలచేత నియమితులయిన ప్రతినిధులు వచ్చారు. ఆసభలో కొత్తచట్టాలప్రకారం కార్మికులకు గలిగిన సౌకర్యాలు లెక్కచూచుకొని ప్రభుత్వం వారికి కృతజ్ఞతాభినందనాలు తెలిపి రైతులూ, గిర్నియజమానులు స్వయంగా తమకు యియ్యదగినకూలీ పంపిణీ ఏర్పరచి వెంటనే ఆప్రకారం జరుపవలసిందని గిర్నిసంఘాలకు, రైతుసంఘాలకూ తెలియపర్చారు. ఆసభలో రామానాయుడు గారిని ఆంధ్రకార్మికమహాసంఘానికి కార్యదర్శిగా ఏర్పరచి కార్మికసంఘాలతోనూ రైతుసంఘాల

PADMA

తోను ఉత్తరప్రత్యుత్తరాలు జరపడానికీ. సభలో ఏర్పరచినకూలి కంపెనీలు ఆయనకు యుక్తమనితోచిన స్వల్పమార్పులతో రాజీకుదర్చడానికి అధికారమిచ్చారు. నాయుడు గారు రయితుసంఘాలూ, గిర్ని సంఘాలూ కలిసి చేసుకొన్న మహాసభకు వెళ్లి కొంచె మించుమించుగా సంగదాసువేసిన పుజ్జాయింపుప్రకారం రాజీకి వొప్పుకొని వచ్చాడు. రామానాయుడు ఆంధ్రకార్మికసంఘానికి కార్యదర్శి అయినతరువాత తానదివరకు భూస్వామిగా శాసనసభలోకి వెళ్లివుండడంచేత తనపదవిని వొదులుకున్నాడు. కార్మిక సంఘాలు తనకు శాసనసభలో వున్న స్థాన మొకటి వెంటనే ఖాళీచేయించి ఆయనను ఎన్నుకొన్నారు. నారాయణరావు శాసనసభలో మందిసొమ్ముతో కట్టించబడ్డ ప్రతి ప్రతిష్ఠాపనలోను దిగువజాతులకు ప్రవేశ ముండవలయు నని తీర్మానం పెట్టి రామానాయుడు కూలీలకూ, యజమానులకూ రాజీకుదుర్చుతూ సభకు రానందున తక్షణం ఆతీర్మానం ఫయిన లయ్యేవరకయినా వచ్చిపోవలసిం దని టెలిగ్రామిస్తే వెళ్లి కార్మికశాలల ప్రవేశమహోత్సవానికి మంచిముహూర్తం అయిదురోజులలో వున్నదని తంతిరావడం చేత తీర్మానంగ అభిప్రాయభేదం లేకుండా మంత్రులంగీకరించినందున నారాయణ రావును తీసుకొని వెంటనే యింటికి వచ్చాడు.

---

## ఇరువదవ అధ్యాయము

## మోహనరావు

మోహనరావును మంచం వదిలిపెట్టి చాలాకాలమయింది. మాంబళంలో కమలమ్మా శిశువూ చనిపోయినా రని తెలిసినతరువాత ఇంటికి వచ్చాడు. అంతకుముందే బలవం తంగా పెండ్లి చేశారు. చెన్నపట్నంనుంచి వచ్చి యింతకాలం ఇంటిదగ్గర నేవున్నాడు [illegible]గానే మళ్లీ కాలేజీలో చేరవలసిం దని అన్నా, తల్లీ బలవంత పెట్టారు. పోవడమంటే మనస్కరించలేదు. తలంచుకున్నప్పుడెల్లా జమీందారీపాయాగా కాపురం చేస్తున్న కమలమ్మను దిక్కుమాలిన పిడుగులబండ్లలో మోసుకొనిపోవడానికి తానే కారకుడ నని మనస్సుకు వచ్చేది. సుఖంగా నడుస్తున్న కాపురం చెరిపి, రామానాయుడికీ, సాహుకూ తన అనువుమాలిన పనివల్ల ద్రోహం చేశా నని దుఃఖించాడు. రామానాయుడిని క్షమించ మని అడుగుదా మనుకున్నాడు, గాని ఆయన ఔదార్యంతో క్షమించినా అంత పెద్దకోరిక కోరడం తనకు భావ్యం గా దనుకున్నాడు. ఇంతవరకూ చెన్నపట్నం గానీ, మంగళాపురం గాని తొక్కిచూడలేదు. గుంటూరు, తెనాలి చెన్నపట్నంపొయ్యే రైళ్లెక్కడమంటే గుండెల్లో దడలుబుట్టేడివి. వొకండ్లతో మాటా, పలుకూ మాని పొద్దుపోకలా తనగదిలో నిర్విణ్ణుడయి కూర్చుండేవాడు తల్లికీ, అన్నకూ మద్రాసులో యెవరితోనో సంబంధమున్న దనిమాత్రం తెలుసు. ఫలానా అని ఎవరూ యెరుగరు. ఇతని అవస్థచూచి భయపడి భ్రమతీరేదాకా ఆమనిషిని మదరాసులో రహస్యంగా ఇతని దగ్గరవుండడమో, లేక యిక్కడకు తీసుకురావడమో చేస్తే బాగుండునని అన్నాతల్లీ ఆలోచించివొకనాడు రహస్యంగా ప్రస్తాపించారు. కదిలించినప్పుడల్లా మోహనరావు యేదోపడంతప్పు జవాబు చెప్పేవాడు గాదు. అతనిని బాధిస్తున్నది అపకీర్తి భయం గాదు; కమలమ్మమీది మోహమూ గాదు. అతని మనస్సే అతనిని బాధిస్తున్నది. శల్యాలంటబోతున్నది, అన్నా, తల్లి అనేకవిధాల చెప్పి చూశారు. కార్యం లేక పోయింది. వొకనాడు తలుపువేసుకొని గదిలో కూర్చొనివుండగా తల్లి సందులలో

PADMA

గుండా చూస్తే యేడుస్తున్నాడు. నెలలు గడిచినకొద్దీ మనిషి క్షీణించడమేగాని దిగులు మాయలేదు. క్రమంగా బయట తిరగడంగూడా మానివేశాడు. అత్తవారికి తెలిస్తే చదువుమానాడేమని అంటారని తల్లి బలవంతపెట్టి కలకత్తాకు చదువుకుపోవడానికి ఒప్పించింది. రాజారావు చదువు మానిపించడమే మంచి దంటాడు. తల్లి, కొడుకూ మల్లగుల్లాలుపడి చివరకు కలకత్తాలో లాపరీక్ష చదవడానికి పంపారు. కలకత్తాకుపోయిన కొద్దిరోజులకే కాపురానికిరాని భార్యా, తల్లి చనిపోయినారు. అంతట చదువు చాలించి యింటికి వచ్చి అన్నా, తనూ వేరుగాబడి, తనభాగపుపొలాలు కౌళ్లకిచ్చి ముశాదలాగా మక్తాపుచ్చుకొని. లోకులవల్ల రావలసిన పైకం వచ్చినమట్టుకు వసూలు పెట్టుకొని, యావత్తూ బ్యాంకిలోవేసి దేశాటనం బయలుదేరాడు. మనశ్శాంతిమాత్రం కుదరలేదు. రెండుమూడుసార్లు యింటికివచ్చినప్పుడు పెండ్లిచేసుకొమ్మని, లేక తన చిన్న కొడుకును దత్తు చేసుకొమ్మనీ అన్న బలవంతపెడితే యేదీ తనకక్కరలేదన్నాడు. వొకమాటు కాశీరామేశ్వరాలు పాదచారిగా పోయినాడు. సరయూనదిలో స్నానం చేశాడు. బృందావనంలో చాలాకాల మున్నాడు. హరిద్వారం పోయి గురుకులం జూచి అక్కడనుంచి బయలుదేరి అసహాయోద్యమ ప్రారంభదినాలలో సబర్మతిఆశ్రమం చేరాడు. మహాత్ముని సాంగత్యం కలిగినతరువాత కొంత మనశ్శాంతి కలిగింది. యితర విషయాలతో జోక్యం కలిగించుకోక ఖద్దరు వడకడం నెయ్యడంతో కాలం బుచ్చుతున్నాడు. మహాత్ముడు కారాగృహంలో ప్రవేశించినతరువాత కొంతకాలం యంగిండియాపత్రికకు వ్రాస్తూవచ్చాడు. మనిషికి రుగ్మత యేర్పడ్డది. క్రమంగా క్షయలోకి దిగింది. మనిషి బొత్తుగా క్షీణించాడు. యౌవనంలో చూచినవాం డ్లితని గుర్తించలేరు. నిజంగా ఆమోహనరావే కాదు. నిరంతరం వ్యాకులంవల్ల అకాలవృద్ధాప్యం గూడా వచ్చింది. శరీరం పాలిపోయి సన్నంగా బక్క దయినాడు. తుమ్మెదరెక్కలవంటి మీసాలూ, ముఖచంద్రుని ముద్దులాడే ముంగురులూ, పైత్యదారుణంచేత జిగిచెడి పలితరోగికి పడ్డట్టు తెల్లబడ్డవి. చెంపలూ, గవదలూ జారినవి. ముఖమంతా ముడతలుపడ్డవి. గిచ్చుడుపడ్డనిడుదండలూ, రొమ్మూ, తొడలూ వొదులై అల్లల్లాడుతున్నవి. ఆకటింటాలలో వచ్చిన యౌవనపు పొంగంతా ఆరిపోయినది. సర్వాంగాలు శిథిలమై ఆతేజమూ ఆనిగనిగలూ ఆచెలువూ, ఆమోహనరూపంయొక్క సొగసూ అన్నీ మలిగిపోయినవి. కండ్లూ, పండ్లూ, ఆగుండ్రనిముఖంమాత్రం సహజసౌందర్యాన్ని విడువలేదు.

ఒకరోజున మరుపుజొచ్చిన అద్దం చూచుకున్నాడు. తనలో కలిగినమార్పు మూర్తీభవించినట్టు కనబడ్డది. కాలం యెంతచౌర్యం చేసిందో కనుక్కున్నాడు. పెండట కాలమే ఆతనిమోహనరూపాన్ని ధ్వంసంచేసింది. ఆసౌందర్యాన్ని అదే తీసుకుపోయింది రోజా ఒకచిన్న మొగ్గగా మొటకరిస్తుంది. నాలుగురోజులకు యెర్రనికొరకంగాడ లోనుంచి బయటికి కనబడుతుంది. వికసించి వివిధములయిన రంగులూ, తావులూ, కాంతులూ, విరజల్లుతుంది. అక్కడనుంచి వాట్లిపోవడం ప్రారంభిస్తుంది. రెక్కలు యెండి బొగిలి రాలిపోతవి. కాలం వెర్రిదా యేమి? సర్వం సిద్ధం చేసుకొని పోరదోసి పరుగెత్తుతుం దెందుకు? ప్రేమా? లేక వార్ధక్యలేనితనమా యీ విపరీతచర్యకు కారణం? పిల్లలు యిసుకగూళ్లు కట్టుకొని ఆడుకొని తొక్కి పరుగెత్తుతారు. కాలం వొక్క రోజాపువ్వునేగాదు. బ్రహ్మాండాలన్నీ యిట్లాగే పాడుచేస్తుంది, కాలుడిచని చంపడం మాత్రమే కాదు; సృష్టిచేసి పెంచేడమూ ఆతడే. కాలుడు త్రిమూర్తిస్వరూపుడు, అయితే యింతగొప్పవాడికి పిల్లచేష్ట లేమిటి? మళ్లీ పురాణపురుషు డరుపేం. పిల్లల

మో స్తరుగా యెప్పుడూ ఆడుకుంటూనే వుంటాడు. అవి లీలలు.

మోహనరావు వుయిలు వ్రాసి, లకోటా చేసి, ఫలానావారికి పంపవలసిందని ఆశ్రమవాసుల కిచ్చాడు. కాలుడు వొకవాడు వుదయం మోహనరూపాన్ని మరి యేమి చేయించుకోవడానికో చెడగొట్టాడు. ఆశ్రమ వాసులు వుత్తరక్రియలు జరిపి, మరణ రిజిస్టరు నకలుతో వుయిలు జతపరచి, కవరు రామానాయుడిపేర రిజిష్టరుచేసి పంపారు. కార్మిక కళాశాల ప్రారంభోత్సవదినమే అందినది. తెరచి చదువుకుంటే యీ విధంగా వున్నది.

“ప్రస్తుతం సబర్మతీ ఆశ్రమవాసుడయిన మోహనరావు వ్రాసినవుయిలు నా మరణశాసనం. నాకు క్షయరోగంవల్ల మరణం ఆసన్నమయింది. నాకు గుంటూరుజిల్లాలో పెదప్యాలుదాఖలా వుండే స్థిరాస్తి, మద్రాసుబ్యాంకిలో వున్నరొక్కం మొత్తంషుమారు రెండులక్షల కిమ్మతుగలది మంగళాపురంలో నల్లబోతు రామానాయుడుగారు కట్టించిన కార్మికకళాశాలకు ఖర్చునిమిత్తం ధర్మంగా యిచ్చివేయబడ్డది. నాయుడుగారేదీనికి ధర్మకర్తగావుండవలసింది. మనశ్శాంతికై యీ వుయిల్ నామూలోని యేర్పాట్లు చేయబడ్డవి.”

---

ఇరువదియొకటవ అధ్యాయం

## విజయ కళాశాల

విజయకళాశాల ప్రారంభోత్సవ దినం వచ్చింది. దేశములో దిగువజాతుల యెడ సానుభూతిగల నాయకులందరికీ ఆహ్వానాలు పంపించారు. దూరపుటూళ్లనుంచీ సమీప గ్రామాలనుంచీ జనులు తిరునాళ్ల ప్రజగా వస్తున్నారు. వచ్చినవారి కందరికీ వసతు లేర్ప రచబడ్డవి. ఇంతటి వుత్సవం మంగళాపుర మెన్నడూ చూడలేదు,

వూరంతా వైభవంగా అలంకరించారు. మాలమాదిగె పల్లెలు సంగదా నేగ్వరచిన నమోనా ప్రకారం వీధులు తీర్చి కట్టివుండడంచేత మేడలు, భవంతులూ లేకపోయినా, గాలికొంపలు గాకుండా చిన్నవయినా గట్టియిండ్లూ, చుట్టూ ఆవరణమూ, నీడ చెట్లూ చూడడానికి ముచ్చటగా వున్నవి. వీధులన్నీ మెరకపల్లాలు చదునుచేసి వూడ్చి నీళ్ళు జల్లారు. గోడలకు వెల్లవేసి యెర్రమన్ను పట్టెలు బెట్టారు. కళాశాల ఆవరణ మంతా పూరి తోపులలోవున్న తాటాకంతా గొట్టి ఫర్లాంగుమేర పందిళ్లు వేయబడ్డవి. వూరం తటా పచ్చతోరణాలెంతో ముచ్చటగా కట్టారు. దేవునిపెండ్లి కందరూ పెద్దలేనని వూరి వారందరూ స్వంతకార్యంగా భావించుకొని అతిథులకు మిక్కిలి ఆదరణా, వుపచా రాలు చేస్తున్నారు.

భోజనపు యేర్పాట్లు అద్భుతంగావున్నవి. వచ్చినవారికివచ్చినట్లుగా విధీవిరామం లేకుండా వడ్డనలు జరుగుతున్నవి. నవకాయ పిండివంటలూ, నాలుగుకూరలూ అంతస్తుల భేదంలేకుండా అందరికీ వడ్డిస్తున్నారు. తక్రాంతమందు చక్రధర్మ స్మరణలకు తెంపులేదు.

వూరు వుల్లాసాగుతున్నా తపోవనం నిశ్శబ్దంగా వున్నది. తరు లతా గుల్మ ములూ, వానిమధ్య చిన్న పర్ణకుటీరములూ దప్ప మానవనిర్మితము లయిన భవనములం దేమీ లేవు భోజనాలయి పొద్దుతిరిగిన వెంటనే తపోవనములో ప్రతి చెట్టునీడనూ పురాణశ్రవణము జరుగుతున్నది. కొందరు తత్వాలు పాడుతున్నారు కొందరు పర్ణశా లలో యోగసమాధిని మగ్నులయియున్నారు. మరికొందరు భక్తిపారవశ్యంతో నామ సంకీర్తనం జేస్తున్నారు. యిది అంతా పూర్వము నైమిశారణ్యములో జరిగినట్లు వర్ణింప బడె సత్రయాగమునకు సరిపోలుతున్నదని చాలామంది అభిప్రాయపడ్డారు.

నాలుగవజాము ప్రవేశించింది. కళాశాలలో మహాసభ జరుగుతుందని తప్పెట వేశారు. జనం పందిరినిండా కూర్చుంటున్నది, సభాపతి యెవరయిందీ ప్రకటించలేదు. యిదివరకు యెవరినీ అందునిమిత్తమయి ఆహ్వానించలేదు. కళాశాల ప్రారంభ ముహూర్తము సమీపిస్తున్నదనంగా, పందిరిమధ్యన యేర్పరచివున్న వేదికమీదికి రామానాయుడు వచ్చి యీరోజు జరగబోయే సభకు త్రిగుణాతీతుడునూ, స్థితప్రజ్ఞుడునూ, వేదాంతవేదియూ నయిన రామదాసమహర్షి అధ్యక్షుడుగ నుండవలెనని తీర్మాన ముపపాదించాడు. నారాయణరావు ఆమోదించాడు. సభలో హర్షధ్వానలు చెలరేగినవి. పక్కన కూర్చున్న నరసింహారావు రామదాసును లెమ్మంటున్నాడు. రామదాసు నేనా, నేనా నావల్లకాదంటూ లేవకుండా కూర్చున్నాడు. వెంకటయ్య సమీపించి రెక్కపట్టి లేవదీస్తే కొంచెముసేపు పెనిగి విధిలేక వేదికమీదికివచ్చి కూర్చున్నాడు. కార్యక్రమం ప్రారంభమయింది. దైవప్రార్థన అయిన తరువాత రామదాసు నిలువబడి ప్రారంభోపన్యాసం మొదలుపెట్టి కర్మయోగమును గూర్చి విపులంగా వుపన్యసించాడు. దాని సారాంశమిది.

జ్ఞానకర్మ భక్తియోగములు ఆత్మోపలబ్ధికి సాధనములు. సత్యాసత్య జ్ఞానము గలిగినతరువాత యోగి నిష్కామకర్ముడై అనన్యభక్తిని పొందగలడు. భక్తియోగము గూడా అనన్యభక్తికి సాధనమే. ప్రేమను మించినది లేదు,

సన్న్యాస మనగా కర్మఫలాపేక్షను విడవడంగాని కర్మలను విడవడము గాదు. జీవించి వున్నంతకాలం యెవడూ కర్మలను విడవలేడు. శరీరపోషణకై ప్రతివాడూ పాటుపడవలసినది. యేదోవిధంగా సంఘసేవ చేయనిదీ యెవడూ దానిచేత పోషింపబడటానికి అర్హుడు గాడు. సంఘముతో సంబంధము విడిచిన అవధూతకుమాత్ర మీనియమము వర్తించక పోవచ్చు. కాని ఆత్మోపలబ్ధికి కర్మయోగము ఉత్తమమార్గము. ఉత్తములైన యిద్దరు కర్మయోగులనుగూర్చి మీకు విన్నవించకోరుతున్నాను. పేర్లు చెప్పినందుకు వారు నన్ను మన్నింతురుగాక! శ్రీరామానాయుడు గారియొక్కయు, వెంకటయ్యగారియొక్కయు ఆత్మసమర్పణము అద్వితీయము.

"ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబక" మ్మని శ్రీమద్రామాయణములో చెప్పారుగాని యీకాలములో దృష్టాంతరము వీరియందుమాత్రమే కనబడుతున్నది. వీరి మహాత్యాగమువలన ఆంధ్రదేశములోని దిగువజాతులు వున్నతపరిస్థితులు రాగలవనినమ్ముతున్నాను. నాయుపన్యాసములో మీరీరోజు చేయదలచుకొన్న మహాకార్యమునకు అడ్డము రావడమునా కిష్టములేక యింతటితో విరమిస్తున్నాను. తరువాత నారాయణరావు తీర్మాన ముపపాదింపవలసినదని వెంకటయ్యను పిలిపించాడు. రామానాయుడు అరుగుపైకి వచ్చి యీక్రిందితీర్మాన ముపపాదించాడు.

విజయకళాశాల అనే గురుకులమునకు మౌనిచంద్రుడగు రామదాసుగారు కులపతిగానూ, నారాయణరావుగారు ప్రధానిగానూ, వెంకటయ్యగారు ధర్మకర్తగాను వుండవలయు నని సభవా రభిప్రాయపడుచున్నారు.

నరసింహారావుగారు తీర్మాన మామోదించారు. సభికు లందరూ హర్షధ్వానులతో అంగీకరించారు. రామానాయుడుగారు మరల వేదికమీదికి వచ్చి తనయొక్కయు వెంకటయ్యయొక్కయు జీవనార్థము వుంచుకున్న ౧౦ యకరములు గాక శేషించిన తమతాలూకు స్థిరచరరూపకమయిన యావదాస్తిని విజయకళాశాలకు ధర్మముగా వ్రాసి యిచ్చిన దానపత్రమునూ, మోహనరావు పంపిన వుయిలు నామాను సభికులకు చదివి వినిపించి వెంకటయ్యకు వొప్పగించాడు. వెంకటయ్య కుమార్తెలకు పసుపుకుంకుమక్రింద

యియ్యబడిన ౨౫ యకరముల మాగాణీభూమినీన్నీ వారు, నల్లమోతువారిఆస్తి పవిత్రమైన హోమద్రవ్య మనియు, అది యంతయు వారు తలపెట్టినలోక సేవ ఆ నేమహాయజ్ఞ నిర్వహణార్థమే వుపయోగపడవలయు ననియు, తమ అనంతరము ఆ ఆస్తిఅంతయు విజయకళాశాల చేరవలయుననియు ధర్మపత్రము వ్రాసి వెంకటయ్యచేతి కిచ్చారు.

పంతులు తరువాత వేదికమీదికి వచ్చాడు. యెందుకు వచ్చేదీ యెవరికి తెలియు లేదు. గద్గదస్వరముతో యీయజ్ఞవేదికపై అడుగుపెట్టుటకు తన కర్హత లేదనియు, సంగదాసు మరణించేటప్పుడు మనమే గెలుస్తామని సంధిసమయములో అన్నాడనియు, అది సంపూర్ణంగా యిప్పటికి నెరవేరిన దనియు, తన అనంతరము తన ఆస్తిఅంతయు సంగకళాశాలకే చేరవలసిందనియు, తాను జీవించియున్నంతకాలము వుచితముగా కళాశాలలో గుమాస్తాగా పనిచేస్తా ననియు చెప్పగా అంతా సంతోషించి ఈ చివరజరిగి నది సంగవిజయమునకు కిరీట మన్నారు. సభ ముగిసింది. మరునాడు యెక్కడివారక్కడికి పోయినారు.

---

## ఇరువది రెండవ అధ్యాయం

# ముగింపు

విజయ కళాశాల రోజుకు రోజుకు వృద్ధవుతున్నది. ఆంధ్రదేశములో దిగువ జాతుల అభివృద్ధికి కేంద్రస్థానమైనది. పిల్లలు పుస్తకములనుండి చదివినేర్చుకొనుదానికంటె విద్యాలయము నడుపుతున్న ఆదర్శ పురుషులయొక్క సుందర జీవితములనుండి ఎక్కువ గుణపాఠములను నేర్చుకొని ఆంధ్రదేశమునకు నాయకులవుతున్నారు. లోక సంగ్రహమునకై మీదుకట్టబడిన రామానాయుడు వెంకటయ్యల జీవితములు రోజులు గడచిన కొద్ది పండిపోతున్నవి. వారిద్దరూ తమకు అట్టిపెట్టుకున్న భూములను వ్యవసాయము చేసి జీవనముగడుపుకొంటూ శేషించిన కాలమంతా కార్మిక పంచమోద్యమాలను వినియోగించుతున్నారు. వెంకటయ్య చుట్టమాత్రము మానివేశాడు గావి, ములుకర్ర చేతబట్టుకొని బారులుంగలు వేస్తూ వ్యవసాయమునకై పొలంబోవడం వృద్ధాప్యం వచ్చేవరకు మానలేదు.

రామానాయుడు మునుపు చేనికి కోతకుబోయినప్పుడు స్వయముగా నేర్చుకొన డానికి ఉవ్విళ్లూరిన విషయములన్నీ స్వానుభవానికి వచ్చినవి. మునుపటి వొంటి మెత్తదనము లేకపోయినా హృదయం యెక్కువ కోమలమై అలంకారము దెచ్చినవి.

రామదాసు కళాశాలలో మగ్గము వొక మూలబెట్టుకొని ప్రతిరోజు కొంతసేపు నేతనేసి వచ్చినకూలితో తన జీవనం గడుపుకుంటున్నాడు. యెడతెగక వినబడుతుండే ఆయన మగ్గపు పలకదెబ్బలయొక్క లయ, నిరంతరము ఆయన పొందుతుండే నాదానందముతో సమ్మిళితమౌతున్నవి. ఆయన జీవిత కాలముయొక్క సాయంసమయమున, కాయగుడ్డలు ధరించి ఆ సమయ సూర్యునివలె బ్రహ్మతేజంతో వెలుగొందుతుండేవాడు. ఆయన ప్రతిరోజూ రేపూమాపూ పూరగొండెక్కి తిరుగుతూ, కొన్నిరాత్రులు కొండమీదనే పండుకొంటూ వుండేవాడు. తరువాత ఆయన కళాశాలకూ, వూరికీ రావడం మానివేశాడు. యేమయినాడో యెవరికీ తెలియదు. సిద్ధుడయి కొండగుహలలో యెవరికీ కనపడకుండా నిరంతర ధ్యానపరుడైయుండి పరబ్రహ్మములో ఐక్యమయినాడని పెద్దలు చెప్పుకుంటారు.

రామదాస యతీంద్రుడు విజయ కళాశాలలో కులపతిగా నున్నప్పుడు కొందరు

సనాతనాగ్రేసరులు హరిజనులు కాలక్రమమున ద్విజాతులుగ జన్మమెత్తక షోడశసంస్కారముల చేత పవిత్రీకరింపబడని శరీరములతో ముక్తినొంద సాధ్యమగునా యని ప్రశ్నింపగా వారు వేదములు ముఖ్యప్రమాణముగా గైకొనిన శ్రీ పిళ్ల లోకాచార్యులు, శ్రీ మణవాళ మహామునులు మున్నగు మహనీయుల శ్రీవచన రత్నములనుండి క్రోడీకరింపబడి విశేష ధర్మరూపకమైన ప్రత్యుత్తరము నిందుపొందుపరచి యీ కథను ముగించుచున్నాము.

భక్తుల జన్మ నిరూపణము భాగవతాపచారము భక్తుడే కులము వాడని విచారించుచు బ్రాహ్మణుడు అర్చావతారముల (విగ్రహముల) లోహాత్మకమును స్మరించు వానివలె వెంటనే పతితుడై ఛండాలత్వమును, నరకమును బొందును. జ్ఞానానుష్ఠానములు లేకున్నను భాగవత సంబంధమే మోక్షము నియ్యగలదు.

జ్ఞానానుష్ఠానములీ అపచారము నుండి రక్షింపజాలవు. భగవత్సంబంధమునకు జన్మవృత్తాదినియమములు లేవు. భగవత్సంబంధమునకు యోగ్యతగలుగుటకు జన్మాభిమానము పోవలయును. వేదాధ్యయనము ద్వారా భగవల్లాభమునకు హేతువగుటను బట్టి బ్రాహ్మణ్యము ఆదరణీయమగును. కాని ఈ బ్రాహ్మణ్యము నేను ఎక్కువవాడనను అహంభావమునకు హేతువయినచో అది త్యాజ్యము. జన్మవృత్తములయొక్క ఉత్కర్షాపకర్షములు భగవల్లాభమునకు హేతువులు గావు. కాని జాత్యాధిక్యత అహంకారమునకు హేతువగుటచే సవర్ణులు భగవంతునకు దూరమగుచున్నారు. కడజాతి వారికి నేమెక్కువను అభిమానముండదు గనుక వారికి ముక్తి సమీపము. సవర్ణులకు అహంకారము అజన్మసిద్ధము. కడజాతికి అనహంకారము జన్మసిద్ధము.

పై జాతులు అట్టి అభిమానమును పోగొట్టుకొనగూడదా యందురేని సాధన చేసి పోగొట్టుకొన్నను వారి సామ్యబుద్ధి కృత్రిమమయి అజన్మసిద్ధమయిన విలక్షణాధికారము గలవారికి సమబుద్ధితో ప్రవర్తించరాదు. వారెల్లప్పుడును అనహంకారులగుటచే నిత్యులని పిలువబడుచున్నారు. నిత్యులతోడి సంబంధము సవర్ణులకు పవిత్ర హేతువు కాకపోవుటయే గాక స్పర్శవేధి యను బంగారమువలె జన్మాభిమానము దుష్టత్వమును బోగొట్టి నిజమయిన సామ్యబుద్ధిని పొడమజేయును. వారితోడి సాహచర్యము పురుషకారమక్కరలేకనే సమభావమును ప్రసాదించగలవు. అందుచేతనే ఋషులు ధర్మవ్యాధుని వాకిట కాచియుండి సర్వసందేహములను నివర్తించుకొనినారు. కనుక సవర్ణులగునో సనాతన సోదరులారా! అన్ని విధములను నాశహేతువగు అభిజనాభిమానమును విడిచి, అట్టి దురభిమానమెన్నడును లేకుండుటచే విలక్షణులైనట్టియు, నిత్యులైనట్టియు హరిజన సోదరులతోడి అనువర్తనము సర్వసోదరభావము నలవరుచుకొనుటకు ఎంతయు తోడ్పడునని మనవిచేయుచున్నాను. మనము కలిసిమెలిసి యుండినచో ఉభయులకును లాభదాయకమే నని భావించుచున్నాము.

సంపూర్ణము

